

**భారతి**



సంపు. ౧౩ ధాతి సంవత్సరము, వైశాఖమాసము (మే ౧౯౩౬) సంఖ్య ౫

# తాజ్ మహల్

కే. అన్నమరాజశర్మ

పాఠకమహాశయా! నీకుఁ బ్రాప్తవశత - దేశయాత్రాభిలాష సిద్ధించునేని
సౌరసౌధనిర్మాణంపుఁ జాయఁ దెగడి - యందములకందమైయొప్పు మందిరంబు
కలదు యమునాపగాతటాంచలమునందుఁ - గాంచుమోయి, నేత్రానందకరముగాఁగ.

షాజహానునిహృదయకాసారరాజ - హంసి, ముంతాజుబేగ మీమర్త్యజగతి
విడిచి త్రిదివంబునకుఁ బోవువేళ, స్వీయ-కథను వినువారుగూడ నేకాలమైన
బాష్పములరాల్పఁ దనదుశంపామనోజ్ఞ - తనులతను నిల్పె విధుకాంతధామమందు.

ఓ మొగల్ మహారాజ్ఞి! నీయోగమేమొ - బాల్యమాదిగ నప్సరోభామపగిది
నిత్యకల్యాణసంప్రాప్తి నెగడి, కడకు - మరణశయ్యను దివ్యసమాధిమూర్తి
కలఁ గలలఁ గాంచుచుంటియుఁ గాలవీథి - నీయశశ్చంద్రికలలీల నెరపుచుంటె.

అది సమాధియా కాదు ప్రేమార్ద్రమైన - షాజహానునిచిత్తంబు స్థాల్యగతిని
పరిణతిం బొందెనో లేక భారతీయ - శిల్పచాతురీప్రకటనా నల్పఫలమొ
స్వర్గముననేని దీనికి సాటివచ్చు - సౌధ ముండునా యని కల్గు సందియంబు.

ధాత సం॥

ఎందఱెందఱో శిల్పులు - యెన్నో యేండ్లు - పూండ్లకష్టము, నిరుపమాపూర్వశోభ
లీను నీసమాధినరసిన మెన్నడేని - కాంచుభాగ్యంబు కల్గు సత్కవిచయంబు
యౌవనసుందరీమృదుహృదయారవింద సౌరభము లుచ్ఛ్వసింతు రాదారులందు.
ఓజగన్మోహినీ! నీవియోగ మొక్క - పతికిమాత్రమె సంతాపభాజనంబె,
సకలభారతప్రజల విచారవార్ధి - ముంచి సౌరాంగనాస్నేహముగ్ధ వగుచు
మాకు స్మృత్యంకమై త్వత్సమాధి తనర - సక్కటకటా! దివమ్మున కరిగినావె.



తిరుచినాపల్లికొండ (కఱ్ఱమీద చెక్కబడిన చిత్రము)

-టి. కేశవరావు.

# “హిస్ మాస్టర్స్   య్స్”

## రేడియో రిసీవర్



మాడల్
నెం. 471 AC

వెల
రూ
300

యంత్రపూర్వకముగ జీవనాదమును ప్రతిఫలించుటలో నసమానపరిశ్రమగల “హిస్‌మాస్టర్స్‌వాయ్స్” వారి యద్వితీయమైన నిర్మాణముగల యీ రేడియోసెట్టును కొని, సర్వదేశముల వార్తలను, సంగీతమును విని ఆనందించుడు.

వివరములు మాయొద్ద గాని మా వ్యాపారులయొద్ద గాని తెలియనగును

# ది గ్రామఫోను కంపెని

లిమిటెడ్.

**45, సౌత్ పెరేడ్, బెంగుళూరు.**



---

# ప్రభావతీ ప్రద్యుమ్నము

## వోలేటి వేంకటసుబ్బరాయ శాస్త్రి

ఆశ్వయుజపు భారతీ పత్రికలో శ్రీ తిరుపతి వేంకటకవులచే రచింపఁబడిన ప్రభావతీ ప్రద్యుమ్న నాటకమునందలి కొన్ని విషయములను గుఱించి నే నొక చిన్న వ్యాసమును వ్రాసితిని. దానిపై శ్రీ వేంకట శాస్త్రులవా రాగ్రహపూరితులై నన్నుఁ దమ విధేయ కోటినుండి వెలిపుచ్చి, ప్రకృతమున కనుసరింపని వ్యక్తిగత ప్రసంగములతో నా ప్రశ్నలకు సమగ్రముగ సరియగు సమాధాన మిప్పింపక గనే అమూల్యములగు మూడు వ్యాసములను సముల్లేఖించిరి. ఏమైన నేమి? పెద్దలగు వారి వ్యాసములందలి వ్యక్తిగత విమర్శనాదికమును గణింపక పై నాటకమునందు శేషించియున్న నా సందేహములనుగూడఁ బయిలోపనిగా జోడించి, తిరిగి యీ వ్యాసమును వ్రాయ సాహసించితిని. సహృదయులు పరిశీలించి శంకించినను, పంకించినను సంతసమే.

శ్రీ శాస్త్రులవారికి సంపూర్ణాగ్రహమును గలిగించిన నా వ్యాసములోని "వెక్కిరింపఁబోయి బోల్తా పడినట్లు" అను వాక్యమునకు నా యభిప్రాయ మిది. తాను బ్రతిఫలింపఁదలఁచుకొనుటచేఁ బింగళి సూరనార్యుఁడు శుచిముఖిపాత్రను గవయిత్రిగాను, విదుషిగాను మాత్రమే చూపియున్నాఁడు. అంతమాత్రముననెఁ బ్రకృతమునకుఁ గలుగు ప్రయోజనముకంటె ధారణా సంపత్తితోఁ గూడుకొనినదని చెప్పుటచేఁ బ్రయోజన మెక్కువగా నుండునని తలఁచి, పిం. సూ. కంటెఁ దమకెక్కువ శక్తిగలదని చూపుటకే కదా యీ రీతిగా వ్రాసియున్నారు? దీనివలన పిం. సూ. కవియుఁ బండితుఁడును మాత్రమే కాని శతవధానాదికమును జేయఁగలవాఁడు కాఁడు, మేమో కవులము పండితులము, శతవధానాదికమును జేయఁగలవారము నని లోకులకుఁ దెలియఁజేయుటకే కదా యీ విషయమునుగూడఁ జక్కఁగా వ్రాయుటకే కాగా, ఇది పిం. సూరన్నను వెక్కిరించుట కాదా? ఇట్టి యభిప్రాయముతో వ్రాసిన నా వాక్యమేల ప్రకృతమునకు సమన్వయింపకుండును? నా యూహ తెలియక శ్రీ శాస్త్రులవారు నాలుగువాక్యములు వ్రాయుట కూడ చేర్చికోవలసిన నా యవస్థనుగూడ తడివి చూచినారు. ఆశ్వయు. ప్రభావతీ ప్రద్యుమ్న మను శీర్షకముతో నిదివరలో వ్యాసమును బ్రకటించినప్పుడు నాల్గు విషయములఁ గూర్చి నేను వ్రాసితిని :

౧. ప్రద్యుమ్నగదసాంబుల పుత్రు లెందఱు? ముగ్గురని పలుతావులలోను, నల్వురని వేఱొక చోటను నుండుటచేఁ బూర్వోత్తరవిరోధముగా నున్నది. నల్వురగుటచే "ఈ మువ్వురు జామాతల" కను పద్యమును దిద్దవలయును.

౨ శుచిముఖిపాత్రలోఁ బ్రతిఫలింపఁబోయి ప్రత్యక్షవిరోధమును బరిశీలింపలేదు.

3. నలినాసనవాహన హంసములలోని యొక మరాళపతి ధర్మపత్ని యని ప్రబంధములోని పుత్రిని పత్నిగా మార్చుటలో ఫలము, వివాహసంబంధము, బాగుండునట్లు తోఁపదు. వంశపతి సారససంభవు తేరివార్వమనుటచే విరోధముగానున్నది.

౪. రాజరాజేశ్వరియొక్క దయచేఁ గవిత యలవడినట్లు చెప్పి, వాణీవరూ విశేషముచేనని వేఱొకచోట వ్రాయుటచే విరోధముగానున్నది.

శ్రీ వేంకటశాస్త్రులవారు సముల్లేఖించిన మూడు వ్యాసములలోఁ బై ప్రశ్నల కెంతవరకు సమాధానము వచ్చినదో ముందుగా పరిశీలింతును. ౧౯౩౫ నవంబరు సంచికలో మొదటి ప్రశ్నను గూర్చి యీ రీతిగాఁ దెల్పిరి. బందరు మినర్వా ప్రెస్సునందు ముద్రింపఁబడిన ౧౯౩౪ సంవత్సరపు ప్రతిలో "మువ్వురు నొకరయపుత్రుల" అని దిద్దఁబడియున్నది అని. శ్రీవారి దోషము సుద్యా

వించి కాటూరి వేంకటేశ్వరరావుగారికిఁ జెల్పఁగా వారు సరిపుచ్చినారఁట. గురువును మెప్పించిన శిష్యులగువారు దిద్దిన దిద్దఁగలుగుదురుగాక! ఆ ముద్రణమును జూచినప్పుడు పైరీతిగా నేను ప్రశ్నించుటకు తమ గ్రంథములో శ్రీవారు తావు లేవిన లేదుగాని యీ ప్రతిని జూచుకపోవుట తప్పని వ్రాసినారు. పై ముద్రణమును జూచితిఁగా నొకపద్యములో దిద్దఁబడినది. మరియొకపద్యములో మూఁడురుగనే యున్నది. ఇంక నేదేని ముద్రణమున్న దయతోఁ దెల్పిన దానినిగూడ చూచుకొందును. నవంబరు సంచికలోని వ్యాసమంతయు నప్రస్తుతములు వ్యక్తిగతసంకుచితాభిప్రాయములతో నిండినదగుటచే దానిని నిరాకరించుచున్నాను.

౧౯౩౭ ఫిబ్రవరి సంచికలో "దీనినిగూర్చి డిసెంబరు భారతీసంచికలో సంగ్రహముగ వ్రాసిన నా వ్యాసమును చదివిన నా శిష్యులు పలువురు నన్నుఁ గూర్చి ఈ వయస్సులో... .....మీరు సమాధానము వ్రాయఁదగిన యంశములం దేమియున్నవి? ఏమేని యున్నచో వ్రాయుటకు మేమెందఱము న్నారముకామా" ఇత్యాదికమును వ్రాయించినారు. గమనించితిరా శ్రీ శాస్త్రిలవారి వ్రాతలను? ౧౯౩౬ డిసెంబరు భారతీసంచికలోని శ్రీవారి వ్యాసమును చదివిన శిష్య ప్రశిష్యులేనట్టు గూరీతిగా వ్రాసినది. శ్రీ శాస్త్రిలవారి వ్యాసము లేని భారతీసంచికలోఁగూడ శ్రీవారి శిష్య ప్రశిష్యులు శ్రీవారి వ్యాసమును చదివినారఁట. ఆ వ్యాసమును చదివియే కాఁబోలు కప్రశిష్యుఁడు "చాలును జాలు....... వేడుము తుమాపణ వారిని వారిశిష్యులన్" అను పద్యరత్నమును గురుదక్షిణగా నొసంగియుండెనో ఏమో. "శిష్యపాపం గురోరపి" అనియేకాని ప్రశిష్యశబ్దము చేర్పఁబడలేదుకొంటి!

శ్రీ వేంకటశాస్త్రులవారిరీతిగా నన్ను సంభావించెడి సమయములో వారు నెవరో "గంధర్వలోకంబున నుండి" యని పద్యములతోఁగూడిన ౧౮వ నవంబరుగల బహిరంగలేఖను పంపినారు. మిత్రులు కొందఱు జాబులనుగూడ వ్రాసినారు. కాని లేఖలలోని పద్యములు కోపోద్రిక్తములై యుండుటచే వానిని శ్రీవారి రీతిగా మచ్చునకు చూపుటకైన నామనస్సంగీకరింపలేదు. రాగద్వేష మాత్సర్యముల దూషణ భూషణము లెన్నఁడును న్యూనత్వాధికత్వ ప్రతిపాదకములు కానేరవు.

ఫిబ్రవరి సంచికలో నా మూఁడవప్రశ్నకు వందిని దేనువును, కాళిదాస శ్రీహర్షాదుల కృతులను బురస్కరించుకొని పక్షుల విషయమై పైరీతిగ నేకగోత్రజనిత వివాహసంబంధప్రశ్న తగదని తెల్పుచు, నొకవేళ నట్టిదిగూడ నుండవచ్చునేమో యని తలఁచి "ఈ వివాహసందర్భము ప్రథమాంకములోనిదే. ఇది నూటఁదొంబది వంతులు పూర్తిగ నగువఱకు తిరుపతిశాస్త్రిగారు రచించియే యున్నారు.... .అగుచో, ప్రథమాంకస్థమగు "ఏకగోత్రజనిత వివాహము" వేం. శా. రచనకు సంబంధించినది కాదుగదా!" ఇత్యాదికమును వ్రాయించినారు. ఈ వ్రాతలచే నేమి తేలుచున్నదో సహృదయులాలోచింతురు గాక!

మార్చిసంచికలో నా రెండవ ప్రశ్నను గూర్చి "ఒక్క శుచిముఖి పాత్రలో తి. వేం. కవులలో నెవరో యొక్కరే ప్రతిఫలింపవీలగును గాని యిరువురు నెట్లు ప్రతిఫలింప వీలగును" అని నా ముఖ్యతాత్పర్యముగా వ్రాసినారు. అట్టి యభిప్రాయమును బడియేకాఁబోలు అద్దమును దృష్టాంతపఱచినారు. కాని నాయభిప్రాయ మది కాదు. మొదటియంకములో తిరుపతిశాస్త్రిగారు ప్రతిఫలించినారు గదా? అప్పుడు జంట లేనేలేదు. ఒకవేళ వీరిసృష్టిలోనున్నచో నా రెండవ పక్షియే వేంకటశాస్త్రులవారుగదా? రెండవ యంకమున్న వేంకటశాస్త్రులవారు తామున్మాత్రమే ప్రతిఫలింపఁజూచినారుగదా? తిరుపతిశాస్త్రులవారు ప్రతిఫలించుటచే, రెండవయంకమున చనిపోయిన ట్లర్థసిద్ధమగు శుచిముఖి పాత్ర తిరిగి యెట్టుల బ్రతికినది? మొదటియంకములో రెండవపక్షిలోఁ బ్రతిఫలించిన వేం. శా. వారు చనిపోయిన శుచిముఖిపాత్రలో నెట్లు ప్రతిఫలింపఁగలిగిరి? అని నా యూహ. కనుక నే "తిరుపతిశాస్త్రిగారా? వేంకటశాస్త్రిగారా? ఉభయులునా? ఉభయులును గారా? శుచిముఖిపాత్రలో తిరుపతిశాస్త్రిగారు ప్రతిఫలించుట, ఈ పాత్రలో వేంకటశాస్త్రిగారు ప్రతిఫలింపఁజూచి

నారు. శుచిముఖిపాత్ర యీసందర్భస్థితిలో నున్నది." అని మొదట వ్రాసియుంటిని. ఇట్టిదానికి నాకు లేని ముఖ్యాశయము శ్రీవారు గ్రహించి రమారమి ౧౦ పేజీల వ్యాసమును వ్రాయించి శ్రమపడినారు. అయ్యో పాపము! అభేదదృష్టిని భిన్నముచేసి వ్రాయుటచేతనే శుచిముఖి అధోగతిపాలయినది. ఒకవేళ శుచిముఖి పాత్రలోనే యిరువురును ప్రతిఫలింపఁదలఁచితిమంగురా? అప్పుడు ప్రబంధములో లేని పక్షులజంటను నాటకములోఁ గల్పించు టెందులకు? కృష్ణుని ముం దాజననమరణములజాబితా చదివించు టెందులకు? ఇట్టి నాయభిప్రాయమును గమనింపకపోవుటచేతనే శ్రీశాస్త్రుల వారేదోయనుకొని వ్రాసినదంతయు నిష్ప్రయోజన మయ్యెఁగదా? శ్రీవారి మూఁడువ్యాసములలోను వచ్చిన సమాధానపు సొంపిది. ఇంక నా మొదటి వ్యాసములో మిగిలినప్రశ్నలివి: (౧) ప్రబంధములోని పుత్రిని పత్నిగా మార్చుటలో ఫలము. (౨) వంశపతి, పతిశబ్దప్రయోగముల చేఁగల్గు విరోధము. (3) రాజరాజేశ్వరీ సరస్వతీశబ్దప్రయోగములచేఁ గల్గు విరోధము - అనునవి. వీనినిఁగూడ శ్రీశాస్త్రులు లేదో పైవిధమున స్పృశించిన జాలు. ఇఁక శేషించిన సంశయములు.

౧. ప్రద్యుమ్నగదసాంబులు ముగ్గురును కృష్ణపుత్రులే; గదుఁడు కృష్ణసోదరుఁడుగాని కృష్ణపుత్రుఁడు కాఁడు. కృష్ణసోదరుఁడను టకు.

"బలం, గదం.......వసుదేవస్తు రోహిణ్యాం ఉదపాదయత్" (భాగవతం నవమస్కంధం)

"దేవరక్షితయాలబ్ధా నవ చాత్ర గదాదయః॥

(భాగవతం దశమస్కన్ధం) "ప్రద్యుమ్నప్రముఖా జాతా రుక్మిణ్యాం." "జాంబవత్యాస్సుతా హ్యేతే సాంబాద్యాః"

(హరివంశము:—పూర్వభాగము.)

"బలభద్రుం డాద్యుండుగాఁ గ్రమంబున...... గదుండునను కొడుకులం జిత్రయను సూతుం గాంచె."

"దేవకియాదిగాగ వసుదేవుఁడు.........సూనులఁ బల్వుర నా గదాదులన్."

(హరివంశము:—ఉత్తరభాగము.)

కం॥ "విను ప్రద్యుమ్నుఁడు జనియిం
చిన నెలలో ననఘ పుణ్యశీలుఁడు పుత్రుం
డనుపమశౌర్యుఁడు సాంబుఁడు
జనియించెను జాంబవతికి జగదభినుతుఁడై."

వాచస్పత్యం:—గదః-పుం ౩ రోహిణీగర్భజాతే వసుదేవపుత్రభేదే. గదాగ్రజ-గదస్యాగ్రజః. ౨ శ్రీకృష్ణే తస్య సాపత్న్య(భ్రాతృ)త్వేపి ఏకపితృకత్వేన తస్య గదతో ఒగ్రజత్వాత్ తథాత్వమ్.

అమరకోశము:—"గదాగ్రజో ముంజకేశో దాశార్హః."

సంపాలవదసము:—"జగాదాగ్రే గదాగ్రజమ్."

ఇట్టి ప్రయోగము లనేకము లున్నవి. గదుఁడు కృష్ణునకు సోదరుఁడేగాని పుత్రుఁడు కానిచో నెడల

"నలుఁరు .....నాదుమన్మలు" ఇట "నాత్మజులానిరి యుద్ధభారమున్" అనున దెట్లు సరిపడును?

చంద్రప్రభుండు:—"తాతా! చంద్రవతీగర్భసంజాతుండు, గదాత్మజుండు, మీమనుమండు, చంద్రప్రభుండు మీ కిదె నమస్కరించుచున్నాఁడు." అని కృష్ణునితోఁ బల్కుట సరిపడునా?

ఈ విషయమును బరిశీలించియే కాఁబోలు ఓంగోలు నూరనార్యుఁడు పంచమాశ్వాసమునకు జివర "అంత నచ్యుతుండు......తదాధిపత్యంబునకుఁ బ్రభావంతుని జంద్రప్రభుని గుణవంతుని గీర్తిమంతునిం బట్టాభిషిక్తుం గావించి, కొడుకులం గోడండ్రను, మనుమని, మనుమ లిని" అని వ్రాసియున్నాఁడు. "కోరికఁ దావక్షానుజుని సూనులకుం బతులైనవారు మావారలు" యని పల్కించుటలోఁగూడ స్పష్టపడుచున్నది. ఇద్దఱు సోదరులైన పక్షమునఁ బ్రద్యుమ్నుఁడారీతిగా పల్కియుండునా?

౨. దేవాంశసంభూతులుగనుండి సహజముగ వాలపక్షులతో మనుష్యాకారమునఁ బూజింపఁబడుచుఁ గేవల స్వతంత్రతా సంయుక్తులుఁగ నొప్పిన హనుమంతుని, గరుత్మంతునిఁ బక్క, తక్కిన తిర్యగ్రూపపాత్రల

రంగస్థలమున నటించుటకై ప్రదర్శించుట నాటకసమయానుగుణముగా నుండునా? ఎక్కడనో యేకవేళములో వచ్చినదాని నేదో రీతిగఁ ద్రోసివేయవచ్చునేమో కాని ప్రకృతనాటకమునఁ జాలవఱకు నున్న శుచిముఖి పాత్రను నటకుఁ డేరీతిగా నటించి సామాజికులకు రసానుభూతిని గలిగించును?

హంసయొక్క యాకారముగానుండి నటకుఁడు నటింపవీలులేదని యేకాఁబోలు హోతా వేంకటకృష్ణ కవిగారు ప్రభావతీప్రద్యుమ్న నాటకములో శుచిముఖి పాత్రకు కామరూపమునుగూడ నిచ్చి పక్షిరూపమునఁగాక స్త్రీరూపమున నటింపఁజేసినారు.

3. నాందిలో "రాక్షసఖండన క్రియాపయిం బ్రేమించు" అని యుండుటచే నిందు ముఖ్యముగాఁ జూపఁదలఁచినది వజ్రనాభవినాశనమా? అనుచో నిందు ప్రధానరస మేది?

౪. "పరమ్మునకుఁ బూర్వమ్ముచే శాస్త్రబాధ చోదితంబు." "కృతాకృత ప్రసంగిత్వ ముథ యత్ర తుల్యమే" "శీఘ్రోపస్థితమనుకరణ అంతరంగమ్మగుచున్నదే" ఇట్టి పంతపాత్రపోషణార్థమైన నిట్టి నాటకములలో నుపయోగించుట తగునా? దీనివలన సహృదయనిర్వృతికలుగునా?

ఈ నాసందేహములకు శ్రీ శాస్త్రులవారనుద్విగ్నమనస్కులై చల్లనిసమాధాన మిప్పింపఁ గోరుచున్నాను.



వెలిదుక్కి K. M. R.

# నవలా రచనము

## నిడమర్తి సత్యనారాయణమూర్తి

•

నేడు ఆంధ్రభాషలో నవలలను చాల విరివిగా వ్రాస్తున్నారు. వానిని చదివేవారి సంఖ్యకూడా నాటికి నాటికి అతిశయిస్తూంది. అయినప్పటికి నవలల సంఖ్యలోవున్న అతిశయం గుణములో కన్పించుట లేదు. అందుచేతనే యీవ్యాసం వ్రాయవలసివచ్చింది.

పాఠకుల మనోవృత్తులపై నవలలకుగల పలుకుబడి మిక్కుటము. చెడ్డనవలలవల్ల దురభిప్రాయాలు ప్రబలవచ్చును; దురభిమానము, దుష్టప్రేమ కలుగవచ్చును; నీతికి బదులు అవినీతి చెలరేగవచ్చును. అలాగే మంచినవలలవల్ల సదభిమానము, సత్ప్రేమ, ఆత్మగౌరవము, మానవసేవాభిలాష కలుగవచ్చును. ఏనవలను చదివితే యిట్టి ఉన్నతమైన, పవిత్రమైన భావాలుద్భవించునో ఆనవలారచయితమాత్రమే ఉత్తమతరగతికి చెందినవాడవును.

ఈదినములలో జనసామాన్యానికి ఉపదేశవాక్యాలు పుస్తకాల రూపకముగా అందుతూన్నాయి. చిన్న పెద్దలందరూ వీటిని చదివి అందులోవున్న విషయసంగ్రహణంవల్ల తమ భావిజీవితాలను దిద్దుకుంటున్నారు.

కాలం మారిపోయింది. న్యాయమైన జీవితము గడపటలచితే అడ్డంకులు పెక్కులున్నాయి. సంఘంలోవున్నతి పొందవలెనన్న వాంఛ సర్వశాంతతనాన్ని ప్రక్కకునెట్టుతూ ఉంది. 'ధనమూలమిదంజగత్' విలాసలాలసతచే ఆంగ్లేయమానసులై ప్రజలు నేటిమానవులలో వున్న కష్టపరిస్థితులను చూడలేకున్నారు. ఈలాంటి తరుణంలో ధైర్యంతో యీఅన్యాయాలను వెల్లడిచేసి చూపింపగల సత్యాగ్రహిశీలుడైన గ్రంథకర్త అవసరము. అతడు నిరూపింపదలచుకున్న సత్యమునకు మానవరూపాన్నిచ్చి మనతో మాట్లాడునట్లు, మన సుఖదుఃఖములను చూచి సంతోష విచారాలను చూపుతూవున్నట్లు చిత్రించాలి. ఇందులో యెంతమాత్రం వ్యత్యాసం కన్పించినా దానికి సహజత్వము లోపించి చదువరియొక్క చిత్తము నాకర్షించలేకపోతుంది. ఇదే నవలారచయిత చేయవలసిన పనులలోనెల్ల కష్టతమమైనది.

నవలను చదివితే మనకు సంతృప్తికలగాలి. పాపమునెడ విముఖత, పుణ్యకార్యాచరణమునెడ - ఆత్యధిక మానవకోటికి ఉపకారకారణమైనది — సుముఖత కల్పించాలి. అంటే నవల గురుపీఠాన్ని ఆక్రమించాలి. కాని గురువువలె నిది శ్రమకరముకారాదు. ఈ రెండును నవల కుండవలసిన ప్రధాన లక్షణములు.

ఈనాటి తెలుగు నవలలలో ప్రాయికంగా కనబడేదిన్ని, మిక్కిలి ప్రియంగా చిత్రింపబడుతూన్నదిన్ని ఒకవిషయం వుంది. అది ప్రేమ. పేరులు చెప్పనేల? కొన్ని కొన్ని పుస్తకాలు భార్యాభర్తలిరువురు కూర్చుండి చదువుటకుకూడా మిక్కిలి అసభ్యంగా వుండేటంత నీచ శృంగారాత్మకములు. యౌవనారంభంలో వుండి, స్థిరభావ సంపన్నులు కాని స్త్రీ పురుషుల చేతులలో ఇవి పడితే వాని దుష్ఫలితాలనుగూర్చి వేరుగా చెప్పనక్కరలేదు.

### కథావిధానం :

నవలలలో కథ సాధారణంగా రెండువిధాల వుంటుంది. ఉద్రేకం కలిగించేవి, తద్వ్యతిరేకములు (Sensational and Antisensational). ఆలాగే చదువరులలోకూడా రెండువిధాల వున్నారు. కాని సరియైన నవలలో ఈరెండు లక్షణాలు సరిసమానంగా ప్రబలివుంటాయి. అంతేగాని సెన్సేషనలుగా వుండాలని భయంకరములైన కొన్ని సంఘటనములను సత్యవిరుద్ధంగా సదిస్రుచ్చి శిలాప్రతిమలవంటి పాత్రలను సృష్టిస్తే

చదువరులకు హృదయంగమముగా వుండవు. మీదుమిక్కిలి రోతగింపు కలిగిస్తాయి. ఈనాటి నవలలలో చాలావరకు — అంటే నూటికి ౯౯ కి పైన—ఈతరగతిలో చేరుతున్నాయి. ఈలాటి అస్వాభావికపు సంగతులు సృష్టించడము సులభమే; కాని లాభమేమి?

నవలారచయిత తానేదోవొకటి వ్రాయవలసింది ధర్మంగనక వ్రాయపూనుకోనడం సమంజసము కాదు. తనవద్ద యితరులకు తెలుపదలచిన సద్విషయం వున్నప్పుడే పుస్తకరూపకముగా దాన్ని వెలువరించడము న్యాయము. గ్రంథకర్త ప్రథమంలో వ్రాసిన పుస్తకాలన్నీ భావభరితమైన హృదయంతో వ్రాయబడివుంటాయి. లోకం వాటిని ఆదరిస్తుంది. వ్రాయగా వ్రాయగా ఆభావాలు పూర్తిఅవుతాయి. కాలంతోపాటు అతనుకూడా మారుతూవుంటేనేగాని నూత్నభావాలు వుదయించవు. అలా మారినా మారకపోయినా పుస్తకాలు యింకా వ్రాయాలనే అభిలాష నానాటికీ తీవరిస్తుంది. అజీర్తిరోగికి కడుపులో మంట హెచ్చు; తిండిచపలతకూడా హెచ్చే. అలాగే భావపరిశ్రమడికి పుస్తకరచనాభిలాష మెండు. ఈస్థితిలో అతని రచనలు విసుగుపుట్టించేవిగాను, రుచిహీనములుగాను వుంటాయి; ప్రథమంలో అతను సంపాదించిన మంచిపేరు కాస్తా తుడిచిపెట్టుకుపోతుంది.

దీనికి మినహాయింపులు వుండకపోవు. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహంపంతులుగారే యిందుకు నిదర్శనం. వారు కర్పూరమంజరి మొదటిభాగాన్ని యౌవనములో వ్రాశారు. రెండవభాగమును షష్టిపూర్తికి ముందువ్రాశారు. అల్లికబిగిలోను, భావగాంభీర్యంలోను, శైలిమార్దవములోను రెండూ సరితూగుతూవున్నాయి. ఇట్టివారు నిత్యయౌవనులు; అగణితభావసంపన్నులు.

## పాత్ర పోషణ:

పిల్లలను కనడము సులభమేగాని వారికి సరియైన విద్యాబుద్ధులు గరపి సత్పౌరులను చేయడము కష్టము. అలాగే కథను అల్లడము సులభము. కాని అందులో వచ్చేపాత్రలను సరిగా పోషించడము కష్టము.

సాధారణంగా మనం చదివే నవలలోని పాత్రములు ప్రతిమాతుల్యములు తోలుబొమ్మలవలె నిలబెట్టబడ్డవిమాత్రమే. అవి తమంతట తాము కదలవు; మాట్లాడవు.

కాని చతురుడైన రచయిత కథాపోషణముకంటె పాత్రపోషణమునెడ ఎక్కువ మెలకువ చూపును. తన మానసపుత్రులైన వివిధపాత్రలను మాట్లాడించి నడిపించి, నవ్వించి, యేడ్పించి, పాడించి అనుదిన జీవనములో మానవులేతీరుగా వ్యవహరిస్తారో ఆతీరుగా వ్యవహరింపజేసి పాఠకులకు చిరపరిచితులను చేస్తాడు. అపుడు చదువరికి తోడిమానవులయెడ యెట్టిస్నేహము, ద్వేషము, ప్రేమము మొదలగుభావాలు ఉద్భవిస్తాయో ఆలాటిభావాలే పాత్రలయెడకూడా వుద్భవిస్తాయి అనగా మన్మథుడి తీరుగా. వీరందరు అతనులు. కాని రతికి అతడు దృశ్యుడు. ఆలాగే అతనులయిన యీపాత్రలందరూ చదువరికి,రచయితకు మనోనేత్రగోచరులవుతారు. అపుడుగాని నవలకు ప్రాణప్రతిష్ఠ జరుగదు. అపుడుగాని దానికి చదువరుల మానసప్రవృత్తులపై అధికారము చలాయింపగల మహాశక్తి వుదయించదు.

పాత్రపోషణము సాలంకషముగా వుండాలంటే రచయిత స్వనిర్మితవ్యక్తులగు పాత్రలను పూర్తిగా ఎరిగివుండాలి. ఎరిగివుండాలంటే వారితో అతను కలసిమెలసి తిరగాలి. ఈకలసివుండడము శారీరకమనుకో వలదు. అది కేవలము మానసికము. సుషుప్తి జాగ్రదవస్థలందల్ల వారితనితో వుండవలసిందే. వారిని తను ప్రేమించుట, ద్వేషించుట యెరిగివుండాలి. వారితో వాదోపవాదాలు జరుపుట, వైరము పెట్టుకొనుట, క్షమించుట, చివరకు దాసోహమనుట మొదలగునవిచేసి తెలిసికొని వుండాలి. వారు శూన్యహృదయులో, వుద్రేకపూరితులో, విశ్వాసహీనులో, విశ్వాసపాత్రులో అయితే యెంతవరకో తెలిసి వుండాలి. వారిలోటుపాటులు తెల్లమైవుండాలి. అనుదినజీవితములో నానాభావకులై ప్రతివారు మారుతూ పతనముపొందుటలో ఉన్నతికివచ్చుటలో జరుగుతూవుంది;

అలాగే అతనిచేత సృష్టింపబడిన యీపాత్రలుకూడా మారుతూవుండాలి. ఆమార్పులను గ్రంథకర్త వివరంగా తెలుపవలెను. కథ సాగినకొలది కాలముగతిస్తూవుంటుంది; కాలం గతించినకొలది పాత్రలుకూడా వయసుతో హెచ్చుచున్నట్లు, భావములలో మార్పు పొందుచున్నట్లు చూపట్టాలి. నవలారచయితకు ఈయాదర్శం దృష్టిపథంలోవుంటే యీ మార్పులన్నీ తమంతటతామే అప్రయత్నంగా వస్తాయి. ఆపగ్నకహితుడైతే అతని పాత్రలు నిర్జీవములై దారుతుల్యము లవుతాయి.

“నాచే సృష్టింపబడిన పాత్రములతో నేనీవిధంగా కలిసిమెలసివున్నాను. నానవలలు జనసమ్మతిని బడయుటకుగల కారణముకూడ యిదే. రంపెరూ కూర్చున్నట్లూహించేవాడను. అపుడు వారివారి కంఠస్వరములను, కేశవర్ణములను, దృష్టిభేదములను, వస్త్రధారణవిధాన విభేదములనుకూడ గుర్తింపగలిగివుండేవాడను. ఎవరు ఏమాట చెప్పగలరో, చెప్పలేరో నేను నిశ్చయించుకొనగలను; అలాగే ఆయాపరిస్థితులలో ఏ వనితనవ్వగలదో, ఏవనిత మొగముచిట్లించుకొనునో నేను నిశ్చయముగ చెప్పగలను. ఈశక్తి రచయితకు ఎప్పుడు తగ్గునో అప్పుడే అతడు పుస్తకరచనమును విరమింపవలసినదని నామతము.”

పైని వుదాహరించిన ఆంథోనిట్రొలోప్‌యొక్క వాక్యములలో ప్రస్ఫుటితమైన సత్యము ప్రతిరచయితకు తెల్లమే. ఇట్టి ఉన్నతాశయములతోను, నిశితబుద్ధితోను వ్రాయబడిన నవలలు తెనుగులో యెన్నివున్నాయి?

## శైలి:

బంకించంద్రుడు వంగదేశమునందలి నవలారచయితలలో నెల్ల నాయకమణి. రమేశచంద్రుడతనికి సమకాలికుడు; ఆంగ్లమున పేర్గాంచిన రచయిత. ఒకనాడు వారిరువురుకలసి మాటాడునపుడు బంకించంద్రుడు “నీ గ్రంథాలను వంగభాషలో యేల వ్రాయవు?” అని అడిగినాడు. “నేను వంగభాషలో వ్రాయలేను” అన్నాడు రమేశుడు. వెంటనే “నీవు భావగర్భితుడవు. వంగభాష నీమాతృభాష. గాన మాటాడగలవు. అలాగే వ్రాస్తే అదే సునిశితమైన శైలిగా మారుతుంది.” అని బంకించంద్రుడు రమేశునకు హితముపదేశించాడు. భావముంటే భాషవస్తుంది. కాని ప్రయత్నంచేసి అలవరచుకున్నగాని భావమునకుతగిన భాష పట్టుబడదు.

రచయితకు భావము, పరిశీలనాశక్తి, నిరంతర వ్యవసాయము, పాండిత్యము అన్నీ అవసరములే. కాని మృదుమధురమైన శైలిలో వానినివొదిగి మనకర్పింపలేకపోతే అవన్నీ కొరగానివవుతవి. శైలి తికమకలుగాను, విసిగించునదిగను, కర్ణకఠోరముగాను వుంటే పాఠకులు ఆపుస్తకాన్ని త్రోసిరాజంటారు. కనుక ప్రథమవీక్షణమాత్రాన భావమును తేటతెల్లము చేయగలిగినట్టిన్నీ, సుఖప్రదమైనట్టిన్నీ శైలి వుండాలి.

తెనుగునకు నిర్మలము, సులభగ్రాహ్యము, సుఖకరము నైన వచనశైలిని స్వర్గీయ వీరేశలింగ యోధుడు ప్రసాదించినాడు. దానినుండి మధుర రాగపూరితమైన శైలిని బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహముపంతులుగారు సృష్టించారు. పానుగంటివారిది, గురజాడవారిదికూడ ధారాళమైన శైలియే. యువకులలో చింతా దీక్షితులు, గుడిపాటి వెంకటచలం, విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు మొదలగువారుగూడ సువ్యక్తమైన శైలిగలవారే.

## సంభాషణాక్రమము:

నవలలో వర్ణన వుండాలి; సంభాషణకూడా వుండాలి. తెనుగు నవలా రచయితలకు ఇందు దేనికెంత స్థానము వుండాలో తెలియదు. ఒక్కొకప్పుడు కొన్నిప్రకరణములు వరుసగా సంభాషణఅనేది లేకుండా కొండవీటిచేంతాడువంటి అంతములేని వర్ణనలతో నడుస్తాయి. జరిగినదంతా గ్రంథకర్త వర్ణించేస్తాడు. ఇది చాలా అసహ్యాకరమైన విషయం. చదువరికి దృష్టంతా కథాచలనంమీద వుంటుంది. కాని ఆచలనమును పాత్రల సంభాషణముల మూలముననూ, వారి రాకపోకల మూలకముననూ తెలిసికోగోరును. అంతేగాని భగవంతుడికి భక్తుడికి మధ్యగా పూజారివచ్చినట్లు కథకు—తదం

తరస్థులైన పాత్రలసహా—చదువరికి మధ్యగా రచయిత వర్ణనాపూర్వకంగారావడము దుర్భరము. అర్చకుడుండడము అవసరమే. దేవాలయం తెరచి, బాగుచేసి, విగ్రహాన్నలంకరించి భక్తునకు కనులపండువుగ వుంచాలి. అంతవరకే అతని పని. మిగిలినది భక్తుడికి భగవంతుడికి ప్రత్యేకం సంబంధించినది. అలాగే రచయిత చదువరిని తీసుకవెళ్ళి పాత్రలమధ్య వదలిపోవాలిగాని వర్ణిస్తూ కూచుంటానంటే రసాభాసుగా వుంటుంది. ఇది మన తెలుగునవలలలో తరుచు కన్పించే అవలక్షణం.

సంభాషణమును పెంచివ్రాయడములో కష్టము మిక్కుటము. ఇరువురిచేత మాట్లాడించడము సులభమే. అంతమాత్రాన పాఠకుడు తృప్తిపడునని తలచుట అవివేకము. సంభాషణలవల్ల కథ నడుస్తూవుండాలి. అలాగాకుండా వుద్దేశవిరహితమైవుంటే చదువరి ఏవగించుకుంటాడు. చదువరి పుస్తకమును చేతబట్టింది కథయేమో తెలిసికొనవలెనని గాని కేవలము రాజకీయాలనుగూర్చి, వేదాంతాన్నిగూర్చి సంస్కరణములను గూర్చి తెలిసికోవాలనిగాదు. కనుక సంభాషించేవిషయ మెట్టిదైనా అది కథకుకూడా చలనము నిచ్చేదయివుండాలి.

సంభాషణలో మాటలు, భావాలు పాత్రోచితంగా వుండాలి. రాజకీయవేత్త వేదికమీదయిచ్చే ఉపన్యాసాలతీరుగా సంభాషణ దీర్ఘమైవుండరాదు. ఇది అసహజం. నలుగురు కలసిమాట్లాడునపుడు ఎవరూకూడా ఆగకుండా మాట్లాడరు. వారెంతటి విద్యావంతులైనా కేవలము ప్రబంధ శైలిలో మాట్లాడరు. చిన్న చిన్నవాక్యాలలోవుండాలి. వ్యాకరణబద్ధమై అసహజంగాగాని, నిర్జీవంగాగాని వుండరాదు. నింద్యగ్రామ్య పూరితమై అసహ్యతను పుట్టింపరాదు. ఇది రచయితకు అసిధారావ్రతచర్యవంటిది.

సంభాషణము నవలకు ప్రాణమువంటిది. దీనివిషయమున రచయిత యేమాత్రము ప్రాలుమాలినా నవలయొక్క ప్రాణమునకే మోసమువస్తుంది. ఈసంభాషణము మూలముననే పాత్రములు చదువరికెరుకయగుదురు. వీనిమూలముననే అతడు వారితో కలసిమెలసి తిరుగును; సరససల్లాపము లాడును. వారి సుఖదుఃఖములను చవిచూచును; చివరకు వారిలో తాను, తనలో వారు లీనమగుదురు.

ఇదంతయు సక్రమముగ జరుగుటకు గ్రంథకర్తమానవస్వభావమునువివిధవిధములుగా బాగుగాయెరిగినవాడయి వుండాలి. అతని పాత్రల స్వభావములు లోకసామాన్యమైన మానవుల స్వభావమునకు విరుద్ధములు గాకూడదు. అయినప్పటికి లోకసామాన్యులగువానికన్న యెక్కువ రసవంతముగా వుండాలి. ఇందుకుగాను అతని పరిశీలనాశక్తి చురుకుగా వుండాలి. జ్ఞాపకశక్తితీక్ష్ణముగా వుండాలి. ఎవరు యేయే సందర్భాల్లో యెట్టిమాటలు మాటాడుదురో, యెట్టి మాటలు మాటాడరో తెలిసికొనగలశక్తి, ఆమాట లెట్టివో వెంటనే స్మృతికి తెచ్చుకొనగల జ్ఞాపకశక్తి యితనికి మెండుగా ఉండాలి. అపుడుగాని సంభాషణమునకు ప్రాణముండదు. అది యున్నగాని నవలకు జీవమురాదు.

ఈవిధమగు పరిశోధనమునకు గురిచేస్తే తెనుగున వ్రేళ్లపై లెక్కించుటకుకూడా చాలినన్ని నవలలు లేవు. ఉన్నవానిలో రాజశేఖరచరిత్ర, రామచంద్రవిజయము, మాలపల్లి, తుమార్పణము, రామాశ్రమము, పూర్ణానందము, అగ్రహారము మొదలగునవి కొలదిగావున్నాయి. వీటిలో ఒక్కొక్క గ్రంథకర్త పుస్తకములనుగూర్చి వ్రాసి వానియందలి ప్రాశస్త్యమునుగూర్చి పాఠకులకు మున్ముందు తెలుపుచుందును. ఇందు చారిత్రకములు, అపరాధపరిశోధకములు, అనువాదితములు అయిన నవలలను గూర్చి వదలి, సాంఘికములైనవానినిగూర్చి మాత్రమే వ్రాయదలచితిని.

[ఈవ్యాసరచనకు ఆంథోనిట్రోలోపు వ్రాసిన యొకవ్యాసము నాకు చాలవరకు తోడ్పడినదని చదువరుల కెరుకచేసికొనుచున్నాము.]

# వ్యావహారిక రచనకు కొన్ని నియమాలు

తెకుమళ్ల కామేశ్వరరావు

## 3. అనవసర గ్రాంధికం

వ్యావహారికంలో అనవసరంగా గ్రాంధిక రూపాలు అనేకమంది రచయితలు కలుపుతున్నారు. కలగాపులగానికి ఇదొకకారణం. గ్రాంధిక రూపాలు కలిపిన శైలికి వ్యావహారికమన్న పేరు కుదరదు. ఒకరిద్దరు పేరుగల రచయితలుమాత్రమే వ్యావహారికంలో తమకు తోచినచోట్ల బండి 'ర' లు, అరసున్నలు వాడుతున్నారు. బండి 'ర' లు, అరసున్నలు వ్యావహారికానికి అనవసరమని తెలిసికొని యింకెవ్వరూ వాడడంలేదు. హాస్యంకోసం, ఎగతాళికోసం గ్రంథకర్తలు గ్రాంధికం వాడుతున్నారు. అది బాగానేవుంది.

గ్రాంధికరూపాల అవసరం మనకు బహుస్వల్పంగా వుంది. నాటకాలలో పాత్రల చేష్టలు తెలిపే ఒప్పుడు గ్రాంధికం కొంచెం అవసరం. 'రాజు వస్తాడు' లేక 'రాణీవస్తుంది' అనిగాని, లేక ఒకఉన్నత పాత్ర 'వస్తాడు' 'వస్తుంది' అనిగాని అనకుండా, 'రాజువచ్చును' 'రాణీవచ్చును', 'రామారావు చేతితో సంజ్ఞచేయును', 'రామమ్మ వచ్చును' అని మర్యాద అమర్యాద అని అనిపించకుండా రాయడానికి గ్రాంధిక రూపాలు మనకు కొంచెం అవసరం. మనం మాట్లాడేటప్పుడు 'వాడి' అని 'దైవజ్ఞుడి' అనీ అంటాం. అలాగే రాస్తున్నాం రాసేటప్పుడుకూడా. కాని కొంచెం అవసరమయినచోట 'వాని' అనీ, 'దైవజ్ఞుని' అనీ గ్రాంధిక రూపాలు వాడవచ్చు. ఇంతకుమించి గ్రాంధికం అవసరం కనపడదు. రచయితలు కలగాపులగం చేస్తున్న కొన్నిమాటలు చూపిస్తాను. వాటిపక్కనే అవి ఏలాగ వుండాలోకూడా రాస్తాను.

అగుచూవచ్చుటవల్ల=అవుతూరావడంవల్ల

అగుసరికి=అయేసరికి

అణచుటకు=అణచడానికి

అనుటకు=అనడానికి

అలవడునా=అలవడుతుందా

ఈయవలెను, చేయవలెను మొ॥=ఇయ్యాలి, చెయ్యాలి మొ॥.

ఉండునుగదా=ఉండేదికదా

ఉండెడివి=ఉండేవి

ఏవిధముగానైనా=ఏవిధంగాఅయినా

కలవు=వున్నాయి

కాబోలు=కామోసు కామాలు, కామోసు

కుచేలునకు=కుచేలుడికి

కొలచుటకుగాని=కొలవడానికిగాని

చెప్పుటకేనా=చెప్పడానికేనా

చేయకపోయిన=చెయ్యకపోతే

చేయుచుండడం=చేస్తూవుండడం

పోవుటయేగాక=పోవడమేగాక

యోజిస్తూ=యోచిస్తూ

వచ్చుట=రావడం

వలె=లాగ, లా, మల్లె, అల్లె

విద్యార్థులవలె=విద్యార్థులలాగ

వ్రాసి=రాసి. (అనేక మంది మాట్లాడేటప్పుడు రాసి అంటూన్నా రాసేటప్పుడు మాత్రం వ్రాసి అంటున్నారు. సంభాషణలో రూపమే రాస్తే మంచిది.)

సుగ్రీవునికి=సుగ్రీవుడికి.

ఈక్రింది మాటలలో రేఫాలు ('ర'వత్తులు) అనవసరం. రేఫాలువుంటే గ్రాంధిక రూపాలవుతాయి గాని వ్యావహారిక రూపాలు అవవు. ఉదా:—బ్రదుకు, వ్రేలాడితే, ప్రాకడం, మ్రొక్కు, క్రింద, త్రాగించాను, ప్రొద్దున్న, త్రోక, త్రాచు, క్రొత్త, ప్రాత, ప్రక్క, వ్రేలు మొ.

ఇచ్చినారు, తెచ్చినారు, చేసినావా, తెచ్చినావా, చేసినాను, తెచ్చినారు మొదలైన గ్రాంధిక

రూపాలు యిప్పటి శిష్టులవాడుకలో లేవు. ఇవి ఇప్పుడు పామరులు మాత్రమే వాడుతున్నారు. ఈ రూపాలుకింది కాలానికి చెందిన (కిందటిశతాబ్దపు) శిష్టుల వ్యావహారికరచనల్లో కనబడుతున్నాయి. అంటే అప్పటి శిష్టులలో ఈ రూపాలు వాడుకలో వుండేవన్నమాట. ఇప్పుడు వాటిని వాడడం లేదు. కాబట్టి వాటిని గ్రంథకర్తలు వాడనవసరం లేదు. కాని కొందరు గ్రంథకర్తల రచనల్లో ఈ రూపాలు కనబడుతున్నాయి. అంటే ఇచ్చారు, చేశావా, తెచ్చాను మొదలైన రూపాలతోపాటు పై రూపాలుకూడా వాడుతున్నారు. వాడుకలోని ఈ రూపాలను ఈ రచయితలు వాడడానికి కారణమేమిటంటే వీరు గిడుగువారి వ్యావహారికశైలిని అనుకరించడమే. గిడుగువారు తమరచనల్లో కిందటి శతాబ్దపు వ్యావహారిక శైలిని అనుకరించారు. గిడుగు వారిని అనుకరిస్తున్నందువల్ల యిప్పటి వారి రచనల్లో కూడా ఆ మూరూపాలు కనబడుతున్నాయి. కనక ఆ రూపాలిని వ్యావహారికంలో రాయడమంటే ఈ శతాబ్దపు వ్యావహారికంలో రాయడం కాదు. కిందటి శతాబ్దపు వ్యావహారికంలో రాస్తే అది పాతపడ్డ మాటల్లో రాయడమనిపించుకొంటుంది. కనక పైనచెప్పిన ఆ రూపాలు వాడవద్దు

యడాగమ మొకటి కొందరి రచనల్లో కనబడుతూంది. మాయమ్మ అనీ మాయత్త అనీ శిష్టులు అనరు. ఈ మోస్తరుగా పామరులు అంటారు. ఇటువంటి ప్రయోగాలు శిష్టులరచనలలో తప్పని చెప్పక తప్పదు. యడాగమం ఈ కింది సందర్భాలలాంటి వాటిలో మాత్రమే వాడవచ్చు. ఉదా:—ఆయాపనులు, ఆయాదేశాలు, అయిదు రూపాయిలకు ఏళాలువో, ఏకంబళీనో దొరక్క పోవునా. ఇక్కడ రచయితలు అనవసరంగా వాడిన సందర్భాలు చూపిస్తాను. ఆసందర్భాల్లో యేమోస్తరుగా వుండాలో రాస్తాను.

(అ) ఈకిందివాటిలో 'వ' గుణింతం వాడవచ్చు.

చెప్పి యొప్పించే=చెప్పివొప్పించే

వస్తూయుండడం=వస్తూవుండడం

అంటియున్న=అంటివున్న

(ఆ) వీటిలో సంధిచెయ్యవచ్చు.

ఆయింటియావిడ=ఆయింటావిడ

ఆడదియేఅయితే=ఆడదేఅయితే

ఇంటియామె=ఇంటామె

పిల్లయే దొరక లేదా=పిల్లేదొరక లేదా

చక్కని భావాలు తట్టినవన్నమాటయే=చక్కని భావాలు తట్టినవన్నమాటే

(ఇ) వీటిలో అచ్చువాడవచ్చు.

నవ్వుపుట్టించే యుపన్యాసాలు=నవ్వు పుట్టించే ఉపన్యాసాలు

అంతటయామె=అంతట ఆమె

తలాయొకటి=తలాఒకటి

కంటెయయినా=కంటెఅయినా

ఈయనయమర్చిన=ఈయన అమర్చిన

(ఈ) లేకయా=లేకా

ద్రుతం గురించి. దీనిని విధిగా వాడవలసిన అవసరం లేదు. కనపడరు అనవచ్చు, కనబడరు అని అనవచ్చు. చూశాను అనీ, చూశా అనీ అనవచ్చు. నుగాగమం అవసరం ఎక్కడో కాని రాదు. అనవసరంగా వాడినవాటికి ఉదాహరణలిచ్చి, అపక్కనే ఎలాగవుండాలో రాస్తాను.

పెందలకడనే=పెందలకడే

వారిలోనున్నప్పుడు=వారిలో వున్నప్పుడు

తనసాన్నిధ్యములో నున్న=తన సాన్నిధ్యంలో వున్న

తక్కువగానుండినందున=తక్కువగా వుండడంచేత

ఈకిందివాక్యంలో 'ను' లు అనవసరం. 'చక్కనిముఖం పవిత్రతను, సత్యమును, ప్రేమ జ్ఞాపకం తెస్తుంది.'

'ప' వర్ణక ఆదేశం. ఈ ఆదేశం వ్యావహారికానికిఅవసరం లేదు. ఉదా:-ప్రయోగింపబడుతూంది, ఆలోచింపబడుతూంది అనేబదులు ప్రయోగించబడుతూంది, ఆలోచించబడుతూంది అని రాయాలి.

ఇంక మరొక విషయం. ప్రపంచకము, సామాన్యము, రోషము, దోషము, కుటుంబము మొదలైన మాటల్లో 'ము' బదులు అనుస్వారం వాడాలి. మనం ఆమాటలను 'ము'కారాంతంగా వుచ్చరించం. అలాంటప్పుడు వాటిని ముకారాంతంగా రాస్తే అసహజంగా వుంటుంది. ప్రపంచకం, సామాన్యం, రోషం మొదలైనవిగా రాయాలి. ఈమాటలయొక్క బహువచనాలు ప్రపంచకములు, సామాన్యములు, దోషములు, కుటుంబములు అని రాయకూడదు. ఈమోస్తరుగా మనం మన సంభాషణల్లో వాడం. ప్రపంచకాలు, సామాన్యాలు, దోషాలు, కుటుంబాలు అనే వాడతాం కాబట్టి అలాగే రాయాలి. ఈఅంశం గమనించకపోతే వ్యావహారికం అసహజంగా వుంటుంది.

మొత్తంమీద వ్యావహారికంలో అనవసర గ్రాంథికం వాడకూడదు. అలాగ వాడితే చాలా వికృతంగా వుంటుంది. ఇంతకీ అది వ్యావహారికమని అనిపించుకోదు.

## ౪. అనవసర సంస్కృతం

కొందరి వ్యావహారికరచనల్లో అనవసరమయిన సంస్కృత పదాలూ, సమాసాలూ కనబడుతున్నాయి. మనంచదివిన గ్రాంథిక గ్రంథాలన్నీ పైవాటితో నిండి వున్నందువల్ల వ్యావహారికానికి కూడా ఇవి అవసరమని కొందరూ, విచక్షణలేక కొందరూ వ్యావహారికంలో వాడుతున్నారు. సాధారణంగా కొందరి అభిప్రాయమేమిటంటే 'మఱ్ఱిచెట్టు' అనడంకంటే 'వట వృక్షం' మంటే ఎక్కువ సొగసుగా వుంటుందనీ, 'ఏనుగు' అనడంకంటె 'కుంజర' మంటే ఎక్కువ బాగుంటుందనీ, కొన్ని కొన్ని ఘట్టాలలో సంస్కృతం దట్టంగా వాడకపోతే రసవంతంగా వుండదనీ. ఇది దురభిప్రాయమని వేరే చెప్పక్కర్లేదు. తెలుగుశైలియొక్క సహజత్వం చావడానికే ఈ మోస్తరుగా సంస్కృతం వాడవలసివస్తుంది. ఎక్కడైతే అనవసరంగా సంస్కృతం వాడతామో అది తెలుగు కాదనుకోవలసిందే. తెలుగు పేరుచెప్పి సంస్కృతంలో రాస్తున్నామనుకోవలసిందే. ఇది తప్పని వేరే చెప్పనక్కర్లేదు. కాబట్టి రచయితలు వ్యావహారికాన్ని రాయడంలో ఎంతో జాగ్రత్తగా వుండాలి.

అనవసరమయిన సంస్కృత పదాలూ, సమాసాల అవసరం మన కొకచోట వస్తుంది. అదెక్కడంటే అలాగ రాసేవాళ్లని వేళాకోళంచెయ్యడానికి. అలాంటి సందర్భాలలో సంస్కృతం వాడవచ్చు. భాషావ్యాసాలలోనూ, విమర్శవ్యాసాలలోనూ, ప్రకృతి శాస్త్రాలలోనూ కొన్ని సంస్కృత పారిభాషిక పదాలు అవసరం. అటువంటివాటికి తప్పలేదు.

అనవసరంగా సంస్కృతం వాడడమేతప్పు. అటువంటిస్థితిలో తప్పుసమాసాలుకూడా చేస్తే ఇక చెప్పేదేమిటి. ఒకాయన 'అందవతి' అని వాడాడు. ఇది తప్పే మనం సంభాషణలో 'బహుకొద్ది'. 'బహుతక్కువ' 'ముఖ్యకోరిక' మొదలైనవి వాడుతున్నాము. ఈతప్పులు కాగితంమీద ఎక్కకుండా వుంటే మంచిది. అటువంటి తప్పులు అసలు సంభాషణలోనే రాకుండా చేసుకుంటే మరీమంచిది.

## ౫. దీర్ఘాలు

కొన్నిమాటలకు దీర్ఘాలుంటేగాని భావం బోధపడదు. పైగా వ్యతిరేకపు అర్థంకూడా యిస్తాయి. దీర్ఘాలు లేకపోవడం గ్రాంథికపు పద్ధతి. అది మనకు పనికిరాదు. కనక రచయితలు దీర్ఘాలను జాగ్రత్తగా గమనించాలి. ఇక్కడ ఉదాహరణ లిస్తాను. ఏ అక్షరాలకు దీర్ఘాలుండాలో ఆ అక్షరాలకింద అడ్డగీట్లు పెడతాను.

'జట్టు స్వేచ్ఛగా వుందిలేనిది.'

'కొంపెతావా యేమిటి అని ఎప్పుడు ఎత్తిపొడుస్తాను.'

'ఆసొమ్ము ఎలాఖర్చయిందో ఎవరికీ తెలియదు'

'సరకులను, జనులను మోసుకొనిపోతో మానవులకు చాకిరిచెయ్యడానికి ఏర్పడ్డ రెలువాళ్ళు దొంగతనాలు, చోరీలు, ఖూనీలు, జరక్కుండా జాగ్రత్తపెట్టి

ప్రజలను సేవించడానికి ఏర్పడ్డ పోలీసువాళ్లు న్యాయా న్యాయాలు విచారించి తీర్పుచెప్పి ప్రజా సౌఖ్యానికి తోడ్పడడానికి ఏర్పడ్డ కోర్టు అధికారులు పాశ్చాత్య దేశాలలో...'

'ప్రస్తుత సమయంలో జరుగుతూవుండిన వివాహాలను ఆదర్శంగా గమనించి ఆవిషయాలను ఆధారంగా చేసుకొని ప్రేమ అన్నది లేదని, ఉన్నా అంతటిప్రధానపాత్ర వహించడములేదని అనుకొంటున్నావు.'

'బిడ్డశ, నేను కులాసాగానే వున్నాము.'

'ఉడతలు, కుందేళ్ళు, లేడిపిల్లలు, కోతులు అకాలంలో నీరు తాగటాని కొచ్చి......డాక్టరు, చంకలో నవ్వుతూ బుజ్జి వచ్చారు.'

'మారదేశాలలోని నదులు, కొండలు, వ్యక్తులు మొదలైనవారి స్వరూపము చూపడములో కవిత చిత్రకళకి తీసిపోతుంది.'

'ఒక్కముద్దయినా తినంది వుండలేరింక.'

'ఎక్కిరుకున్నాం దిగేసున్నాం గోజ.'

'ఇంట్లో నాకెవరిమీద ప్రేమలేదు.'

రచయితలు సాధారణంగా అవసరమయినచోటే దీర్ఘాలు పెట్టకుండావున్నారు. కాని ఒక గ్రంథంలో అనవసరంగా దీర్ఘాలు కనబడుతున్నాయి. ఈ దీర్ఘాలవల్ల వ్యతిరేకం అర్థం కలుగుతూంది. కాని ఇవి పాత్రల సంభాషణలలో వుండడంవల్ల అది పాత్రపోషణకోసమన్నట్టుగా తోసుకుపోతూంది.

'ఎవరు పురమాయించారు తల్లిగివ్వలా'

'తప్పకుండాను.'

'పెద్దాడబడుచు పైనాడు కిదివరకే నువ్వు లోటు చెయ్యలేదూ.'

## ౬. అన్యదేశ్యాలు.

ఈ అన్యదేశ్యాలు ఇంగ్లీషుకు సంబంధించినవే. డెబ్బై ఏనభై యేళ్లకిందటి వ్యావహారిక రచనల్లో కావలసినన్ని తురకపదాలు కనబడతాయి. ఇప్పుడు అనవసరమైన తురకపదాలన్నీ పోయాయి, అవసరమైనవిమాత్రమే నిల్చాయి. తురక పదాలగొడవ మనకిప్పుడేమీలేదు, ఇంగ్లీషుపదాల గొడవగాని.

కొంతమంది తమ రచనల్లో తరచు ఇంగ్లీషు ముక్కలు వాడుతున్నారు. సంభాషణననుసరిస్తే ఆమోస్తరుగా వస్తుంది. సంభాషణలో అనవసరంగా బోలెడంత ఇంగ్లీషు వాడుతూవుంటాం. ఇది తెలివి తక్కువ పనని వేరేచెప్పనక్కర్లేదు. సంభాషణలో ఒక సంగతి తెలుగులో చెప్పి అదే ఇంగ్లీషులో చెప్తాం. తెలుగులో వున్నముక్కలకే ఇంగ్లీషు ముక్కలు వాడతాం. ఈమోస్తరుగా ఇంగ్లీషువాడకం అనవసరం. మనం సంభాషణలో అత్యవసరమైనచోట్ల తప్ప ఇంగ్లీషు వాడకూడదు. ఈ మోస్తరుగా నియమం పెట్టుకొని మాట్లాడితే చాలామంచిది. తక్కిన దేశస్థులు తమ సంభాషణల్లో అనవసరమైన ఇంగ్లీషుముక్కలు వాడరు. ఆమోస్తరుగానే మాట్లాడుతూ వుండాలి మనంకూడా. రచనలనుసరించి. సంభాషణ ననుకరించడం చేత వ్యావహారిక రచనల్లో ఇంగ్లీషుముక్క లెక్కువగా వుంటున్నాయి. అందులో ముఖ్యంగా హాస్యరచనల్లో ఎక్కువగా వుంటున్నాయి. హాస్యరచనల్లో ఈమోస్తరుగా వాడకపోతే హాస్యముండదని వారి అభిప్రాయం. ఇలాగవాడే వాళ్ళలో అయినా వాళ్ళయొక్క మొట్టమొదటి రచనల్లో వున్నన్ని ఇంగ్లీషు ముక్కలు తర్వాతి రచనల్లో వుండవు. అంటే క్రమేపీ తెలుసుకొంటారు, హాస్యరసోత్పత్తికి ఇంగ్లీషే వాడనవసరంలేదని. పైగా ఇంగ్లీషుముక్కలు వాడడంవల్ల ముఖ్యమైన నష్టమేమిటంటే, ఇంగ్లీషు చదువుకోనివాళ్ళు, స్త్రీలూ ఈరచనలను శ్రద్ధతో చదివి ఆనందించలేరు. అంచేత ఇంగ్లీషు ఎంతతగ్గిస్తే అంతమంచిది. ఈ అన్యదేశ్యాలు తగ్గించివేసి తెలుగులో కలిసిపోయిన ఇంగ్లీషుమాత్రమే వాడుతూవుండాలి. ఎక్కడేనా అంతగా అవసరమయినచోట మరికొన్ని ఇంగ్లీషుముక్కలు వాడవచ్చు.

రచనల్లో ఈఇంగ్లీషువాడుక ఈకిందమోస్తర్లుగా వుంది. కొంతమంది ఇంగ్లీషుమాటలు తెలుగు అక్షరా

లలో రాస్తున్నారు. మరికొంతమంది ఆమోస్తరుగా రాసి కుండలీకరణాలలో ఇంగ్లీషుమాటలు రాస్తున్నారు. ఇంకొంతమంది ఇంగ్లీషుమాటలు రాసి వాటిని కుండలీకరణాలలో తర్జుమా చేస్తున్నారు. కొంతమంది ఈముక్కలు ఇంగ్లీషులోనే రాస్తారుగాని కుండలీకరణాలలో తెలుగురాయరు. ఇన్ని మోస్తర్లుగా వుంటుంది ఈఇంగ్లీషు ప్రయోగం. అంతగా ఇంగ్లీషుముక్క వెయ్యవలసివచ్చినప్పుడు అది తెలుగు అక్షరాలలోనే రాస్తే మంచిది. ఇంగ్లీషురానివాళ్లుకూడా చదువుకోడానికి వీలుగా వుంటుంది. వారు ఆమాటచదివి తర్వాత అర్థం తెలుసుకుంటారు

## ౭ ఉచ్చారణ - విభేదపు గుర్తులు

కొన్నిమాటలు మనం ఉచ్చరించిన ప్రకారం రాయడానికి ప్రయత్నిస్తున్నాము. వీటినైనా అందరూ ఒక్కమోస్తరుగ రాయడం లేదు. నాకు కనబడ్డ కొన్నిమాటలు ఈకింద ఉదహరిస్తాను. అవి ఏ మోస్తరుగా రాయబడుతున్నాయో మొదటచెప్పి అవి మునుపు ఎలాగ రాసేవారో ఆపక్కనే రాస్తాను.

రావయ్యా=రామయ్యా.

కావోసు=కమోసు.

ఏవిటా=ఏమిటా.

ఏవయ్యా=ఏమయ్యా

ఆవడం=ఆమడం.

మరికొంతమంది ఈకిందివిధంగా రాస్తున్నారు.

ఏవిటి=ఏమిటి.

మావ=మామ.

నష్టపోగలవా=నష్టపోగలమా.

నేను 'ఉచ్చారణ—విభేదపు గుర్తులు' అనే నావ్యాసంలో (ఈవ్యాసం ౧౯౩౭ మేనెల 'భారతి' సంచికలో పడింది) ఈకింది మోస్తరుగా రాస్తేమంచిది అని చెప్పాను. 'మ' అక్షరంమీద ఒకచుక్క పెట్టడం.

కొందరు ఒక మాటను ఒత్తిపలకడం ఈ కింది విధంగా చూపిస్తున్నారు. ఉదా:—ఇఖ (ఇక), (ఘట్టిగా) చప్ప్పన రా (చప్పన రా), చల్ల్లగా (చల్లగా) తక్కిన వాళ్లుకూడా ఆపద్ధతి అవలంబిస్తే మంచిది.

కొంతమంది 'చెప్పేను, వచ్చేను, తెచ్చేను, చెప్పలే, ఇయ్యాలే' అని రాస్తున్నారు. ఈమోస్తరుగా రాసేవాళ్లు బహుసకృత్తు. నూటికి తొంభై తొమ్మిది మంది 'చెప్పాను, వచ్చాను, తెచ్చాను, చెప్పలా, ఇయ్యాలా' అనే రాస్తున్నారు. అంటే పై మాటల్లో ఏత్వాలు వాడడంలేదన్నమాట. మనం ఉచ్చరించే ప్రకారం వుండాలంటే ఏత్వాలు వుండకూడదు. కనక చెప్పాను, వచ్చాను మొ. రాయడమే సమంజసం. కాని ఈ మాటలలో పా, చా అక్షరాలు వేరు. ఇవి మన మామూలు పా, చాలు కావు. కాబట్టి వీటికేదైనా గుర్తు పెడితే మంచిది. ఈ గుర్తునుకూడా నేను పైన చెప్పిన వ్యాసంలో రాశాను, ఆయా అక్షరాలమీద రెండు చుక్కలు అడ్డంగా పెట్టడం. ఆ నా వ్యాసంలో యింకా మరికొన్ని సంగతులు చెప్పాను, బాంకు, ఫర్లాంగు, ఫాక్టరీ మొదలైన మాటలు రాయడం గురించి. బాంకు అన్నమాటలో బామీద రెండుచుక్కలు వుండాలనీ, ఫర్లాంగులో ప కింద ఒక చుక్కపెట్టాలనీ, పాక్టరీ అన్నమాటలో పామీద రెండుచుక్కలూ, కింద ఒక చుక్కపెట్టాలనీ. ఇలాగే మరికొన్ని ఉచ్చారణలు తెలియచెయ్యడానికి మరికొన్ని అక్షరాలకి కొన్ని గుర్తులు పెట్టాలనీ చెప్పాను. తెలుగు అక్షరమాల ఇప్పుడు మన ఉచ్చారణకు తగినట్టుగా నిర్మించుకోలేదని ఒకవాదు వుంది.* ఇటువంటి వాదు లేకుండా వుండాలంటే మనం కొన్ని కొత్తగుర్తులు పెట్టుకొని ఉచ్చారణకు సరిపోయేటట్లు రాసుకోవాలి.

## ౮. వర్ణక్రమం తప్పులు

పంతొమ్మిదవ శతాబ్దిని శిష్టులురాసిన వ్యావహారికం నిర్దుష్టంగా వుండేది. చివరికి 'స' కి 'శ' రాయ

* గిడుగువారి వ్యాససంగ్రహంలో Is Telugu Alphabet quite phonetic' అనే వ్యాసం చూడండి.

చే. కా.

డం, 'శ' కి 'స' రాయడమేనా ఎక్కడో కాని కనబడదు. అలా కనబడితే అది పొరపాటువల్ల పడిందనే అనుకోవచ్చు. మరి ఏభై అరవైయేళ్ళకిందట్లో వ్యావహారికం చేతికొచ్చినట్టూ రాసేవారు. 'సర్వశబ్దసంబోధిని' అనే నిఘంటువులో వాడిన ముక్కలు చూడండి- ఆముక్కలు రాసి అవి బ్రాకెట్లలో ఎలాగవుండాలో రాస్తున్నాను. వొంతు (వంతు), యెందు (యందు), ఎముని (యముని) ప్రకాసించు (ప్రకాశించు), శెత (శత), భూయిష్ట (భూయిష్ఠ), శ్రుంకు (స్రుంకు), నాశిక (నాసిక), గడ్డము (గడ్డము), శ్రుతి (స్రుతి), వెండ్రుక (వెంట్రుక), జెంతువు (జంతువు), సూర్పణక (శూర్పణక). అప్పటి శిష్టుల రాతలన్నీ ఆమోస్తరుగావుండేవి. ఆ కాలానికి గ్రాంధికం అప్పుడే విజృంభించింది. వ్యావహారికంలో రాసే అలవాటు తగ్గడం చేతే రచయితలు ఇటువంటి తప్పు వర్ణక్రమాలు రాసేవారని నా ఉద్దేశం. మళ్లా ఈ మధ్య వ్యావహారికం ప్రారంభించింది. రచనల్లో కొన్ని కొన్ని తప్పులు కనబడుతున్నాయి. ఈ తప్పులు మనం పెందరాళే సర్దుకోవాలి. లేకపోతే అరవై యేళ్ల కిందటి వ్యావహారికంలాగే దారీతెన్నూ ఒక పద్ధతీ లేకుండా పోతుంది.

వర్ణక్రమంతప్పులు ప్రారంభకులలో కొంచెంగా కనబడుతున్నాయి. ఇద్దరిముగ్గురి పెద్దల్లోనే యివి కాస్త జాస్తిగా కనబడుతున్నాయి. ఉదా:— పూర్ణార్ణోగ్యం, విస్తీర్ణం, సంస్త, నిర్ణయం, మాత్రుదేవతలు, రుషులు, అవస్త, సత్రువు, దుఖాలు, అజీర్ణం, పరిస్తితులు, రుషులు, రుణం మొదలైన మాటలు వీరి రచనల్లో కనబడుతున్నాయి. వాక్యాదిని అచ్చువుండవలసినచోట హల్లు వాడుతున్నారు. ఉదా:—వొక్క, యీ వూళ్లో మొదలైనవి.

కొత్తరచయితలలో వర్ణక్రమంతప్పులు విశేషంగా కనబడడం లేదన్నాను. నాకు కనబడ్డ కొన్ని తప్పులు ఇక్కడ చూపించి అవి ఏలాగ వుండాలో రాస్తాను.

పుటక=పుట్టుక

శెలవులు=సెలవులు

సెరిశేయి=సెరికాయి

తెలిసాక=తెలిశాక

మసుగ్గా=మసకగా

విడదీసా=విడదీశా

చెప్తే=చెప్తే

తెలీయదు=తెలియదు

గరక=గరిక

అవుపడడం=అగపడడం

మద్యాహ్నం=మధ్యాహ్నం

అమురుస్తాడు=అమరుస్తాడు

రుణం=ఋణం

రాశిన=రాసిన

తీశేరండి=తీశారండి

చెవుతున్నా=చెబుతున్నా

తోపనియ్యలేదు=తోచనియ్యలేదు

మూశి=మూసి

బెగ్గరిగా=బిగ్గరగా

గబాలిన=గభాలున

సమ్మంధం=సంబంధం

రుషి=ఋషి

మనుషుడు=మనుష్యుడు

పార్వదేశం=పార్వతీశం

ఒంటిల్లు=వంటిల్లు

వాక్యాదిని అచ్చుతో ప్రారంభించే మాటలు హల్లుతో రాయడం ఎక్కడం ఎక్కడెక్కడేనా కనబడుతూంది. ఇవి పొరపాటువల్ల పడినవే అనుకోవచ్చు. వర్ణక్రమం వ్యావహారికానికి ప్రాణంవంటిది. దీన్ని చెడగొడితే వ్యావహారికానికి విపత్తు కల్పించుకున్నామన్నమాటే.

## ౯. గ్రామ్యం

వ్యావహారికంలో గ్రామ్యం ఎవరూ వాడడం లేదనే చెప్పవచ్చు గ్రామ్యపదాలు శిష్టులు వాడరు. అక్కడక్కడ ఒకరిద్దరు రచయితలలో సంక, ఎల్తా, సుంచో, పిలు (పిలువు) మొదలైన మాటలు కనబడు

తున్నాయి. వ్యావహారికంలో యిటువంటి గ్రామ్యం వుండకూడదని వేరే చెప్పనక్కర్లేదు.

## ౧౦. కొన్ని ఒకే ప్రయోగాలు

ఈకింది మాటలకి ఒకే ప్రయోగం కనబడుతూంది. ఈ ప్రయోగాలయినా అచ్చుపొరపాట్లో, గ్రంథకర్తల పొరపాట్లో అనుకుంటున్నాను. ఎంచేతంటే ఏమాత్రం భాషాజ్ఞానమున్న గ్రంథకర్తయినా ఇటువంటి తప్పులు రాయడు.

అనుకున్నావా=అంటున్నావా
ఆయినా=అయినా
ఉంకో=ఇంకో
ఊగ్లో=ఊళ్లో
ఏంవిటి=ఏమిటి
కల్ది=కలది
పొగలు=పగలు
బాగుణ్ణు=బాగుండును
బాయి=బావి
రికక్కలు=రెక్కలు
సఖం=సగం

## ౧౧. వ్యావహారికంలో కృతకం

కృతకం అని ఎప్పుడైతే అన్నామో అప్పుడే అది వ్యావహారికం కాదన్నమాట. కాని వ్యావహారికమనిపించుకొంటూ కృతకంగా వుండడానికికూడా అవకాశముంది. దాన్నిగురించి ముందుముందు చేస్తాను.

కిందటి శతాబ్దపు వ్యావహారికానికీ ఇప్పటి వ్యావహారికానికీ కొంతభేదముంది. కిందటి శతాబ్దపు వ్యావహారికంలో 'నీవు, వాడిక, చూచి, వ్రాస్తూ, గనుక, కాబోలు, చేసినాను, తెచ్చినాను, మొ; ఇయ్యడమునకు, చెయ్యడమునకు, మొ; సందేహములు; పుస్తకములు, మొ; 'న్న'లు (ఈ 'న్న'లతో ఇరవై పుటల వాక్యంకూడా వుంటూవుంటుంది ఒకొక్కప్పుడు) కర్మణి ప్రయోగాలు, కస్తవి, అవుతవి, ఉన్నది, ఉన్నవి (ఈఉన్నది, ఉన్నవి మాటలు యిప్పుడుకూడా కొన్నికొన్ని ప్రాంతాల్లో వాడుకలో వున్నాయి) ప్రపంచకము, నిత్యము, పట్టణము అని ముకారాంతంగా రాయడం, జరుగుచున్నది, అగుచున్నది, మొ. కనబడతాయి. గిడుగువారు రాసే వ్యావహారికంలో ఎంతసేపూ పైరూపాలే కనబడతాయి. అంటే వారు రాసేవ్యావహారికం కిందటి శతాబ్ది అన్నమాట. కిందటి శతాబ్దపు వ్యావహారికంలో రాయడం ఇప్పటి వ్యావహారికం రాయడమవదుకదా! ఇటీవల వ్యావహారికం స్థాపించినవారు గిడుగువారు. వీరి ఉద్యమం ఆమోదించి అనేకమంది వ్యావహారికం రాస్తున్నారు. కాని పూర్తిగా గిడుగువారి రూపాలే వాడి, వ్యావహారికం రాసినవాళ్ళు ఒక్కళ్ళూ కనబడరు. గిడుగువారు వాడిన రూపాలూ ఇప్పటి రూపాలూ కలగలపుచేసి రాసినవాళ్ళు చాలామంది వున్నారు. ఇటీవల వ్యావహారికం రాసేవాళ్ళలో ఈకలగలపు ఎక్కడోగాని కనబడదు.

శ్రీరామమూర్తి పంతులుగారు కిందటిశతాబ్దపు వ్యావహారికంలో రాశారన్నాను. వీరు ఈమోస్తరుగా రాయడానికి ఏదో ప్రబలకారణం వుండివుండాలి. ఆ కారణం ఏమయివుంటుంది? ఆకారణం 'ఇదీ' అని స్పష్టంగా చెప్పలేంగాని కొంతవరకూ వూహించవచ్చు. మళ్లీ వ్యావహారికాన్ని స్థాపించడానికి వారు గ్రాంథికవాదులతోటీ, గవర్నమెంటుతోటీ యుద్ధం చెయ్యవలసి వచ్చింది. ఈయుద్ధంలో ఎదుటివారికి తమ వాదన నచ్చచెప్పాలంటే వారు వనకటి గద్యరచనలోవుండే భాషే వాడాలి. తనకాలంనాటి వ్యావహారికంలో రాయడం మొదలెడితే ఎదుటివారిని ఒప్పించడం ఇంచుమించుగా అసాధ్యం.అంచేత వారు పందొమ్మిదవ శతాబ్దాదినివుండే వ్యావహారికంలో రాశారని నాఉద్దేశం.

గిడుగువారు ఒక్కరూ ఒకమోస్తరుగానూ, తక్కినవారంతా మరొకమోస్తరుగానూ రాస్తున్నారని చెప్పాను. రామమూర్తిపంతులుగారు కూడా మనలాగే, అంటే ఇప్పటి వ్యావహారికంలో రాయవలసిన అవసరం కనబడుతూంది. ఎంచేతంటే, కొంతమంది అంటున్నారుకదా, "రామమూర్తిపంతులుగారు రాసే వ్యావ

హారికంలాంటిదైతే మాకేమీ ఆక్షేపణలేదు. తక్కినవారంతా రాసే వ్యావహారికమైతే మాకు పనికిరాదు" అని ఈమోస్తరుగా అనేవారికి రామమూర్తి పంతులుగారు రాసేభాష ఇప్పటి వ్యావహారికం కాదని తెలియదు. అలాగ తెలిస్తే వారుఅంతా రామమూర్తిపంతులుగారిలాగే రాయాలని కోరరు. పంతులుగారుకూడా యికముందు ఇప్పటి వ్యావహారికంలోనే రాస్తే వ్యావహారికాన్ని ఎవరూ ఆక్షేపించరనుకొంటాను.

నవకటి వ్యావహారిక రూపాలు ఇప్పటి మనరచనలలోకి రానియ్యకూడదు. అలాగవస్తే అది కలగలుపు అవుతుందికాని వ్యావహారిక మవదు. పాతపడ్డ మాటలుఅం [illegible] కలో లేని పదాలుకూడా మనరచనలోకి రానియ్యకూడదు. వాడుకలో లేని మాటలువాడితే వ్యావహారికమవుతుందా! పాతపడ్డమాటలు హాస్యంకోసం, వేళాకోళంకోసం ఎక్కడేనా వుపయోగించవచ్చు.

వ్యావహారికమనిపించుకొంటూ కృతకంగా వుండడానికి అవకాశముందన్నాను. అదెలాగో ఇక్కడ వివరిస్తాను. గోదావరిజిల్లావాడు గుంటూరుజిల్లా తెలుగు వాడినా, గుంటూరుజిల్లావాడు గోదావరిజిల్లా తెలుగువాడినా, నైజాంవాడు గోదావరిజిల్లా తెలుగువాడినా లేక విశాఖపట్టణంజిల్లావాడు యితరప్రాంతాల తెలుగువాడినా అంటే తనువాడే శబ్దస్వరూపాలుగాక ఇతరప్రాంతాల్లోనివి వాడితే ఆవ్యావహారికం కృతక మవుతుంది. తను మాట్లాడేభాష తానురాయవచ్చు? ఆమోస్తరుగా రాస్తే కృతక మవుతుంది. ఇప్పటివరకూ ఈమోస్తరుగా రాస్తున్నవాళ్ళు ఎవళ్లేనావున్నారా అంటే ఇంచుమించుగా లేరనే చెప్పాలి. ఎక్కడెక్కడోగాని ఈమోస్తరుగా ఒకప్రాంతంలో భాషాస్వరూపాలు మరోప్రాంతంలో వాడడం కనబడదు. ఏదైనా వ్యావహారికంలో కృతకం రాకుండా చూసుకోవాలి. ఏప్రాంతం వారు ఆప్రాంతం తెలుగురాస్తే జిల్లాజిల్లాకీ తెలుగు వేరయిపోతుందని భయపడక్కర్లేదని చెప్పాను. వ్యావహారికం అభివృద్ధి చెందినకొద్దీ అన్నిప్రాంతాల్లో తెలుగూ ఒక్కలాగే ఏర్పడుతుందేమో ఎవరుచెప్పగలరు? వ్యావహారికంలో కృతకంరాకుండామట్టుకు మనం జాగ్రత్తపడాలి.

## ముగింపు

ఈమోస్తరుగా ఇప్పటి వ్యావహారికంలో నాకు కనబడ్డ కొన్నిలోపాలుగురించి చెప్పాను. ఈలోపాలైనా చాలామట్టుకు ప్రారంభకులలోనే కనబడుతున్నాయి. సాధన వున్న వారిలో ఎక్కడెక్కడో కాని కనబడవు.

వ్యావహారిక రచనకు కావలసినవి బహుస్వల్ప నియమాలు, గ్రాంధికంలా నైరిమోగ్రి నియమాలేమీ మన వ్యావహారికానికి లేవు. మనం ఈస్వల్ప నియమాలనుకూడా పాటించడానికి బద్ధకిస్తే ఎవరి రాతలు వారికి నచ్చవలసిందేగాని రెండోవారికి నచ్చవు. ఈచిన్ననియమాలు పాటిస్తే వ్యావహారికం తలకొకరీతిగా వుందనే ఆక్షేపణగాని, 'ఏకతలేదు'అనే ఆక్షేపణగాని వుండదు.

సమగ్రమైన నిఘంటువు ఒకటివుంటే వ్యావహారికానికి అనేక విధాల లాభంగావుండేది. ఇప్పుడు చేస్తూన్న తప్పులన్నీ,చాలామట్టుకు తగ్గిపోతాయి. కాని మనమింకా అటువంటి నిఘంటువుకు నోచుకోలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్తువారి నిఘంటువులో వ్యావహారికం బహిష్కరించబడుతుంది కాబట్టి ఆనిఘంటువువల్ల వ్యావహారికానికి లాభం తక్కువ. కొత్తగా వేసే వావిళ్లవారినిఘంటువులో వ్యావహారికపదాలు చాలా చేర్చబడతాయిట. ఏదయినా గిడుగువారి నిఘంటువు బయటపడితేగాని భాషకు విశేషంలాభం వుండదు. గిడుగువారి నిఘంటువూ. వ్యాకరణంకూడా త్వరలో ప్రకటించబడాలి.

ప్రారంభకులు తమ రచనల్లో ఎక్కువ తప్పులు లేకుండా రాయడానికి మరొకపద్ధతివుంది. సాధారణంగా ప్రతిపట్టణంలోనూ చక్కగా వ్యావహారికంరాసే వాళ్లు వున్నారు. ప్రారంభకులు తమ రచనలను మొదట్లో అటువంటివారిచేత దిద్దించుకొన్నటయితే స్వల్పకాలంలోనేవారు నిర్దుష్టంగా రాయగలుగుతారు. అలాగకుదరనిపద్ధతిలో నేనుచెప్పిన నియమాలు పాటించవచ్చు.



# "అవును, ఇపుడు నేను యౌవనముగను ఆరోగ్యముగను నున్నాను"

"ఇదివరకు నేను ఋతుసంబంధమైన నొప్పులతో బాధపడుచుండెడిదానను. సత్తువ యావత్తు పోయెను. బలహీనత యేర్పడెను. నాకు యేమాత్రము సౌఖ్యము లేకుండెను. అపుడు ఒక స్నేహితురాలు కల్జానా సేవింపమని నాకు సలహా యొసంగెను. నా జబ్బు యావత్తు కల్జానాతో శీఘ్రముగా నిమ్మళించుననియు, తిరిగి నాకు ఆరోగ్యము శరీర దార్ఢ్యత చేకూరుననియు ఆమె నాకు చెప్పెను.

కొద్దికాలము కల్జానా బిళ్లలను తీసికొన్న తరువాత, ఆమె నిజమే పలికెనని గ్రహించితిని. ఇదివరకు మాదిరి నొప్పులుగాని లేవు. బలహీనత యావత్తు మటుమాయ మయ్యెను. కల్జానా తిరిగి నాకు ఆరోగ్యము బలము ప్రసాదించినది. నా పండ్లుగూడ చాల గట్టిగానున్నవి.

నా మాదిరిగానే యిటువంటి నొప్పులతో బాధపడుచున్న స్త్రీలు యావన్మంది కల్జానా బిళ్లలను తీసికొనవలెను. ప్రతిరోజు యీ బిళ్లలను తీసికొనుచు మరల సదారోగ్యము బలము పొందుట చాల సులభమైనపని.




చేతితో తాకబడి యుండలేదు.

# Kalzana

ఆరోగ్యాభివృద్ధికి ఖనిజసంబంధమగు ఆహారము

ప్రతిమందుల దుకాణములలోను బజారులోను దొరకును. 2

మొత్తంమీద వ్యావహారిక రచనల కిప్పుడు పత్రికలే ప్రోత్సాహమిస్తున్నాయి. ఆంధ్రవిశ్వవిద్యాలయం వారు మనకిచ్చిన ప్రోత్సాహ మేమిటంటే ఇటీవల 'మాలపల్లె' నవలలో ఒకభాగాన్ని పఠనీయగ్రంథంగా ఏర్పరిచారు! ఒకరిప్రోత్సాహాలకోటీ నిరుత్సాహాలతోటీ మనకేంపని? ఎవరు ప్రోత్సహించకపోయినాసరే మనంవ్యావహారికంకంటే వేరేభాషలో రాయలేము. వేరే భాషలో రాయలేకపోడమేకాదు ఆభాషలో రాయబడిన గ్రంథాలు చదవలేముకూడా. వ్యావహారికం చదవడం అలవాటుపడ్డమనం ఈకాలపు గ్రాంథిక గ్రంథాలు చదవలేం.* ఈకాలంలోఇంకా గ్రాంథికంలోరాసేవాళ్ళనిసరించి ఏమనుకోవాలో తెలియకుండావుంది. పదిపదిహేనేళ్ళ కిందట ఒకగ్రంథకర్త గ్రాంథికంలో రాశాడంటే 'పానీ తెలియకచేశాడ'ని అనుకోవచ్చు. ఈకాలంలోకూడా గ్రాంథికంలోరాస్తే చెప్పేదేమిటి! ఇప్పటికీ వ్యావహారిక భాషయొక్క ప్రాశస్త్యం ఎరగనివారి రచనలు విశేషంగా రసవంతంగా వుంటాయని అనుకోలేము. ఒకప్పుడు వ్యావహారికంలో ఎవరేనా రాస్తే నవ్వేవాళ్లు. ఇప్పుడు వ్యావహారికంలో రాస్తేనే పసందుగా వుంటుం దంటున్నారు. మరి కొన్నాళ్లు పోయేక ఎవరేనా గ్రాంథికంలోరాస్తే ఆమనిషిని ఒకవిచిత్ర వ్యక్తిగా చూస్తా రనుకొంటాను.

వాఙ్మయ మూర్తులూ, భాషాకూడా క్రమేపీ మారుతున్నాయి. ఈకాలంలో ఒకడు ప్రబంధం రాశాడన్నా, లేక శతకం రాశాడన్నా మనం నవ్వుకొంటాము. చివరకి ఒకసాంఘిక నాటకం గ్రాంథికంలో రాశాడన్నా లేక నాటకంలో పద్యాలు పెట్టాడన్నాకూడా ఆశ్చర్యపడతాము. ఆపుస్తకాలను ప్రీతితో చదవలేము. కాలానికి తగిన రచనలు కావాలి. కాలంయొక్క మంచి పద్ధతి తెలుసుగోకపోవడం రచయితలో లోటే. వ్యావహారిక విషయంలో కొందరు కొంతవేగిరంగా వ్యావహారికంలోకి దిగారు. మరికొందరు కొంతఆలస్యంగా దిగుతున్నారు. మొత్తంమీద అంతాకూడా ఇకముందు వ్యావహారికంలోకి దిగుతారు.

నియమాలులేనటువంటి, తప్పులువున్నటువంటి వ్యావహారికం ఎన్నటికీ మంచిదికాదు. ౧౮౬౨లో ప్రకటించబడిన 'హితసూచని' గ్రంథంలో గ్రంథకర్త వ్యావహారికభాష సలక్షణంగా రాయాలన్నాడు. వ్యావహారికమైనా నేర్చుకొందే చక్కగా రాయడం రాదంటూచెప్పిన గిడుగువారి మాటలుచెప్పి ఈవ్యాసం ముగిస్తాను. 'వ్యావహారికభాష అందరికీ వచ్చినదే? అది వ్రాయడము నేర్చుకోనక్కరలేకుండానే వస్తుంది, బడులలో నేర్పడమెందుకూ?' అని కొందరు అంటున్నారుగాని అది బాగా ఆలోచించి అన్నమాట కాదు. కాకి రూపమైన, కుక్కరూపమైన పెన్సలుతో కాగితము మీద గీతలుగీసిగాని, రంగులతో చిత్రించిగాని, బంకమట్టితో కూర్చిగాని......వ్యక్తపరచడము నేర్చుకోనిదీ సాధనము చేయనిదీ అందరికీ రాదేమి? కాకిని అందరూ చూస్తూనేవున్నారే? పెన్సలూ, రంగులూ, బంకమన్నూ అన్నీ ఎరిగినవే! సామగ్రి కొత్తది కాదే! పనిముట్లు చేతివేళ్లేనే. ఏభాషఅయినా కూర్చి వ్రాయడము శిల్పమువంటిది. పొందికగా మాట్లాడడమైనా నేర్చుకొని సాధన చేస్తేగానిరాదు.

* ఈ అంశం చినకటిగ్రాంథిక గ్రంథాలకు చెల్లదు.

చే. కా.




(అనువాదము) తలిసెట్టి రామారావు.

# కళలయొక్క అభివృద్ధి

కొడవటిగంటి కుటుంబరావు

వీధి నాటకాలు వెనకపడి, నాటకాలూ, అవికూడా కొంచెం వెనక్కువెళ్ళి టాకీలు వచ్చినవికనుక నున్నూ; తాళపత్రాలూ ఘంటాలూ మొదలయినవాటి నిఅతిక్రమించి అచ్చుకూటములున్నూ; బ్రషులూ, కేన్వాసులూ, నూనెరంగులూ మొదలైన సాధనాలను మించి కామెరాలూ రావటంనూలాన కళా ప్రపంచ మందంతటా వాయువేగంతో అభివృద్ధిపొందుతున్న దనే అభిప్రాయం ఒకటి ప్రబలంగా ఉంది. నిజమైన కళయందు ఎక్కువఅభిరుచి లేక, అదేమిటో తెలుసుకోవలె నే యావకూడా లేని ఆంధ్రులుకాని ఆంధ్రేతరులు కాని, వారి కావిశ్వాసంవల్ల ఏమాత్రమైనా సంతుష్టికలిగేయెడల, కళ అభివృద్ధిగాంచుతున్నదని అభిప్రాయపడవచ్చును. "కళలు పూర్తిగా నశించిపోతున్నవి" అని మొరపెట్టే వయోవృద్ధులను కళాసనాతనుల కింద కట్టివెయ్యవచ్చును. అందుకు ఎవరి అభ్యంతరమూ ఉండబోదు.

అయితే అటువంటివారు, కళలకూ వాటి ప్రదర్శనములకు సంబంధించిన శాస్త్రములకూ విచక్షణ తెలియక, ఎవడైనా తెలిసినవాడు చెబుతుంటే అర్థంచేసుకోలేక, ప్రతివిమర్శనలు చెయ్యటం అసహ్యంగా ఉంటుంది.

కళలనుగురించి ఆంధ్రులఅభిప్రాయాలు ఇంకా అయోమయంగాఉన్నట్టు కనిపిస్తూండటంవల్లనూ, ఆంధ్రులుకూడా ఇతరులతోపాటు పైకిరావాలంటే ఈవిషయాలనుగురించి స్పష్టంగా తెలుసుకున్న విమర్శకులు కొందరు తయారుకావాలికనుకనూ, కొన్ని చిన్న చిన్న విషయాలనుగురించి నాకు తెలిసినది తెలియనివారికి తెలియజేసేఅభిప్రాయంతో ఈ నాలుగు ముక్కలూరాస్తున్నాను.

కళ అభివృద్ధికాదు, క్షీణించదు. ఆసద్గతీ దుర్గతీ కళాప్రదర్శనములకు మాత్రమే కలుగుతూ ఉంటుంది. కళాప్రదర్శనముయొక్క ఉద్దేశం కళను ప్రకటించటం. అది జయప్రదంగా కొనసాగాలంటే ప్రదర్శనా విధానం కొన్ని అవసరమైన కట్టుబాట్లకు లోనుకావాలి. భావం ఎటువంటిదో కళ అటువంటిది. భావమంటేది టెక్నిక్. కళాపిపాసకు ఎటువంటి టెక్నిక్‌తోనూ ఏమీ సంబంధంలేదు. అది నేర్చుకోవటం ప్రదర్శకుడిపని. గానకళ తీసుకున్నట్టయితే, సంగీతశాస్త్రవేత్త కళాప్రదర్శనాలకు అర్హుడవుతాడని భావించనక్కర్లేదు. కాని గానకళాప్రదర్శకుడికి సంగీతశాస్త్రంకూడా రాకతప్పదు. గానకళయందు అభిరుచిగలవాడికి సంగీతశాస్త్రం రాకుండానే గానకళాప్రదర్శనం (సంగీతశాస్త్రప్రదర్శనంకాదు!) సులభంగా అనుభవనీయమవుతుంది. సంగీతశాస్త్రమందే అభిరుచికలవాడు గానకళనుగురించి ప్రసంగించటం నిరర్థకం. గానకళయందూ సంగీతశాస్త్రమందూకూడా అభిరుచికలిగినవాళ్ళనుగురించి నేనేమీ చెప్పను. ఈస్వల్ప విషయాలు అర్థంచేసుకుంటే వివిధపత్రికలలో ప్రచురించబడే పొరపాటు అభిప్రాయాలకు తావుఉండదని నేను నమ్ముతున్నాను.

"అభివృద్ధా? మార్పా" అనే తలపేరుతో నేను నాలాకాలంక్రితం రాసినవ్యాసం ఒకటి నాట్యకళ తృతీయసంచికలో ప్రకటితమయింది, అదిచూచి డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు, నాగురువులు, నన్ను రివ్యూవనరీవాడికింప కట్టేశారు. "ఆంధ్రవార్త" వారికి అందులోఉండిన అభిప్రాయాలు సంకుచితబుద్ధితోకూడినవిగా కనిపించినవి. ఇంకాఎందరెన్ని విధములుగా భావించారో నాకు తెలియదు. నావల్లజరిగినపాపం వేరేఏమీలేదు; "మనకు కావలిసింది అభివృద్ధికాదు, మార్పు." అన్నాను.

"అభివృద్ధి" కింద పరిగణించబడే వస్తువును ఒక్క సారి తరిచిచూస్తేనే నాముక్క ఎందుకన్నానో సుల భంగా బోధపడుతుంది.

కళకు సంబంధించినంతవరకూ మార్పయినా అభి వృద్ధిఅయినా కళాప్రదర్శనములతాలూకు టెక్నిక్కు దేనని మొదటనే మనవిచేశాను. ఈఅభివృద్ధి రెండురకా లుగా ఉండవచ్చును. (౧) కళను బాగా ప్రకటించ టానికీ, (౨) కళను విరివిగా ప్రకటించటానికీ. మొదటి రకం అభివృద్ధికి ఎవరూ అభ్యంతరం చెప్పరు. రెండవ రకమైన అభివృద్ధికూడా చాలాయోగ్యమైనదేకాని, దా న్నిహద్దుమీరి పోనివ్వరాదు. అయితే మొదటిరకం అభి వృద్ధి చాలామందంగా జరుగుతుంది. భరతాచార్యుల వారు కొన్నిసూత్రాలు చెప్పారు. ఆచంద్రార్కమూ వాటికి చలనం వేసనీ, వాటికి మెరుగుపెట్టడం అసంభవ మనీ ఎవరూ భావించరాదు. దానికి తగిన సమర్థుడు అనుకున్నప్పుడల్లా జతపడడం అసంభవం.

ఇక రెండవరకం అభివృద్ధి చూడండి. మాతాత గారికాలంలోకూడా తాటాకులు రాయటానికి ఉప యోగించారు. ఈనాడు ఘంటాలు చూడనివారుకూడా అనేకమంది ఉండవచ్చును. కాగితాలూ, కలాలూ, ఇంకా మంచికలాలూ, కాళ్లతోతొక్కే అచ్చుయం త్రాలూ, పవర్‌మీద నడిచేయంత్రాలూ వాటంతటఅవే అచ్చుకూర్చే యంత్రాలూ, గంటకు ఎన్నోవేలప్రతులు ముద్రించే రోటరీలూ, అన్నీ దేశంలోకి వచ్చిపడినై. సముద్రందాటి మరికొన్ని రానున్నవి. ఈఅభివృద్ధివల్ల కళాప్రచారం జరగటానికి అవకాశం లేకపోలేదు. ఈ నాడు ఇంటింటా ఒకభారతం ఉండటానికి అవకాశా లు ఏర్పడినై. పైగా, భారతంవంటి ఉత్తమకావ్యం ముచ్చటయిన అచ్చుతో!

అయినప్పటికీ కాస్త విచారిస్తే ఈఅభివృద్ధికి దుఃఖించాలో సంతోషించాలోకూడా తెలియదు. ఈ అభివృద్ధి మనచేత ఏవిధంగా చంపేసిందీ! రైలు ఉన్నంత మాత్రంచేత కాశీక్షేత్రంయొక్క పవిత్రత క్షీణించిందా అని తెలివిగా అడగవచ్చును. అపవిత్రత కాశీక్షేత్రంలోలేదు. కాలినడకను కాశీకివెళ్లి గంగఒ డ్డున సాష్టాంగంపడ్డవారి హృదయాల్లో ఉంటూఉం డేది! అచ్చుకూటాలే రాకపోయినట్టయితే భారతంయొ క్కప్రతులలో "న" లకు "స"లు ఉండేవికావు. భార తంచదవటం మానేసి యువకులు (ముందు వీరిమీదే దేశంతాలూకు బాధ్యతలు పడవలసి ఉన్నవి) మాసప త్రికలు చదవకపోయిఉందురు. అనేకవిధములైన పిచ్చి గ్రంథాలు అచ్చుకూటాలద్వారా శాశ్వతాలు చెయ్యబ డకపోయిఉండేవి.

నాట్యకళ టాకీలద్వారా శాశ్వతం చెయ్యబడి దేశంయొక్క దశదిశలా విరివిగా ప్రకటించబడటమనేది సంభవమయినప్పటికీఎంతఅనుమానాస్పదమోచూడండి. వీధినాటకం తీసుకుంటే అందులో ప్రేక్షకుల దృష్టి యావత్తూ నాట్యకళమీదే ఉండటానికి చాలా అవకా శాలున్నవి. తెరలులేవు. చెప్పుకోదగిన వేషధారణలేదు. ఒకరొబ్బరిమట్టల పందిరీ, ఒకటిరెండు దుప్పట్లూ.అంతే. ప్రదర్శనకు సంబంధించిన టెక్నిక్ యావత్తూ భరతశా స్త్రంలో చెప్పబడినదే. శాస్త్రంలో ప్రవేశంగలవారు విమర్శనాదృష్టితో చూస్తారు. స్త్రీలూ పిల్లలూ ప్రద ర్శనంలోఉన్న రసంమాత్రం గ్రహిస్తారు. లేకపోతే నిద్రపోతారు.

ఒకటాకీ తీసుకోండి. వేషధారణ ఒకకళ, ఆ రంగులూ అవీ తయారుచేసేటందుకు ఒకశాస్త్రమూ, ఒకపెద్దపరిశ్రమా. అవి నయ్యాటానికి ఒకఎక్స్పర్టు. ఒక నాటకం. ఆనాటకరచనకు టెక్నిక్ నాటకం ఒకకళావస్తువు. అభినయం ఒకకళ, దానికి సంబంధించిన కొంతశాస్త్రం. ఫోటోగ్రఫీ ఒకకళ. దానితాలూకు శాస్త్రమూ, పరిశ్రమా. శబ్దగ్రహణం ఒకశాస్త్రం— ఇన్నిశాస్త్రాలూ, కళలూ వాటితా లూకు లోటుపాట్లూ ఒకముద్దచేసి మనసెత్తిన ఒక టాకీ రూపంతో రుద్దుతున్నారు. ఇందులో నాట్యక ళను వెతకటానికి ఎవరికిపట్టింది? "మొంగుబొమ్మలు శే టగా కనపడటంలేదూ! మాటలు స్ఫుటంగా వినిపించ టంలేదూ! Bad photography! Absurd sound-recording! "డైరెక్టరెవరో పట్టివెధవ!" "అసలు డైర

క్టరు దొరట. అందుకని పనియావత్తూ మనవాళ్లే చేసేవారు. ఈవిధంగా పోతే వ్యాఖ్యానాలు.

ఈపరిస్థితుల్లో టాకీలురావటం ఏకళయొక్క అభివృద్ధికి? ఆఒకకళకోసం ఇన్ని ఉపకళలూ, ఉపశాస్త్రాలూ వినియోగించటం ఏమిటి? అసలు కళనుంచి ప్రజలదృష్టి ఈ ఉపకరణాలమీదికి పోవటం యేమిటి? ఒక్క ప్రదర్శనం కోసరం ఇంతమంది డైరెక్టర్లూ, టెక్నీషియన్లూ, నటులూ ఆరోగ్యాలు పాడుచేసుకొని చెప్పరాని హైరానపడి, అమాంబాపతు నౌకర్లూ వాళ్ళూ పొట్టనించలేని జీతాలమీద బతుకుతూ తమ జీవితాలను ఈకళయొక్క సేవలో వినియోగిస్తుంటే కళకుగాని ప్రజలకుగాని కళాదృష్టిలో కించిత్తయినా ఉపకారం జరిగిందా? టాల్‌స్టాయి ఇంతమంది ప్రాణాలు తోడుతున్న కళను తక్షణం తగలవెయ్యమన్నాడు. ఆయన ఆముక్క తనదేశంయొక్క ఆర్థికపరిస్థితులు గమనించి చెప్పాడు. మనదేశంలో కళయొక్క దుర్గతి చూచికూడా ఆముక్క చెప్పవచ్చును.

అయినా నేను టాకీలూ, అచ్చుకూటాలూ మొదలైనవి తీసిపారేసి కళను ఉద్ధరించమని ఆంధ్రులను వేడుకోవటంలేదు. అది పట్టి అరణ్యరోదనం అవుతుంది. కాని ఈఅభివృద్ధి యావత్తూ కళయొక్క అభివృద్ధిఅనిగాని, దీనికి కళతో ఏవిధమైనసంబంధమయినా ఉందనిగాని అనుకోవద్దని ఆంధ్రులకు ప్రార్థిస్తున్నాను. ఇదీ అరణ్యరోదనమే అవుతుందా?



మిశ్ర ప్రకృతి K. M. R.

# నరసభూపాలీయము

ఆకెళ్ల శేషాద్రి

యువ సంవత్సర ఫాల్గున మాస భారతిలో నా ప్రియమిత్రులగు, బ్రహ్మశ్రీ బులుసు వేంకటరమణయ్యగారు "నరసభూపాలీయము" అను వ్యాసమున నేతద్గ్రంథకర్త వ్రాసిన పొరపాటులను, ముద్రణ స్ఖాలిత్యములను, గొంతవఱకు వ్రాసిరి. వా రాగ్రంథము నందుఁ జూపిన కొన్ని యనుపపత్తులు నిజముగా ననుపపత్తులు కాకుండుటచే వానికి నాకుఁ దోఁచిన సమాధానములును, కొన్నిటిలో నా యభిప్రాయ భేదములును నిట వ్రాయఁదలఁచితిని.

కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలాలంకార కృత వస్తుధ్వని కుదాహరణముగా నిచ్చిన (౨ ఆ. ౧౩౩) పద్యములో వాచ్యమగు నుత్ప్రేక్షచే ఖండన వేదనరూప వస్తువు వ్యంగ్యమగుట సరికాదనియు, ఉత్ప్రేక్షా వాచకశబ్దము వివరణపద్యములోనే యున్నది, కాని యుదాహరణపద్యములో లేదనియు, వ్రాయుచు, "వలెన్, పోలెన్, మొదలగు పదములు లేవు. కాన ఉత్ప్రేక్ష వ్యంగ్యమే యగును. అట్టి పదము లున్నపుడే ఉత్ప్రేక్ష వాచ్యమగు ననియు లేనిచో వ్యంగ్యమగు ననియు అలంకారికుల అనుశాసనము" అని వ్రాసిరి. వాచకశబ్దము లేకుండుట నిజమే! కాని, వాచక శబ్దాప్రయోగమాత్రమున నుత్ప్రేక్ష వ్యంగ్యమగునా? ఇట్టి యాలంకారికుల యనుశాసన మెచ్చట నున్నది?

"...రిధి బోషించుటచేఁ గాఁబోలు వారి రక్తము నంటుటలేదు" అని యున్నచో 'కాఁబోలు' యగును. "పోషించుటచే రక్తము నంటదు" అను నప్పుడుకూడ రక్తము నంటకపోవుటలోఁ బోషించుటను హేతువుగా నుత్ప్రేక్షించుటచేఁ గ్రియాహేతూత్ప్రేక్ష వాచ్యమే, కాని వ్యంగ్యము కాదు. వాచకపదము లేదు గాన గమ్యోత్ప్రేక్ష యగును. గమ్యోత్ప్రేక్ష, వాచ్యాలంకార భేదమే కాని వ్యంగ్య భేదము కాదు.

అన్ని యలంకారములును, వాచ్యములునుగాను, వ్యంగ్యములుగాను గూడ నుండును. అలంకారము యొక్క సామగ్రియంతయుఁ బద్యములోఁ జెప్పఁబడినచో నప్పు డలంకారము వాచ్యమని చెప్పవలయును. సామగ్రి యూహ్యమాత్రము కాక వాక్యార్థముచే వ్యంగ్యమైనచో దాని నలంకారధ్వని యనవలయును. వ్యంగ్యమగు నుత్ప్రేక్ష కాక, వాచ్యమగు నుత్ప్రేక్షయే, వాచ్య, గమ్య (ప్రతీయమాన) యని రెండు విధములు. ఉత్ప్రేక్షను సూచించునట్టి, 'వలెన్, కాఁబోలున్' మొదలగు శబ్దములు * పద్యములో నుపాత్తము లైనచో వాచ్యోత్ప్రేక్ష యనియు, వాచకపద ముపాత్తము కాక గమ్యముగా నున్నచో నది గమ్యోత్ప్రేక్ష యనియు, సర్వాలంకారిక సిద్ధాంతము. గమ్యోత్ప్రేక్షయను పదమునకు గమ్యమగు (వ్యంగ్యమగు) నుత్ప్రేక్షయని యర్థము కాదు. గమ్యమగు (ఉపాత్తము కాని) వాచక పదము కల యుత్ప్రేక్ష యని యర్థము. వాచకపదము గమ్యమైనంతమాత్రమున నలంకారమంతయు వ్యంగ్యమగునా?

ఇట్టి యెడనైనఁ బొరపడుదురనియే కాఁబోలు నప్పయదీక్షితులును, విశ్వనాథుఁడును "గమ్యోత్ప్రేక్ష

* తే.గీ. తలఁతు ననుకొందు శంకింతుఁ దర్క్యము ధ్రువమనఁగ నాఁగఁ గాకోపు నాఁజను ననఁదగు
పోలెనొక్కొ కావచ్చుఁ గాఁబోలు నేమొ, ఓ ఒకో వంటి దుత్ప్రేక్ష కొప్పగు నర్థ.
(అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి, తెలుఁగు కావ్యాదర్శము)

వాచ్యాలంకార మెట్లగును? అలంకారధ్వని కావల యును గదా" అని శంకించుకొని, యుత్ప్రేక్షా సామ గ్రియంతయు నుపాత్తము కాక వ్యంగ్యమయినచో ధ్వనియనియు, సామగ్రి యంతయును నుండి, వాచక పదము మాత్రము లేనిచో గమ్యోత్ప్రేక్ష, లేక ప్రతీయ మానోత్ప్రేక్ష యనియు, గమ్యోత్ప్రేక్షకును, ఉత్ప్రే క్షాధ్వనికిని భేదమును స్పష్టపఱచి యున్నారు. చూడుఁడు:—

"నను గమ్యోత్ప్రేక్షాయా మలంకారతయా పరి గణన మయుక్తమ్, తస్యా అలంకారధ్వనిత్వాత్, ఉచ్యతే, విషయ విషయి నిమిత్తే ష్వూపాత్తేషు కేవల మివాదివాచకాప్రయోగ మాత్రేణ యత్రోత్ప్రేక్షాఽ వగమ్యతే, సాఽత్యంతం స్ఫుటత్వా ద్వాచ్యాయమా నత్వా దలంకారతామే వాఽవసాదయతీతి,......... యత్రోత్ప్రేక్షణీయస్య విషయిణో ప్యనుపాదానం, నిబద్ధేన వస్తునాఽలంకారేణవా గమ్యోత్ప్రేక్షా గూఢా తత్రైవోత్ప్రేక్షాధ్వనిః"

(అర్థచిత్ర మీమాంస)

"నను ధ్వని నిరూపణ ప్రస్తావేఽలంకారాణాం సర్వేషామపి వ్యంగ్యత్వం భవతీత్యుక్తమ్. సంప్రతి పున ర్వాశివ్య కథ ముత్ప్రేక్షాయాః ప్రతీయమానత్వమ్? ఉచ్యతే,—వ్యంగ్యోత్ప్రేక్షాయాం 'మహిలాసహస్స' ఇత్యాదా వుత్ప్రేక్షణం వినాపి వాక్యవిశ్రాంతిః, ఇహ తు స్తనయో ర్లజ్జాయా అసంభవాల్లజ్జయేవే త్యుత్ప్రే క్షయైవ వేతి వ్యంగ్యప్రతీయమానోత్ప్రేక్షయో ర్భేదః.

(సాహిత్య దర్పణము)

జగన్నాథ పండితుఁడును స్పష్టముగా నీసంగతి వ్రాసియే యున్నాఁడు

"సాచోత్ప్రేక్షా ద్వివిధా, వాచ్యా ప్రతీయమా నాచ. ఇవ, నూనం, మన్యే...ఇత్యాది ప్రతిపాదకైః సహితా, యత్రోత్ప్రేక్షా సామగ్రీ తత్ర వాచ్యోత్ప్రే క్షా. యత్రచ ప్రతిపాదక శబ్దరహితం తత్సామగ్రీమా త్రం తత్ర ప్రతీయమానా........... ప్రాయదాహృతే ష్వేవ పద్యేషు వాచకానా మివాదీనాం త్యాగే ప్రతీయమానా. । అర్థసామర్థ్యావసేయత్వాత్. నతు వ్యంగ్యేతి భ్రమితవ్యమ్."

(రస గంగాధరము)

నరస భూపాలీయమున నీ పద్యమునకు నవ్య వహిత పూర్వమే వస్తుకృతాలంకారధ్వని కిచ్చిన (౨ ఆ. ౧౩౧) పద్యములో నుత్ప్రేక్ష వ్యంగ్యము. చూడుఁడు—

"రాజా! నీ ప్రతాపము ప్రబలఁగా దావాగ్ని యడవుల పాలయ్యెను." ఇచట "ప్రతాపాగ్ని వేడిమి మాచి మనమునఁ గలఁగి కాఁబోలు,— (దావాగ్ని యడవి కేగెను.)" అనెడి క్రియాహేతూత్ప్రేక్ష వ్యంగ్యము.

ఇచ్చటనే "ప్రతాపము ప్రబలఁగా మనసునఁ గలఁగి కాఁబోలు దావాగ్ని యడవికిఁ బోయెను" అని యున్నచో వాచ్యోత్ప్రేక్షయగును.

వాచ్యోత్ప్రేక్షయందలి 'కాఁబోలు' అను పదము తీసివేసి "ప్రతాపము ప్రబలఁగా మనసునఁ గలఁగి దావాగ్ని యడవికిఁ బోయెను" అని యున్నచో గమ్యోత్ప్రేక్ష.

ఇట్లు వ్యంగ్య గమ్యోత్ప్రేక్షలకు భేదము స్పష్ట మైయుండ నభేద మెట్లు తలఁచిరో తెలియదు.

పై యాలంకారిక రాద్ధాంతమును బాగుగా గమ నింపక మఱికొందఱు కేవలాంధ్ర పండితులు "గమ్యో త్ప్రేక్షకును, ఉత్ప్రేక్షాధ్వనికిని భేదమే లేదు. కావు ననే నరసభూపాలీయకర్త గమ్యోత్ప్రేక్షకు వేఱుగా నుదాహరణములను జూపక "గమ్యోత్ప్రేక్ష రచింపఁగ లేదు నేర్పు చాలమి నిందుకా" అన్నాఁడు (౫-౯౫) అట్లే కానిచో నలంకార ప్రకరణాంతమున, 'ఈరీతిం గొన్ని యలంకారము లేర్పఱచినాఁడఁ గడమ దడమకే, నేరక వర్ణించుటగా, దారయ విస్తారభీతి నాపాదింపకా.' (౫-౧౮౨) అని తన సామర్థ్యమును బ్రకటించుకొనిన యాతఁ డీసందర్భమున నేర్పు చాలలేదనునా? కాన నభిన్నములగు గమ్యోత్ప్రేక్షోత్ప్రేక్షా ధ్వనులకు భేదము దుర్నిరూపమగుటయే, తనకు నేర్పు చాలదని చెప్ప

టాలోని నిగూఢాశయము." అని మూర్తిపుఁ బట్టుదలతో వాదించుట యలంకారశాస్త్ర సిద్ధాంతానభిజ్ఞతా మూలకమే యని తెల్లము కాకమానదు గదా!

శబ్దశక్తిమూలాలంకార ధ్వన్యుదాహరణ పద్యమున (౨-౧౧౪)శబ్దశక్తిమూలధ్వని లేదనియు, శబ్దశక్తి మూలాలంకార ధ్వని సిద్ధాంతమునకుఁ బై యుదాహరణముతోఁగాని, సమన్వయముతోఁ గాని యేమాత్రపు సంబంధము లేదనియు, నచ్చట రూపకాలంకారము వాచ్యమనియు వ్రాసిరి.

ఈ కోమలి 'పద్మిని' అనఁగా 'కమలిని' అనియు, 'ఇనుఁడవు నీవు' అనఁగా 'సూర్యుఁడవు' అనియు మాత్రమే వారర్థము చేసికొని యుందురు. అది పొరపాటు. ఇచట 'పద్మిని' అనఁగా 'పద్మినీ జాతిస్త్రీ' అనియు. 'కమలిని' అనియు రెండర్థములు కలవు. అట్లే, ఇనుఁడు-(౧) రాజు, (౨) సూర్యుఁడు. ఇచట మొదట నీ రెండు శబ్దములును ప్రకృతములగు, 'పద్మినీజాతి స్త్రీ, రాజు,' అను నర్థములను జెప్పును. తరువాత నభిధచేఁగాని, వ్యంజనచేఁగాని, * యప్రకృతములగు కమలినీ భాస్కరులను దెల్పును. అప్రకృతార్థమునకుఁ బ్రకృతసంబంధము కల్పించుటకే ప్రకృతాప్రకృతముల సాపమ్యము వ్యంగ్యరీతిని స్ఫురించును. కాన, 'కోమలి కమలినివంటి పద్మినీజాతి స్త్రీ' అనియు, 'నీవు సూర్యునివంటి రాజవు' అనియు నౌపమ్యము వ్యంగ్యము.

ఇచ్చట నౌపమ్యము వ్యంగ్యమగుటచే నుపమాలంకారధ్వని యని కొందఱి మతము. ఇట్టి తావుల శబ్దసామ్యముండుటచే శ్లేషయగునని కాఁబోలు, ధ్వన్యాలోకమున శ్లేష వ్యంగ్యమని చెప్పఁబడినది. ప్రకృతాప్రకృతము లేకశబ్దోపాత్తము లగుటచే నభేదమే భాసించుననియు. రూపకాలంకారము వ్యంగ్యమగు ననియు రసగంగాధరకారుని మతము.

విద్యానాథుఁ డిట్టిపట్టుల నుపమాధ్వని యనువాఁడుగాన మూర్తికవి యతనినే యనుసరించినాఁడు. కాన నీ పద్యము శబ్దశక్తి మూలాలంకార ధ్వని కుదాహరణమగుట యసంగతము కాదు. వేంకట రమణయ్యగారు చూచిన వావిళ్లప్రతిలో 'వధూనృపకుమారకంబులు' అను పాఠ మున్నదఁట! ౧౯౨౭ సం॥పు వావిళ్లవారి ప్రతిలో 'వధూనృపతివాచకంబులు' అని యున్నది. ఈ పాఠమున, గ్రంథకర్తృ సమన్వయముకూడ సుసంగతముగానే యున్నది.

అర్థాంతరసంక్రమితావివక్షితధ్వన్యుదాహరణ

ప్ర

కాని, నరసరాజు మత్స్యయంత్రము సేయఁగా మత్స్యేంద్రుఁడు భయపడెననుట, నేను 'రాముఁడను, సర్వమును సహింతును' అనుదానివంటిదే కావచ్చును. మత్స్యేంద్రుఁ డను పదమునకు 'నరసరాజుచే సేయఁబడిన మత్స్యముయొక్క పేరు ధరించిన దేశమునకు రాజు' అని లక్షణచే నర్థము చెప్పవలయును. నరసేంద్రుఁడు తాను జంపఁదలఁచిన వారి నొక్కరినే చంపుట కాదు; వారి నామముల ధరించిన వారిని, వారిని గాపాడువారినిఁ గూడఁ జంపునను వ్యంగ్యము సరసముగా నున్నది. కాన నీ పద్య మా ధ్వనికి నుదాహరణమగుట సుసంగతమే! 'అత్ర మత్స్య శబ్దసామ్యంబుచే' అను వివరణ మీ సంగతిని సూచింపక పోలేదు.

కవి నిబద్ధవక్తృ ప్రౌఢోక్తిసిద్ధ మనుటకు బదులు సుకవిని బద్ధోక్తిసిద్ధ మని గ్రంథకర్త యన్నాఁడనియు, ఆ నామ మసంగతమనియు వెంకట రమణయ్యగారు వ్రాసిరి.

కాని, యుదాహరణము లిచ్చు సందర్భములో వారు సంగతమనిన పేరే యున్నది. దానినే పద్యము కుదురుటకొఱకుఁ గొంచెము మార్చి చెప్పినాఁడు. కాని దీనివలనను నా యర్థము వచ్చుచుండుటచే నీ నామము సంగతము కాకపోదు. 'కవి నిబద్ధమగు నుక్తి' అని కర్మధారయసమాస మనుకొన్నచో నసంగతమగును గాని,

---

* ఇచ్చటి మతభేదములు, నా వ్రాసిన 'శ్లేష—శబ్దశక్తి మూలధ్వని' అను వ్యాసమున (శ్రీముఖ సం॥ మాఘ మాసపు భారతి) విశదముగాఁ జూపఁబడినవి.—

# లక్నో కాంగ్రెసు చిత్రములు



౩. మోతీనగర సింహద్వారము



౪. మోతీనగరము (విమానమునుండి)



౫. కార్యనిర్వాహక సంఘసమావేశమునకయి
ఆనందభవనమునకు (అలహాబాదు)
పోవుచున్న డా. పట్టాభి, రాజేంద్రప్రసాదులు



౬. స్వదేశీ ప్రదర్శనమున
పండ్లను, కాయలను పరికించుచున్న
గాంధిమహాత్ముడు

'కవినిబద్ధునియొక్క, ఉక్తి' అని షష్ఠీ తత్పురుష సమాస మనుకొనినచో సంగతమే కావచ్చును. ఆనామము మార్చుటయే యసంగత మనినచో ఛందోభంగాది భయము లేనిదే, వచనములోను నట్లే వ్రాసిన విద్యానాథుని నామకరణ మసంగతమే కావలసివచ్చును. చిత్తగింపుఁడు—

" అర్థస్య స్వతఃసంభవిత్వేన కవి ప్రౌఢోక్తి సిద్ధత్వేన, కవినిబద్ధోక్తి సిద్ధత్వేనచ త్రైవిధ్యమ్" (ప్రతాపరుద్రీయము.)

మఱియు నేఁబది యొక్క ధ్వనిభేదముల కును నామధేయములు వ్రాయుచు విద్యానాథుఁడే 'కవినిబద్ధోక్తి సిద్ధ' అని పంక్తిరెండుసారులు వాడి యున్నాఁడు.—దీని కేమందురు ?

మూర్తికవి గ్రంథమున నక్కఱలేని పెంపు లెక్కువయని చెప్పుచు, కావ్యములు, " కాంతాసమ్మితములు " అనుటను లమునకు 'అంగనాజన విలాసాలాపలీలాసమ్ప్రాదుర్భావములు ' అని పెంచినాఁడనియు, స్త్రీలు తమ కోరికలు చేష్టలచేతనే ప్రకటింతురు గాని మాటలచేఁ బ్రకటింపరనియు వ్రాసిరి.

కాని మాటలచేతనే యెక్కువగాఁ బ్రకటించుట యనుభవసిద్ధము. స్త్రీ తనకు వస్త్రాభరణాదు లపేక్షితములైనపుడు భర్తతో " చూశారండీ ! ఇదిగోనే ! ఆచార్యులుగారి కోడలు - కనకం - చక్కని కంచిచీర కొనుక్కుంది. యెంతో బాగుంది. మొన్న పండుక్కి డాలరుగొలుసు చేయించుకుంది. నిజంగ్గా మొలిచినట్టు చేశాడు కంసాలి. " అని యితర దృష్టాంతపూర్వకముగాఁ దన మనస్సులోనున్న కంచిచీర డాలరుగొలుసు లమీఁది కోరిక ప్రకటించుట యనుభవము లేదా ? కావుననే రామాయణాది కావ్యములును నితరదృష్టాంతపూర్వకముగా " రామాదివద్వర్తితవ్యం, నరావణాదివత్ " అనునది మొదలగు నీతులను బోధించుటచే వానికిఁ గాంతాసమ్మితత్వము చెప్పఁబడినది. దృష్టాంతపూర్వకముగాఁ గాంతలు మాట్లాడుట నుద్దేశించియే తత్సామ్యము కావ్యముల కీయఁబడినది.

గౌణ వృత్తియు లక్షణాంతర్భూతమే యని చెప్పు సందర్భమునందలి పద్యమున (౨-౫౮) 'వాచ్యవిభవాభిరామమై ' అని యున్నదనియు, దాని కర్థమేమో తెలియదనియు మా మిత్రులు వ్రాసిరి.

కాని ౧౯౨౭ సం॥ వావిళ్లవారి ప్రతిలోనే 'వాచ్యవిభవాభిభావియై ' అని యున్నది. ఈ పాఠమునవారి యనుపపత్తి వారింపఁబడినది.

స్థాయిభావముల వివరించు సందర్భమున "ఇందు ఉత్సాహమునకు బదులు ప్రయత్నము చెప్పఁబడినది. అది ఉత్సాహార్థమున అవాచకము" అని వ్రాసిరి.

మూలమున " స్థేయాన్ ప్రయత్న ఉత్సాహ " అని యున్నది. మిగుల స్థిరమగు ప్రయత్నమే, యుత్సాహమని యర్థము. మూర్తికవియుఁ బ్రయత్నమాత్రముత్సాహమని చెప్పలేదు. 'నిత్యముఁ దలఁచు ప్రయత్నమ్ముత్సాహమగును ' అని చెప్పియున్నాఁడు. (౩-౧౫) నిత్యమును దలఁచునది స్థిరము కావచ్చును గదా ! ఇఁక స్థాయిభావ పరిగణనపద్యమున (౩-౮) 'రతిహాస శోకయత్నములు' అని యత్నశబ్దముమాత్రము చెప్పినాఁడని యందురేమో, దానికి ౧౯౨౭ సం. నఁ బ్రకటించిన వావిళ్లవారి ప్రతిలోనే, పుటయడుగున, 'రతిహాసకు గుత్సాహములు ' అని పాఠాంతర మున్నదని చూపఁబడినది. ఈ పాఠమే గ్రాహ్యము. శుక్=శోకము.

' సాపరాధుఁడై యలుగనివాఁడు ధృష్టుఁడు ' (౨-౧౦) అను ధృష్టుని లక్షణము, 'వ్యక్తాగా గతభీర్ధృష్టః ' అను మూలమునకు సరిపడదని వ్రాసిరి.

నిజమే ! కాని, ముద్రణమునందు 'క' కారమునకు 'గ' కారము పడిన దనుకొన్నచో సరిపోవును. అలుకుటయన భయపడుట యని యర్థము.

పరిణామాలంకారోదాహరణము(౫-౫౦)సరిగా లేదనియు, నిచ్చెనకు హేతితాదాత్మ్యము మున్నదే గాని పరిణామాలంకారము కాదనియు, అట్లు ప్రకృతరూపమునఁ బరిణతి యిచ్చుట లేదనియు, దానంజేసి యీ పద్యము రూపకోదాహరణము కావలయుననియు వెంకటరమణయ్యగారు వ్రాసిరి. నిజమే, కాని, 'దృగబ్జముచే వీక్షించెను. ' అను పరిణామాలంకారోదాహరణమున నబ్జము దృష్టిరూపము నొందియే వీక్షణ క్రియోప

యోగి యగునట్లు ప్రతాపరుద్రీయమున నిచ్చిన యుదాహరణములో నారోప్యమాణమునకుఁ బ్రకృత తాదాత్మ్యము స్పష్టముగాఁ గన్పట్టదు. "రాజా! నీసామంత రాజులు నీ యాజ్ఞయనెడి పుష్పమాలను శిరస్సులందు ధరించిరి" అను ప్రతాపరుద్రీయోదాహరణమునఁ బుష్పమాల రాజాజ్ఞాతాదాత్మ్యము నొందుచుండలేదు. శిరస్సులందు స్రజమును ధరింతురుగాని యాజ్ఞను ధరింపరు గదా!

ఒకవేళ, లక్షణములో విద్యానాథుఁడు, 'ఆరోపవిషయాత్మతయాస్థిత' మ్మని యన్నాఁడు కనుక నాజ్ఞాతాదాత్మ్యమును స్రజము పొందినదనియే యూతని యభిప్రాయమనియు, కేవల స్రజమును ధరింపలేదనియు, అట్లు ధరించుటచే నుపయోగమును లేదనియు, దానంజేసి యాజ్ఞారూపము నొందిన స్రజమే ధరించిరనియు నచ్చట సమాధానము చెప్పుకొన్నచో, నిచ్చటఁగూడ, మామాలునిచ్చిన స్వర్గారోహణమున కుపయోగింపవనియు, నీహేతితాదాత్మ్యము నొందినవిచ్చినయే యంకుల కుపయోగించుననియుఁ జెప్పఁగూడదా?

మఱియు, రసవదాద్యలంకారములను జెప్పుటయందు మూర్తికవి పొరపాటని వ్రాసి, "రస మప్రధానమగుచో ప్రేయోఽలంకారమగునని, రసాభాస మప్రధానమగుచో ఊర్జస్వి అలంకారమగునని, భావాభాస మప్రధానమగుచో సమాహితాలంకార మగునని ఆలంకారికుల సిద్ధాంతము" అని వేంకట రమణయ్యగారు వ్రాసిరి.

కాని. యిట్టిసిద్ధాంత మేయాలంకారికు లేర్పఱిచినదో నాకుఁ దెలియలేదు. "రస మితరాంగమైనచో రసవ దలంకారమగును, భావ మితరాంగమైనచో 'ప్రేయోఽలంకారము', రసాభాస భావాభాసము లితరాంగములైనచో 'ఊర్జస్వి', భావశాంతి యితరాంగమైనచో 'సమాహితాలంకారము' అని పెక్కుమంది యాలంకారికుల మతము.

నరసభూపాలీయమునకు మూలమగు ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు పైసిద్ధాంతమునే వ్రాసి, తన కుపష్టంభకముగ నలంకారసర్వస్వకారునివాక్యముల నుద్ధరించి యున్నాఁడు. చూడుఁడు:

"అన్యాంగత్వేన రసనిబంధనే రసవదలంకారః; భావనిబంధనే ప్రేయోఽలంకారః; రసాభాస భావాభాస నిబంధనే * ఊర్జస్విదలంకారః। భావశాంతి నిబంధనే సమాహితాలంకారః.........॥

ఏత దలంకారసర్వస్వే ప్రపంచేనోక్తం, 'రస, భావ, తదాభాస, తత్ప్రశమన నిబంధనే రసవత్ప్రేయ ఊర్జస్విత్సమాహితాని......' ఇతి."

విశ్వనాథుఁడును స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. చూడుఁడు:

"రసభావౌ తదాభాసౌ భావస్య ప్రశమ స్తథా;
గుణీభూతత్వమాయాంతి యదా,ఽలంకృతయ స్తదా.
రసవత్ప్రేయ ఊర్జస్వి సమాహితమితి క్రమాత్॥"
(సాహిత్యదర్పణము-దశమపరిచ్ఛేదము. ౯౫ కారిక)

తర్కవాగీశ భట్టాచార్యుఁడును,

"రసస్యేతరాంగత్వే రసవత్, భావస్యేతరాంగత్వే ప్రేయః; ఆభాసయో రితరాంగత్వే 'ఉర్జస్వి' భావప్రశమస్యేతరాంగత్వే సమాహిత మిత్యర్థః."

అని పై దర్పణమును వివరించియున్నాఁడు.

మఱియు నలంకారకౌస్తుభమున "యత్రతు రసోఽన్యస్మి న్నర్థేఽంగత్వం భజతి తత్రోపకారకత్వా ద్రసవదలంకారతాం భజతి. "భావస్య తథాత్వే ప్రేయోఅలంకారః. రసాభాస భావాభాసయో స్తథాత్వే ఊర్జస్వినామాఽలంకారః, భావశాంతేరన్యాంగత్వే సమాహితాలంకారః" అని చెప్పఁబడినది.

అభినవగుప్త పాదాచార్యులును ధ్వన్యాలోకలోచనమునఁ బై యభిప్రాయమునే తేల్చినాఁడు.

ఇట్లే యింకను పెక్కుమంది యాలంకారికుల సిద్ధాంత మిట్లు ప్రసిద్ధమైయుండ, వేంకట రమణయ్యగారు వ్రాసినసిద్ధాంత మేయాలంకారికులదో తెలిసికొనవలసియున్నది.

పై నా యభిప్రాయములలో నేవైన దోషము లున్నచో మామిత్రులు తెలిపిన వినయముతోఁ గైకొందును.

* దీనికి దర్పణకారాదులువాడిన 'ఊర్జస్వి' అను నామమే సార్థకముగాఁ గన్పట్టెడి.

కావ్యతీర్థ, పురాణవాచస్పతి

# బంకుపల్లె మల్లయ్యశాస్త్రిగారు

### శ్రీ పట్నాల అన్నయ్య శాస్త్రి

## జననము

బ్రహ్మశ్రీ బంకుపల్లె మల్లయ్య శాస్త్రులవారు క్రీ. శ. ౧౮౭౬ సం. ఏప్రిల్ ౨౫ వ తేదీకి సరియగు ధాతృనామ సంవత్సర వైశాఖ శుద్ధ ౧౧ స్థిరవారమున పునర్వసునక్షత్ర తులాలగ్నమందు గంజాంమండలమున శ్రీకాకుళంతాలూకా సింగుపురమను గ్రామమున జన్మించిరి. వీరి మాతామహులు శ్రీ వెంట నారాయణప్పగారు, ఉపమన్యుస గోత్రులు. వీరికి నేడుగురు కుమార్తెలును నొక కుమారుఁడును గలిగిరి. శ్రీ శాస్త్రి గారి తల్లి జ్యేష్ఠురాలు.

సుప్రసిద్ధమైన ఉర్లాం గ్రామము శ్రీ శాస్త్రిగారి పితరుల నివాసము. శ్రీ శాస్త్రిగారిది యజుశ్శాఖ. ఆపస్తంబసూత్రులు, నాది ఆరామ ద్రావిడి, భారద్వాజస గోత్రులు, తండ్రి గంగన్నగారు, తల్లి సూరమ్మగారు.

శ్రీ గంగన్నగారు వేదము చదువుకొన్నవారు. పురాణములయందు మంచి జ్ఞానముగలిగి తెలుఁగులో సాహిత్యము సంపాదించినవారు. కవిత్వము చెప్పనలవాటుగూడ వీరికి గలదు.

## బాల్యము, విద్యారంభము

శ్రీ శాస్త్రిగారు తమ ఏడవయేట తమతండ్రి గారివద్ద వేదాధ్యయనము ప్రారంభించిరి. తరువాత కొన్నాళ్లకు వీరి తండ్రిగారు వీరికి నింగ్లీషుభాషను జదివింప నూహించి యొకమాస్టరుగారికి నొప్పగించిరి. ఒకనెలరోజులుమాత్రమే చదివి దానియం దిష్టములేక సంస్కృతమును జదువ నభిలషించిరి. తండ్రిగారివద్ద భయముచే దమ యభీష్టము చెప్పవెరచి తల్లిగారి ద్వారా చెప్పించిరి. అట్లే కానిమ్మని నాటినుండి శ్రీ కందుకూరి బసవరాజుగారి యాస్థానపండితులగు శ్రీ భళ్ల మూడి లక్ష్మణశాస్త్రిగారివద్ద సంస్కృతము జదువ దండ్రిగా రాజ్ఞాపించిరి. శ్రీ శాస్త్రిగారికి, చాగంటి సీతయ్య శాస్త్రిగారు నాటి సహాధ్యాయులు. క్రమముగా బదునారవయేడువచ్చువరకు పంచకావ్యములుపూర్తిగా జెప్పించిరి. విక్రమార్కచరిత్ర, భోజచరిత్ర మాత్రమే జదివి వీరు మంచి సాహిత్యము సంపాదించిరి.

బాల్యమున శ్రీ శాస్త్రిగారికి బదిమందిలో దనకు దెలిసిన విషయమును ముచ్చటించుటకు మొగమాట ముండెడిది. అందుకు దండ్రిగారు నితరులు వీరిని నిందించుచుండుట తటస్థించుచుండెడిది. కాని తరువాత శ్రీ శాస్త్రిగారు పర్లాకిమిడి రాజావారి సంస్కృత కాలేజీ ప్రవేశించి యచట ప్రధానపండితులగు శ్రీ భళ్ల మూడి వెంకటశాస్త్రిగారివద్ద నైషధమును, శాకుంతలనాటకమును జదివి పదునొకండుమాసములలో నలుగురిలో మొగమాటము పోగొట్టుకొనుటయే గాక తోడివిద్యార్థులలో దాను మేటి యనిపించుకొనిరి. కౌముది ప్రారంభింపుడని యెన్నిసారు లడిగినను వీరిగురువుగారిదిగో యదిగో యనచు గాలక్షేపము చేయుచుండుటచే నొకనాడెరికిం దెలియకుండ శ్రీ శాస్త్రిగారు శ్రీ గుమ్మలూరి నరసింహశాస్త్రిగారితోడను, శ్రీ నేరళ్ల వెంకటశాస్త్రిగారితోడను గలసి కాలినడకను గోదావరీతీరమునకు బయలుదెడలి త్రోవలో కునిచేరిరి. అచ్చట శ్రీమహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవద్ద కౌముది పూర్తిగా జదివి యుర్లాం బ్రాహ్మణిసభలో పరీక్షనిచ్చిరి.

అంత భార్య రజస్వలయై యుండుటచే దల్లిదండ్రులు జలవంతమున విద్యాభ్యాసము మానవలసివచ్చెను. అప్పటికి శ్రీ కందుకూరి మహాలక్ష్మమ్మగారికి సంస్కృతము జెప్పుటకుగా విజయనగరమునుండివచ్చి తర్కవేదాంతపండితులు శ్రీ కూరెళ్ల సూర్యనారాయణశాస్త్రి

గా గ్రామములో గాపురముచేయుచుండిరి. వారివద్దను తర్కపాఠమును ప్రారంభించి యొకసంవత్సరములో ముక్తావళివరకు ప్రకరణసాహిత్యమును శాస్త్రిగారు సంపాదించిరి. ఇంతలో శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు దివంగతులైరి.

## శరీరవ్యాయామము

వీరు జన్మతః మంచిబలిష్ఠులు. పండ్రెండవయేట వీరికి వ్యాయామమునందు మంచియభిరుచి సహజముగ గలిగినది. తోడివారలలో మేటియై దండెపట్టుపట్టుట యందు మంచియాసక్తి వీరి కుండెడిది. పర్లాకిమిడిలో సాధారణముగా నెవరునుగూడ నెత్తిపాడవని సంగిడిని వీరనేకసారులెత్తి పాడిచియుండిరి. ఈ విధముగ శాస్త్రిగారు శరీరవ్యాయామకళ నభివృద్ధిచేసిరి.

## గానకళా కౌశలము

వీరికంఠము మంచిమధురమైనది. వీరి తండ్రిగారి కంఠముగూడ రమ్యమైనదియే. శ్రీ శాస్త్రిగారు శ్రీ పోకల సింహాచలంగారివద్ద సంగీతము వర్ణములవరకు నుద్యోగము చేయుచున్నప్పు డభ్యసించిరి. సంస్కృతాంధ్రపురాణములు మద్దెలతాళములతో శ్రుతినుంచుకొని రమ్యముగ బద్యములను దాళయుక్తముగ బాడుచు "బురాణహరికథ" యనుపేరుతో కాలక్షేపముచేయు పద్ధతిని ప్రదర్శించుటలో వీరే ప్రథములు. సభలలో నిలువబడి చేత దాళముబట్టి యెత్తయిన టేబిలుపై పుస్తకమునుంచి చదువుచు గుడివైపునమద్దెలయును నెడమ వైపున ఫిడేలును శ్రుతికొంచెము వెనుకప్రక్కనుండగా సాంఘిక నైతిక వేదాంతవిషయములను సందర్భానుసారముగ జర్చించుచు బురాణమును వినిపింతురు.

## నాటక కళాప్రావీణ్యము

వీరు పర్లాకిమిడిలోనున్నప్పుడు సంస్కృతాంధ్ర నాటకములలో బ్రధానపాత్రల నభినయించుచుండిరి. గయోపాఖ్యానమున నర్జునుడు, వేణీసంహారమున భీముడు, సంస్కృతశాకుంతలమున దుష్యంతుడు, రత్నావళిలో వత్సరాజు మొదలగు పాత్రల నభినయించి శ్లాఘాపాత్రులయిరి.

## మంత్ర శాస్త్రజ్ఞానము

శ్రీ శాస్త్రిగారు తర్కాభ్యాస కాలమునందే మంత్రదీక్షనొందిరి. వీరి జ్ఞాతులు పురుషోత్తమపురనివాసులు శ్రీ బంకుపల్లె కామశాస్త్రిగారు వీరికి మంత్రదీక్షాగురువులు. గణపతిభువనేశ్వరీ మంత్రములుమాత్రమే మొదట సాధనచేయుచుండిరి. ఇంతలో నొకకుమారుడు గలిగెను. ఆరుమాసముల కుఱ్ఱవాడయియుండగా వీరి భార్య మరణించెను. అవిరక్తిని శ్రీ శాస్త్రిగారు విద్యావ్యాసంగము విడిచి కేవలము మంత్రదీక్షలతో గాలముగడుపుచు దమగురువుగారి వద్దనే పూర్ణదీక్షనొందిరి. ఆరోజులలోనే వీరు మంత్రశాస్త్ర గ్రంథములన్నిటిని గృషిగావించిరి.

## ఉద్యోగ స్వీకారము

వీరు యిరువదియొకటవ సంవత్సరమున అనగా ౧౮౯౭ సంవత్సరములో శ్రీకాకుళమునందు హైస్కూలున బండితపదవికొఱకు నధికారు లొక పోటీపరీక్షను బ్రకటించిరి. పదునెనమండ్రు తెనుగుపండితులలో శ్రీ శాస్త్రిగారే ప్రథములుగా నుత్తీర్ణులైనందున నాపదవిని అచ్చట నధికారులు వీరికే యొసగిరి. అచట పనిచేయుచున్నకాలములోనే పర్లాకిమిడి కాపురస్థులు, శ్రీరాజావారి యాస్థానగాయకులునగు శ్రీ పోకల సింహాచలం గారికుమార్తెను శ్రీమతి వెంకటరత్నమ్మగారిని వివాహమాడిరి. హైస్కూలులో రెండుసంవత్సరములు పనిచేసిన పిమ్మట నుద్యోగము లేనిదినములలో వీరు శ్రీ భళ్లమూడి దక్షిణామూర్తి శాస్త్రిగారివద్ద పంచదశప్రకరణములు, గీతాభాష్యమును జదివిరి. ఇంతలో లుకలాం గ్రామమున కర్ణెపల్లి రామావధానులుగారి కుమార్లకు సంస్కృతము జెప్పుటకుగాను వెళ్లిరి ఆరునెలలుమాత్రమచటనుండగా వీరితల్లిగారి యంత్యకాలము సంప్రాప్తమయ్యెను. తమ యిరువదవయేట శ్రీ శాస్త్రిగారు మాతృవియోగదుఃఖమనమునిగి వృద్ధులగు తండ్రిగారిని తమకంటె మిక్కిలి చిన్నవారగు చెల్లెండ్రను తమ్ములను గొంతకాలము సంరక్షణచేసిరి. ఇట్టికాలములో జదువు లేకపోవుచున్నదని తలచి వీరు శ్రీకూర్మము సంస్కృ

తపాఠశాలా పండితులుగానున్న నాదూరి వెంకట శాస్త్రిగారివద్దను మనోరమశబ్దరత్నములు, పరిభాషేందు శేఖరమును జదివిరి. ఆకాలములోనే పర్లాకిమిడి రాజావారి యింగ్లీషు కాలేజీలో తెలుగుపండితపదవి యాక్టింగుగా ఖాళీరాగా నచ్చట రెండుసార్లు పనిచేసి విరమించిరి. తిరిగీ యుర్లాంవచ్చి శేఖరమును బూర్తి గావించిరి. అచ్చటనుండగనే ౧౯౦౩ వ సంవత్సరములో మార్చి ౨౦ తేదీని మరల తెలుగుపండితపదవి పర్లాకిమిడిలో ఖాళీవచ్చినందున నందుబ్రవేశించిరి. ఈ సారి యుద్యోగము ఖాయమైనది. రెండు సంవత్సరములు పనిచేసినపిదప శ్రీ శాస్త్రిగారికి ద్వితీయ భార్యయందు బ్రథమపుత్రజనన మైనది. వీరి తమ్ములిద్దరును చెల్లెండ్రును బ్రథమకళత్ర పుత్రుడునుగూడ శ్రీ శాస్త్రిగారి సంరక్షణలోనికే వచ్చిరి. విద్యావివాహాది కార్యములొనర్చి స్వతంత్ర జీవనాలంబకులగువరకు దమసంరక్షణలోనుంచిరి. బ్రథమసోదరుడు పర్లాకిమిడి యింగ్లీషు కాలేజిలో మాష్టరుగ బ్రవేశించెను. ద్వితీయసోదరుడు ఛత్రపురం హైస్కూలులో తెలుగుపండితుడుగ నిప్పటికిగూడ పనిచేయుచున్నాడు. వీరి ప్రథమకళత్ర పుత్రుడు విశాఖపట్టణజిల్లాబోర్డులో నాయుర్వేద డాక్టరుగానున్నారు.

౧౯౦౩ లో శ్రీ శాస్త్రిగారు పర్లాకిమిడిలో బ్రవేశించునప్పటికి భాష్యాంతవ్యాకరణమును, నాలుగు తర్కప్రకరణములు, వేదాంతమున బంచదశియును తెలుగున గవిత్వముచెప్పుటయు వీరివిద్యలు. తరువాత శ్రీ రావుసాహెబ్ గిడుగు రామమూర్తి పంతులుగారివద్ద నింగ్లీషుభాషనుగూడ వీరభ్యసించిరి. స్వయంకృషి వలనను సెలవులలో బండితులసహవాసమువలనను వేదాంత భాష్యమును గృషి చేసిరి. వీరికి మంత్రశాస్త్రమున సతీర్థ్యులు, తర్కమీమాంసవేదాంత పండితులు నగు శ్రీగంటి సూర్యనారాయణశాస్త్రిగారు ముఖ్యస్నేహితులు. వారిసహాయమున వేదాంతమీమాంసాసాహిత్యములను సంపాదించుసట్లు శ్రీ శాస్త్రిగారి వల్లనే తెలిసినది.

పర్లాకిమిడి శ్రీరాజావారి యాస్థానమున జ్యోతిష్కులగు శ్రీ నీలమణి పాణిగ్రాహిగారివద్ద సూర్య సిద్ధాంత దర్పణములను జదివి యైదారు సంవత్సరములు దృక్సిద్ధపంచాంగమును బ్రకటించిరి.

దృక్సిద్ధతిథియందే శ్రాద్ధములు ముహూర్తములు చూచుకొనవలెననియు నదియే సరియైన సిద్ధాంతమనియు వీరినమ్మకము. ఆవిషయమై వీరి వాద ప్రతివాదములు గూడ నెల్లరకు నాంధ్రపత్రికాముఖమున విశదము.

## ప్రథమ సంస్కరణము

శ్రీ శాస్త్రిగారికి ౧౯౦౫ వ సంవత్సరములో ద్వితీయకళత్రమందు ప్రథమపుత్రుడు కలిగినయప్పుడే తనయింటి యాచారమును దెలియజేసి యటి యాచారమును విసర్జించవలెనని చెప్పిరి. అదేమనగా ఏసంతానముగాని మన యింటగలిగినపుడు సంవత్సరములోగా నల్లమేకను శక్తికిబలియిచ్చుట. మాంసాహారమును విడిచినవారు జీవహింసగావించుట కూడదని వీరి యప్పటి యభిప్రాయము. కావున తానా యాచారమునుగావించుట మంచిదికాదనియు నందులకు నీవంగీకరించవలసినదని భార్యకు జెప్పి యామెచేనంగీకరింపజేసి యాపూర్వాచారమును మాన్పించిరి. ఈ సంస్కారమునకు ముఖ్యముగా దోడుసూపిన శ్రీ శాస్త్రిగారి ద్వితీయ ధర్మపత్ని శ్రీమతి వెంకటరత్నమ్మగారి యాశయము శ్లాఘనీయము. స్త్రీస్వభావముచే నామె యేమాత్ర మడ్డుపెట్టినను నీ పూనిక నెరవేరకుండెడిది. ఈమె చిన్నతనముననే తన సంరక్షణలోనివా రైదారుగురు గృహమున నున్నను విసుగుబాటులేక నొకనాడైనను భర్తనువేధించక యుత్సాహముతో మఱదులను, మరదండ్రను, సపత్నీపుత్రుని సంరక్షించి వారివివాహములు సారెలు బాలసారెలు గావించి శ్రీ శాస్త్రిగారిగౌరవమును గాపాడిన యామెసుగుణము కొనియాడదగినది.

శ్రీ శాస్త్రిగారు సనాతనులయ్యును సంస్కరణప్రియులు. వీరు ౧౯౧౭ సంవత్సరములో సుర్లాంలో సెకండరీ స్కూలులో తెలుగుపండితుడుగ రెండేడ్లుపని చేసిరి. అప్పటికి వీరికి ౧౯ సంవత్సరములే వయస్సు. ఆదినములములలో బ్రతియాదివారమును సభలు జరిగిం

చుచుండిరి. అందు స్త్రీపునర్వివాహము శాస్త్రీయమని పలువాదములు గావించియుండిరి. అందువిషయమై పద్యములుగూడ రచించియుండిరి. మరియు స్త్రీవిద్య యత్యంతావశ్యకమనిగూడ నుపన్యసించిరి. ఇటీవల పర్లాకిమిడి ప్రవేశించినతరువాత స్త్రీవిద్యావిషయమై వీరిమనస్సున నూహాలునిండి మూడుకావ్యములవరకు భార్యకుపాఠము జెప్పి తెలుగు ప్రబంధములనుగొన్నిటిని జదివించిరి. వీరి భార్య భారత భాగవత రామాయణాదులగు పురాణములకు చితకీతి నర్థముచెప్పగలరు. ఈమె సంగ్రహరామాయణాదులు కొన్ని గ్రంథములను గూడ రచించిరి.

## మార్పు

శ్రీ శాస్త్రిగారు శుద్ధసనాతనరీతిని కుమారిను తొమ్మిదవయేటనే మేనల్లునకొసంగి వివాహముగావించిరి. కాని వివాహానంతరము మూడేండ్లు కాకుండ మరణించెను. అదియే శ్రీ శాస్త్రిగారియందుండు తొలుతటి సంస్కరణభావానికి నాజ్యాహుతియైనది. నాఁడుమొదలు రెండవపనిమాని వీరు ధర్మశాస్త్రములు బరిశీలించుచు నందలివిషయమును ఆంధ్రపత్రికల మూలమున లోకమునకు వెల్లడిచేయుచువచ్చిరి. శ్రీ పర్లాకిమిడి రాజావారుగూడ ౫౦౦ రూపాయిల విలువగల ధర్మశాస్త్ర గ్రంథములను దెప్పించి వీరికృషికై తైప్రగికి యొసగియుండిరి. ఇంతలోఁ శారదా వివాహ చట్టములు గూడ నెసంబ్లీలో బ్రతిపాదింపబడినది. రజస్వలానంతరమగు పురుష సంయోగార్హ కాలమే స్త్రీలకు వివాహ కాలమన్న సిద్ధాంతము లోకమునకు భారతీ పత్రిక మూలమున సప్రమాణముగఁ బ్రకటించిరి. దానితో దేశమున నద్ప్రతివాదములు ప్రారంభమైనవి. ఆంధ్ర పత్రికలలో వీరి వాదరీతినందరు గమనించియేయుందురు.

## ఆంధ్రదేశ సంచారము, సేవ

స్త్రీ పునర్వివాహము పూర్వాచారముకాకపోయినను శాస్త్రీయముగావున నాచరణీయమని వీరియభిప్రాయము. ఇదివరకు శ్రీ వీరేశలింగంపంతులుగారి నాటి యాచారము 'బ్రహ్మమతము' ననుసరించిన దగుటవల్ల వైదికుల కందు బ్రవేశముండిన జాతిభ్రంశముకలుగునని పునర్వివాహము వైదికముగ హిందూలాననుసరించి చేసిన చో వైదికులకు జాతిచ్యుతిదోషము రానేరదనియు నెంచి వైదికాత్ముతా పునర్వివాహము నాచరణలోనికిఁ దేవలయునని యు నూహించిరి. ఈ యభిప్రాయమునే మనసున నిడి యుక్తతో పునర్వివాహమునకు గల నిషేధము గూడ లేదనియు సతీశాసనము వచ్చినదిమొదలు పునర్వివాహావశ్యకత గలిగెననియు నొక ప్రకటన పత్రిక వ్రాసియాంధ్ర దేశమున విద్యాసంస్థలకు, బండితులకుబంపి వారివలన యనుమతినిగూడఁ బడసిరి.

మరియు శారదాశాసనసందర్భమున ౧౯౨౯లో చెన్నపురివరకు సంచారముగావించి పెద్దపెద్ద స్థలములలో సభలలో చర్చలుసలిపి పండితులలో ఋతువనంతర వివాహమే శాస్త్రీయము ఋతుపూర్వము దాన మాత్రమేయనియు దమసిద్ధాంతమును వెలడిచేసిరి. ఆ విషయము పత్రికాముఖమున నెల్లరకు దెలిసియే యున్నది. శాస్త్రిగారి ధర్మశాస్త్రపరిశ్రమకు, బ్రతిభకు జాలమంది పలుతావుల బ్రశంసించియుండిరి. మరియుఁ గొందరుపండితులు కొన్నితావుల వీరివాదము శాస్త్రీయమేగాని యాచారవిరుద్ధమనిరి. పండ్రెండు స్థలములలో బండితులు స్త్రీ పునర్వివాహము శాస్త్రీయమని యనుమతిపత్రములనుగూడ నొసంగియుండిరి. నాటిని దమ కుమార్తె వివాహసందర్భములోఁ జదివియుండిరి.

## ద్వితీయ సంస్కరణము

వీరు దమకుమార్తె శ్రీమతి కృష్ణవేణమ్మకు వివాహముసేయఁదలఁచి శాఖాంతర వివాహములు గూడ శాస్త్రీయములను నుద్దేశముతో స్వశాఖలో వరులకొరకు బ్రయత్నింపక యితరశాఖలలో వరాన్వేషణముగావించిరి. దైవవశంబున గుంటూరుకాలేజిలోఁ దెలుఁగు పండితులుగానున్న శతావధానులు శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు సనాతనకుటుంబమునకు జెందియు సంస్కరణప్రియులై వివాహమున కంగీకరించిరి. అతఁడు ౨౯ సంవత్సరములు వయస్సుగల స్నాతకవరుఁడు. ౧

వేదుల సత్యనారాయణశాస్త్రిగారు వెలనాటిశాఖవారు. ఇట్టి గుణవద్వరలాభము శ్రీ శాస్త్రిగారి సంకల్ప శుద్ధి వలననే గలిగినదనవచ్చును.

పర్లాకిమిడిలో స్వగృహమున ౧౯౨౯ సం॥ ఫిబ్రవరినెలలో నీశుభవివాహమును శ్రీ శాస్త్రిగారు జరిగించిరి. ఆశుభమునకు బట్టణవాసులగు స్త్రీ పురుషులెల్లరు వతికుతూహలముతో వచ్చిరి. ఆరాత్రి పెండ్లివారితో సహపంక్తికి నరువదియైదుగురు పెద్దలుమాత్రము వచ్చి భోజనాదులు గావించిరి.

## స్వశాఖవారిలోఁ గలవరము

నాఁటినుండి స్వశాఖవారిలో గలవరము ప్రారంభమైనది. కొందరు పెద్దలు సంతకములుచేసి "మాశాఖలో నీయకార్యకరణము గావించినందులకు శ్రీ శాస్త్రిగారికిఁ దగినశిక్షను విధించి మీరు వీరిని బహిష్కృతి చేయవలయును." అనియొక మహజరును శ్రీ శృంగేరీ స్వాములవారి కంపిరి. శ్రీ శాస్త్రిగారుకూడ స్వాములవారికి దనకార్యము శాస్త్రీయమనిగూడ మరియొక యర్జీని వ్రాసిరి. ఈరెంటినిగాంచి పీఠాధిపతులాగా దనక తటస్థులై యున్నకుండిరి. ఇట్లుండఁగా గొంతకాలమునకు బంధువులు యథాపూర్వకముగ సంఘమునసహాయపడి మెల్లమెల్లగ నుద్యమములోనికి గలియజొచ్చిరి. తటస్థులు గొందరున్నను వ్యతిరేకులు గారు.

## ఉద్యోగ భ్రష్టత

౧౯౩౦ సంవత్సరములో శ్రీశాస్త్రిగారి రెండవ కుమారుఁడు సూర్యనారాయణశాస్త్రి పర్లాకిమిడి కాలేజీలో బండితుడుగఁ బనిచేయుచు సత్యాగ్రహోద్యమమునఁ గాంగ్రెస్సులోఁజేరి పాల్గొనుటచేత నరెస్టుగాఁబడి తన యుద్యోగమునకు రాజీనామా యిచ్చిరి. అది కారణముగా రాజావారు శాస్త్రిగారిని "కుమారుని తమ యాజ్ఞలో నుంచలే"దని బండితపదవినుండి తొలగించిరి. తొమ్మిది నెలలు గడిచిన తరువాత గాంధీ యిర్విన్ సంధి జరిగినది. ఆ వెంటనే శ్రీ రాజావారు శాస్త్రిగారికి తొమ్మిదిమాసముల పెన్షను ౨౫ రూపాయిలు చొప్పున నిచ్చివేయుచు జీవితకాలమందు నెల ఒకటికి ౨౫రూపాయి లిచ్చుటకు నిశ్చయించిరి. ౧౯౩౨ సంవత్సరములో బరంపురం సిటీ హైస్కూలులో సంస్కృతాంధ్ర ప్రధానపండితుడుగ నొకసంవత్సరము పనిచేసిరి.

## అస్పృశ్యతా ప్రచారము

ఆ రోజులలో దేశమున మహాత్ముని యస్పృశ్యతా ఉద్యమము ప్రబలియుండెను. అస్పృశ్యత విషయమై శ్రీ శాస్త్రిగారి యుపన్యాసము లాంధ్ర త్రిలింగ పత్రికలలో జదువనివారుండరు. అస్పృశ్యత శాస్త్రసిద్ధముకాదన్న పండితులలో వీరే మొదటివారు. శ్రౌతస్మార్తకర్మాచరణమందు దప్ప యస్పృశ్యత యితరకాలములందు లేదని వీరి మూలసిద్ధాంతము. సనాతనపక్షమువారు మొదట వీరిని వాదమునకై చెన్నపట్టణము బిలిచి యధ్యక్షవర్గము ముప్పురు గలిగియుండవలెనని వీరు కోరగా వాదమును జారవిడిచి యుపన్యాసపద్ధతినే యంగీకరించితి మనిరి. దీనివల్ల వారి వాదబలమెల్లరకు నానాడు విశదమైనది.

అటు పిమ్మట నాంధ్రదేశమున నెల్లూరు, గుంటూరు, గోదావరి, కృష్ణ, విశాఖపట్టణ, గంజాం మండలములలో నస్పృశ్యతాప్రచారము గావించిరి.

## శుద్ధ శాక్తేయులు

వీరు పంచాయతన పూజాపరులగు స్మార్తులయ్యును శక్తిపంచాయతనమునే నెలకొల్పిరి. పూర్ణదీక్షాపరులు చండీపాఠము శ్రీ చక్రార్చనము మహావిద్యాపాఠము శూలినీ ప్రయోగపద్ధతియు శ్రీ బులుసు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వద్ద నభ్యసించిరి.

ఆగమశాస్త్రమున నర్చకులు సర్వాధికారములు గలవని బరంపురం జడ్జీకోర్టులో సాక్ష్యము జెప్పుటయు నప్పపల్లిక్షేత్ర దేవాలయమున ధ్వజస్తంభ ప్రతిష్ఠ జేయించుటయు జూచినవారికి వీరి యాగమశాస్త్ర పాండిత్యము స్పష్టపడినది.

## ఔదార్యము, సమబుద్ధి

శ్రీ శాస్త్రిగారు ధనవంతులు కాకపోయిన ననేక విద్యార్థులకు దమయింటనే బసలిచ్చి భోజనము

లు పెట్టి చదువుచెప్పిరి. అనేకులు శూద్రులుఁగూడ భోజనము చేయుచు వీరి గృహమునఁ జదివెడివారు. సర్వులను జాతిభేదమును హెచ్చుతగ్గులను గణింపక సమభావముతో జూచుటయే వీరి యందుండు మహోత్కృష్ట గుణము. ఇందుల కొక యుదాహరణ మిచ్చుచున్నాను.

వీరిగృహమున భోజనముచేయుచు నప్పారావను నొక బ్రాహ్మణేతరుఁడు చదువుకొనుచుండెడివాఁడు. శ్రీ శాస్త్రిగారు తమ కుమాళ్లతోఁ బాటు సర్వసంరక్షణములు సమానముగా జరిపించుటచే నాయూరివా రందరు "శ్రీ శాస్త్రిగారి నల్లబ్బాయి" అని పిలుచుచు జాలకాలమువఱకు శాస్త్రిగారి కుమారుఁడనియే తలచుచుండిరి.

## నిరాడంబర జీవనము

వీరు గృహయజమానుల య్యు నింటికి పెద్దసేవకునివలె వర్తింతురు. ఒకనాఁడు కృష్ణామండలమునుండి యొక పెద్దమనిషి శ్రీ శాస్త్రిగారి దర్శనార్థము వీరి గృహమునకు వచ్చిరి. ఆ సమయమున శ్రీ శాస్త్రిగారు తమయింట్లో మురికికాలువను బాగుచేయుచుండిరి. నౌకర్లింట నున్నను వారిచే నెప్పుడును పనిచేయించుకొనెడివారుకారు. శ్రీ శాస్త్రిగారి దర్శనార్థము వచ్చిన యతఁడు శాస్త్రిగారినిజూచి "నేను శ్రీ మల్లయ్యశాస్త్రిగారు కుండలములు సింహతలాటములు శాలువలు మొదలగు వాటితో నెంత యుత్కృష్టముగా నుందురో యని యనుకొంటిని గాని యింత నిరాడంబరులని తలఁపలేద"ని వ్రాక్రుచ్చినట్లు నేటికిని నాకు జ్ఞాపకము.

## భూతదయ

వీరి భూతదయ అపారము. ఏప్రాణినైన హింస చేయుటకు నొప్పరుగదా! హింసనుజూచిన జాల పరితపింతురు. అందు కుదాహరణము. వీరిగృహమున నున్న విద్యార్థులతో వీరి కుమారులు చిన్నతనమున నొక నాఁడెలుకకన్నములలోఁ బొగపెట్టి కొన్నియెలుకలను జంపిరి. ఆ విషయము శ్రీ శాస్త్రిగారికి దెలిసి చాల పరితపించి కుమాళ్లచేత నొక రోజుపవాసముచేయించిరి. విషజంతువును గూడ వీరుకొట్టనీయరు. వీరి గృహమున వైశ్వపులో నొక నాగుబాము చాలకాలమువరకు సందరకు నగపడుచునే యున్నట్లు నేనెరుగుదును.

శునక మొకనాడు గృహమున బ్రవేశించి యన్నమును దినుచుండెను. అంతనెవరో చూచి దానిని గఱ్ఱతో మోదిరి. శ్రీ శాస్త్రిగారు చూచి 'మనుష్యుఁడు పశుపక్ష్యాదులకంటె బుద్ధిలో నుత్కృష్టుఁడు గావున నాహారమును జాగ్రతపరచుకొనవలెను. దానికి ఫలానవారి యాహారమును మనము దినకూడదన్న జ్ఞానము గలదా? కనుక నట్టిదానిని కొట్టుట మన యజ్ఞానమే' యని బోధించిరి. శ్రీ మల్లయ్యశాస్త్రిగారి పాండిత్యముతోఁపాటు వీరి యాత్మగుణములు సర్వులనాకర్షించినవి అట్టి సహృదయుని దయాస్వభావుని నిరాడంబరజీవనుని శాంతుని మరియొకరిని నా జీవితమున నే నెరుగను.

## వీరిచే రచింపఁబడిన గ్రంథములు

శ్రీ శాస్త్రిగారు చైతన్య చరిత్రను శ్రీశ్రీశ్రీ కృష్ణచంద్ర గజపతి మహారాజావారి కృతితో యక్షగానముగ రచించిరి. (అచ్చయినది.) కంసవధ, కృష్ణజననము, రామకృష్ణ పరమహంసచరిత్రలను యక్షగానములుగా రచించిరి. (అముద్రితములు.)

రుక్మిణీకల్యాణమును భాగవతకలాపముగా రచించిరి. (ముద్రితము.) కొండవీటి విజయమను పద్యకావ్యమును బి. యే. విద్వాన్ క్లాసులకు బఠనీయ గ్రంథముగా నున్నది. అస్పృశ్యత వివాహతత్వమను మరి రెండు గ్రంథములనుగూడ వీరిటీవల రచించిరి. (ముద్రితములు.)

## బిరుదులు

౧౯౧౨ వ సంవత్సరమున కలకత్తాలో పరీక్షనిచ్చుటవల్ల "కావ్యతీర్థ" బిరుదము నొసంగిరి. తరువాత చిక్కటి సంస్థానములో సంస్కృతమునసీతాకల్యాణము జానకీవహ్ని ప్రవేశమను రెండుకథలనుబురాణ హరికథలుగా రచించినందుకు శ్రీ రాజావారుసత్కరించి వీరికిఁ "బురాణవాచస్పతి" యను బిరుదమొసంగిరి.

## ఉపసంహారము

శ్రీ శాస్త్రిగారికి నేడుగురు కుమాళ్లు నొక్క కుమార్తెయు గలరు. పెద్దకుమారునకు నలుగురుపిల్లలు మూఁడవ కుమారున కిరువురు పిల్లలు. వీరికి వీరి కుటుంబమునకు బరమేశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్యాభివృద్ధుల నొసంగి సర్వదా రక్షించుగాక.

# లక్నో కాంగ్రెసు చిత్రములు



౨. సంపూర్ణానంద, స్వచ్ఛందసేవాదళాధినేత



శ్రీమతి సోఫియాసోంజీ, స్వచ్ఛంద సేవకాదళాధినేత్రి



౮. జాతీయగీతము గానముచేయుచున్న స్వచ్ఛంద సేవికలు

# రసాభాసము

గొల్లపూడి శ్రీరామశాస్త్రి

ఏకత్రైవానురాగశ్చేత్
తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా
యోషితో బహుసక్తిశ్చేత్
రసాభాసస్త్రిధా మతః.

(ప్రతాపరుద్రీయము)

ఈ త్రివిధములగు రసాభాసములగూర్చి మార్చి నెల భారతిలో నొకరు చర్చించి తుదకు నీవిధముగ తమ యభిప్రాయమును దెలిపిరి.

"తిర్యఙ్మ్లేచ్ఛగతరతి — ఇచ్చట నాయికానాయకులు గలరు. ఇద్దరియందును రతిగలదు. ఔచిత్యమును తదనుగుణముగనే వర్ణితమగును. రసోత్పత్తికి విభావజ్ఞాన మనావశ్యకము గాన తద్గతాభాసమునకు వారి యవిదగ్ధత కారణమని చెప్పదగదు. వారికిని శృంగార చేష్టలుండును. ఇట్లు రసోత్పత్తికి వలసిన సామగ్రి యంతయు నుండునపుడు రసమేల కాకూడదు? 'అనుచితవిభావాలంబనత్వం' అని రసాభాసమునకు లక్షణ మొసగిన జగన్నాథపండితుని యభిప్రాయమును తిర్యఙ్మ్లేచ్ఛగతరతి ఆభాసమైనట్టుల గాన్పింపదు.

తిర్యఙ్మ్లేచ్ఛగతరతి ఆభాసము గానేరదని అభిప్రాయపడువారు ఇంకను మఱికొందఱుగలరు (మమ్మట భట్టాదులు). కావ్యప్రకాశ వ్యాఖ్యాతయగు వామన భట్టు మూలకారుని యభిప్రాయమును గూర్చి వివరించుచు 'తిర్యఙ్మ్లేచ్ఛగతరతిః నరసాభాసః, అనౌచిత్యాభావాత్' అని వ్యక్తపఱచెను. కాని అనౌచిత్య లక్షణమును మాత్రము కొంచె మించుమించుగా సాహిత్య వేత్తలందఱును ఒకవిధముగనే తెలిపి చివరకు "అత్ర సహృదయ హృదయమేవ ప్రమాణం" అని నుడివిరి.

"అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వం, విభావాదౌ అనౌచిత్యంపునః లోకానాంవ్యవహారతోజ్ఞేయం యత్రతేషాం అయుక్తమితి ధీ రితి కేచిదాహుః."

(రసగంగాధరము)

"అనౌచిత్యంహి శాస్త్రలోకాతిక్రమాత్, ప్రతిషిద్ధ విషయకత్వాదిరూపం సామాజిక సంవేద్యం."

(వామనభట్టీయము)

రసాభాసము త్రివిధమని వచించిన విద్యానాథ పండితవర్యుని నిరూపణమును గనుఁడు.

"శృంగారాదీనాం లోకోత్తరనాయకాశ్రయత్వేన పరిపోషాతిశయః. అతఏవ శృంగారస్య మ్లేచ్ఛాది విషయత్వే త్వాభాసత్వం."

(ప్రతాపరుద్రీయము)

"అతఏవేతి — యత్ర విభావాది పరిపూర్తిః తత్ర ముఖ్యోరసః. తదుక్తం లోచనే రసస్తు సఏవ...స్థాయ్యంశే చర్వణ ప్రయుక్త ఏవాస్వాదప్రకర్షః... ఏవంచ యత్ర విభావాది పరిపూర్త్యభావః తత్రారోపితో రసః, మ్లేచ్ఛానాం తథాభూతత్వాత్ రసాభాసత్వమితి భావః మ్లేచ్ఛా...సహోపాదనం" (వ్యాఖ్యాత)

విదగ్ధత యనునది యేకోశమునందును లేని అన్నదమ్ము లనఁబడిన తిర్యఙ్మ్లేచ్ఛులయెడఁ గల రతి విభావములచే పరిపుష్టము గానికారణమున రసత్వము నొందఁజాలదని పైవచనాభిప్రాయము.

మూఁడవ రసాభాసమునుగూర్చిన యాక్షేపణము గూడ తెలిసికొని పిదప దీనింగూర్చి విచారించెదము.

"ఇక నాయికకు అనేకనాయకవిషయకరతి వర్ణితమైనపు డదియు రసాభాస మనిరి. దక్షిణనాయకునకు అనేక నాయికానురాగము వర్ణితమైనపుడు రసమగుచుండ నాయికకు అట్టియనురాగము వర్ణించిన రసమేలకాఁగూడదు? మఱియు, పరనాయికాగతరతి రసమగుచుండ బహుసక్త యోషిద్గతరతి రసముగాక ఆభాస మెట్లగును? వీరిరువురకు గల భేదమేమి?"

రసభంగకర మనౌచిత్యమని తెలిపి, ఆట్టియనౌచిత్యమును లోకశాస్త్రముల మూలమున గ్రహించవలయునని

నుడివిన యాలంకారికుల మతమున బహుసక్తయోషిద్గత రతి రసాభాసమనుట నిర్వివాదాంశము. దీనింబట్టియే పాండవులయెడ పాంచాలికిం గల యనురాగము రసాభాసమేయని కొందఱ యభిప్రాయము. అపరిణేతృ బహునాయక విషయత్వమున రసాభాసత్వమేగాని పాంచాలివిషయమునం గాదని కొందఱు.

"వ్యాస ప్రాక్ఫలితాశ్చైవ స్వారితాః పరమాకులాః,
పాండుపుత్రేషు పాంచాల్యాః పతంతి ప్రథమాదృశః.

పాంచాల్యాః బహువిషయాయాః రతేః అభివ్యంజనాత్ రసాభాసపీఠేతి నవ్యాః. ప్రాంచస్తు అపరిణేతృ బహునాయకవిషయత్వే రసాభాసత్వం నాత్రేత్యాహుః" (రసగంగాధరము)

మఱియు, "అనుచిత విభావాలంబనత్వమే రసాభాసత్వమని నిర్వచించిన జగన్నాథపండితులు లోకుల బుద్ధికి నేదియనుచితమని తోంచునో అది యనౌచిత్యమని కొందఱందురు. ఈలక్షణము మునిపత్న్యాదివిషయమున పరిపోయినను సామాన్యయోషలను, అనుభయనిష్ఠపట్లను పోసగదు. ఈరెండుచోట్లనుగలరతి లోకులబుద్ధికి అనుచితమని తోంచదుగాన నది రసాభాసము గాకపోవును. కనుక అనౌచిత్యము రత్యాదికి విశేషణముచేసి నచో అనుచితమగు రతి రసాభాసమని యేర్పడును. ఇయ్యది సర్వత్ర సరిపోవు"ననివచించెను.

పరకీయాగతరతి రసమైనపుడు బహుసక్త యోషిద్గతరతి రసముగాక ఆభాస మెట్లగు? అని యొక యాక్షేపము.

పరకీయ అనోఢ, కన్య అని రెండువిధములు. ఒకనిచేం బెండ్లియాడంబడినది అనోఢ. పెండ్లిగానికన్య తల్లిదండ్రులకు అధీనురాలుగాన పరోఢవలె నిదియు పరకీయయనియే వ్యవహారము. కన్యానురాగము ప్రధానాప్రధాన రసాశ్రయముగా వర్ణింపఁబడును. అనోఢానుగతరతి యనౌచిత్య భాజనముగాన ఉత్తమకావ్యముల యందు అట్టి పరకీయ నాయికగా నుండఁబడదు. "పరిణీత రాగరసములం బరికల్పిత గాదు సత్ప్రబంధములందుఁ" అని కావ్యాలంకార చూడామణికర్త. కనుక బహుసక్త యోషిద్గతరతివలె పరనాయకానుగతరతియు రసాభాసమేయని సాహిత్యవేత్తలయభిప్రాయము.

ఈరసాభాసములన్నియు నిట్లుండ, కావ్యాలంకార సంగ్రహకర్త "పలువుర కొకభామినిపైఁ దలఁపును ...రసాభాసమయ్యె" అని మఱొక రసాభాసభేదమును గూడంగూర్చి మఱికొంత చిక్కు కలిగించినాఁడు. అది యట్లుండనిండు.

"దక్షిణనాయకునకు అనేక నాయికాను రాగము వర్ణితమైనపుడు రసమగుచుండ నాయికకు అట్టి యనురాగమును వర్ణించిన రసమేల కాఁగూడదు?" అని యాక్షేపము.

ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత మూలగ్రంథోక్తము లగు రసాభాసములఁగూర్చి వివరించుచు చేసిన చర్చయే మనవ్యాసకర్త యాక్షేపమునకు కారణమని తోఁచెడి.

"బహుసక్తి రనేకత్రానురాగః, అత్రాపి ముఖాంతరేణ సమానురాగ ఫలాభావాత్ విభావాద్యపరిపూర్తి రితి భావః."

"సర్వాత్మనా తన్ను ప్రేమించివచ్చిన విటులను చేరఁదీసి వారియెడఁ దనకు అనురాగమున్నట్లునటించి వారి ధనమెల్లఁ గైకొని పిదప వారిని ఇంటినుండి వెడలఁగొట్టుటయే కళానిపుణయగు సామాన్యకు నైజముగాన నిరువురకు సమానానురాగము లేనికారణమున తద్గతరతి విభావాది పరిపుష్టముగాదు. కనుక నది రసాభాసము." అని పైవచనాభిప్రాయము. పిదప మనవ్యాఖ్యాతకు కేఁటి వ్యాసకర్తయాక్షేపము మనసునకు రా దానిని సమర్థింపఁబోయి తుదకు తానే రసాభాస మొనరించినాఁడు.

"పుంసోఽప్యనేకనాయికానురాగే రసాభాసత్వమితి కేచిత్. తన్న్యాయ్యం తన్మతే దక్షిణనాయకానురాగస్య సర్వసంప్రతిపన్న రసభావస్య ఆభాసత్వ ప్రసంగ ఇతిచే న్నైవం."

"ఒక పురుషునకు అనేకనాయికలయెడఁగల యనురాగమును రసాభాసమేయని కొందఱిమతము. అట్లయిన సాహిత్యవేత్తలందఱును రసమని యంగీకరించిన దక్షిణ

నాయకానురాగమును రసాభాసమే కావలసివచ్చును. అది యనుచితము."

"తస్యా స్త్వేకస్యా మేవ గాఢానురాగత్వాత్ అన్యత్రతు క్వచి న్మధ్యత్వం క్వచి న్మందత్వమితి నిశ్చితం. తుల్యోఽనేకత్ర దక్షిణఇతి లక్షణం తు అనేకాసు నాయికాసు అనువృత్తిమాత్ర పరత్వేన తుల్యత్వపర మితి ద్రష్టవ్యమ్."

(దక్షిణ నాయకునకును ఒకనాయికయందే గాఢానురాగము. తక్కిన నాయికలయెడఁగల యనురాగము మధ్యత్వ మందత్వములు గలవి. అయితే నాయికలయందఱియందును సమానానురాగముగలవాఁడు దక్షిణుఁడు అను దక్షిణనాయకలక్షణము మాట యేమందురా? అందఱు నాయికలయందును సమానానురాగము గలవానివలె వర్తించువాఁడని తల్లక్షణాభిప్రాయము.)

బహునాయకానుగతరతి సమానానురాగాభావముచే రసాభాసమే యగునననిచో, బహునాయికానుగతరతియు నట్టిదేయను నాక్షేపమునకు సమాధానము చెప్పఁదలఁచినాఁడు. మఱియు ముఖ్యముగా సర్వసమ్మతమైన దక్షిణనాయకగతరతి రసాభాసము గాదని నిరూపింపఁ దలఁచినాఁడు మనవ్యాఖ్యాత.

దక్షిణ నాయకునకు ఒకరియందే గాఢానురాగము. తక్కినవారియెడ అతనికిఁగల యనురాగము మధ్యత్వమందత్వములు గలది. కనుక దక్షిణనాయకానుగతరతి రసాభాసముగాగు అనెను. ఒకరియం దెక్కువ ప్రేమ, తక్కిన వారియెడ తక్కువప్రేమయున్నచో నట్టి యనురాగమునకును సమానానురాగాభావదోషము తప్పక కలుగును. అట్లయిన దక్షిణనాయకగతరతియు ఆభాసమే యనవలసివచ్చును. ఏమో చేయఁబోవ ఏమో అయినట్లయినది మనవ్యాఖ్యాత పడ్డుపాటు. అందఱునాయికల యెడలను సమానముగు ననురాగము గలవాఁడె దక్షిణుఁడను నిర్వచనము సర్వాలంకారికసమ్మతము.

"అనేకాసు నాయికా స్వనైవ మేవ్యేణ స్నేహానువర్తీ దక్షిణో నాయకః."

(విద్యానాథుఁడు)

నద్యో మన్త్రైవ నిమంత్రితా స్మరకళాకేళీషు కాచి న్మృగీ
సానూతేన విలోకనేన హృదయం కస్యాపి దావిష్కృతమ్,
కస్యాశ్చి త్ప్రహితః ప్రసాధనవిధి ర్దూతీకరేణక్వచా
గంతాస్మీ త్యనుచింతయైవ నృపతే రాసీ త్ప్రభాతా నిశా

(రాజుగారు తనమనోగతమును ఒకనాయికకు వక్రోక్తిగూఢమునను, మఱొక నాయికకు సాభిప్రాయములగు చూపులచేతను, వేఱొక నాయికకు ప్రసాధనాద్యలంకారమును దూతీముఖముగాఁ బంపుటచేతను తెలియఁబఱచెను. అంతట నాతనికి ఏనాయికకడకు పోవుదు అను ఆలోచనము గలిగినది. అతఁడట్లు ఆలోచించుచుండఁగనే తెల్లవాఱినది.)

"ఏత త్పరిస్ఫురతి పద్మదృశాం సహస్రం
అక్షిద్వయం కథయ కుత్ర నివేశయామి?
ఇత్యాకలయ్య నయనాంబుజ మేవ నిమీల్య
రోమాంచితేన వపుషా స్థిత మచ్యుతేన."

(రసమంజరి)

(దక్షిణనాయక-బోధకు అధ్యక్షుఁడగు శ్రీయుత కృష్ణమూర్తిగారి ప్రతిభావిశేషమును గనుఁడు: తన యెదుటఁ గల పద్మాక్షులా వేనవేలు. తనకో రెండేకండ్లు. ఏకకాలమున నీరెండు కండ్లతో నెందఱను చూడవచ్చును? ఒకరిని చూచినచో మఱొకరికి కోపము రాక తప్పదు. వస్తే యేమనెదరా? దానిచేఁ గలుగు ప్రళయము అంతయింత యనరానిది. మనకుఁ దెలియక పోవచ్చునుగాని ఆయనకును ఆయనజట్టువారికిని అది కరతలామలకము. మఱియు అనుభవసిద్ధము. కనుక ఆమహానుభావుఁ డట్టితఱి దీర్ఘాలోచనచేసినాఁడు. ఎవరిని చూడఁగూడదని నిశ్చయించుకొని రెండుకండ్లు అట్లే మూసికొనినాఁడు. అంతరంగమందలి యనురాగాతిశయముచే అతని శరీరము గగుర్పొడిచినది. దానికి కారణము నేనె నేనె యని యచటి పద్మాక్షు లనుకొనినారు.)

మీన మేషముల లెక్కించుచు తెల్లవాఱులు గడపిన రాజుగారి యంతరంగమున అనురాగశేషమైనను గలిగి

యుండునా అని సంశయము. ఏమాత్రమేని అతనికి అనురాగ ముద్భవించియుండినచో ఏదో విధముగ నతఁడు తెంపు చేసియుండెడివాఁడే. గనుర్పాటును బట్టి మూర్తిగారి మనసున ననురాగ ముద్భవించినదని చెప్పుటకు సంశయము లేదు. అయితే ఆయనురాగము ఎవరియెడఁ గలిగినదని చెప్పుటమాత్రము దుర్లభము. చూచియు చూడక మునుపే కంపముగాసికొనుటచే మనకువలెనే అతనికిని తెలిసియుండదు.

## సారాంశము

శాఖాచంక్రమణము గట్టిపెట్టి యిఁక సారాంశముఁ దేల్చుటకు యత్నించెదముగాక. ఆలోచింప త్రివిధములగు నాభాసములును గ్రాహ్యము లేయని తోఁచెడి. మొదటిదగు నేకత్రానురాగము మనకువలెనే వ్యాసకర్తకును నిర్వివాదాంశము. రెండవది తిర్యఙ్మ్లేచ్ఛ గతరతి. ఇది రసాభాసము గాదనువారిలో నొకరు వ్యాసకర్త. మనమో రసాభాసమేయనువారిలో నొకరము. తిర్యఙ్మ్లేచ్ఛగతరతి రసాభాసమే యనుటకు విద్యానాథ మహాకవి చెప్పిన ముఖ్యకారణము విభావాదిపరిపూర్త్యభావము. దీనింగూర్చి కొంతవివరించెదముగాక!

విభావములు (లలనోద్యానాదులు), అనుభావములు (కటాక్షభ్రూవిక్షేపాదులు), వ్యభిచారి భావములు (నిర్వేదాదులు) అను త్రివిధములగు భావముల చేరికచే రసము వ్యక్తమగునని యాలంకారికుల సిద్ధాంతము.

ఒకవస్తువు గోచరమైనంతనే మన మనసున ఒక భావము గలుగును. ఆభావము తీవ్రత నొందునేని దాని ననుసరించి యనుభావము లుత్పత్తిల్లును. భావములకును అనుభావములకును కార్యకారణ సంబంధము. వానికి వ్యభిచారిభావములు తోడ్పడునేని ప్రధాన భావము నిలుకడనొందును. అట్టిభావమును సహృదయుఁడు తన మనసున పలుమాఱు భావించుటచే ఆనందము కలుగును. అట్టియానందమునే రసమందురు.

అనుభావములఁ గలిగించునదిగను, సహృదయు హృదయంగమమును అగు భావమును ప్రేరేపించుశక్తి ఆవస్తువునకు (ఆలంబనవిభావమునకు) ఉండవలెను. లేనిచో తద్గతభావము సహృదయభావ్యమానము గాకపోవుటచే రసత్వ మొందఁజాలదు. భావము మనోగతమైనను దానిని ప్రేరేపించు శక్తి వస్తుగతమే. కనుకనే సహృదయులకుఁ గల భావజ్ఞతయు, వస్తువునకుఁ గల భావప్రేరక శక్తియు నన్యోన్యాశ్రయములు. ఇందు నేది కొఱవడినను రెండవది నిష్ప్రయోజనము.

కనుక అవిదగ్ధులగు తిర్యఙ్మ్లేచ్ఛులయెడఁ గల రతి తాత్కాలిక హృదయరంజకము గావచ్చునుగాని అది సహృదయ హృదయములఁ జొచ్చి వారిచే భావ్యమానము మాత్రము కాఁజాలదు. కనుకనే యది రసాభాసమని చెప్పఁ దగినది.

బహునాయికాగతరతి రసమైనపుడు బహునాయకగతరతి రస మేలకాఁగూడదు అను నాక్షేపమునకు విద్యానాథమహాకవి 'అచటను సమానానురాగము లేకపోవుటయే' యని సమాధానము చెప్పెను. అది మనవ్యాసకర్తకు తృప్తికరముగ నున్నట్లు గాన్పింపదు. ఒకపురుషునకు పలువురు నాయికలుండవచ్చును. ఒక స్త్రీకి ఒకపురుషుఁడే యుండవలయుననుట శాస్త్రవిహితము, ప్రాచ్య సాంఘిక మర్యాద. కనుక బహుసక్తయోషిద్గతరతి రసాభాసము అని మఱియొక సమాధానము. కాని యిచటను మఱియొక యాక్షేపము గలుగును: రసాత్మకమగు కావ్యమునకును, లోకసంబంధియగు నీతి'ని సంబంధమేమి అనునది.

కావ్యప్రయోజనము నీతిబోధకము గాకపోయినను కావ్యమునకును నీతికిని సంబంధము లేదనుటమాత్రము అవిచారమూలకము. దేశకాలపాత్రముల ననుసరించి నీతులు వివిధములైనను అన్నిటియొక్క ముఖ్యధర్మము మానవజీవితోద్ధరణమే. కనుకనట్టినీతిమిళితము గాని యేకళయు రసాత్మకము గానేరదు. ఆలోచింప లలితకళలన్నియు సాంఘికనీతి మిళితములైనపుడే రమణీయములగును. ఒకనిదర్శనము గనుఁడు. వస్త్రహీనయగు స్త్రీవిగ్రహమును చూచినపుడు ఆనందము గలుగకపోవుటయటుండ సహృదయులకు నేవగింపు సయితము గలుగ

చున్నది. అందులకుఁ గారణము సాంఘికజీవితమునందు అలవాటుపడిన వస్త్రధారణము లేకపోవుటచే రమణీయతకొంతవచ్చుటయే కనుక విశ్వశ్రేయమును గూర్చుటయే పరమప్రయోజనముగల కావ్యము నీతిసారముగ నుండినచో ఆనందప్రదము గానేరదు. వాల్మీకి కాళిదాసాది కవిప్రవరుల కావ్యరత్నములు సాంఘికజీవితాదర్శములైం కారణమువనే యానందదాయకములైనవి. రసాత్మకమని యెల్లరచే నేకగ్రీవముగఁ గొనియాడఁబడు శాకుంతల నాటకము నీతినిధియని చెప్పవచ్చు. అందు "పతికులే తవ దాస్యమపి క్షమం, అనిర్వర్ణ్యం పరకళత్రం." మొదలగు ప్రాచ్యసాంఘిక నీతులెన్నియో యిమిడియున్నవి.

ప్రాచ్యుల జీవితము ఐహికాముష్మిక ఫలకాంక్షి. ముఖ్యముగ నాముష్మికఫల సంపాదన కేర్పడినయుపకరణమనియే పెద్దల యభిప్రాయము. ఇఁక పాశ్చాత్యజీవితము కేవలము ఐహికము. కనుక దానింబట్టి సాంఘిక మర్యాదలును భిన్నములుగనే యుండునుగదా. కళకును నీతికిని సంబంధము లేదనువాదము పాశ్చాత్య సంస్కృతి ప్రతిభావిలసితము. పదేపదేవిడాకు లిచ్చుకొనుట కలవాటుపడిన పాశ్చాత్యుల కావ్యములలో నొకవేళ బహుసక్త యోషిద్గతరతి రసమైనఁ గావచ్చునేమో కాని 'యావజ్జీవం హోష్యామి' అనెడి భారతీయుల కావ్యములలో బహుసక్త యోషిద్గతరతి రసాభాసమనుట నిస్సంశయము.

ప్రాచ్యవాఙ్మయప్రపంచములో ఉత్తమనాయికాత్వము నొందిన మన ద్రౌపదమ్మగారివిషయమే నాఁడు మొదలు నేఁటివరకు సాహిత్యవేత్తలకు ప్రాణగండముగ నున్నది. పోనీ యని యానాఁటి సాంఘిక నీతియేమో అనుకొందమన్నను పాంచాలిబహుపతిత్వమును గూర్చి ఆకాలముననే దూషించినవారు పలువురు గలరు. "ఒక స్త్రీకి ఒకపురుషుఁడే శాస్త్రవిహితముగ నుండ అయిదుగురు భర్తలుగల పాంచాలి దాసిగాక పతివ్రతయెట్లగు? దాసినిసభకుతీసికొని వచ్చుట తప్పుగా"దని కౌరవసభలో కర్ణాదులు అనుట మనకు తెలియనిదికాదు.

అప్పుడే ద్యూతానంతరము అంధరాజు ద్రౌపదిని బిలిచి "అమ్మా! నీవు మహాపతివ్రతాశిరోమణివి; నిన్నెవరైన పల్లెత్తి యొకమాట అనినచో వారికి నావలెనే కండ్లు పోవును. తప్పులు క్షమించి నన్ను, నాబిడ్డలను కాపాడుము"అని బతిమాలుకొన్నాఁడు. ఆకాలముననే పాంచాలీ పాతివ్రత్య విషయమున నెప్పుడు సందేహము కలిగినను కృష్ణాదులు తమ యోట్లను అనాయాసముగ నామెకే యిచ్చుచుండెడివారు. కనుక మన వాఙ్మయ ప్రపంచములో నీ ద్రౌపదీపాత్రము చాలచిత్రము, విలక్షణము నని చెప్పఁదగినది.

రసభంగకరమగు ననౌచిత్యము "శాస్త్రలోకాతిక్రమాత్ ప్రతిషిద్ధ విషయకత్వాదిరూపం సామాజిక సంవేద్యం" అని యనౌచిత్య లక్షణమును నిర్వచించిన ప్రాచీన సాహిత్యవేత్తల యందఱయభిప్రాయమును సాంఘికనీతి బాహ్యమగు బహుసక్తయోషిద్గతరతి రసాభాసమనియే స్పష్టమగుచున్నది. (?) కనుక రసాభాసములు త్రివిధములని వచించిన సాహిత్యవేత్తలు పూర్వాచార్యులనియే చెప్పవచ్చు.



పిశిపాటి వెంకటరమణయ్య

నా కప్పటికి పదేళ్లుంటవచ్చు మా అమ్మ చనిపోయి. మా నాన్నగారు సాల్టు సబిన్సుపెక్టరుగా వుండి, యీవూ రావూరు క్యాంపులు వేసికొంటూ, తల్లిలేనిపిల్లవాణ్ణి పెట్టుకొని సంసారం నెగ్గలేక, ఒక్కదివాణంలేకుండా మనోవృత్తిజీవితంగడుపుకొంటున్న మా పెత్తల్లిని బ్రతిమాలి పట్నవాస కాపరం పెట్టించి చదువుకోసమని వదలేశారు నన్ను. మా పెత్తల్లిగారి గ్రామంకూడా అక్కడికి నాలుగైదుమైళ్ళ దూరంలోనే వుండేది. మొదటినుండి పల్లెటూరి బ్రతుక్కలవాటుపడినామె గనుక, ఆ పట్నవాస కాపురం ఆమెకు తలకాయనొప్పిగా వుండేది. తల్లిలేనిపిల్లవాణ్ణని నామీద పంచప్రాణాలు వదుల్తుండేది గనుక మానాన్నగారి కోరికప్రకారం వొప్పుకొంది. కాని, శుక్రవారం సాయంకాలము నేను స్కూలునుండి రావడమే తరువాయి వాళ్లపల్లెకు ప్రయాణంగట్టేది. మళ్లీ సోమవారం ఉదయము అక్కణ్ణే భోంచేసికొని స్కూలువేళకంతా వూడిపడేవాళ్ళం.

ఆ పల్లెగూడా మహా ఆనందంగావుండేది. ఎక్కడ చూచినా తోటలు. ఊళ్ళోఅంతా బ్రహ్మాండమైన చెట్లు. ఏ మునిసిపాల్టీలు లేకుండానే సందుగొందులతో సహా పరిశుభ్రంగా ఊడ్చివట్లుండేవి. పల్లెనానుకొనే నది. తోటల్లో సమృద్ధిగా కూరగాయలుపండేవి. కావలసినంత పాడీ పంట. మునిపల్లెలావుండేది. బ్రాహ్మలిండ్లన్నీ ఓప్రక్క నుండేవి. ఎవరింట్లో ఏకార్యమొచ్చినా సరే అందరు వొకయింటివారయ్యేవారు. రెండో యింట్లో పొయిలో పిల్లి లేచేదికాదు.

నాకూ యీడుజోడుపిల్లలు ఆడుకోడానికి చాలామందుండేవారు గనుక ఆ పల్లెలో కాలంగడపడమంటే మహాసర్దాగావుండేది. ప్రొద్దున్నే చద్దన్నంవేళకు మేమెవరింటిదగ్గర ఆడుకొంటూచేరితే, ఆ యింటి పిల్లలతోపాటు ఇంత తరవాణీఅన్నం తినేసివచ్చేవాళ్ళమన్నమాటే. ఇలాంటివిందులు నాకు తరచు పార్వతమ్మగారింట్లో జరుగుతుండేవి. వీరింటివ్యవహారాలుగూడా చాలాతమాషాగానే వుండేవి. అసలా పల్లె మొత్తంమీదే బ్రాహ్మణకుటుంబాలలో మగవాళ్లుతక్కువ, 'విడో'లెక్కువగ కనిపించేవారు. గ్రహచారవశాత్తూ వయసుమీరింతరువాతకూడా బ్రతికివున్న ఏ సుబ్బయ్యగారివంటివాడో ఆవూరికంతా హీరో అన్నమాట. ఊరివ్యవహారాలంతా, లౌకికం కానీ వైదికం కానీ, వారి సలహా మీదనే జరిగిపోవలసినదే. మజరా గ్రామ మవడంచేత కర్ణంగారికి మధ్యవర్తిత్వానికి వాకిట వసారాఅరుగుమీద చిరిచాప పరుచుకొని ఏవో కాగితాలకట్టలు ముందరేసుకొని, ముందుకు తయారుగాబోయ్యే శిష్యుణ్ణి ప్రక్కనబెట్టుకొని కూర్చునేవాడు తాళ్లకట్టిలాగి బిగించిన వెండి కళ్ళఅద్దాలుగుండా వీధిలో యిటూ అటూ పోతూ

వుండే ఆడవాళ్లను హెచ్చరించుకుంటూ ఓయికిలింపు యికిలించేవాడు. "ఓహో! చెంచా! (చెంచమ్మ) ఏమిటే ఆవుపాడ పట్టుకెళ్లుతున్నావా? ఏం సంగతి? యీవేళ యింత ప్రొద్దుపోయింది?" అని యీలాగే సగం సగం పేర్లతో పిలుస్తూ యికిలింపులతో హెచ్చరించేవాడు. ఆ పూర్వసువాసినికూడా సుబ్బయ్యగారి హెచ్చరింపు గౌరవసూచకంగా, కాస్త వెనక్కు తిన్నేసిన ముసుగుతూ, రెండుచేతులూ ఖాళీగనుక, మణికట్టు





తో నెత్తినదిమి ముసుకును ముందుకులాగి ముఖమంతా మందహాసం కనిపించేది. ఇలాగే వచ్చే పోయేవాళ్లతో వెర్రిప్రశ్న. వాళ్లకు తగ్గట్టుగా భక్తిగౌరవాలసమాధానం.

ఇక మధ్యాహ్నం భోజనానంతరం వో గంట పడుకొనిలేచి పొక్కుకరింప్లకే బయలుదేరేవాడు. వాకిట వసారా అరుగుమీద చాపవేయించుకొని, ఆరోజు 'టాపిక్'నుబట్టి గంట్లో రెండు గంటల్లో కూర్చొని మంచీ చెడ్డా మాట్లాడి వెళ్లుతుండేవాడు. ఇక ఆ గ్రామయింటివాండ్లకో గౌరవంగా భావిస్తూవుండేవారు.

ఓ సాయంకాలం పార్వతమ్మగారింట్లో నేనూ మహాలక్ష్మీ సుందరం యింకాకొంతమంది పిల్లలం ఆడుకొంటూ వున్నాము. ఇంతలోకే సుబ్బయ్యగారు వచ్చారు. గబగబా పార్వతమ్మగారు మమ్మల నందరినీ కసిరి అవతలికి తరిమేసి, అరుగూప్చి చిరిచాప పరిచింది. ఎందుకింతగారంతో అని నేనలాగే నిల్చొని చూస్తూ వున్నా. మహాలక్ష్మి నాచెయ్యిపట్టుకొని 'రా! బావా! పోదా' మన్నది. పెద్దమనిషి యింటికివచ్చి మాట్లాడుతూ వుంటే పిల్లలల్లరిచెయ్యకుండా దూరంగాపోయి ఆడుకోవాలని నాకింకా అప్పటికి క్రొత్తగనుక తెలియలే,



'రా! బావా! పోదా'మన్నది.

అందుకనే అనుభవంవున్న మహాలక్ష్మి నాచెయ్యిపట్టుకొని గుంజడం. ఇంతలోకే సుబ్బయ్యగారు "ఒసే! పార్వతీ! మహాలక్ష్మిని శేఖరానికిచ్చి పెండ్లి చేసేట్టయితే బాగుంటుందే" అని మొదలుపెట్టా డారోజు 'టాపిక్'. ఈ మాటవినడంతోటే నా కేమీచలనం కలుగలేదుకాని, నాచెయిపట్టుకొని గుంజుతూవున్న మహాలక్ష్మిమాత్రం

చప్పున నాచెయివదలేసి దూరంగావెళ్లి తలవంచి సిగ్గుగా నిలుచుంది!

అరుగుమీదకూర్చున్న సుబ్బయ్యగారికి కనబడుతూ వుండేట్టుగా పార్వతమ్మ వాకిటితలుపు నానుకొని కూర్చుంది. ఈ పెండ్లి ప్రసంగం సుబ్బయ్యగారెత్తి మాట్లాడుతూవుంటే పార్వతమ్మగారి కూతురు రావమ్మగారు, కోడలు భాగీరదమ్మగారు నెత్తిముసుగులు సరిగా సవరించుకొని మెల్లగావచ్చి పార్వతమ్మగారిని చాటుచేసికొని కూర్చున్నారు. పార్వతమ్మగారు 'మరేలే, మనసంబంధం వాళ్లుచేసికొంటారూ. వాళ్ళంతా ఉద్యోగస్థులు, గొప్పవాళ్లు. మనం పల్లెటూరివాళ్లం' అంటూ మనకు వగ్గవారు మనకూ కోరుకుతారనే బిగువుతో పెదవివిరుస్తూ, కండ్లారుస్తూ గడ్డానికి చెయ్యి మోపి కొంచం ముందుకువాలి కూర్చుంది

సుబ్బ—ఇదేమన్న మాటలే. పట్నవాసంవాళ్లూ, ఉద్యోగస్థులూ పల్లెటూరిపిల్లలను చేసికోరని శాస్త్రముకున్నా వుందాయేమిటి? అంతదూర మెందుకు? వాళ్లమ్మపల్లెటూర్దేఅవునంటావా కాదంటావా. వాళ్లనాయన చేసికోలా?

పార్వ—అదేకాదులే. వాళ్లకుకట్నాలు-కానుకలు వాళ్లహోదాకు తగ్గట్లు మన మేమివ్వగలము? ఏదో యింతపుసుకూరా అన్నంపెట్టి చేసేవాళ్లమేకాని.

సుబ్బ—ఏమంత మునిగిపోయింది? మీకుమాత్రం ఏ పదిమంది పిల్లలున్నారని. రాముకొట్లాగో (కూతురికి) యెవరూ దిక్కులేరయిపోయె. దాని యెనిమిదెకరాలూ యిచ్చి పిల్లనిస్తామంటేకండ్లద్దుకొంటూ చేసికొంటారు. కోడలిని కొడుకునూ పెట్టుకొని సుఖంగా వుండవచ్చు. రాముకుమాత్రం యింతకన్నా కావలసిందేముంది? సుందిగాడికి (మనవడికి) ఆ ఆస్తి కావలెనని యేమీ లేదు కదా? వాడికి కావలసినంతలిని ఒకరి కింత పెట్టగలిగిన ఆస్తేవుందయిపోయె.

ఈ మాటలు వినేటప్పటికి, అప్పుడే మనవడికి కలిసివచ్చిన ఆ యెనిమిదెకరాలు ఎగిరిపోయినట్టే సుందులు కొట్టుకో మొదలుపెట్టినవి పార్వతమ్మకు! పైకేమీ కనిపించకుండా "సరేలే, మన మెన్నుకొంటే యేం లాభం దైవంకూర్చివుండాలి కదా?" అని ఆప్రసంగం జారవిడిచింది.

రావమ్మగారికేమోగాని మొదటినుండి నన్ను చూస్తే విపరీతమైన ప్రేమవుండేది. ఆమెకైనా పాతిక ముప్పైయేళ్ళలో వుంటాయేమో? తలచెడిందన్నమాటే కాని బంగారంలాంటి విగ్రహం. మహలక్షికి తలదువ్వి జడవెయ్యగానే నాకూ ప్రాపుకూడ దువ్వేది. నీళ్లుపోసేది. అన్నంకూడ మహలక్షి, సుందరాలతోటిపాటు వాండ్లింట్లోనే తినమని బలవంతంచేసేది. గడ్డంక్రిందికి చెయిపెట్టిరెండుబుగ్గలుగట్టిగానొక్కిపట్టుకొని నాముఖం పైకెత్తి వంగి నన్నుతెరుచుగట్టిగా ముద్దుపెట్టుకొంటూ 'నా చిలకతండ్రి నా బంగారునాయన, నా శేఖరం'అని పలిపివేస్తుండేది. శుక్రవారం సాయంకాలం నేనూ మా పెత్తల్లీ పల్లెకుచేరుకొనే సమయానికంతా వాకిట్లో నిల్చొని యెదురుచూస్తూ వుండేవారు. సెలవరెండు రోజులూ (శని ఆదివారాలు) వాండ్లింట్లోనే సరిపొయ్యేదన్నమాట నాకు. మాపెత్తల్లికెందుచేతనో వాండ్లు వన్నంత చనువుచెయ్యడం గిట్టేదికాదు. అయినా ఏమో తల్లిలేనిపిల్లవాడినని నాసరదాకేమీ అడ్డుతగిలేదికాదు. అప్పటికి నాకుమహావుంటే పన్నెండు పదమూడేండ్లుండవచ్చు. మహలక్షికీ వొకటి రెండు తక్కువుండవచ్చు. కాని, పల్లెటూరిపిల్ల. వెన్నమీగడలతో మెరుగుబోసిన బంగారుబొమ్మ. నాకన్నా మంచి దిటవుగా వుండేది. ఆటపాటల్లో తోటిమగపిల్లలమగు మమ్మలనందరినీ త్రోసిరాజనేది. గోలీకాయలు మొదలుకొని గోటిబిళ్ళదాకా ఝుమాయించి ఆడేది! చెట్టెక్కడంవస్తే నేనుమిటకరించుకొని చూస్తూ-చూస్తూవుండగానే చిటారుకొమ్మకెక్కి కూర్చునేది. నేనెక్కలేక తంటాలు పడుతుంటే ఓకొమ్మమీద కూర్చొని క్రింది కొమ్మను కాళ్లతూతగాజేసికొని రెండుచేతులూ వదిలేసి వికగబడినవ్వేది.

ఓమారు ఊళ్లో అందరూ మాఘస్నానాలకని బయలుదేరుతుంటే "నీవుకూడారా బావా పోదాం"అని పిలిచింది మహలక్షి. మాటతోసెయ్యలేక నేనూబయు

ద్దేరా. చలి భరింపలేకుండావుంది. తీరా అందాకా వెళ్లి స్నానంకద్దూ — స్నానంవద్దూ అని గట్టిగాముసుగుబెట్టుకొని, నీటివొడ్డున్నే ఓ రాయుంటే దానిమీద కూర్చొని స్నానం చేస్తూవున్న వాళ్లందర్నీ చూస్తూవున్నా — మహలక్ష్మి నాకుదగ్గరగా కంఠంలోతు నీళ్లల్లో మునుగుతూ తేల్తూ నవ్వుతూ త్రుళ్లుతూ "స్నానంచెయి బావా చలుండదు. ముసుగెట్టుకొని కూర్చుంటే అట్లాగేవుంటుంది" అని పిలిచింది. "వద్దబ్బా నాకు చెప్పలేస్తున్నాది" అని మరీగట్టిగాముసుగుకొని వూగుతూ కూర్చున్నా. ఈమాట అనీఅనడంతోటే మహలక్ష్మి అమాంతం నన్ను బట్టి నీళ్లలోకీడ్చింది. నాకు తలమునుకలయింది. ఒక బుటకేసి యిన్ని నీళ్లుకూడా మింగా. ముక్కులోనూ, నోట్లోనూ నీళ్లుపోయి నేను ఉక్కిరిబిక్కిరవుతుంటే నా అవస్థచూచి మహలక్ష్మి పకపకా నవ్వను మొదలుపెట్టింది. పక్కనేవున్న భాగీరథమ్మ (తల్లి) రావమ్మ (మేనత్త) మహలక్ష్మిని కూకలేశారు. కాస్తదూరంనుంచీ చూస్తూవున్న మాపెత్తల్లి "వట్టి గయ్యాళిపిల్ల" అనుకొంది కాబోలు మహలక్ష్మి కేసి చురచురచూచింది. అప్పట్లో యీ 'చురచుర' లన్నీ మహలక్ష్మి కోలెక్కలోకే వచ్చేవికావు.

ఈ ఆటపాటలలో ఒకటిరెండేండ్లు గడచిపోయినవి. ఇలావుండగానే, సుబ్బయ్యగారు వివాహప్రశంస తెచ్చింది. ఈ ప్రశంస వచ్చిందేమొదలు రావమ్మగారికి నాపైన వెర్రిప్రేమకలగడం, మహలక్ష్మి నాతో కొంటె చేష్టలుచెయ్యడం మానివయ్యారం తటస్థించడం. పైగా మహలక్ష్మి నన్ను చూస్తే సిగ్గుకూడా అభినయిస్తూ వుండేది. ఇంతట్లోకే మాకు వేసవిసెలవలుకూడా వచ్చాయి. ఒక్కపట్టున మూడుమాసాలు. మహలక్ష్మిని ముస్తాబా చేసి, నాజూటవ తిరిగేట్టు చేసినా వెర్రివెర్రిగా మాట్లాడవద్దనీ, పిచ్చిపిచ్చిగా గంతులెయ్యవద్దనీ యేమేమో నీతులు చాటుమాటుగా బోధిస్తూకూడా వుండేవారు. ఈకట్టుదిట్టా లెందుకో నాకేమీ అర్థమయ్యేవికావు. పైగా నాకుమాత్రం మహలక్ష్మి నిట్లాంటి కట్టుదిట్టాలలో వుంచడంచేత పూర్వంకీతితరగు వాండ్లింట్లో కాలం గడపడం అంత ఉత్సాహంగా వుండేదికాదు. ఒక్కో రోజు బొత్తిగా వాండ్లింటికి వెళ్లడమే మానేసేవాడిని. నేను వాండ్లింటికివెళ్లడం తగ్గించినతరువాత మహలక్ష్మే మాయింటికి అప్పుడప్పుడు రావడం మొదలుపెట్టింది. ఒంటరిగా పనిచేసికొంటూవుండే మాపెత్తల్లిగారికి కాస్తసహాయంకూడా చేస్తూవుండేది. ఆ అల్లరికొంటె చేష్టలుమాని యింతబుద్ధిమంతురాలైనదని మాపెత్తల్లిగారికికూడా ఆశ్చర్యంగావుండేది. "అమ్మాయ్, యీరోజు నీవుకూడా మీబావతో యిక్కడే భోజనం చెయ్యి" అని కూడ అడిగేది. నేభోజనంచేసినతరువాత ఆకేతచేస్తుల్లో నా యెంగిలెత్తి శుద్ధిపెట్టేది. మైలపనులన్నీచేస్తూ ఆమెను సంతోషపెట్టేది. మహలక్ష్మికి వాండ్లింట్లో యిటుచెంబటుపెట్టేఅగత్యమే వుండేదికాదు. ఎంతో గారాబంగా, ఏమైనాపనిచేస్తే అరిగిపోతుందన్నట్టుగా చూచుకొనేవారుకూడ. అలాంటప్పుడు మాపెత్తల్లిగారి కన్ని పనులు చేసిపెడుతున్నట్టు తెలిసికూడా వాండ్లవ్వ తల్లి మేనత్తా యేమీ మాట్లాడేవారుకారు.

ఆసలందాకావస్తే నాపెండ్లివిషయమై జోక్యం కలిగించుకోడానికి మాపెత్తల్లికేమీ అవకాశముండదని లోలోపల ఆమెకూ తెలుసు. అయినా అప్రయత్నంగా వచ్చిపడుతూవున్న యీగౌరవానికందుకు పోనొట్టుకో వడముకొనేదో యేమో మహలక్ష్మిచేయగలిగిన చిన్న చిన్నపనులన్నీ సగర్వంగానే చేయించుకొనేది. ఇన్నాళ్లూ పాపం మాపెత్తల్లికినోరికే చాలీచాలని భరణంతో ఆ పల్లెలో జీవితం వెళ్లబుచ్చుకొంటుంటే అడిగేవాళ్లెవరూ వుండేవాళ్లేకారు. పైగా కాస్తదూర బంధువులు మంచిభూస్థితిగలిగిన పార్వతమ్మగారికుటుంబమువారికి 'ఖాతరే' వుండేదికాదు. ఇప్పుడు ఖాతరు చెయ్యడమేకాదు కాస్తభయంగాకూడా సంచరిస్తుండేవారు. మహలక్ష్మిని నాకిచ్చి వివాహంచేసేయత్నాలలో మాపెత్తల్లిగా రడ్డుకొగుల్తారేమోననే యీ భయమంతా వారికి! మాపెత్తల్లిగారికికూడా యీ గౌరవమంతా నావంటి కొడుకుండబట్టేనని ఆమెభ్రమ!

మహలక్ష్మి పూర్వంమాదిరి ఆటపాటల్లోనేమి, మాట ముచ్చటలలోనేమి విజృంభించడం మానేసి కొందమెడ

మెడంగా తిరగడం మొదలుపెట్టింనుంచీ ఎందుచేతనో ఆకర్షణెక్కువయింది. ఒంటరిపాటున వారచూపులు చూచేది! మీదబడి క్రిందబడి గుంజుకొని కొట్టుకొని ఆడుకొనేరోజుల్లో యేచైతన్య ముండేదికాదు. ఈ దూరంనుండి ప్రయోగించెడి వారచూపుల దెబ్బమాత్రం మహాగాబరాయెత్తించేది! ఎవరైన వింటారేమోనని జంకుతూ వొంటరిపాటుగా ఈ వేళక్కడనే భోంచేస్తాముండుబావా అని దీనంగావేడుకొనే ఆలాపం హృదయాన్ని కలచివేసేది! ఇదివరలో ఆటల్లో మొండికిబడి కూర్చుంటే, లేవనెత్తడానికి మీదబడి రెండుచేతులతో తనువు సమాంతం కౌగలించుకొంటే యేమీ అనిపించేదికాకపోయినా, దూరదూరంగా సంచరిస్తూవచ్చిన యీవేళల ఏ సందర్భంలోనన్నా తాకడం సంభవిస్తే ఝల్లుఝల్లుమనేది!

ఇలా కొన్నాళ్లుజరిగినది. ఆరోజుకారోజు నేనెందుకో చిక్కిపోతున్నట్లు మాపెత్తల్లి కనిపెట్టింది. చివరకామెవచ్చిన పర్యవసాన మేమంటే అనాదినుండి రావమ్మగారింటిని కొన్ని ఆడదయ్యాలు ఆశ్రయించుకొనియున్నాయని, మొగవాళ్లను చంపుకతింటాయని, వివాహాలు నసలే సహించవని! తెలిసియున్న మూడు తరాలనుండి రావమ్మగారు కాపరానికివచ్చిన సంవత్సరానికే మొగుణ్ణి చంపేశాయట. కోడలింటికివచ్చిన ఆరుమాసాలకే కొడుకు చచ్చాడట. కూతురిపెండ్లయి పదహారుదినముల పండక్కు అల్లుడింటికివచ్చిన మూడోరోజునే 'హరి' అన్నాడట. ఇకనిప్పుడు మహాలక్ష్మిని నాకిచ్చి వివాహము చెయ్యవలయునని వాండ్లు పడుతున్న విశ్వప్రయత్నాలను కనిపెట్టి ఆదయ్యాలు నావెంటబడ్డాయని నిశ్చయించుకొంది! అందుకనే రాత్రిళ్లు నన్ను వాండ్లింట్లో పడుకోవద్దని నెత్తిననోరుపెట్టుకొని కొట్టుకొంటున్నా విన్నానుకాదని గోలపెట్టింది. ఇదివరల్లో ఎంతో తెలివిగా చదివేవాణ్ణని స్కూల్లో టీచర్లందరూ మెచ్చుకొంటూవుంటే యిప్పుడు పరీక్షలు ఫెయిలుచేయిస్తూవున్నది కూడా ఆదయ్యాలే అని తెలిసికొంది! తనకెంతకష్టంగావున్నా నాకొరకు అప్పల్లెకు వెళ్లడమే మానేసి నన్ను పెట్టుకొని పట్నంలోనేవుండిపోయింది. అప్పుడప్పుడూ నేను సెలవలలో వెళ్లివద్దామని రమ్మంటే ఆదయ్యాలే యిక్కడికివచ్చినా వదలకుండా వెంటబడ్డాయని నన్నేమీ అనకుండా ఆదయ్యాలను తిట్టిపోస్తుండేది! ఒకరిద్దరు భూతవైద్యులనుగూడ పిలిపించి భూతోపశమనం చేయించిందనికూడ జ్ఞాపకం.

పాపం! మహాలక్ష్మిని నాకిచ్చి వివాహంచెయ్యవలెనని వాండ్లు విశ్వప్రయత్నాలు చేశారు. రావమ్మగారు తన యేనిమిదెకరాలుయివ్వడమేగాకుండా జీవితపర్యంతము దాస్యంచెయ్యడానికికూడ సంసిద్ధురాలైయున్నట్లు మానాన్నగారికి తెలియజేశారు. అన్నివిధాలా అనుకూలమైన సంబంధమేనని మానాన్నగారుకూడ మొగ్గారు. కాని మాపెత్తల్లిగారు ఎక్కడున్నా దూరంగాపోయి బ్రతుకుతూవున్నా ఈ పెండ్లిపేరుబెట్టి ఆదయ్యాలను నామీద ఉసిగొల్పి నా అంతంచూడటానికే రావమ్మగారి కుటుంబం పగబూనిందని, ఆ దయ్యాలను హతమార్చడానికి రాక్షసరూపం దాల్చింది. మానాన్నగారి మనసు త్రిప్పేసింది. ఇంకను బ్రతిమాలడము ఆత్మగౌరవానికి లోపమని మహాలక్ష్మికి వేరేసంబంధం మాట్లాడారు. వివాహం జరిపించారు.



"బావా! నన్న్యాయం చేశావుగదా?

అదేమి కర్మమోగాని ఏడాది తిరక్కమునుపే మహలక్ష్మికి వైధవ్యం సంప్రాప్తించినది! "హమ్మ! బ్రతికామురా దేవుడా! దయ్యాలకుతగిన ఆహుతి దొరికింది. ఇం కవి మాపిల్లవాడిని పట్టుక బాధింపవు" అనుకొని మాపెత్తల్లి సుఖంగా నిద్రపోతూవచ్చింది!!

పాపం మహలక్ష్మిని యిప్పుడుకూడా ఎప్పుడైనా చూడటం తటస్థించితే "బావా! నన్నన్యాయం చేశావుగదా?" అని కాల్వలైగట్టు కంటిధారల తన పవిటకొంగుతో అద్దుకొంటూ గద్గదికంగా అంటుంది.

# వామనభట్టబాణుడు — శ్రీనాథుడు

కురుగంటి సీతారామయ్య

**స్వవిషయము:-**

కొంతకాలముక్రిందట మనుచరిత్రము లోని యొకపద్యమునందలి పాఠభేదములయొక్క సామంజస్యమును చర్చించి వ్రాయగా పండితులును, విమర్శకులును నాపై దండెత్తిరి. ఒకరు నా తంజావూరిపిచ్చిని బయటబెట్టి శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజావారి వ్యాఖ్యానసహాయముతో "స్థితస్యగతి"ని చింతించి నావాదమును భేదించిరి. మరియొకరు "చు"లో "విభావానుభావ సాత్త్వికవ్యభిచారి భావసముల్లాసితస్థాయి భావమును" కనిపెట్టి, యట్టి వారిసామర్థ్యమున కవకాశమిచ్చిన నాకు వందనము నొసంగిరి. ఇద్దరును పద్యముననున్నవి రెండేయర్థములని మాత్రము చెప్పిరి. నేను ధన్యుడను. కాని వీ రే లాకొ యర్థత్రయమును కల్పించి వ్రాయబడిన టీకను పొర బాటనిమాత్ర మనలేదు. దయచేసి తామంగీకరించిన యర్థద్వయపరముగా దానిని దిద్దించిన బాగుండును. నేనుమాత్రము పాఠభేదమన్న భయపడవలదని యొకరికిని, రస మర్థనిష్ఠముగాని కేవల వ్యాకరణ ప్రత్యయ నిష్ఠము కాదని మరియొకరికిని మనవిచేయుచున్నాను. ఈవ్యాసమున మరియొకవిషయము బయటబెట్టి మరికొందరి విమర్శనమునకు పాత్రుడను కాదలచినాను.

**వామనుడు**

వామను డొక సంస్కృతకవి. ఈయన వేమభూపాలచరిత మను గద్యకావ్యమును రచియించి దానిని బాణుని కాదంబరీ సదృశముగా వ్రాసినాడు. అందుచే 'భట్టబాణ' శబ్దము నాయనపేరునకు తగిలించి యాయనను బహూకరించినారు. అప్పటినుండి యాయన వామన భట్టబాణుడను వ్యవహారమున బరగినాడు. ఈయన కొండవీడును పాలించిన రెడ్డిరాజగు పెద్దకోమటి వేమనృపతివద్ద నాస్థాన విద్వాంసుడుగా నుండెను. ఈవేమనృపతి స్వయముగ పండితుడై, కవియై, కవి పండితులకు పోషకుడై పరలెను. ఈయనవద్దనే సుప్రసిద్ధాంధ్ర కవియగు శ్రీ నాథమహాకవి యాస్థానకవీశ్వరుడుగా నుండెను. కావున వీ రిద్దరును, అనగా వామన శ్రీనాథులు సమకాలీనులని నిశ్చయము. ఈకాలము ౧౫-వ శతాబ్ది ప్రథమపాదమని చెప్పనగును. ఇద్దరును నప్పటికే కవులయి గ్రంథముల నిర్మించి మించినట్లుకూడ కన్పట్టుచున్నది. ఇద్దరును బహుగ్రంథనిర్మాతలే. వామనుడు వేమభూపాల చరితమును గాక నలాభ్యుదయాది కావ్యములను, శబ్దచంద్రికాది నిఘంటువులను; శృంగార భూషణాది రూపకములను, ఇంక కొన్ని గ్రంథములను రచియించినప్రౌఢ. వీరిద్దరిలో మొదట నెవరువ్రాసిరో యిదమిత్థమని చెప్పటకు వలనుపడదు. ఇట్టి సమకాలికులగు వారియొక్కయు, నందును నొక యాస్థానము నందుండి పొత్తుగల్గినవారియొక్కయు వ్రాతల యందు సామ్యము లుండుట వింతకాదు. ఒక్కొక్కచో భావసామ్యమేకాక భాషాసామ్యము కూడ కానవచ్చును.

"చూడామణి ర్నృపాణాం
దుర్మదపరిపంథిశిఖరిదంభోళిః,

సర్వజ్ఞ చక్రవర్తీ
ఽదకోమటి వేమభూపతి ర్జయతే.''
(శృంగార శ్రీనాథము. ౭౨)

ఈ శ్లోకము వేమభూపాలచరితమునం దున్నది. శ్రీనాథవిరచితమగు శాసనాంతర్గత మీ శ్లోకమని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెలుపు చున్నారు. కావున నీ శ్లోక మెవరిచే విరచితమని యడిగిన మనము చెప్పజాలము. ఇట్టిసామ్య మునుబట్టి యెవరివద్దనుంచి యెవరు గ్రహించిరో చెప్పుట దుస్సాధ్యము.

పైభాగములేగా యింకను కొన్నిభాగములు భీమఖండమునందలివియు, వేమభూపాల చరితంబునందలివియు, సమానములుగా నున్నవి. వానిలో కొన్నిటి నీక్రింద బొందుపరచు చున్నాను. చతురవర్ణ [illegible] ర్ణించ నవసరమున:-

౧ ''సంక్రాంత హరిచరణ లాంఛన ఇవ, ఆతపత్ర చామరతోమరధనురసిభి రవిరహితః; సురాపగయా సోదర్యస్నేహదత్తానీవ, శుచిత్వ గాంభీర్యపావనత్వ మాధుర్యాణి చరితమనః స్వభావవచనేషు సముద్వహా[illegible]. కలితకారణగుణ ఇవ సందరితమహిమా'
చరితము.

అట్టి సందర్భముననే:-

''అప్పణ్యవంశంబు కంసాసురధ్వంసి చరణపల్లవంబు దనకుం బుట్టినిల్లు గావునం గారణ గుణ సంక్రమంబునంబోలెం జామరతోమరచ్ఛత్రధనుః ఖడ్గాది చిహ్నోపశోభితంబై, చదలేటి నీటివలని సోదరీయ స్నేహ లబ్ధంబులుం బోని పావనత్వ శుచిత్వ గాంభీర్య మాధుర్యంబులు చరితమనః స్వభావవచనంబుల ధరియించి.''
(భీమేశ్వర పురాణము.౧-౩౨)

౨ త్రిలింగదేశ వర్ణనా సందర్భమున:-

''సమంతా దఖండితాంభస్సమృద్ధిః విశ్వంభరాభ్రూలతానుకారిసేతులేఖైః, తటతరుకుసుమాంతరక్షరదమంద మకరందస్యంద కందళిత కల్లోలైః, సలిలకేళిలోల కలహంసకామినీ కోలాహలానుకృతజలదేవతామణినూపుర ఝుణఝుణాత్కారైః, కారండవ పక్షవిక్షేప పరిచలిత పంకజ పరాగపాళీ విరచితాళీక సంధ్యానుబంధ చకిత చక్రవాకయుగ్మైః, స్తనంధయైరివ సాగర రాజస్య అనేకై స్తటాకై రుపశోభితః,''
(వేమభూపాలచరితము.)

దాక్షారామ పురవర్ణనావసరమున:-

''అఖండితాంభః సమృద్ధి విజృంభించి విశ్వంభరాభ్రూలతానుకారి సేతు రేఖాలంకారంబులై, తటతరుకుసుమాంతరక్షరదమంద మకరంద స్యందన కల్లోలంబులై, సలిలకేళిలోలకలహంస కామినీ కోలాహలానుకృతజలదేవతాచరణమణినూపుర ఝుణఝుణాత్కారంబులై, కారండవ పక్షవిక్షేప పరిచరిత పంకజ పరాగపాళీ విరచితాళీక సంధ్యానుబంధచరిత చక్రవాక మిథునంబులై, పయోధిగన్న బిడ్డలుంబోని యొడ్డు చెఱువులచేతను.''
(భీమేశ్వర పురాణము. ఆ.౧-౧౦)

౩ ఆ సందర్భముననే:-

''సరస సహకారశాఖా శిఖాధిరూఢకోకిల కులకోలాహలాకలిత విరహిణీ హృదయహోలాహలక్ష్వేళైః, మధుకర గుంజాయమాన మాధవీని కుంజఖంజన్మిహిర కిరణపుంజైః, ఉద్భిన్నపున్నాగ కుసుమ పరిమళోద్గార నిర్వారిభిః, ఉల్లసిత చంపక కళికాకలాప కల్పిత కందర్ప పావకాస్త్ర సంపద్భిః, పాకపరిస్ఫుటితపుంద్రేక్షుపరుర్ముఖోద్గీర్ణ(?) ముక్తామణికిరణ దర్శితాకాలరాకానిశాప్రకాశైః, కోరకప్రకరతారకితకురవకాసోకవాైః, వనితావద

నాసవ వాసనా సనాథవకుళవన్యైః, మహిళాకుచ కాంతి చోరలికుచఫలైః, మాతులుంగామోదహృదయంగమైః, నవనారంగసంగిభిః, భుజంగలతాపరిష్వంగ ధన్యతరుణ పూగభద్రైః, లలితలవలీలతాలింగితలవంగైః''

(వేమభూపాలచరితము.)

అట్టి సందర్భముననే:-

''సరస సహకారశాఖాశిఖాధిరూఢ కోకిలకుటుంబినీ కంఠనాళకోమలకుహూకార కోలాహల కలితవిరహిణీ హృదయ హాలాహల క్షేపంబులును; మధుకరనికరగుంజాయమాన మాధవీనికుంజ కుంజన్నిహితకిరణపుంజంబులును; సముద్భిన్న పున్నాగ కుసుమ పరిమళోద్గార నీహారంబులును సముల్లసిత చంపక కళికాకలాప కల్పిత కందర్ప పావకాస్త్ర పరిత్రస్త ప   ంబులును; పాకవరిస్ఫుటిత పుంద్రేక్షు పర్వముఖోద్గీర్ణముక్తామణి దర్శితాకారరాకానిశాకర ప్రకాశంబులును; కోరక ప్రకరతారతారకిత కురవకానోకహంబులును; వనితావదనాసవవాసనాసనాథవకుళవనంబులును; మహోరు కుచకలశకాంతిచోర ఫలకలిత లికుచనిచయంబులును; మాతులుంగామోదహృదయంగమంబులును; నవనారంగ సంగసుఖిత సారంగమంగళగాన సరససంగీత ప్రసంగంబులును; భుజంగలతా పరిష్వంగధన్యతరుణ పూగద్రుమంబులును ; లలితలవలీలతాలింగితలవంగంబులును నగు శృంగారారామంబుల చేతను.''

(భీమేశ్వర పురాణము ౧.౧౧౦)

పై యనువాదములుచూచిన రెంటికినిభేద మెంతయో లేనట్లు తెలిసికొనగలము. ఇందు మాతృకయేదో, పుత్రిక యేదో తెలుసుకొనుటకు ప్రయత్నించిన నాకు మూ డూహాలు తట్టుచున్నవి.

(౧) రెండుగ్రంథముల రచనాకాలమును పరీక్షించిన కొంతవరకు తేలగలదని తోచును. రెడ్డిరాజ్యము కొండవీడున క్రీ. శ. ౧౪౨౪ సంవత్సరముతో నంతమొందినట్లు చెప్పనగును. కోమటి వేమారెడ్డి రాజ్యము క్రీ. శ. ౧౪౨౦ తో నంతమొందెను. వామన శ్రీనాథులు వేమన యాస్థానమున నుండిరన్నపుడు క్రీ. శ. ౧౪౨౦ వరకునని తెలియుచున్నది. తరువాత శ్రీనాథుడు రాజమహేంద్రవరము చేరినటు కన్పట్టును. వేమభూపాలచరితము వేమునకాలములో, ననగా క్రీ. శ. ౧౪౨౦ కి లోపున రచియింపబడినట్లు తలపవచ్చును. రచనానంతరము వామను డేమయ్యెనో మనమెరుంగము. రెడ్డిరాజ్యము పోయిన వెనుక వామను డెచ్చటనుండెనో కూడ మనకు తెలియదు. వేమారెడ్డి యనంతరము వేమభూపాలచరితమును వామనుడు రచించెనని చెప్పుట సమంజసముకాదుగదా! ఇక భీమేశ్వర పురాణమన్ననో శ్రీనాథుడు రాజమహేంద్రము చేరిన తరువాత రచియింపబడినట్లు తేలుచున్నది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు భీమేశ్వరపురాణ రచనాకాలమును క్రీ. శ. ౧౪౩౦ సంవత్సరమని తలంచినారు.[౨] పౌర్వాపర్యము నాలోచించిన రెండుగ్రంథములలో వేమభూపాలచరితమే పూర్వరచితమని తోచుచున్నది. ఇదియే నిజమైన వామనునే శ్రీనాథు డనుకరించియుండవలెను. శ్రీనాథు డిట్టివ్రాతలయం దసమర్థుడని నాయాశయము కాదు. సమకాలికు డగుటచేతను, నొండొరులకును గౌరవభావ ముండుటచేతను, వర్ణనము రసవంత మగుటచేతను ననుకరణ మట్టి వ్యక్తులయెడ నపకర్షహేతువు కాకపోవుటచేతను, శ్రీనాథుడు వామనునినుండి గ్రహించియుండ వచ్చును.

౧ శృంగార శ్రీనాథము. పు. ౪౧౨

౨ శృంగార శ్రీనాథము పు. ౧౪౪

(౨) వామనుని గ్రంథము సంస్కృతము నం దున్నది. శ్రీనాథునిది యాంధ్రమున గలదు. వర్ణనములా సంస్కృతభాషలో నున్నవి. దీర్ఘ సమాస భూయిష్ఠములైయున్నవి. వామను డట్టి వ్రాతలలో సమర్థుడగుటచే నాయనకు "భట్ట బాణ" బిరుదము లభించెను. ఇట్టి సందర్భ మున వామనుడే వీనిని రచియించి యుండవ చ్చునని యూహింపనగునని తోచుచున్నది. శ్రీనా థుడుకూడ దీర్ఘ సంస్కృత సమాసరచనాచణుడై నను నైపయూహకు తావున్నట్లు తోచును.

(౩) రెండురచనలను పోల్చిన నొకదానిపై నొకటి యాధారపడినట్లు కన్పట్టును. వామనుని సమాసముల నొక్కొకచో హ్రస్వములుగనున్న వానిని శ్రీనాథుడు కొన్నిపదములనుచేర్చి దీర్ఘ ములు ...వించెను. ఒక్కొక సమాసమునందలి భావము...ు పెంచెను, పొట్టిదైన రచన పూర్వ మనియు పొడుగైన రచన పరమైన వెనుకటిదాని యుపబృంహణమనియు తోచుచున్నది. రెండుదా హారణముల నిత్తును.

౧. 'ఉల్లసిత చంపకకళికాకలాపకల్పిత కందర్పపావకాస్త్ర సంపద్భిః"

(వేమ భూపాలచరితము.)

౧. "సముల్లసిత చంపక కళికాకలాప కల్పిత కందర్పపావకాస్త్ర పరిత్రస్త పథికలోకంబులును."

(భీమేశ్వర పురాణము.)

పైసమాసమునమొదటిదానిపై నత్యూహ. చంపక కళికా సందోహము మన్మథాస్త్రముల ననుకరించుచున్నవని వామనుడనగా నట్టిమ న్మథాస్త్రములచే పాంథలోకముభీతిల్లుచుండు నట్లుచెప్పి వామనునియూహనుపొడిగించి శ్రీనా థుడు వాక్యమును పెంచెను.

౨. "నవనారంగసంగిభిః" ఉపవనం బులు నారంగసంగము కల్గియున్నట్లు వామను డనెను. దీనిని "నవనారంగ సంగసుఖిత సారంగ మంగళగాన సరససంగీత ప్రసంగంబు లును" గా శ్రీనాథుడు పెంచి తదనంతరార్థ మును కలిపి యట్టి సంగీతప్రసంగము లుద్యా నంబులు కలిగియున్నవని చెప్పెను.

ఇట్టి యుదాహరణముల నింకను నియ్య వచ్చును. రెండుస్థలములను చూచిన మొదటిది మాతృకయనియు, రెండవది దానియుప బృంహణమనియు చదువరులు తలంపకపోరు.

పర్యవసాన మేమనగా వామనుని వాక్య ములను శ్రీనాథుడు గ్రహించి వలసినచో దానికి వన్నెపెట్టెనని నిశ్చయింపనగును.

# 'ఈ కలిమికోసం'

ముద్దా విశ్వనాథం

పాపం! ఆ పితంతువుకి ఇరవైరెండేళ్ల రామం ఒక్కడే కొడుకు. చదువూ సంధ్యా చెప్పించడానికిగాని, పెళ్లీ పేరంటం జరపడానికిగానీ ఏమీ ఆస్కారం కనపడదు. ఏకోశాన్నీ 'నా' అనే దక్షత లేదు. ఇంకేం ధైర్యం! ఆమెకు తెలుసు, పూరాగా తెలుసును: కనీ పెంచుకున్న కొడుకుని కన్నుల పండువుగా దగ్గిరుంచుకోకుండా ఒక అయ్య చేతికొప్పగించి ఇల్లటముంచడం కానిపని అనీ, ఆత్మగౌరవానికీ కుటుంబ ప్రతిష్ఠకూ భంగకరమనీ, చూస్తూ చూస్తూ ఆలా వప్పచెప్పడం కటికివాళ్లుకూడా చేయలేని క్రూర కృత్యమనీ, ఇదీ ఓవిధమైన మాంసవిక్రయమేననీ అనుకుంది. అయితేమట్టుకి? - ఒక యింటివాడయితే చదువు సాగుతుంది, నాగరికంగా నలుగురలోనూ మసలుతాడు, మిద్దెలూ మేడల్లోనూ విహరిస్తాడు, వాడి బ్రతుకు వాడు బ్రతుకుతాడు అనే సంకల్పంతో-ఆ కుటుంబానికి ఒక్కగానొక్క పిల్ల అయిన లలితకు ఇచ్చి ముడెట్టించింది. లలితకు పదిహేనో ఏడు, గొప్పయింటి పిల్ల.

అక్కడికి బాగా బిగిసి పద్దెనిమిదికోసులకు పైగా ఉంటుంది అగ్రహారం. రామం తల్లికి అక్కడ చిన్నతోటముక్క ఉన్నది. పూర్వపు వార్షికాలూ అవీ అయిదారుపుట్ల గింజలకి లోటులేకుండా వస్తవి. ఏదో ఆవిడ తనువు తెల్లారేటందుకు సరిపడా పరమేశ్వరుడింత కలగజేశాడు. అంచేత అక్కడనే కాలక్షేపం. అదీగాక ఏనాడయితే పెళ్లయిందో, రామం-అత్తారి కుటుంబానికే చెందిపోయేడుగా! మొదటినించీ మామగారు రామానికి చెయ్యితడిపి చేస్తూండేవాడు, కర్చుపెట్టుకోమని. కాని తల్లియందుండే భక్తిచేత తను ఇబ్బందిపడికూడా సొమ్ము ఆవిడికి పంపేస్తూండేవాడు రామం.

రామానికి బి. యే. అయింది, ఇంకా ఉద్యోగమేమీ లేదు. ఘరానా తక్కువని చెప్పి చిన్న చిన్న నవుకరీ లేవీ వద్దనేవాడు మామగారు. సరే ఉద్యోగంమాటచూచుకోవచ్చు, ఇప్పుడంత తలమునుకలేదు గదా అని ఊరుకున్నాడు రామం. ముసలి తల్లిదగ్గిరకి తనూ, భార్యా వెళ్తే ఆవిడ సంతోషిస్తుందనీ, సంతోషించి చల్లని దీవన లిస్తుందనీ, తనను నవమాసములూ మోసి కనిపెంచిన మాతృణము కొంత తీరుతుందనీ, కుటుంబంపేరు నిలబడుతుందనీ ఆశించాడు. ఆశించాడు కానీ!—పెదవి మెదపడానికి వీలుందా, అడుగు కదపడానికి హక్కుందా; మామగారి ఆజ్ఞ లేందీను? అయినా నోరుతెరిచి అడిగినాడు రామం. అడిగేటప్పటికి 'ఏమిటీ వెర్రి వెర్రి

వేషాలూ పిచ్చిపిచ్చి ఆలోచనలూనూ?' అని గదమాయించినాడు మామగారు.

తండ్రి మాట దొరకపుచ్చుకుని లలిత కూడా మగడి ఆలోచనకి కినిసిందని వేరే చెప్పాలా? రాత్రి. దివ్యభవనంలో పడకగది ప్రవేశించినాడు రామం. భార్య ఇంకా రాలేదు. మృదుతల్పంతో అమర్చిన కుర్చీలో కూలబడ్డాడు. వేలూ లక్షలూ ఆలోచనలు వెళ్లిపోతున్నవి. ఏమిటేమిటో! లలితవచ్చింది. ఎంతో సుకుమారంగా పెరగడంచేత, సిరి సంపదలలో తులతూగడంవల్ల, మహావైభవంలో మునిగితేలుతూంపడడంవల్ల, కాలు క్రిందపెట్ట నవసరంలేనందున కష్టసుఖాలు ఒంటబట్టకనూ, లలితమతం మారలేదు,- మునుపటి మంకుతనం పెంకిమాటలూ వదలేదు 'కోరిందల్లా ఇస్తూంటే ఏం తక్కువని ఈ యేడుపు?'-ఇదే లలిత ఉద్దేశం. మనస్సులో అత డెంత కుందుతున్నాడో, ఎందుచేతనో, ఆబాధ ఆపిల్లకేం తెలుస్తుంది!

భర్తసంకల్పం లలిత చెవుల బడింది. ఏగూటి చిలక్కి ఆగూటిపలుకే కదా! తలిదండ్రులచాయనే నడవడంచేత లలిత జిజ్ఞాసలో పడింది. 'ఈ సౌఖ్యమూ, సౌభాగ్యమూ వదులుకొని ఎక్కడో అడివిలో పూరికొంపకి పోవడమేమిటీ?' అని. దిగులుతో మొహం కిందికి దించుకుని, చేతులు ముడుచుకుని కూచున్న మొగుణ్ణి చూడ్డంతోటే లలితకి ఒళ్లు మండుకొచ్చింది. కాని పరధ్యానంలో ఉన్న అతనికి లలిత వచ్చినట్టే తెలియదు.

డబ్బు లేనికారణంచేత రామం అత్తవారికి దఖలుపడ్డాడు. వారు యజమానులు, అతడు బానిస, అంటే మనిషి కాడు. వారు ముక్కుకి తాడు కట్టి ఈడిస్తే ఆ జాడంబటే నడవాలి. అతనికి వ్యక్తిత్వం లేదు. అసలు కుటుంబంపేరే లేదు. ఫలానివారి అల్లుడు, లేదా ఫలానా లలితాంబగారి మొగుడుఅనే ఈలోకంలో అతనినామరూపాలు చెలామణీ. ఇలాటి సందర్భంలో స్వతంత్రాలోచనకిగాని, స్వేచ్ఛావర్తనానికిగాని వీలేదీ?

ఒక్కగా నొక్కకూతురే అగుటచేత, తలిదండ్రుల ప్రేమంతా పిల్లమీదనే ఘనీభవించింది. పిల్ల ఎప్పుడూ వారి కళ్లెదట ఉండాలి. ఒక్క నిమిషం విడిచిపెట్టి ఉండడం దుస్సహం. వారు పెట్టిపుట్టినారు, సిరిపట్టినది. హిందూ సాంప్రదాయములు ధిక్కరించైనా సరే, అమ్మాయికి ఒక అల్లుడిని కుదిర్చి, వాడినే తమ ఇంటికి కాపరానికి రప్పించా లనుకున్నారు. ధనికుల మాటకి తిరుగుందా? వెండిచెప్పు చేత పుచ్చుకుంటే కొండమీది కోతి దిగివస్తుంది. 'డబ్బుతో ఏపని సాధించలేము? మన ఐశ్వర్యం చూచి ఎవరు లొంగరు?' అనుకున్నారు. అనుకున్న ప్రకారం వారి అధీనంలో వారి సమక్షమందు ఉండి పొయ్యే వరతుకి ఒడబడి, వారి అమ్మాయికి రామం ఎరమైనాడు!

లలితాంబను అస్తమానం లాలిస్తూ, రంజింపజేస్తూ ఆమెఅభిమానం చూరగొన వలె. ఏ క్షణంలో అత్తుకుని తిరగలేకపోయి నా, తన అసమర్థతకు శిక్షించే పైఅధి కారులు అస్తమామలు.

లలితనూ, లలిత తల్లిదండ్రులనూ, ఇంకా ఇంకా సంబంధీకులనూ మంచిమాటచేసుకొని వా రంకరికీ అనుగుణ్యంగా వంగి తిరిగి సరి పుచ్చుకోవలసిన బాధ్యత రామా నిది. తలిదండ్రులు క్షుణ్ణంగా నూరి పోసిన ఈ సూత్రం కోమలంలో ఉన్న లలితకు నాళనాళాలకీ ఎక్కెసింది.

పతిపక్కకి వెళ్లింది లలిత. విసుక్కుంది. "ఇలా ఈదురోమంటూ కూచున్నారేం? నా ప్రయాణాన్ని గురించేనా యేమి టీవిచారం?

రామం—అదీ ఒకకారణమే.

లలిత — ఎందుకండీ నీకూ నిప్పూపుట్టని ఆ అధ్వాన్న పు అడవిలోకి? అక్కడేం పైపులా, లైట్లూ, సినీమాలా ఏమన్నానా?

రామం—ఎందుకా? మా అమ్మ దగ్గిరికి. ఈ అయిదేళ్లాయె ఒక్కమాటయినా అమ్మ నిన్ను చూసిందా? కొడుకునీకోడల్నీ కళ్లారా చూసుకుందామని ఉండ దూ ముసలిఘుటానికి?

లలిత—ఇక్కడకి రాకూడదూ ఆవిడ గారు? ఇక్కడి కొచ్చి ఉండిపొమ్మని ఎన్ని సార్లు చెప్పాడు నాన్న! పల్లెటూరివాళ్లకి ఎంత చెప్పినా నెత్తికెక్కదు.



"ఇలా ఈదురోమంటూ కూచున్నారేం? నా ప్రయాణాన్ని ..."

రామం—నాతల్లి ఇక్కడికి రావాలి? నువ్వు అక్కడికి వెళ్లరాదూ?

లలిత—ఏమిటండీ వింతగా అడుగుతున్నారు! మీబతుకూమీభాగ్యంఎరగమూ! నేను చూస్తే పువ్వులాగ పెరిగిన పిల్లని. పూటకి గతిలేందీ నన్ను రమ్మని పీకుతారెందుకూ? మీదరిద్రం నాకూ అంటుకోవాలనా?

రామం—సంబంధం ఉండబట్టి అంటుకుంటే అంటుకోనూవచ్చు. దానికేంలే. ఆవిడ తల్లి, నేను కొడుకునిన్నీ. ఈ వృద్ధాప్యంలో మన్వంతరం గడపి, నాచేతులమీదుగా పిడికెడుబుగ్గి చెయ్యడం విధి. అంచేత ఇద్దరమూ వెళ్లి ఉందాం రా. లోకరివాజుగా ఉంటుంది, ఇహం పరం కూడాను. రానంటావా, నేను మట్టుకి వెళ్లకతీరదు.

లలిత—ఊహూఁ! అయితే ఓవారం రోజు లుంటారా యేం?

రామం—వారమేమిటి? నాతల్లి జీవితకాలం అక్కడే ఉండాలి. అందుకనే ఉభయులమూ వెళదామంటున్నాను.

లలిత—నేను రాను. మీరయినా, వెళ్లి వారంలోపలే తిరిగి రావాలి, వచ్చితీరాలి. నన్నట్టే విసిగించకండి.

రామం—బాగానే ఉంది. నువ్వు రానూ రావా? నన్నూ వెళ్లనియ్యవా? వస్తేరా, లేకుంటే నీయిష్టం, నేమాత్రం వెళ్లడం నిశ్చయం.

లలిత—గట్టిగా బుకాయిస్తున్నారేమిటి? మీ అమ్మ మిమ్మల్ని మాకమ్ముకున్నప్పుడు ఈపరతు లేమీలేవే? గుడ్డిగవ్వకి గతిలేక, గర్భదరిద్రంచేత మీతల్లి మిమ్మల్ని నా కప్పగించింది. మీ ప్రాసెత్తడానికి ఆవిడికి అధికారం లేదు. మీకూ ఆవిడకీ అసలు సంబంధమే లేదు. మీరు నా సొమ్ము, నా అధీనం. తెలిసిందా? మానాన్నగారు సంచులు కోసి కుమ్మరించి మీకు చదువు చెప్పించిం దెందుకు? చీటికీ మాటికీ మీయెదాన్న డబ్బు కొడుతూండడ మెందుకనుకున్నారు? తినగా తినగా మాసొమ్ము మీకు విష మైపోతూందికాబోలూ!

ఈగర్జనారావం రామంచెవులికి తుపానులాగ సోకి చకితు డైపోయి, మరినో రెత్తలేదు. చెంపలవెంట బొటబొట నీళ్లు కారినవి. చేతులు రెండూ జోడించినట్టుగా ఒకటయినవి. అవును, అత్తవారి పరతులకు ఒడబడి అమ్ముడైపోవుట నిజమే. ధనమోహములకు మునిసిపోయి వారు పన్నిన ఉరికి గురి అయినాడు. వారిసొమ్ము తిన్నందుకు, ఋణపడియున్నందుకు లలిత నిరంకుశాధికారం చెలాయించినా, అగ్గికణాలు రాల్చినా కిం మ్మనకుండా పడవలసిందే, పడ్డాడు; దులిపి దుమ్మెత్తిపోసినా, ఛరిగేసినా మాటాడకుండా పడ్డాడు. కాని - ఇప్పు డతణ్ణి వేచి, వేధిస్తున్న పెద్దసమస్య ఇది: అమ్ముకున్నది భౌతికదేహమేనా? సూక్ష్మశరీరంకూడానా? ఈధర్మసందేహంలో పడి ముందుకథ ఆలోచించుకుంటున్నాడు రామం.

వయస్సుకి చిన్నయినా ఇంతటి బి.ఏ. నీ నోరు కట్టించితిని గదా అని లలిత తన ప్రజ్ఞకి తన్మయం పొందింది. పరుపుమీదపడి దొర్లుతూ "ఈ బూల్లి బూల్లి ఏడుపు ఎందుకో! ఏమన్నారనీ!" అంటూ గొణిగింది. గొణుగుతూనే గుర్రెట్టి నిద్దరోయింది.

తెల్లవారి చూసేటప్పటికి పక్కని రామం లేడు. దుప్పుకలవచ్చి, ఆకలితో తెలివొచ్చింది లలితకి. హృదయంలో ఒక మోస్తరు ఆవేదన బయల్దేరింది. భర్తని తిట్టి, తిరస్కరించి, తూలనాడిన సంగతి తలపుకి వచ్చింది. గది నలుమూలలా రామంకోసం వెతికింది, కనబడలే. ఏమీ తోచక పెద్ద కేకపెట్టింది. కేక విని ఇంట్లో అందరూ గబగబ పరుగెత్తుకొచ్చారు. సంగతి తెలిసింది. రామం ఎక్కడున్నాడోనని గదులన్నీ గాలించారు. కాని కార్యం లేకపోయింది.

చివరికి పారావాడి నడిగితే, వాడిలా అన్నాడు-"బాబు, ఓరేత్తిరివేళ లేచి ఎక్కడికో వెళ్లారండి. తోడొస్తానంటే అక్కర్లేదన్నారండి. అమ్మాయిగారి కియ్యమని ఇదుగో చీటీ యిచ్చారండి; 'ఒరే అప్పుడూ! పూటకు గతిలేనివాడినిరా. ఇలాంటి భవనంలో ఉండడానికి తగనురా. ఈ కలిమికోసమని కన్నతల్లినీ వొదుల్కోలేనురా' అంటూ మరి నూపులేదండి."

వాడితూపుల్లాటి ఈ వాక్యాలు లలిత హృదయాన్ని దూసుకుపోయి, చెప్పుదెబ్బ కొట్టినట్టయింది. మనస్సుకి ఒక విధమైన వింత పరివర్తనం కల్గింది. తన జీవితంలో ఒకకొత్త పాఠాని కివి తొలిపలుకు లయినవి. మగడూ, మగడిమంచితనమూ, తనపైని అతడు చూపు తూండిన మక్కువ, అన్నీ ఒక్కొక్కటే నెమరుకి వచ్చాయి. అతడు ఎదుట నున్నన్నాళ్లూ అతనివిలువ తెలియలేదు లలితకి.

కన్ను తెరిచి మంచిచెడ్డలాలోచించింది; తనమీద నుండే గారంచేత తలిదండ్రులు వక్రమార్గ మవలంబించినట్టూ, ధనమే సాధనంగా అమాయకపు రామాన్ని - వెర్రి రామాన్ని-వలలో వేసుకుని ఈ భవనమనే కత్తెరబోనులో బంధించినట్టూ, తమ సొమ్ము తినడంచేత నీతికి కట్టుబడి నోరెత్తలేక తన భర్త తప్పనిసరిగా ఇంతవరకూ ఉండిపోయి నట్టూ గ్రహించింది.

"నాకూ నాతలిదండ్రులకూ పరస్పరమూ ఎంత అనురాగ అభిమానము లున్నవో, అలాగే పాపం! ఆ తల్లీ కొడుకులికీ కూడ ఉండవూ? వాళ్లూ మాలాటి మనుష్యులేనే! ప్రాణులు కారే! డబ్బులేదన్న ఒక్కలోపం చేత రామం నా ఇంట చేరితే, అతన్ని జడపదార్థంగా, ఆటవస్తువుగా చూచాను; మా పశువులు మేసి పాలిస్తున్నట్టే అతడు మా యింట మస్తుగా తిని, నాకు చాకిరీచేస్తూ, శయ్యాసుఖమిచ్చే యంత్రమేమో ననుకున్నాను. పెళ్లినాటినించీ మా అమ్మా నాన్నా మప్పిన పాఠ మిది. ఈ పాఠమే అనాలోచితంగా రాత్రి రామందగ్గిర ఏకరువు పెట్టాను, కొంపముంచుకున్నాను, కాపరానికి నీళ్లు పోసుకున్నాను."

"నా రామానికి ప్రాణం ఎంత విసిగి పోయిందో! ఓపట్టున తొందరపడే మనిషి కాడు. ఎంతో బుద్ధిమంతుడు. పాపం! అగ్గిలో పడ్డ మిడతలాగ ఒక్కవిధంగా వేగిపోయినాడు. నేనూ మానాన్నా పిల్లపేగులూడి వచ్చేటంత కుళ్లుమాట లాడాము. మరొకళ్లయితే పొడుచుకు చావ్వాలసిందే." ఈఆలోచనలతో లలితహృదయం కెర్లుకుపోయింది. లలితదృక్పథం మారింది-కథ అడ్డం తిరిగింది.

తనమీది ప్రేమచేత తల్లిదండ్రులు తల పెట్టిన వ్యాహం ధర్మవిరుద్ధం కనక ధిక్కరించకతప్పదు. రామం తల్లిని కనిపెట్టుకుని ఉ టానన పటంలో రాజబాట త్రొక్కినాడు. ప్రజలూ, పరమేశ్వరుడూ కూడా మెచ్చే ఆలోచన అది; కాబట్టి ఆమోదించితీరాలి. లలిత ఒక్కగా నొక్కకూతురైతే, రామం ఒక్కగా నొక్కకొడుకు కాడూ? ముద్దూ ముచ్చట, ప్రేమా అభిమానమూ అందరికీ ఒక్కటేగా! బీదా గొప్పా అనేది వ్యక్తులికి గాని గుణాలకి కాదే! సౌఖ్యంకోసం గౌరవం చంపుకుని గొప్పోరింట గులాం అయినాడు రామం. రుచి తెలిసినతరువాత సౌఖ్యం రోసి సలాంపెట్టి వెళ్లిపోయాడు.

ఇంకేందారి? - ఇంకెక్కడిరామం? —

ఈ జిజ్ఞాసతో తిన్నతిండి ఒంటబట్టక, కంటినిండ నిద్ద రెరక్క తల్లడిల్లిపోయింది లలిత. రోజురోజూ చింతతో చిక్కి సగమైంది. ఈవివేకం కల్గినతరి - మునుపటి కొంటిచేష్టలు, పెంకికబుర్లు, వెకిలినవ్వులు, నాటంత టవ్వే పోయినవి. పెద్దమనిషితరహా అలవడింది. సంసారమూ బాధ్యతా బోధపడింది - అన్నీ బాగానే ఉన్నవి. కాని రామం యేడీ? - 'ఒరే అప్పుడూ! ఈకలిమికోసమని కన్నతల్లిని వొదులుకోలేనురా' అని దీనంగా చెప్పకుని ఏడ్చిన రామం యేడీ? ఈమాటమట్టుకి లలితహృదయం మీద అచ్చుపడిపోయింది. కలలోకూడా మరచిపోలేకుంది. తలపుకి వచ్చినప్పుడల్లా గుండె చెరువై కుంచెడునీళ్లకి వలవలాయేడుస్తుంది. 'ఈ కలిమికోస మని కట్టుకున్న రామాన్ని వొదులుకోలే'నని నిశ్చయించుకుంది. కాని ఎవరితో చెప్పకోవడం? ఏం దారి? - ఇంకెక్కడి రామం ?-

రామం వెళ్లిపోయి ఇప్పటికి మూడేళ్లయింది. లలితకి బెంగల్లా ముదిరి రోగంలోకి దింపింది. రాగారాగా పెద్ద జ్వరం వచ్చేసింది. డాక్టర్లకి లొంగలేదు. ఇరవైయొక్క లంఖణాలు. సన్నిపాతం, పేలాపన. ఆపేలాపనలో 'అత్త యింకా బతికుంటే బాగుండు' నంటుంది ఒకమాటు. 'రామం, రామం, రామం, ఇంకేం రామం!' అంటూ నిట్టూర్పు విడుస్తుంది మరోతడవ. కాళ్లూపుకుని 'అగ్రహారం వచ్చేశామా?' అని ఆత్రంతో అడుగుతుంది. అంత జ్వరంలోనూ ఉలిక్కిపడి లేచి కూచుని "అలా అన్నానని ఏమీ అనుకోకండేం!"అని రెండుచేతులూ జోడిస్తుంది. "ఇంకేముంది? ఈ కలిమికోసం- ఈ దిక్కుమాలిన కలిమికోసమని-అయ్యో!

అయ్యో !!" అంటూ బోరున ఏడ్చేస్తుంది. ఆ వెంటనే - కంటినీళ్లు ఆరకుండానే - "నా రామాన్ని నే నెరగనూ !" అంటూ పకపక నవ్వేస్తుంది. ముక్కోటి దేవతలకి పేరు పేరునా మొక్కు దండాలెడుతుంది. ఆఖరికి అటూ ఇటూ అన్న స్థితికివచ్చింది.తలిదండ్రులకిదంతా ప్రళయభీకరంగా కన్పడింది. కాళ్లూ చేతులూ ఆడలేదు. 'పెళ్లిచెయ్యకుండా వున్నా తీరిపోను' అని మూలుక్కున్నారు.

'బాబూ!' అని కేకేశాడు టపా బంట్రోతు.

ఇంకా పథ్యంలేదు గాని,రొట్టీ - కాఫీ- పళ్లూ అవీ పుచ్చుకుంటూంది లలిత. లేచి మసలలేకపోయినా మంచంమీదే తనంత తను కూచుంటూంది. వచ్చిన ఉత్తరాలలో ఒక కవరు చింపి చూశాడు తండ్రి. "ఓహో అగ్రహారంనించా?" అని కోరచూపుచూస్తూ తల పంకించాడు.లలిత గభాలున లేచి తండ్రి చేతులో ఉత్తరం లాక్కుంది మోటగాను. అతడేమీ అనలేకపోయాడు, ఆ స్థితిలో.పడుకుని లోపలే చదువుకుంది. చిరునవ్వు నవ్వుకుంది. ఆనందబాష్పములు రాల్చింది. మళ్లీ ఇంకోసారి చదువుకుంది. ఉత్తరం కళ్ల నద్దుకుంది, తండ్రి కిచ్చేసింది.

"................................
మీ ఆశీర్వచనబలమున నాకు సబ్ రిజిస్ట్రారు ఉద్యోగమయినది. అత్తమసన్నీ దిలలో మునిగి తేలలేకపోయినా,సంసారపక్షంగా స్వతంత్రజీవనం సాగించుకో గల అనుకూలస్థితి ఏర్పడినది. ఇప్పుడయిన మీ అమ్మడిని ఇక్కడికి పంపుటకు వీలున్నదేమో తెలిసికొన నభిలషించుచున్నాను.........................."

లేఖసార మిది. ఈలేఖ లలితకి గాఢ జీమూతాంధకారంలో మెరుపులా గర్జించింది. శోషగొట్టిన ప్రాణికి నీళ్లు చల్లిన ట్టయింది. చివికిపోయిన లలితపాలిటి జీవామృత మయిన దీ ఉత్తరం.

లలిత జీవిత కథనము ఇంతిలా పరిణమించినా, తలిదండ్రుల మనస్సు మారలేదు. మునుపటి పిచ్చిమోహం వదల్లేదు. ఇప్పుడీ ఉత్తరమయినా వాళ్ల కొయ్యమతానికి విరుగుడుగా పని చెయ్యలేకపోయింది. "ఈ మాత్రం నవుకరీకోసం తల అమ్ముకుని దేశాలట్టి పోవడమేమిటి ? ఇక్కడికేవచ్చి ఉండిపో"మ్మని జవాబు రాదామని వాళ్లనుకుంటున్నారు. ఆ మాటలు విన్నది లలిత. లేని బలం తెచ్చిపెట్టుకుని లేచి కూచుంది.ఆవేశం వచ్చేసింది-"నా కాపరానికి నీళ్లేనా ?"అని కోపంతో అడిగింది."నిజంగా మీకు నామీద అభిమానంలేదు, వట్టి దురభిమానం!" అని నిర్భయంగా చెప్పింది. "అదే నన్నింతవరకూ తెచ్చి కొంప ముంచింది. ఇంకా కనికరం లేదా?" అని జాలిగా బతిమాలింది. "ఈకలిమికోసమని కట్టుకున్న భర్తనివొదులుకోలే"నని కంట నీరు పెట్టుకుంది. "నారామం నా ఎదుట కూచోవాలి. నా అత్తగారిచేతి పథ్యం పుచ్చుకోవాలి. లేకుంటే ఇలాగే మాడి

చచ్చిపోతా"నని ఖచ్చితంగా భీష్మించింది. చేసేది లేక వాళ్లు మతి మార్చుకున్నారు. అగ్రహారం మనిషిని కట్టారు.

* * *

చాలా లోతు ఆలోచన గలవాడు రామం. ఆలోచనకు తగ్గ ఓరిమీ ఉన్నది. ఓపనిలోగాని మాటలోగాని దుడుకుపడడు. అయితే, అత్తారింటిదగ్గిర వశం తప్పిపోవడం చేత ఆఖరిమెట్టుగా ఆలోచించి 'ఆరాత్రి' సెలవుపుచ్చుకున్నాడు. చివరివరకూ మృదువుగానే మెలుకువచ్చాడుగాని, ఎక్కడా మోటుతనం చూపలేదు. ఏకాయెకీని పట్టుదలతో వెళ్లిపోయాడు, అదృష్టం బాగుంది, రేఖ బయలుపడింది, పని దొరికింది, ఈ మూడేళ్లలోనూ ఆరువేలు వెనకేశాడు, ధైర్యం కల్గింది, మామగారికి ఉత్తరం వ్రాశాడు.

లలితమనస్సు బాగా ఎరుగును రామం. తూలనాడినా, కాళ్లదన్నినా, అదంతా అత్తమామల ప్రభావమనీ, నిజంగా లలిత హృదయం నిష్కలుషిత మైనదనీ, నేడు గాకుంటే రేపయినా లలితప్రవర్తన మారి చక్కబడే అవకాశ మున్నదనీ, అతనికి పూర్తిగా గ్రాహ్యమే. ఈ కారణంచేతనే 'ఆరాత్రి' లలిత అన్న మాటలకి చేయవలసినంత పట్టింపు చెయ్యలేదు.

మనిషి వచ్చిరావడంతోటే తల్లీ కొడుకూ బయల్దేరారు. ఈసారి రామం అత్తారింట్లో లోకాచారప్రకారం మూడు రోజులే ఉన్నాడు. నాలుగోరోజుని తల్లీ, కొడుకూ, కోడలూ బండి చేయించుకొని అగ్రహారం వెళ్లిపోయ్యారు.

తెల్లవారింది. ముగ్గురూ బండిదిగి ఒక పూరిల్లు ప్రవేశించారు. రెండుచిన్నగదులూ, వంటపంచా ఉన్నవి, అంతే. నవ్వుతూ గుమ్మంలో కాలెట్టింది లలిత. నవుకర్లూ, చౌకర్లూ ఎవళ్లూ లేరు.

"మరి నీకు నేనే కావలిస్తే ఇదే బాధ. ఈ గుడిసెలో ఉండాలి. వొళ్లువంచి వెట్టిచాకిరీ చేసుకోవాలి. ఈ అడివిలో నరసంచారముండదు. ఎవ్వళ్లూ పలకరు. చూసుకో మరి. ఈ అవస్థపడడమో, నాన్నగారి హావేలీకి ఉడాయించడమో!" అన్నాడు రామం మందహాసంతో.

ప్రత్యుత్తరంగా చిన్న చిరునవ్వు నవ్వి పూరుకుంది లలిత. ఇప్పుడు తన జీవితవిధానమే మార్చేసుకుంది. పుట్టింటి హావేలీఆడంబరంకంటె ఈ పూరింటి ప్రకృతిరామణీయకతలో ఉన్న రుచి తెలుసుకుంది. మేకలమందలాగు వందలాది నవుకర్లను అక్కడ అస్తమానం తోలుతూండే అధికారబలంకంటె ఇక్కడ అవలంబించిన 'స్వయంకృషి-స్వతంత్ర జీవనము'లోని సారం తెలిసి ఆనందించింది. ఆ ఉన్న కాస్త పెరడులోనే చిన్ని చేతులతో చినచిన్నమళ్లుకట్టి,కొత్తిమిరి,మెంతికూర-ఇలాంటి నిత్యావసరములు, పుష్పజాతులూ పెంచి, మహాసౌధముల కంటెనూ ఈపూరిల్లు కలకల్లాడేటట్టు చేసింది. భర్తసేవ,







AFGHAN SNOW
AFGHAN SNOW






అత్తగారిశుశ్రూష ఏమరకుండా చేసి, అత్యంత నైపుణితో గృహనిర్వాహకత్వం వహించింది. ఆదర్శప్రాయమైన హిందూగృహం నిలబెట్టి 'భూలోకస్వర్గ' మనిపించింది. ఇంటికే గాక గ్రామానికంతకూ వింతశోభ కూర్చింది. "అటూ ఇటూ కూడా ఏడుతరాలవాళ్లు తరించిపోతారు"రని ఆహ్లాదపడ్డారు. ప్రజలు లలితని ఆశీర్వదించారు, రామాన్ని అభినందించారు. అతని తల్లి భాగ్యానికి అందరూ అబ్బురపడ్డారు. ఇదంతా ఒక్క నెలలోపలి సంగతి.

ఒకనాడు షికారుకి పిలిచాడు రామం. ఇద్దరూ పిచ్చాపాటీ మాటాడుకుంటూ, ఊరిచివరకి వెళ్లిపోయారు. అదో తోట, ఆ అందం ఇలాటిదని చెప్పలేము. మరో ఫర్లాంగులో అప్పుడే తయారయిన అద్భుతమైన బంగళా. "ఇదెవరిల్లు?" అని అడుగుతూ వెనక్కి తగ్గింది లలిత. "చెప్తా ర"మ్మని చెయ్యిపట్టుకుని తీసుకెళ్లాడు. అంతట్లో నలుగురు నవుకర్లొచ్చి దండాలు పెట్టారు. ముందిద్దరూ, వెనక ఇద్దరూ బంట్రోతులు చేతులు కట్టుకుని నడుస్తూంటే ఆ జోడీ - రాజూ, రాణీ అన్నట్టున్నారు! బంగళాకు పైపులున్నాయి, మెరుపులైట్లున్నాయి, ఇంకా ఇంకా ఏమేమిటో కనీ వినీ ఎరగని చిత్రాలు తమాషాలున్నా! బంగళా అంతా చూడ్డమయింది. చివరికి పడకగదికొచ్చారు. పటాలన్నీ పరికించింది లలిత. "ఈ కొత్త రకాలు నేనెప్పుడూ చూడలే" దంది. వచ్చి వచ్చి ఒకపటం చూచి ఆశ్చర్యచకితయ్యై పోయింది. అది తమ ఫోటో. 'ఆరాత్రి' - అంటే మూడేళ్లక్రిందట రామం అత్తారింటికి సలాం పెట్టిన ఆరాత్రి - నాటి లలితా రాముల ఫోటో. లలితనిచూచి రామం నవ్వినాడు. లలితకి ఏమేమో జ్ఞాపకం వచ్చాయి.



"వచ్చివచ్చి ఒకపటం చూచి ఆశ్చర్యచకితయ్యై..."

ఆమెని దగ్గర చేరదీసుకున్నాడు రామం. లలితారాముల భౌతిక కాయములతోపాటు ఆత్మలుకూడా ఐక్య మైపోయినవి!

బంగళా గేటుకి ఒక వేపు 'వి. రామారావు, బి.ఏ., సబ్ రెజిస్ట్రార్' అనీ, రెండో వైపున 'లలితా విలాస్' అనీ నల్లఫలకముల మీద బంగరురంగు అక్షరాలు చెక్కబడి ఉన్నవి. లలితమీద రామానికి ప్రేమ లేదంటారా ?



# బుడబుక్కల జోస్యం

## ఉన్నవ లక్ష్మీనారాయణ

(శ్రీ శారదా నికేతన వార్షికోత్సవములో ప్రదర్శింపబడినది.)

అంభాపలుకు, జగదంభాపలుకు, ఆదిశక్తీ పలుకు, ఓంకారీ పలుకు, మళయాళమహేశ్వరీ పలుకు, నానాలుకయందు రణభేరీ పలుకు నకులకోలాహలీ పలుకు నేనున్నానని.

తమహృదయములో ఒక్క రాయభార ముండది దేవరో. అదియేమి రాయభారమని అడుగుధరు గెనండి రాజా? చేవుకొని పండు పండినట్లు చెంగల్వపూసినట్లు సభలముగా ఒక్కపంత ముండది దేవరో.

రామరామనా రామన్నా
రామరామనా రామన్నా

బృహస్పతిగాము వుండదిబాబు
మూడులోకముల ముచ్చటలన్నీ
ముంజేతిలో వొల్చిపెడతది
జోగలో మంచిపేరు పడతవు
బలేధాతవు వుండవురాజా. రామ

ప్రశ్న—
నీవుజెప్పే నందేశమేమిటి?

రాయభారమే ఉండదిరాజా
దేశాన్నంతా ముంచకపొయ్యే
ఆపద మన కాసన్నమయినది
కాఱుమబ్బులు కమ్ముతుండవి
కనుగలిగీ వర్ధించు రాజా
తిల్లిక మలిగిపోతే నీవు
దేబిరించిన లాభము లేదో
కనివెల్తురు వుండంగానే
తట్టబుట్ట సవిరించుబాబూ. రామ

వేదశాస్త్రములు వెలిసినరాజ్యం
యజ్ఞయాగములు వెలిగిన రాజ్యం
రామకృష్ణులు పుట్టినరాజ్యం
ధర్మరాజులు ఏలినరాజ్యం
సొంత ధర్మములు సన్నగిల్లుతవి
పరధర్మాలే బలిసిపోతవి
పరమతముల్లో గలిసిపోతరు
అన్నెమతములు ఆవరించుతవి
అన్నివైపుల అల్లుకుంటవి
చుట్టూతల చుట్టేస్తవి
మంటలు చుట్టూ ముట్టుకుంటవి. రామ

ప్రశ్న—మనకేమి నష్టము ?
హిందువులంతా తగ్గిపోతరు
పరమతముల్లో కలిసిపోతరు
అన్నెదేవతల కొలుపులు చేస్తరు
తురకవురుసులకు ఈళ్లేపోతరు
క్రీస్తుబొమ్మలు పీళ్లెపెడతరు
పీర్లపండగలు వీళ్లవేరాజా
అన్నిదేవతలకు వీళ్లెమొక్కుతరు
హిందువులంతా వెఱ్ఱిమూకలు రామ

అంతటితో పోయిందా బాబు
మనలో మనకే పోరుపులు బాబూ
మనవాండ్లంటె మనకేగిట్టదు
అందువల్లనె అలుచయిపోతము. రామ

ప్రశ్న—
అలుచయితే ఏమినష్టము?
మన దేవుళ్లను కొలువనియ్యరు
వూరేగింపుల కష్టం బెడతరు
గుళ్లో హారతు లెత్తనియ్యరు
ఇంట్లో మేళము చెయ్యనియ్యరు
బయట పల్లకీ లెత్తనియ్యరు
జెండాలంటూ చర్చీలంటూ
మసీదులంటూ మఠాలంటూ
గోమాతలనే గొంతులుగోస్తరు
తల్లిగోవుల నె తలలు నరుకుతరు
ఆఁ ఊఁ అంటె నోరు నొక్కుతరు
అదేమంటే అంతేనంటరు
ఏమాటన్నా ఏకమవుతరు
కూడదనంటె కొడతామంటరు
తగునా అంటె తంతామంటరు
కొట్లుకొంపలు కొల్లగొడతరు
ఆడలమర్యాదన లేదక్కడు
ఎక్కడిపాపమొ ఏమిఘోరమొ. రామ

ప్రశ్న—మనమేకంకాగూడదా?
ఎట్లాగేకం అవుతంబాబు?
ఎవరికి వారే యమునాతీరే
తలకోదారి పుర్రెకో బుద్ధి
పట్లోకాగరు కోట్లోకాకరు

కమ్మొకటంటె కాపొకటంటడు
ఏదీకాదని బాపడంటడు
కుక్కలుచింపిన ఇస్తరిబాబు
ఊత్తుమంటు ఎగిరిపోతరు. రామ

ప్రశ్న—
ఇప్పుడు మనకేమినష్ట మొచ్చింది?
ఏమినష్టమని మెల్లగడుగుతవు.
కాళ్లకట్టకొచ్చింది బాబు
గుటగుటమంటూవుండదరాజ
పాంచాలము పరమతమైనది
కాశ్మీరము గంగగలిసినది
వంగదేశము భంగమైనది
సింధుదేశము సింధుగలిసినది
మదరాసంతా బైబిల్మయము
పేరుగన్నది గుంటూరుమండలము
ఫిరంగిపురములో ఎవరుండారు?
పాకీబండ్లగతి వారజూచితే
గుండెలు దడదడ కొట్టుకొంటవి
పల్నాడంతా పరవంజింది
తిరునల్వేలి తిరువాన్కూరు
పరమతములకు పట్టుగొమ్మలు
మాలపల్లెలు మాదిగపల్లెలు
ఎరుకులవాండ్లు, ఏనాదూలు
కాపులుకమ్మలు కలుస్తుండరు
అలగాలంతా కలిసిపోయిరి
ఇంకామనకే ముండదిబాబు
చిట్టచివరకొస్తుండదరాజా

ప్రశ్న—

మిగిలినవాండ్లు చాలరాయేమిటి?

ఎవరుమనకుమిగి లుంటరుబాబు
కాళ్లుచేతులు పోయినవిబాబు
పొట్టిమొండెమే మిగిలివుంటకీ
పనికిమాలిన సోమరిపోతులు
ప్రాణములేని బొమ్మల్లుంటరు
బొజ్జలుపెరిగిన కోమట్లుంటరు
భోగలాలసులు-భూస్వాములు
బోనకడుపులోళ్ ఊచపిట్టలోళ్
ఎండిపోయిన ఎదురుబొమ్ములోళ్
కండలులేని కట్టెబొమ్మలు
తోళ్లుగప్పిన బొమికెలపోగులు
ఉఫ్ఫునఊదతే గాలికిబోయ్యే
చెత్తచెదారము మిగులుతదండి
కత్తిజూపితే వణికిపోతరు
తుక్కుదుడుసుమన కెందుకుబాబు?
గట్టిగుండెలోళ్ చక్కబలములోళ్
కండలుపెరిగిన దండలుగలవోళ్
ఛాతీల్ బెరిగిన వీరబంటులు
ధైర్యసాహసములు గలవాళ్లంతా
పరమతముల పాలైనారండి. రామ

ప్రశ్న—

పైకులాలవాండ్లంతా పనికిమాలిన
వాండ్లంటావా?

అంతదాక మనకెందుకుబాబు
నిన్నమొన్ననే జరిగిందంట
కఱకు తుఱకలు కట్టలుబట్టి
యిండ్లమీదికే యెగబడివస్తే
కోహాట్లో యేమైనదరాజా!
గుల్బర్గాలో యేమిజరిగెను?
ముల్తాన్ హిందువులేమైనారు?
కొవ్వాలిరైతుల గతియేమైనది?
బిడ్డలపెండ్లా లెందరొవదలి
పెట్టెలుబేడలు మేడలుమిద్దెలు
ధనధాన్యాలు అన్నీవదలి
బ్రాహ్మణులందరు పారిపోయిరి
బి. ఏ., లెమ్మెల్తోకముడిచిరి
కోమట్లందరు కొంపలువదలి
పరుగో, పరుగో, పరుగో, యనిరి
బొజ్జలుపెరిగిన రైతులందరు
పెండ్లాంబిడ్డల యిండ్లలోవదలి
పొలములలో దాక్కుండిరిబాబు
అటుతరువాతేమైనదిరాజా?
ధనధాన్యంబుల కొల్లగొట్టిరి
కొంపలుకొట్లు తగులబెట్టిరి
గుళ్లుగోపురాల్ కూలదోసిరి
చెప్పకుంటిమా సిగ్గులచేటు
స్త్రీలనుబట్టి చెఱిచిరిబాబు. రామ

ప్రశ్న—

ముందు ఏమిజరుగుతుందంటావ్?

ఏమిజరుగుతదో యెరుగనబాబు?
అఱచేయి చూచుట కద్దమెందుకు?
వేదశాస్త్రములు వెలయించిన దేశం
యజ్ఞయాగములు చేసిన దేశం
కర్మయోగము కాసిన దేశం

భక్తియోగము పండిన దేశం
రామకృష్ణు లవతారము లెత్తి
పోషణ జేసిన పుణ్యదేశము
నాస్తికమతములు ప్రబలముయితే
నాశనమైపోతుందిబాబు. రామ

ప్రశ్న—
మఱిప్పుడు మార్గమేమిటి ?

మార్గమొక్కటే వున్నది బాబు
అందఱికొక్కటె రాజమార్గము
ముసుగులుదన్ని గుఱ్ఱుపెట్టితే
దేశమంతయు దొద్దశోతది
కండ్లువిప్పి చూడండిబాబు
గుడ్డిచూపులు చూడకుబాబు
దూరపుచూపు తెచ్చుకొబాబు
లోకమంతయు మేలుకొన్నది
జ్ఞానమొ, జ్ఞానమొ, జ్ఞానమొఅంటూ
అలివికప్పిన ఆకలిగొన్నది
చదువో, చదువో, చదువో అంటూ
దరిమాలిన దప్పికగొన్నది
అడ్డగోడలు ఆగివురాజా
కరుణాళువులై పూర్వయోగులు
లోకమంతకని జ్ఞానవర్షము
కుప్పతిప్పలుగ కురిసిరిరాజా
నడుంగ బ్రాహ్మలు అడ్డందగిలి
అంతా తమకే కావల్నంటరు
వేదశాస్త్రములు తమవేనంటరు
గుళ్లుగోపురాల్ తమకేనంటరు
తిప్పలు తీర్థాల్ తమసొమ్మంటరు
అందరినోళ్లా గడ్డలుగొట్టి
అంతానెత్తిన కట్టుకుంటారా?

అందఱు సమమని వేదంజెపితే
అందఱిలో మేమెక్కువంటరు
అన్నివిదువ్రమని వేదంజెపితే
అన్నీనాకే కావాల్నంటరు
చెట్లచెంతన తబుసులుమాని రామ
మేడలు మిద్దెలు నిలకడజేసుక
శ్వానవృత్తినే చేపట్టారు
ఎవరిధర్మము వారికెక్కువని
సమతాధర్మం వేదంజెపితే
తక్కువెక్కువలు తెచ్చిపెట్టినరు
ఇహపరములు రెండూచెరిపి
రెంటికిచెడ్డ రేవడలయిరి. రామ

ప్రశ్న—
అయితే చివర మాటేమిటో చెప్పు ?

చదివీ చదివీ చచ్చుపడకను
కర్మయోగులై కార్యశూరులై
తలుపులన్నియు భార్లాదీసి
లోకమంతకు ప్రాణముపోసే
లోకమంతకు జ్ఞానముచేపే
లోకమంతకు మోక్షమునిచ్చే
చెడనిమార్గమును చెప్పేటందుకు
గోబ్రాహ్మణులు కావాడెన్నా
మనమంతా లోకమిత్రమండలి
లోకముక్తికై పయనంగట్టి
చెట్టపట్టాల్ చేతులుపట్టి
కల్యాణమునకు కదలండన్నా. రామ

పక్షి చెప్పిన పలుకిదిరన్న
బ్రహ్మవాక్యమని తెలియరబాబు
ఎన్నటికీ యిదితప్పదురన్నా. రామ

# ‘లంఘనం పరమౌషధం’

## ‘కరుణకుమార’

"వంకాయలున్నై, పచ్చిమిరపకాయలున్నై, అరటిపళ్ళున్నై"

" అరటిపళ్ళెట్లా ఇస్తావు ?"

" అణాకు పదిస్తుండా నమ్మా."

" ఆ! బజారులో పదహారు వంతున దిబ్బలు దిబ్బలుగా ఇస్తుంటే."

" లేదమ్మా."

" మొన్న మేం తెప్పించుకో లేమా !"

" అవ్వేవో జబ్బురకం తల్లీ."

" నీవి మేలురకంగాబోలు, అన్నీ ఒకటేరకం."

" లేదు తల్లీ ! పొద్దున్నే తమతో బేరంఎందుకు, పదకొండుచేసి తీసుకో అమ్మా."

" పద్నాలుగుచేసి యిస్తే ఇయ్యి-లేకుంటే వెళ్లు"

" మే మేంతినేది తల్లీ ?"

" అన్నం—"

" మీ బోటిగొప్పవాళ్ళే ఇట్లా బేరంచేస్తే మాకు అన్నం ఎట్లావస్తుంది తల్లీ."

" ఊళ్లోవాళ్ళకందరికీ మేం అన్నం పెట్టలే మయ్యా! నీకిష్టమైతే ఇయ్యి—"

" నేనుకొన్నదే పన్నెండువంతునకొంటే నీకు పద్నాలుగెల్లా గిచ్చేది తల్లీ."

" నాకదంతా తెలియదు—"

" లేదమ్మా: పన్నెండుకాడికి కొన్నాను: అణాకు ఒక్కపండులాభం. తల్లీ నీకుగాబట్టి పదకొండుచేసి యిస్తుండా. దయుంచు."

" లేదు లేదు: పద్నాలుగుకు ఒక్కటితక్కువై నాకవసరంలేదు—'

" సరే: తల్లీ! నేకొన్నకాడికే యిస్తా: పన్నెండు చేసి తీసుకో—"

" అరి నీ పంతం పాడుగాను."

" లేదమ్మా: దణ్ణంపెడతా పొద్దున్నే నీకు. ఎప్పుడూవచ్చే ఇల్లుకదాఅని—పోనిట్టుకోలేక లాభం లేకపోయినా యిస్తుండా—తీసుకో అమ్మా."

" అణావిక్కు-ఓ అర్ధణాపళ్లుచాలు-"

" అయ్యో తల్లీ: ఓ అణావి ఉంచుకో అమ్మా. మళ్ళా నేను నాలుగు రోజులుదాకా రాను"

" మాఇంట్లో తినేవారే లేరు; ఖర్చుకావు."

" అర్ధణాపళ్లు ఎన్నాళ్ళుంటాయి తల్లీ—"

" అర్ధణాకయితే ఇవ్వవావిమిటి చెప్పు—నాకు పొద్దెక్కుతోంది-నీతో కూర్చోలేను—"

" సరే: తీసుకోతల్లీ-నీచలవఉంటే అంతేచాల్లే."

" మంచి వియ్యావోయ్."

" నీ కాడనే దాచుకొంటానా తల్లీ."

" చూడు. ఆకాయ డాగుపడింది"

" డాగు కాదమ్మా: పైతొక్కకొంచెం-"

" కుళ్లిందేమో ?"

" కుళ్లితే నాకు డబ్బులివ్వబోకండి: చెడిపోయినసరుకు అమ్ముకొని, నే నెంతకాలం బతికి ఉండాలమ్మా-ఈలోకంలో-"

" కాయలు గట్టిగాఉన్నాయి ఏమిటోయ్."

" లేదు తల్లీ: భోంచేసుకొని మరీ డబ్బులియ్యండమ్మా నాకు. ఇప్పుడు తొందరలేదు."

"....................."

" వంకాయ లక్కరలే తల్లీ"

" ఎందుకు పాడువంకాయలు, తినితిని మొఖం కొట్టింది."

" చిన్న పూసలానుండాయి తల్లీ : ఇవ్వేళే కోసుకొచ్చను.

" ఓ వీశకాయలు తూచుతా."

" ఎందుకు ? నీకొక్కడా అమ్ముడుపోలేదా ఏమిటి?"

" అరవీశ వేసేదా ? "

" అసలు ఎట్లా ఇస్తున్నావు!"

" నీ యిష్టంకాకిక మీరిపోనులే తల్లీ."

" నిన్న వీశ అర్ధణాకి తీసుకో అని తోటపల్లి గొల్లది కాళ్ళమీద పడేసింది-ఖర్చు కావని వద్దన్నా."

" అమ్మో : తల్లీ: అన్నిటికి ఇట్లా బేరంచేస్తే మాకు ఈ ఎండలో తిరిగిన కూలయినా గిట్టవక్కర లేదా తల్లీ. ఈకాయ లట్లాంటివికావు, : ణాచేసి యిస్తుండా. ఓ అరవీశతూస్తా.

" అణానా ? సడేలే. పొద్దున్నే జ్వరం బాగానేవుంది—"

" వీశకు చిన్నడబ్బుంటేచాలు తల్లీ ? నాలుగు వీశలుతెచ్చాను. ఒక్క అణాడబ్బులు వంకాయల్లో మిగిలితే చాలనుకొని తెచ్చా. నాకెమైనా స్వంతతోటలుండాయా తల్లీ! మారాజులు మీరు. మావంటివాళ్లని పూటకి పదిమందిని పోషించగల మారాజులు. మీరే ఇట్టా బేరంచేస్తే మేంబతికేది ఎట్లా తల్లీ ? "

" సరేలెద్దూ. నీకులకేమి ? అర్ధణాకిచ్చేటట్టయితే ఓ అరవీశఇచ్చిపో. లేకుంటే నీదారిన నీవుపయి చెయ్యి— "

" సరే. నీఇష్టమేకానియ్యమ్మా: ముక్కాని చేసుకొని తీసుకో: ఓ వీశఇమ్మంటావా "

" ఎందుకూ ! వీశా: అరవీశాను: సంతర్పణం చేయమంటావా ఏమిటి ? ఓవీబులంతూచు— "

" ఏబులం ఎట్లాగమ్మ ? లెక్కసరిపడదే: ఏబులం చిన్నడబ్బుకాడికి తీసుకో— "

" సరేలే ఏబులానికో బేరం, వీశకో బేరమూనా. నీదంతా ఎగతాళిగావుందే— "

" వీశ ముక్కానయితే ఏబులం ఎట్లామ్మ గిట్టేది. రెండు దమ్మిడీలను కొంచెంఎక్కుందే—"

" నీవీను పుమండిపోనూ. ఏబులానికి ఇంకా నాలుగుకాయలు అదనంగావేసి చిన్నడబ్బుతీసుకొని పోరా. ప్రాణాలు కొరికేస్తున్నావు "

" అమ్మో మాలక్ష్మి: నీకు దణ్ణం పెట్టుకోనాలమ్మ. సరే తీసుకోఅమ్మ "

" నీకు అరటిపళ్లకూ, వంకాయలకూ ముక్కాని ఇవ్వాలి "

" పొద్దున్నే బోణీచేస్తే నీచేతిచలవ చల్లంగా ఉంటుందమ్మ "

" ఇప్పుడు చెయ్యితీరలేదురా. ఇంటికిపోయ్యి ఎప్పుడురా"

" సరేతల్లీ: పచ్చిమిరపకాయ లక్కరలేదా అమ్మ "

" పచ్చిమిరపకాయలూ వద్దూ, పండుమిరపకాయలూ వద్దూ— "

అరటిపళ్లూ వంకాయలూ ఒడిలోవేసుకొని సరళని వాకిట్లోనుంచి ఇంట్లోకిపోయింది. సూరలమ్మ - తట్టను నెత్తిమీదికెత్తేవాళ్లులేక - తనే కష్టం మీద నెత్తికెక్కించుకొని - అసలే అప్పళించుకొని వెన్నుకు అంటిపెట్టుకొనిఉన్న కడుపును చేతిబట్టుకొని వెనుకకు తనలోనికి లాగుతూఉండగా అడుగులు వేసుకొంటూ - " ముక్కానిబేరం: మూడుజాములయిందిగదా. పిల్ల ఎట్లాగబ్బా బతికించేది. ఇంటికాడ వోపలేనిమనిషి. కూడయినా వొండుకుందో లేదో " అని అనుకుంటూ నడవదిగి - బయటి ప్రాకారందాటి - వీధినబడి - " వంకాయలు, పచ్చిమిరపకాయలు - " అని అరుచుకొంటూ పూర్వజన్మంలో

పెట్టిపుట్టిన సంపన్న గృహస్థుల సౌధరాజములచే శోభించే బజారున బడిపోయినాడు.

౨

" అమ్మా కూర లేవీ అక్కరలే—"

" ఏం తెస్తావే ? "

" పొన్నగంటాకూ: దేవదారాకూ "

" దేవదారాకేమిటే ! "

" ఇట్లావచ్చి మాదిపోఅమ్మా: నెయ్యేసి వండు కొంటే కమ్మంగా ఉంటుంది. "

" దేవదారాకా ? ఏంచిత్రమే ! కాలంమారిన ద్దీ కూరలుకూడా మారుతున్నాయి కాబోలు—"

" దేవదారాకు తినలేదా తల్లీ: మావూరుకు తూర్పుతట్టు నల్లబోడుకుపోయి కోసుకొచ్చా. "

" ఈ కూర ఉడుకుతుందా? "

" అమ్మో! పొయ్యిమీద పెట్టేవరకు వెన్నము ద్దయిపోతుంది తల్లీ. తెల్లవారుజామున కోళ్లుకూసిన పుడు లేచిపోయి తెచ్చా. ఇయ్యాళ వొండిచూడు"

" ఏమండీ దేవదారాకట. కొనమంటారా? -కు కూరలంటే మీకిష్టమేగా "

"ఆకుకూర లేవితిన్నా విరేచనబంధం ఉండదు. తీసుకో. "

" ఈరాగిగింజలు పుచ్చుకొని కాస్త దేవదా రాకూ, కాస్త పొన్నగంటాకూ పెట్టవే, నాకు పొద్దె క్కింది. "

"........................"

" ఆ గింజలకిదేనా ఏమిటికూర. "

" నా బంగారుతల్లీ, ఎప్పుడొచ్చినా బేరం అ డందే తీసుకోదు. ఊ, తీసుకెళ్లు "

" అమ్మో, నీ చెయ్యి పడిపోనుగదే. చేతిలోకి ఏమైనా వచ్చిందటే "

" గింజలు ఊరికేనే ఒళ్లోపోసేవరకు- వీళ్లకేమీ లెఖలేకుండా ఉంది. దోసిటితో దోసెడుగింజలు తెచ్చి పోశాను దీని మొఖాన్ని. "

" లేదులే తల్లీ శానా పెట్టాను. "

" ఏమిటే ? ముష్టిపెట్టినట్టు పెట్టుతున్నావు. చాల్లే. నీకూర నీవుతీసుకొని నాగింజ లిట్లా నాకియ్యి "

" లేదులే అమ్మా. కోపం చేయబోకమ్మా "

" ఏం నడమంతర పాడుదానివే. నీదగ్గరే ఇంత శాణీతనం ఉంటే ఇక మాబోటివాళ్ల దగ్గ రెంత ఉం డాలో అనుకొంటూ. ఇందాకటినుంచి చూస్తూన్నా. వేస్తున్నట్టుగానే వట్టిచెయ్యినే దులుపుతుందిగాని చేతు లోకి ఆకేరాదు. దీనిశాణీతనం మండిపోను. "

" అబ్బబ్బ. మాఅమ్మ పొద్దస్తమానులూ కొసురు తూనే ఉంటుంది. కడుపుచల్లంగా ఉండా- దిక్కు లేనిముండ ఎట్లా బతకాలో అనేనా లేదు మా అమ్మకు. "

" నీ నవ్వు నిర్మాల్యంగానూ. ఎవ్వందుకే? "

" అమ్మా, తొడుక్కోను రవికలేదు. నీచెమ టకు మాసింది ఓపాతరవిక పారెయ్యమ్మా. నీకు రోజూ కరివేపాకు తెచ్చిపెడతా. అమ్మ అమ్మ "

" మీకు చీరెలూ, రవికెలూ సారిపంచిపెట్ట డానికి మాకేమీ జమీలు లేవు. "

" అమ్మ! అమ్మ! మొన్ననే ఓడ్డెముకన్నా. బాలింతరాలిని పీధినబడిపోవాలంటే సిగ్గవుతోంది. నీకు దణ్ణంపెడతా. ఒక్కపాతరవికె పారెయ్యమ్మా. చూడు, నీకు రోజూ కరివేపాకూ, పొన్నగంటాకూ తెచ్చి పెడతా తల్లీ. "

" ఇప్పుడు నాదగ్గర ఏమీ లేవే. నన్నాట్టే వాగిం చకు. "

" ఎన్నాళ్లనుంచి అడుగుతుందా తల్లీ "

" అడిగితే ఇక్కడ సిద్ధంగా ఉండొద్దూ "

" నీదయ తల్లీ. ఏంచేసేది. మమ్మల్నిట్టా పుట్టిం చినందు కనుకోవాలి. "

అని అనుకొంటూ ఆకుకూరల వ్యాపారంతో ఆర్జించి జీవించే ఆ ఆడపడుచు వెళ్లిపోయింది.

౩

"అమ్మా, ఉట్లూ గంపలూ బుట్టలూ కావాలా"

"....................."

"ఉట్లు అమ్మా ఉట్లు-గంప లక్కరలే"

"ఎట్లా ఇస్తావు."

"నీ ఇష్టంకాడికి తీసుకో అమ్మా అడిగేదే ముంది. గంప తవ్వెడుగింజల కిస్తా"

"ఇకనేం, సంసారాలు చేయనక్కర్లేదు. చాల్లే ఇక వెళ్లండి. ఈ ఎరుకలముండలికి దురాశ."

"అమ్మా, పోబోకమ్మా, ఎట్లా తీసుకొంటావో చెప్పరాదా అమ్మా"

"గింజలంటే మీ కేం లెఖలేకుండా ఉంది."

"ఈ గంప కావాలా. ఆ గంప కావాలా."

"నాకిదే కావాలి. ఎద్దుకు దాణా పెట్టుకోను గంపలేక ఇబ్బందిగా ఉంది. ఇదే తీసుకొంటా."

"దీన్ని తవ్వెడు గింజలకడిగితే ఇవ్వలేదమ్మా"

"సరే: ఇంకా ఇక్కడజాస్తీపెడతాగని వచ్చావు కాబోలు పాపం."

"నువ్వెంతకు తీసుకొంటావు చెప్పమ్మా"

"సోలెడు గింజల కిచ్చి పో."

"కడుపు నిండదు తల్లీ—"

"అయితే పో. ఉట్లు ఎట్లా ఇస్తావు."

"ఒక్కొక్కటి మూడు సోలల గింజలకి తక్కువ లేదు."

"మీకేం లోకం కిందామీదా తెలియడంలేదే. నోటికివచ్చినంత ఖరీదులు చెప్తున్నారు."

"ఎన్ని తీసుకొంటావమ్మా."

"బేరం కుదరితే ఒక ఉట్టీ, ఒకగంపా తీసుకోవాలనే ఉంది: అయినా మీ ఎరుకలవాళ్లతో బేరం, ఎముకలు కొరుక్కు తింటారు."

"అయ్యో: తల్లీ, అడుక్కొను వస్తే ఆసాములు ముష్టిపెట్టకుంటే, ఇట్లాంటివేనా చేసుకొనక పోతే ఎట్లా గమ్మా కడుపులోకి గంజి వచ్చేది— మీరు మారాజులు."

"సరేలే: గంప సోలెడుకూ, ఉట్టి మూడు అర సోలలకూ ఇస్తావా ఇవ్వవా?"

"కడుపు నిండదు తల్లీ."

"సరే పొండి: ముష్టిముండల్లారా: మీతో నే కూరేసుతోందా ఏమిటి లోకం— పనిలేదులే పొండి."

"పోబోకమ్మా: కోపంచేస్తే ఎట్లాగమ్మా."

"మీతో సమానంగా నేనీ సంజెల్లు పెట్టలేను. ఆకాడి కిస్తే ఇవ్వండి లేకుంటే పొండి."

"సరే: తీసుకో అమ్మా: నీకడుపు చల్లంగా ఉంటే అంతేచాలు మాకు."

"... ... ... ..."

"అదేందమ్మా: గింజలునిండా ఇంతదుమ్మూ, ఇంతపొల్లూ ఉంది: మంచిగింజలు పెట్టమ్మా."

"అయ్యో: ఇదేం పాడ్యే కాలమే మీకు. ముత్యాలవంటి గింజలు తెచ్చి పోస్తే— దుమ్మంటావు: ఛీ! మీతో బేరం చేయడమే బుద్ధితక్కువ."

"అమ్మా:నువ్వు కొలిచేది సరిఅయిన సోలేనా."

"ఇదిగో, నా కాట్టే కోపం తెప్పించబోకు. నేను సరిఅయిన దాన్ని కాను: మీకేమైనా కళ్లు దింముకొని పోయినాయా ఏమిటి? ఈనాడు మీకే కొత్తగా కొలుస్తున్నానా. పిచ్చసోలలతోనూ, పిచ్చ తవ్వలతోనూ కొలవడం నాకు చేతగాదు—"

"సరే: ఇయ్యమ్మా."

"... ... ... ..."

"అమ్మా: చంటిబిడ్డ ఒడిలో ఉండాడు — నిన్నటినుంచి కూడులేక పాలెండిపోయినై. వీణ్ణి మెడలో తగిలించుకొని తిరగలేకుండా ఉన్నాను: కోపవస్తోంది- ఒక్కపిడచ అన్నంపెట్టమ్మా: చచ్చినీకడుపునపుట్టుతా"

"సరే: పుట్టక పుట్టక నీవంటివాళ్లే పుట్టితే మేం తరిస్తాం. — ఇప్పుడు నీకోసం మేం అన్నాలు వండి పొయ్యలేదు. వెళ్లండి"

"అమ్మా: అమ్మా: సన్నం పెసతా తల్లీ. నీకు పున్నెం ఉంటుంది."

"ఈ వెధవ గోడు నే పడలేను. కూటికి లేని వెధవల కీ సంతానం ఎందుకో. పొండి పొండి."

"చంటిబిడ్డమాడున పెట్టుకొంటూ — ఇంత ఆముదంచుక్క చేతులో వెయ్యమ్మా. పోతాం—."

"అబ్బబ్బ: ఈ ఎరకల ముండలు మొండి ముండలు. పట్టుకొంటే పిశాచాల్లా వదలరు. ఇప్పుడు నీకోసం చమురెక్కణ్ణుంచి తెచ్చేదే?"

"అమ్మా: అమ్మా: చంటిబిడ్డ. చూడమ్మా మాడు ఎండిపోతోంది — ఒక్కబొట్టు పెట్టమ్మా."

"ఇప్పుడు నాకు చెయ్యివూరుకోలేదే. పొండే" అంటూ చేతిలో గంపాకుట్టే తీసుకొని వీధితలుపు దగ్గరగావెట్టి — లోపలికి చిటచిటలాడుతూ వెళ్లిపోయింది సరోజనమ్మ.

"అదొట్యా: ధర్మాత్మురాలు — మా అమ్మ— నూరేళ్లు నిండాలి." అని దీవిస్తూ ఎరుకలమ్మలు వచ్చిన దారినే పోయినారు

౪

శేషశాయి తీవ్రమైన సామ్యవాది. అయినప్పటికీ కొన్ని అనివార్యమైన కారణాలవల్ల అతనిభావాల్లో ఉన్న తీవ్రత కార్యాల్లోకి ఇంకా దిగలేదు. బీదా సాదా అంటే అపరిమితమైన కరుణా, దయాను. తిర్యగ్జంతువులయిన పశుపక్ష్యాదులకేగాక, అచరములైన వృక్షాలయినప్పటికీ చీమకాటంత బాధ కలుగగా చూచి విలవిల్లాడే కుసుమ కోమలమైన హృదయం అతనిది. ఇక పరమేశ్వరుని సృష్టిలో మిక్కిలి పవిత్రమైన మానవ జన్మ ఎత్తిన ప్రజలయొక్క—అందులోనూ దరిద్రులయొక్క—కష్టపరంపరలు చూచినప్పుడతనిమానస స్వాటులు క్షోభించునో అది ఊహింపదగిన విషయమే గాని వర్ణించవలసినది గాదు.

తలిదండ్రులిద్దరూ గతించిన పిదప అన్నయొక్క అభిరుచి, ఆశయాలకీ—తన అభిరుచి ఆశయాలకీ పొత్తు కుదరనందున, వెంటనే విభాగాలు చేసుకొని స్థిరచరాస్తులు అమాంబాపతులూకలిపి శేషశాయీ, తన అన్నా చెరొక ఇరవై వేల రూపాయల కిమ్మతుగల ఆస్తిని పంచుకొన్నారు. ఇల్లు మాత్రం అంతా అన్నభాగానికే వదలి తాను విడిగా మరొక ఇల్లు కొత్తగాకట్టించుకొన్నాడు ఓమూడువేల రూపాయలతో.

అంత దొర్జాడి సంపాదించుకొంటేనేగాని జరగ దిగులు లేదు. అదిగాక ఇంట్లో మట్టసమైన సంసారం—తనూ, సరోజినీ, ఓపదేళ్లకుర్రాడు రంగశాయీని. రంగశాయితర్వాత ఓఆడపిల్ల పుట్టి రెండేళ్లు పెరిగిందిగాని నష్టమైపోయింది పాపం. మళ్లా సరోజిని నీళ్లుపోసుకోలేదింతవరకు. తండ్రి సంపాదించిపోయిన ఆస్తి ఎంతవున్నా — ఉద్యోగం పురుషలక్షణం గాబట్టి—ఊరికేకూర్చునిచేసేదేముంది— కానీ అంతగావస్తే చూతాంలే అని అనుకొని తనకంత ఇష్టంలేకపోయినా—కట్టినబోర్డు విప్పకుండా—జన్మస్థానమైన నెల్లూరులోనే రోజూ కోర్టుకుపోతూ వస్తూ ఉన్నాడు ప్రాజ్ఞుడు నియోగి వంశంలో ప్రభవించిన మన శేషశాయి.

నిజంలో తనతెలివికీ, తన చదువుకీ, తన చాకచక్యానికీ నెలకు రెండువందల రూపాయల సంపాదన ఓలెఖ్ఖలోదికాదు. రెండువందలు రొఖ్ఖంగా చేతికొచ్చి ఇంకా ఓవంద రూపాయలుదాకా వసూలు కావలసిన పద్దులు అక్కౌంటుమీద ఉంటే ఏంగాక - కాంగ్రెస్సనీ, సోషలిజమనీ, ఉపన్యాసాలనీ, హరిజనులనీ, యూనాదులనీ - ఇట్లాంటి ఇతర వ్యాసంగాల్లో దిగకుండా నలుగురులాగా, తనూ అంగడిలో కోమటి గల్లాపెట్టె నంటిపెట్టుకొని కూర్చున్నట్లు అంటిపెట్టుకొని నిలబడే ఉంటే ఈపాటికి లీడింగు అడ్వోకేటు అని అనిపించుకోకపోయాడా? కాని చిన్నప్పటినుంచీ అతని మతమే వేరు - అబద్ధం సోకిన అలజడి తగిలితే ఆకేసు అట్లా అంటుకోడు - లక్షవచ్చుగాక - లక్షపోనుగాక. భగవంతుడిచ్చినదానితోనే తృప్తి, ఆనందమూనూ.

అందువల్ల ఇంకా ముప్పైఅయిదు ఏళ్లయినా పూర్తిగా నిండని చిన్నవయస్సు అయినప్పటికీ - ఇతనియొక్క విముఖత్వానికి తోడిప్లీడర్లలో కొంతమంది ఆశ్చర్య పడుతూ ఉన్నా, మరి కొంతమంది మాత్రం సంతోషిస్తూ, ఇతనిని ప్రోత్సాహపరుస్తూ, బారులో మట్టుకు తాము లీడర్లు అని అనిపించుకొంటున్నారు.

సోషలిజంమీద అభిమానంగా చదివాడు శేష శాయి. తత్సంబంధమైన సాహిత్యవాహినిలో పడ్డా డంటే, నిద్రాహారాలక్కరలేకుండా ఎన్నిరాత్రిం బగళ్లయినా, వందలకొద్దీ మైళ్లు అట్లా కొట్టుకొని పోతూనే ఉంటాడు. ఆ అలలమీద తాండవం చేస్తుం టాడు. ఎంత భోగభాగ్యాల్లో పొర్లాడుతూ ఉన్న ప్పటికీ, నిత్యమూ తన అంతర్వీక్షణానికి గోచరమయ్యే భారతదేశ దారిద్ర్య విచ్ఛేదనానికి సోషలిజంతప్ప మరొక ఉపాయం పనిచేయదని దృఢవిశ్వాసం అతనికి: కాని ఇంత తీవ్రమైన సామ్యవాదికి ఇంత తీవ్రమైన అహింసాప్రేమ తత్త్వాలు పట్టుపడడం ఆశ్చర్యకరంగా ఉండకపోతుందా అని సందేహం.

తానెంతవిజ్ఞానవంతుడైనామాత్రం ఏం-సరోజిని కాతని హృదయంలోని జ్యోతి దృగ్గోచరంగాలేదింకా. ఇంగ్లీషు చదువులేకపోయినా తెలుగులో చక్కని పాం డిత్యంపాత్రింకద్ద ఆమెకు. భార్యాభర్తలిరువురూ గాఢమైనప్రేమతో ఒండొకలను ప్రేమించుకొం టారు. అదిగాక ఈశ్వరసృష్టిలో ప్రతిమానవునికీ, ప్రతి జీవి - మృగానికి పక్షికి కూడా స్వేచ్ఛఉండి తీరాలనివాదించే శేషశాయి తనభార్యకుగూడా ఆమెకోరినస్వేచ్ఛ ఇవ్వడంలో ఆశ్చర్యంఏముంటుంది గనక! కాకపోయినా ఎంతస్వల్ప విషయాల్లోఅయి నప్పటికీ - సంసారానికి సంబంధించిన విష యాల్లో ఆమెకర్తి ఎదురుతిరిగిలిండంటే ఓర్చుకోలే ఘటంగాదుఆమె. కొంచెం ముక్కుమీదకోపంఆమెకు. అందులోనూ మొదటినుంచీ ఇంట్లో అత్తగారి పోరూ, ఆడబిడ్డలపోరూ లేనిసంసారమేమో. ఆమె అవిచ్ఛి న్నంగా స్వారాజ్యంఏలుతోంది తనఇంట్లో.

అట్లాఅని ఓదూబరామనిషి గూడాకాదు పాపం. పొదుపుచెప్పాల్సినపుడు ఆమెను చెప్పి మరొకరిని చెప్పాలి: తనభర్త ఇంతస్వేచ్ఛ ఇచ్చాడుగదా అని ఈ కాలపువాళ్లలాగ నెత్తినెక్కి తొక్కేరకమూగాదు: భర్తఅంటే పంచప్రాణాలుఇస్తుంది - అసలూ మాంస మూ అరిగిపోయేటట్టు చాకిరీచేసి భర్తను సుఖపెట్టు తుంది. కాని —

౨

ఆదినం ఆదివారం: కోర్టులేకపోబట్టి ఉదయా స్నేస్నానంఅయింతర్వాత కాఫీతీసుకొని, బయట తన ఆఫీసుగదిలో పడకకుర్చీలో పండుకొని శేషశాయి స్వారాజ్య పేపరు చదువుకొంటున్నాడు. ఆదివారం అయినందువల్ల గుమాస్తాగాని, పార్టీలుగాని అప్పటి కింకారాలేదు.

తనగదికెదురుగానే వీధివసారా. తనుపడుకొన్న చోటునుండిచూస్తే వసారాలోవస్తూ పోతూఉన్న మను ష్యులు కనుపిస్తూనేవుంటారు. పేపరు చేతిలోకితీసు కొన్నదిలగాయతు వసారాలో ఉదయంనుంచీ సరోజిని చేస్తున్న కూరగాయలబేరాలు శేషశాయి నిశ్చలమైన దృష్టితో గమనిస్తూనేఉన్నాడు. చూచిన కొద్దీ తనలో తాను క్రుంగిపోతున్నాడు. తానుఅధిష్ఠించిన పడక కుర్చీ పాతాళంలోనికి పోతున్నట్టుగా అతనికితోచింది. పోనీ, ఆకూరగాయలబేరాల్లో తానుకలగచేసుకోరాదా అనిఅనుకొంటే, సరోజిని స్వాతంత్ర్యభంగానికిఓర్వదే! ఇదివరకొకటిరెండుసార్లు ఇట్లాగే "స్వల్పంలో బేరాలు చేయబోకు" అని నూత్నంగా అనేవరకు "మీకు తెలి యదు ఊరుకొందురూ.మీకెందు కీఆడంగితొడవ"లని కసురుకొంది. అప్పటినుండీ తా నిట్టివిషయాల్లో చటు కున్నజోక్యంపుచ్చుకోవడానికి సందేహిస్తూఉంటాడు శేషశాయి. అదికాక అతనికోరికవేరు. తాను బీదల యెడల ఏవిధంగా కరుణాసముద్రుడయి, ఆపన్నులై వచ్చినవారికిలేదనకుండా సాయపడుతూ సంతోషిస్తూ ఉంటాడో అట్లాగే సరోజినిగూడా—తానంతటతాను కరుణార్ద్రహృదయయై, బీదలయెడ సానుభూతి,

కరుణా, దయాగలిగి వర్తిస్తూ, లోకోపకారం చేస్తూ జీవించుతూ ఉండగా, తాను చూచి సంతోషించవలెనని అతని ఆశయం. కాని అభూతదయా, పశ్చాత్తాపము లోకరు నేరిపోస్తే అలవడే సుగుణములా! ఆ ప్రేమ, ఆ కరుణ సహజంగా లోపలినుండి పుట్టుకురావలె.

శేషశాయి కిదే దుఃఖం. ఎంత శ్రమపడినా తన భార్యమతములో మార్పుకలుగలేదు. మొగవాడు ఎన్నిటికని - పూరగాయలదగ్గర కూడా - భార్యను కాదని తాను కలుగచేసికోంటాడు. ఒకవేళ కలుగచేసుకొన్నా "ఆయన ధర్మరాజు - అడిడ్డే గయ్యాళి." అని లోకు లనుకోంటారేమో అని అతని భయం

ఆ దినం జరిగిన చర్యలు సామాన్యంగా ప్రతి ఇంటా నిత్యమూ జరుగుతూనే ఉంటాయి లోకంలో. భాగ్యవంతులకీ, దరిద్రులకీకూడా పరిపాటి అయిపోయింది. అయినప్పటికీ తనభార్య ఆ విధంగా ప్రవర్తించగా చూచి శేషశాయిమనస్సు వ్యాకులపడింది. పేపరు చదవాలని ఒకటి రెండు పర్యాయములు ప్రయత్నించాడుగాని మనస్సు నిలకడ చిక్కలేదు. "మాకొక్కనిచేరం మూడుజాములయింది—" "అమ్మా బాలింతరాలిని - వీధినబడిపోవడానికి దవికలేక స్కగవుతోంది" "అమ్మా అన్నంలేక పాలెండిపోయినవి. ఒక్కపిడచ అన్నం పెట్టమ్మా" — ఈ వాక్యాలే చెవుల్లో గింగురు మంటున్నవి అతనికి. తలచుకొనినకొలదీ నిట్టూర్పులు అధికమవుతూ ఉన్నవి.

ఒకటి రెండుసార్లు లేచి, వీధివసారాలోనికి పోయి, ఒక పావుగంటసేపు అటూ ఇటూ పచార్లు చేశాడు.

"ఎందుకీ గృహస్థాశ్రమం - ఉత్కృష్టమైనది అంటారు గాని - గృహిణి ఇట్లాంటిదయినప్పుడు ఈ ఆశ్రమంయొక్క గొప్పతనం ఎట్లా గోచరిస్తుంది— అది ఉపయోగించుకొనే పద్ధతి తెలిసి ఉండాలి......"

మళ్లావచ్చి కుర్చీలో కూర్చున్నాడు. వీధిలో ఎక్కడ కూరగాయలవాళ్ల అరుపులు వినబడ్డా, అతడు ఉలిక్కిపడి, "గుండె దడదడమని కొట్టుకొంటోంది— ఎందుకో! ఈశ్వరా! నీ విలాసం" అని అనుకొంటూ, నిట్టూర్పు విడుస్తూ, పడక కుర్చీలోనే పడుండి ఉన్నాడు శేషశాయి.

౬

"పది గంటలయిందే సుబ్బీ! ఏంపనే నీది. ముందు లోపలిగదీ, సావిడీ తుడిచిరా! ఎబ్బే! వట్టి ఏబ్రాసిముండలీ యానాది ముండలు."

"వస్తుండా నమ్మా! అయిపోయింది వసుండా. ఇయ్యాళ పనే జరగడం లేదమ్మా!"

"కానీ కానీ. కోర్టులేకపోయినా భోజనానికి పొద్దోతే అయ్యగారు లేరు ముందు నా కాబోలి కడిగి ఇయ్యి."

"తడిగుడ్డలు పిండి ఆరవేశావా?"

"వేస్తుండా నమ్మా."

"చూడు. పని అయింతర్వాత ఎద్దుతొక్కిన పేడతీసి, ఇవ్వేళ, పిడకలు చేసి మరీపో."

యానాదిసుబ్బి సరోజిని దగ్గర పనికి కుదిరి ఆరునెల్లయింది. ఏడో నెల జరుగుతోంది. సరోజిని కాపురానికి వచ్చింతర్వాత ఇంతకాలం అతుక్కొని నిలిచిన యానాది ఈ సుబ్బి ఒకతే ఇంతవరకు. సరోజిని పెట్టేబాధా కష్టము పడలేక - వచ్చిన యానాదులు ఓ రెండు మూడు నెలలుండేవరకు నిభాయించుకోలేక వెళ్లిపోవడమూ జరుగుతోంది: కట్టుకోను గుడ్డలిస్తానని, రవిక లిస్తానని, అన్నం పెడతానని కొండంత ఆశలుపెట్టి పిలిచి ఏర్పాటు చేయడమూ, ఈమె రవ్వారట్టూ పడలేక వాళ్లు పారిపోతూఉంటే ఆ యానాదిదాన్ని పిలిపించి, చెడదిట్టి, దాని కదివరకే రవికైనా, ఏ గుడ్డయినా ఇచ్చిఉంటే దాన్ని మళ్లీ గూబలునులిపి తీసుకొని - ఇంట్లోపెట్టి - మళ్లీ రాబోయే యానాదిదాని కివ్వడమూ - ఇట్లా జరుగుతోంది ఇంట్లో యానాదిదాని వ్యవహారం. సుబ్బి

కొంత పెద్దవయసలో మనిషి కాబట్టి పాపం మొదటినుంచీ వొళ్లువంచిపనిచేసుకొనిపొయ్యే అలవాటు కొద్దీ ఎవ్వరూ మెప్పించలేని సరోజిన్ని సుబ్బిమాత్రం మెప్పించి అంటిపెట్టుకొని, రోజూ అన్నంపెట్టే బదనాయం లేకపోయినా - నెల కారూ పాయిపావలా ఉద్యోగంతోనే తృప్తిపొంది కాలం గడుపుకొంటోంది పాపం.

ఉదయం సరిగా ఏడున్నరగంట అయ్యేవరకువస్తుంది. పదిన్నరగంటదాకా పనిచేస్తుంది. ఇంటికిపోయి మళ్లా మధ్యాహ్నం 3 గంటలకల్లా వస్తుంది. సాయంత్రం ౬ గంటలవరకూ పనులుచేసిపోతుంది. చదువుకోక పోయినా, గంటలు తెలియకపోయినా - అలవాటు చొప్పునగాబోలు - పిడుగులుపడే వర్షంకురుస్తున్నా సరే, ఇంటికాడ తనపిల్లలకి జబ్బులుచేసి తలక్రిందు లైనాసరే, ఎన్ని అటంకాలున్నాసరే, ఉదయం ఏడున్నరగంటకు కాగానే సుబ్బి తనడ్యూటీకి హాజరు కావలసిందీ, తనపనిచేయవలసిందీని. తానువచ్చేటప్పటికి అసలు తలుపులింకా తెరవకుండా నిద్రమంచంమీదే ఉంటారు సరోజినీశేషశాయిలు. బయటవాకిలి చిమ్ముతూండే సుబ్బిచేతిలోని పొరకకట్ట ధ్వనులతోనే తరచు శేషశాయికి మెలుకువరావడం. "దీనితస్సాగొయ్యా. ఏరోజుమారదినా, ఇది ఇంతకరక్టుగా వేళకెట్లా వస్తుందిరా. ఎంతతంటాలు పడ్డా పదకొండుగంటలకి మేం కోర్టుకు సరిగ్గా అందుకోలేమే" అని శేషశాయి ఆశ్చర్యపడుతూ నిద్రలేవడమూ, కాలకృత్యాలు తీర్చుకోవడమూ జరుగుతూఉంటుంది - ఇట్లా కంటి సంజ్ఞతోనే ఇంటిపనులన్నీ అతిజాగరూకతతో చేస్తూ ఉన్నప్పటికీ సరోజిని సుబ్బినిగూడా తరచు ఏవో వంకలు పెడుతూ ఎగ్గులాడిస్తూనేఉంటుంది. అయినా కడుపార పదిమందినిగన్న పెద్దలతల్లిగాబట్టి తనజనా బాదారీ చక్కగా గ్రహించుకొని, మెలకువతోనూ, తెలివితేటలతోనూ చేసుకొంటూ కాలంగడుపుతోంది సుబ్బి:

పదన్నరగంట అయింది. రోజూ చేయవలసిన పనులన్నీ పూర్తిచేసుకొందిసుబ్బి. ఇంటికిపోతూ—

"అమ్మా"

"ఏమే"

"ఒక్కసారి బయటికి రా అమ్మా"

"ఏమే"

"నాలుగురోజులు కాస్తఇబ్బంది పడాలసొచ్చిందే."

"ఏమిటే: ఏవూరైనా పోతావాఏమిటి ?"

"నీవుగనక దయఉంచితే నీపుణ్యాన్న ఇంత అన్నంతింటాం."

"ఏంవచ్చింది ?"

"వరికోతలమ్మా"

"అయితే"

"పైరు పంటకొచ్చింది. కోతలుపట్టారు. కూలివాళ్లకోసరం రెట్లు తిరుగుతున్నారమ్మా"

"అయితే ఇంటిపనులన్నీ విడిపించి వరికోతకు పోతానంటావాఏమిటి ఇప్పుడు ?"

"అమ్మా, రోజుకు శేరుబియ్యం, అరణాలు డబ్బులూ ఇస్తారమ్మా"

"ఇష్టంలేకపోతే మానుకొని లేచిపోరాదూ"

"పదిరోజులకల్లా కోతలయిపోతాయమ్మా. మళ్లా వరినాటురోజులు. ఇంకా అయిదారు నెల్లదాకా అదనుతల్లీ"

"ఉద్ధరిస్తావు"

"ఏమో: పిల్లలూ మేమూ ఇంతబతుకుతాం. అదునుతప్పితే మళ్లావచ్చేదిగాదుగదా అమ్మా"

"అయితే ఇంటిపనులు నీతాత చేస్తాడను కొన్నావా, నీముత్తాత చేస్తాడనుకొన్నావా ?"

"పిల్లని పంపిస్తానమ్మా"

"ఏపిల్లని ?"

"నాపిల్లనే"

"ఎవరు ? అబోద్దూదరిలంజెవా. వద్దేతే మాకు పిల్లావద్దు జెల్లావద్దు"

"..............."

"నాకు ఇంట్లో పనిచేసేమనిషి లేకుంటే క్షణం జరగదు. మాయాసాదివాళ్లకున్న రోగం యిదేగా. ఉన్నన్నాళ్లూ, ముండలు చేసతినేదిన్నీ, ఒంటికి పొగరెక్కింతర్వాత ఉడాయి చేదిన్నీ"

"నేనట్లాంటిదాన్ని గానమ్మా. ఒక్క పదిరోజులు గడువుకో తల్లీ. పోనీ జీతంపట్టుకోలే"

"జీతంపట్టుకుంటే పనులెట్లా జరగాలెనే."

"పిల్ల అన్నిపనులూ చేయగలదమ్మా- పోనీ రెండురోజులు చేయించుకొని చూడు. నీకు అందుబాటులేకుంటే అట్లాగే నేను వస్తాలే. పన్నెండు ఏళ్లుండయ్యమ్మా దానికి. మాదటికి దాన్నిగూడ కూలి పనికి పంపించాలని ఉండా."

"వల్లగాదు. ఉంటే నువ్వుండవలసింది, లేకపోతే మానుకోవలసింది."

"అట్లాగంటే ఎట్లాగమ్మా?"

"ఎట్లాగో నన్నడిగితే."

"మీ అన్నంతింటూ నిన్నడగకుంటే ఎవరినడిగేదమ్మా ఇక"

"పదిరోజులు కాదుగదా. పదినిముషాలుగూడా నీకు శలవు ఇవ్వడానికి వీలులేదు ఇష్టమైతే ఉండు- కమ్మామంటే వెళు"

కొంచెంసేపు ఏమీ జవాబు చెప్పలేక ఊరుకొంది సుబ్బి. అలవాటయిన ఇల్లు- చటుక్కున చిన్నపిల్లలా వదులుకొని ఎట్లా లేచిపోగలదుపాపం.-

"పోనీలే అమ్మా. నీదయ. నీవు పొమ్మంటేనే పోతా. వద్దంటేపోనులే. కోప్పడబోకు. ఇంటికాడ మొగాడు నిన్నడిగిరమ్మంటే- పోనీ ఈపదిరోజులూ చెరొక పావలా డబ్బులూ సంపాదించుకొంటే పిల్లలకి దిగులుండదని అనుకొని అడిగాను తల్లీ. కోపగించుకోబోకు"

"సరులే. మళ్లా పెండలాడేరా. మధ్యాహ్నం ఎద్దుకి ఉలవలువిసరాలి. నిమ్మకాయ ఊరగాయలోకి మిరపకాయలు దంచాలి. చాలాపనులున్నాయి"

"వస్తాలే అమ్మా. ఒక్క బేడడబ్బులుంటే పారెయ్యమ్మా, ఈ నెల జీతంలో పట్టుకొందువుగాని."

"డబ్బులా?"

"ఒక్క బేడ ఇయ్యమ్మా. ఈ నెలజీతం - కొరవ రూపాయిబేడే యిద్దువుగానిలే. ఇంటికాడ నూకలేవు. మా యానాదోడికి నిన్నరాత్రంతా జరంకాసిపోసింది. ఈ పొద్దు కూలికిపోలేదు. ఒక్క బేడ ఇస్తివా ఈ పూట రాగులు కొనుక్కొని ఇంతగంజి కాచిపోస్తాపిల్లలకి"

"నీకోసం నేనేం బేడలూ, మాడలూ మూట గట్టుకోలేదు, తెలుసునా. నీఉద్యోగానికితోడు అడ్వాన్సులు గూడానా? ఒకటోతేదీవస్తేగాని డబ్బులుమాట ఎత్తకు."

"అమ్మా! అమ్మా! రాత్రి ఇంటిల్లిపాదిమీ పస్తు పండుకొన్నాం. నీవుదయఉంచకుంటే పిల్లలు చస్తారు"

"నన్నూరికే పదే పదే వాగించకే. పొయ్యిమీద కూర మాడిపోతోంది"

"అమ్మా, ఇప్పేళ ఇంత అన్నమేనా వేశావు గాదు తల్లీ అంటల్లో"

"రాత్రి అన్నం మిగలందే ఏంచేయమంటావు. నీకోసం ప్రతిరోజూ సమారాధనలు జరపమంటావా ఏమిటి? అదిగాక నీకు రోజూ అన్నం పెట్టే ఏర్పాటు లేదే. నెలకు రూపాయి పావలాడబ్బులు మాత్రం ఇచ్చేది ఖరారు. అన్నం మిగిలినరోజు పెడతా, లేనిరోజు లేదు. అన్నంబననాయం లేదుగా"

అంటూ సరోజిని వంటఇంట్లోకి పోయింది.

సుబ్బి—అన్నంకోసం రోజూ తెచ్చుకొంటూ ఉన్న ముంత- తెచ్చిన ముంత తెచ్చినట్టుగానే కుడి చేతపట్టుకొని ఏంచేస్తో తలగోక్కుంటూ—ఇంటికిపోయింతర్వాత తన దృష్టిలో పడే దృశ్యం అక్కడనే దృగ్గోచరంకాగా-అడుగుసాగక-ఏమి చేయడానికీ తోచక-ఒక్కక్షణం నిలబడి-నిట్టూర్పువిచ్చి ఇంకోరెండడుగులు ముందుకు బలవంతాన్నవేసి -దొడ్డిలోనుండి పడమటితట్టు సందుసుండా వీధివాకిట్లోకి పోతూ - ఆఫీసుగదికాడికి వచ్చేటరకు - కిటికీసుండా

పంతులు శేషశాయి పడకకుర్చీశాయియై ఏదో చదువుకుంటూఉండగా చూచి, పోనీ తనబాధ పంతులుతో చెప్పుకొందమనా అని అనుకొని రెండడుగులువేసేవరకు - "అమ్మమ్మో! అమ్మ బతకనియ్యదే- ఎప్పుడూ పంతులుతో నేను పలకనేలేదే - నావల్లగాదు-" అని నిస్పృహచెంది ఈ ప్రయత్నంలో పుట్టిన ఆవేశంతో గుండెకొట్టుకోవడంలో గలిగిన నీరసంవల్ల - అదివరకే ఏకాదశీవ్రతాచరణదీక్షలో నిస్సత్తువ లైన తన అవయవములు మరింత పటుత్వంతప్పినందున బలహీనురాలై పదిమంది బిడ్డల్ని కని ఏబదేళ్ళపడిలో వొరుగుతూవున్న రక్తమాంసాదు లెండిపోయి - ముడతలుపడిన చర్మంతోనూ, కట్టెవలె బిగుసుకున్న ఎముకలు కనుపించే దేహంతోనూ, తినిపారేసిన తాటిముంజెలోని కళ్ళవలె గుంటలుపడ్డ కళ్ళతోనూ, రాచుకోను చమురులేనందున తైలలేపనముగాని, స్నానసౌభాగ్యముగాని లేనందున తెలతెరబడిగా ఎరగనందువల్ల అట్టకట్టిన తలవెంట్రుకల చుట్టతోనూ చూసేవాళ్ళకి ఛిద్రదేవతవలె ప్రకాశిస్తూ- ఆవొక విధమైనస్థితిలో ప్రాణాలు ఉగ్గబట్టి - పంచభూతాత్మకమైన తన దేహాన్ని బలవంతాన్న వీధినబడి ఈడ్చుకొంటూ, ఈడ్చుకొంటూ సుబ్బినాలుగుఫర్లాంగులదూరంలో ఉన్న తనగుడిశెకాడికి ఒక అరగంటసేపటికి ఘటంచేరవేసింది.

౨

అతనిబాధ అతనిది: శేషశాయి [illegible] ఏమీ తెలియదు పాపం: ఉదయం తాను చూచిన దృశ్యమే చిత్తములో హత్తుకోగా - తన్మూలాన్న గలిగిన విచారంవల్ల ఓగంటాగంటన్నరసేపు దుఃఖించి.-

"దుఃఖించి ఉపయోగం లేదు, అజ్ఞానంవల్లనే సరోజిని ఇట్లాప్రవర్తిస్తోంది. కాని ఆమెకు దయలేకపోలేదు. డబ్బంటే కాపీన్నమూ లేదు: లోభిత్వమూ లేదు: ఆమెకు డబ్బును సద్వినియోగం చేయడంమాత్రం తెలియదు: నేను హరిజననిధికి వందరూపాయలు ఇచ్చినపుడు తాను సంతోషించిందిగాని విచారించలేదే: హరిజనహాస్టలుకు ఏభయి రూపాయిలు ఇచ్చినప్పుడు గూడా సంతోషించిందే: శారదానికేతనానికి రెండు వందలిచ్చినపుడూ సమ్మతించిందే - ఇట్లాటివి ఎన్ని -. మొన్న సంక్రాంతిపండుగకు హరిజనుల పిల్లకాయలకు సుడ్డలుకుట్టించినపుడు తాను స్వయంగా తన చేతులతో పంచిపెట్టింది. ఇట్లా నేచేసే సద్వినియోగాలకు ఆమె ఎప్పుడూ నాకు అడ్డు రాలేదు: కాని - ఎటువచ్చీ - తన ఇంటివిషయాల్లోమట్టుకు ఆమె స్వాతంత్ర్యంకోరుతుంది: ఆ పెట్టుపోతల్లో నన్ను కలిగించుకోనివ్వదు: తన కింతస్వతంత్రం ఉన్నందుకు-ఈ స్వల్పవిషయాల్లో రవంత ఉదారగుణమేఉంటే -నాకెంత ఆనందంగా ఉండును! కానీలే: ఈశ్వరని దయవుంటే - ఆమె ఈదుర్గుణాల్ని విడిపించుకోగలదు:"

అని కొంతప్రయత్నంమీద ఊరటకల్పించుకొని నిట్టూర్పువిడిచి - మరల పేపరు చదువుకొంటూ కుర్చీలోనే కూర్చొని ఉన్నాడు శేషశాయి. ఈలోపల సుమస్తా ఓసారివచ్చి ఏవోకొన్నికాగితాలమీద సంతకం చేయించుకొని వెళ్ళిపోయాడు.

ఇంట్లోవున్న శేషశాయికే సుబ్బిబాధ తెలియనప్పుడు ఇక వీధిలోవారికి తెలియక పోవడంలో ఆశ్చర్యం ఏముంటుంది?

వంట అయిందని సరోజిని చెప్పడంతోనే శేషశాయిలేచి భోజనంచేసి, తాంబూలంవేసుకొని ఎండవేళ కాస్సేపు నిద్రపోయాడు. నిద్రలేచింతర్వాత ఏవో కొన్ని జాబులు పోస్టకుపోవలసినవి వ్రాసుకొంటూ ఆఫీసుగదిలో కూర్చున్నాడు. మూడుగంటలయేవరకు 'ఫలహారంచేయరుగాని రమ్మ'ని సరోజిని పిలిచింది. సరేనని లేచి పడమటిసందుగుండా దొడ్లోకి కాలుముడుచుకోను పోయేవరకు, ఉత్తరపుతట్టు వసారాలో ఎప్పుడు వచ్చిందో సుబ్బివచ్చి క్రింద గోతంపరుచుకొని, దానిమీద తిరగలిపెట్టుకొని వసారాగోడ కోఅడుగుదూరంలో దక్షిణపుముఖంగాకూచుని, ఎడంకాలుముడుచుకొని, కుడికాలు సాచుకొని ఎక్కుపెట్టిన ఉండేలుబద్దవలె ముందరికి వంగిపోయిన నడుములో, ముందుకీ వెనక్కీ ఊగిసలాడుతూ, ఉలవలు విసురుతూ కూర్చుంది. "అరే! ఇంతకరకట్టుగా ఇది ఊర్యాటికి తప్పకుండా

వచ్చిందే" అని మనస్సులో ఆశ్చర్యము కలుగగా, ఒక్కక్షణం నిదానించి చూచేవరకు తిరగలిపైరాయి కొంతకష్టంమీద తిప్పుతూ ఉన్నట్టు అతని మనస్సుకు తట్టింది. అవశిష్టంతీర్చుకొని, బావిదగ్గర కాళ్ళూచేతులూ ప్రక్షాళన చేసుకొని పైపంచాలుతో చేతులు తుడుచుకొంటూ వంటయింటిగడపఎక్కి లోపలికి పోతూ ఉండగా సరోజిని అప్పుడే ఇల్లు చిమ్మి పెంటవేయ బోతూంది.

"ఇప్పటికి రెండుమాసాలు నెలన్నుంచి చూస్తున్నాను. ఎప్పుడు చూచినా సుబ్బి ఆ నుద్దేకట్టుకొని ఉంటుంది. పాపం దానికి కట్టుకోను రెండోనుద్దలేదు గాబోలు. దాన్ని చూస్తే నాకు దుఃఖంవస్తోంది. పాత చీరల్లో ఏదో ఓ నుద్ద దానిముఖాన్ని పారెయ్యకూడ దటే"

"........................."

"అబ్బ! ఈ దారిద్ర్యదుఃఖం చూడలేకుండా ఉన్నాను. కళ్ళబడకపోయినా బాగుండేను ఈ అవతారాలు. మళ్ళా దానిచేతనే, ఆ మురికిబట్టలతోనే ఇంటికి పాలూ, పెరుగూ, కూరలూ అన్నీ తెప్పిస్తావు. అబ్బ! అసహ్యం అవుతోంది."

"........................."

"ఏదో పాతచీర ఒకటిచూచి దాని కిద్దూ. నేనీ దుఃఖం చూడలేకుండా ఉన్నాను."

"వచ్చిపోచుందుగూ. కోకలు చిల్లారి నే బాగుండవు."

"దానికో పాతచీర ఇస్తేనేగాని నా కేమీ సహించదు."

"ఇది మరీబాగుంది. తలచినప్పుడే తాత పెళ్ళిలా ఉంది."

"దీని కేమైనా లగ్నం కుదిరాలా ఏమిటి ?"

"అయితే మీ ఇష్టంవచ్చినట్టు చేసుకోండి. నన్నడగడ మెందుకు? మీకు తెలియని చీర లేమున్నై. మీరే తీసి యిచ్చుకోండి. పాతదో, కొత్తదో నాకు తెలియదు."

"అంటేగాని నీవుమాత్రం నీచేత్తో యివ్వలేవన్న మాట."

"ఇప్పుడెంత తొందరేమి వచ్చిందండీ? మొన్న నే- ఆరునెల్ల యిందే – రాయివంటి చీర ఇచ్చాను. మళ్లా ఇంతలోనే ఇంకొకటా? దానికి లేకపోయినా మీ కెందుకీ అనవసరపు గొడవలూ?"

అని ఏమేమో చెప్పబోయేవరకు వీధిలోనుండి

"శేషశాయీ"

"ఎవరువారు?"

"ఏంచేస్తున్నావోయ్"

"వస్తున్నా. రా, లోపలికిరా. ఇట్లా వచ్చి నావిట్లో కూర్చో."

అనేవరకు తోడే అప్పారావు శ్యామలరావు చంకన పెన్సిసుబాటు పెట్టుకొని నావిట్లోకి వచ్చి కుర్చీలో కూచున్నాడు. సమయానికి వచ్చిన స్నేహితునికి భార్యాభర్తల తగవులు తెలియకూడదని – సరోజిని ఇచ్చిన జవాబులవల్ల లోపల కుతకుతలాడే హృదయాగ్నిని తెచ్చిపెట్టుకొన్న ముఖవిలాసంతో మరుగుపరుస్తూ, శేషశాయి శ్యామలరావుప్రక్కనే కుర్చీలో కూచుని మాట్లాడుతూ ఉన్నాడు. ఇంతలో వీధిలోని ఆటలు చాలించి "అమ్మా! తినడానికే" అంటూ రంగశాయి వంటింట్లోకి పరుగుపెట్టేవరకు "పెడతానుండు" అని రెండు ప్లేట్లలో ఫలహారాలు పెట్టి శేషశాయికీ, శ్యామలరావుకూ చెరొక ప్లేటూ ఇచ్చిరమ్మని లోపలినుంచి సరోజిని రంగశాయిని పంపింది.

"ఇప్పుడేఇంటిదగ్గరతినివచ్చాను: ఆకలిలే"దంటూ విసుగుతోనే శ్యామలరావు బలవంతాన్న లోపలికెక్కిస్తున్నాడు ప్లేటులోఫలహారాన్ని. కడుపులోనూ మనస్సులోనూ బాగులేనందున శేషశాయిమాత్రం కొంచెం ఎంగిలిచేసి, సగంపైగానే ప్లేటులో దిగవిట్టాడు. (తీసుకొని ..

"ఇవ్వేళ క్లబ్బులో పాటకచ్చేరికి వస్తావా శేషశాయీ?"

"అహా: "

"తప్పకరా: చాలాగొప్పపాట. "

"ఎన్ని గంటలకేమిటీ? "

"ఎట్లాలేదన్నా ఆరవుతుందిలే: ఆదివారం కాబట్టి నేనుముందుగాపోతేనేగాని టెన్నిసుసెట్టు దొరకదు: నేవస్తున్నా. క్లబ్బులోకలుసుకొందాం" అంటూ శ్యామలరావు వెళ్లిపోయినాడు.

ఆతడెందుకువచ్చిందీ శేషశాయికి అర్థంకాలేదు: వెళ్లేదారిగాబట్టి, ఇరుగుపొరుగు కాపురంగాబట్టి పోతూపోతూ ఇట్లా తొంగిచూద్దామని వచ్చాడుగాబోలునని అనుకొని-"ఎందుకో ఓఅందుసరే. దీనికింత ఆలోచనయేల? ఎందుకొరకైనా సమయానికి కందుకొన్నాడు." అని అనుకొంటూ. సరోజినిసంభాషణ వల్లగలిగినరిచ్చపాటు ఎదలోనే ఇంకాస్వస్థత లేకుండా ఉన్నాడు. ఇంతలో

"యేమండోయ్: ఇట్లారండి: ఇట్లారండి - తొందరగారావాలి: అయ్యొయ్యో:"

.....”

"అయ్యయ్యో తొందరగారండి: రావాలి రావాలి. "

"ఏమి ?"

"ఏమిటండీ. సుబ్బివిసురుతూ విసురుతూ ఇట్లా తిరుచుకొని కిందికిఒరిగిపోయిందేం? ఇట్లా పడిపోయిందేమిటండీ? పిలిస్తేపలకటంలేదు. "

"అయ్యొయ్యో పాపం! ఇట్లా పడిపోయిందే"

"ఏమిటో! ఇప్పుడు చూశానండీ. విసురుతూనే ఉంది"

"దీనికేమైనా జబ్బుందా ఏమిటి?"

"అబ్బే లేదండీ! ఏడు నెలలుగా చూస్తున్నాను. ఎప్పుడూ ఇది ఇట్లా పడిపోలేదు. అయ్యొయ్యో పాపం! ఎట్లాగండీ ఇప్పుడు"

"డాక్టరును పిలుచుకొని వస్తానుండు"

"పిలిపించండి పాపం. చూడండీ, ముందు దాని మొగుడికి చెప్పి పంపండి. కాస్త పట్టుకోస్సైనా పట్టు

"నే పట్టుకుంటాలే"

"మీరు వద్దు. వాణ్ణి పిలిపిస్తురూ—అన్నట్టు మరిచిపోయాను. దీని మొగుడికిగూడా నిన్నరాత్రి జ్వరం వచ్చి పడివున్నాడని చెప్పిందండి పాపం. అయ్యో: ఎట్లాగండి"

"అయ్యో" అంటూ శేషశాయి సుబ్బికి సమీపంలోకి పోయి చూచున్నాడు. సుబ్బి కుడిచేతిని బలవంతాన ఎత్తి నోటిదగ్గర పెట్టుకొని "దాహం దాహం" అని అర్థం అయ్యేటట్టు సంజ్ఞచేసింది.

"మంచినీళ్లు కావాలట. కాసినినీళ్లు తీసుకురా"

"అయ్యో పాపం! శోషవచ్చింది కాబోలునండీ. నిన్నటినుంచీ అన్నంలేదు పొద్దున చెప్పిందండీ పాపం. అడిగినపుడు ఆ జేపడబ్బులయినా పారేశానుగాను. పొద్దున్న అంట్లల్లో అన్నంగూడ మిగలలేదు ఇవ్వేళ. ఈపూట గూడ గంజిలేకుండా వచ్చింది గాబోలు సన్నాసిముండ: చెప్పనూలేదు, పోనీ: ఏమీ చెప్పకుండా వచ్చి తిరగలి ముందేసుకొని కూర్చుంది"

"నీచదువు తర్వాత చదవొచ్చులే. ముందు ఇన్ని నీళ్లు తీసుకొచ్చి గొంతులోపోయి"

"చన్నీళ్లా, వేన్నీళ్లా"

"నోరువచ్చని నీళ్లయితే మంచిదే"

"తెస్తాగాని ముందు ఈలోటాలో చల్లనినీళ్లు దాని ముఖాన్న కొట్టండి. కొంత తెప్పిరిల్లుతుంటుంది."

" అయ్యో: మళ్లీచూపుతోందే, దాహమట — తొందరగా నీళ్లుతే —. "

లోటాతో సరోజిని నీళ్లు తెచ్చేవరకు— సుబ్బి నోరు తెరవగా—శేషశాయి గొంతులో ఓ గుక్కెడు నీళ్లు పోశాడు — నోట్లోపోసిన రెండునిమిషాలవరకూ నీళ్లు గొంతుదిగలేదు. క్రమ క్రమంగా—ఒక్కొక్క

చుక్క దిగమింగుతూ ఆసుక్కడునీళ్లూ—అయిదు నిమిషాలకు మింగింది—.

"చూడు—ఇక వట్టినీళ్లువద్దుగాని — కాసిని చిట్టుకుడునీళ్లు తయారుచెయ్యి — నేను పోయి దీని మగనికైనా, కొడుకుకైనా పిలుచుకొనివస్తా" నని సుబ్బిని సరోజినికప్పగించి, శేషశాయి పరుగున సుబ్బి సంసారం ఉండే గుడిశకాడికి పోయినాడు.

శేషశాయిఇంటికి వాయవ్యమూలగా, గోడ్డుకు పడమటగా ఉండే సుబ్బిగుడిశ— నాలుగు ఫర్లాంగులుంటుంది దూరం — ఆగుడిశ అట్లా అపక్కగా ఉందని అనుకోవడమే గాని శేషశాయి ఎప్పుడైనా వాళ్ల గుడిశకాడికి వెళ్లాడా, చేశాడా.

అక్కడ సుబ్బిగుడిశ ఒక్కటే గాక ఇంకా ఏడుగుడిశలున్నై. ఏగుడిశకాడికిపోతే సుబ్బిసంసారం కనుపిస్తుందో తెలియకపోయె శేషశాయికి: అన్ని గుడిశలూ చుట్టు గుడిశలే. ఒక్క అడుగు ఎత్తునగా బోలు మట్టిగోడపెట్టి, దానిమీద తాటిఆకులూ, చిరిగిపోయిన ఈతచాపలూ కప్పి అమర్చబడి ఉన్నవి. మనిషి కూర్చుని దేకుతూ లోపలికిపోగల సందుమాత్రం ఉంది— ముఖద్వారం. మిగిలిన యానాదులందరూ పనులకు పోబట్టిగాబోలు ఆగుడిశల్లో ఎక్కడా శబ్దంలేకుండా—ఈతాకుతడికలతో మూయబడిన ముఖద్వారములు గలవై— గుడిశలన్నీ నిశ్శబ్దంగా ఉన్నవి. ఒక్క గుడిశకాడ మాత్రం సందడిగా ఉంది. సుబ్బిపిల్లలు—అప్పుడప్పుడు తల్లితో శేషశాయిఇంటికివస్తూ పోతూ ఉన్న వాళ్లయినప్పటికీ— ఎందువల్లనో శేషశాయికి వాళ్లు గుర్తు చిక్కలేదు.

ఆయన పోయేవరకు సుబ్బిపిల్లలు—నలుగురు ఆడపిల్లలూ, అయిదుగురు మొగపిల్లలూ— గుడిశకాడ బయట గలభాచేస్తున్నారు. ముసలాడు - తండ్రి గుడిశలో కాళ్లుచాచుకొని క్రిందనే తలకింద ఇటుకరాళ్లు ఎత్తుపెట్టుకొని పెల్లికిలాపండుకొని ఊ, ఊ, ఊ అని మూలుగుతున్నాడు. శేషశాయి వచ్చినసంగతి బయట పిల్లలెవ్వరూ గమనించలేదింకా. సుబ్బి పెద్దకొడుకు సుబ్బరాముడు ౧౬ ఏళ్లవాడు ఓగోచీపెట్టుకొని నడుంగా కూర్చున్నాడు. వాడిచుట్టూ మిగిలినపిల్లలందరూ—కొందరికొంతమంది—మంచానికొంతమంది—గంతులేస్తూ కొంతమంది— మారాములు చేస్తున్నారు. సుబ్బరాముడికీ వాడిచెల్లెళ్లకిద్దరికీ గుడ్డలన్నీ తడిసిపోయి ఒళ్లంతా బురద అంటుకొని ఎండిపోయి నల్లగా, బురదలో పొర్లివచ్చిన వరాహావతారాల్లాగా ఉన్నారు.

సుబ్బరాముడు తనముందొకకుండబొచ్చె పెట్టుకొని మిగిలినవాళ్లు మారాములు చేస్తూ ఉంటే వాళ్లని నవ్వుతూ, భయపెడుతూ సమాధానపెడుతూ ఎవ్వరికీ లోపం లేకుండా పంచిపెట్టుతున్నాడు; కాని తనకంటె చిన్నవాళ్లయినప్పటికీ-ఒకరిద్దరు ఆఘాయిత్యపు పిల్లలు సుబ్బరాముడిమీద ఎగబడి, బొచ్చెలోనిది బలవంతంగా లాగి బెరుక్కుని దూరంగా పారిపోయి మామిడి చెట్టుకింద నిలుచుకొని ఆత్రంతో గతుక్కుంటూ నోట్లో కుక్కుకొంటున్నారు. "ఈ పాలిరా గడవా పెడతాలే. అమ్మకీ అయ్యకీ మిగలపనిలే అంతా మీ పొట్టనే పెట్టుకొంటే" అంటూ సుబ్బరాముడు చేయి జారిపోయిన వస్తువును గురించి తమ్ముల దుండగానికి ఆక్రోశపడుతున్నాడు. మరికొంతమంది అన్న ఇచ్చిన దానితోనే తృప్తిపడి మంచితనంగానే అన్నను బెల్లించుకొని తీసుకొని తింటున్నారు. పిల్లల్లోకల్లా ఎడపిల్లవాడు - శేషుడు గాబోలు - నాలుగేళ్లకుంక - ఈమధ్య ఆడుకోవడంలో ఎక్కడనుంచో కాలుజారిపడి, ఎడంకాలుతొడలో విరిగినందున వచ్చినంత జబ్బుచేసి చికిత్స చేసేవాళ్లులేక పోయినకాలు రానందున దేకుకొంటూనే త్రొక్కుల్లాడుతున్న ఆ సంఘంలో ఎట్లాగో మరి అన్నమీద ఎగపడ్డాడు. ప్రాణంమీదకొచ్చి తిరిగీ జన్మ ఎత్తిన తజబ్బుచేసినందువల్ల శేషడికి బలహీనంవల్ల ఊపిరపొట్ట పెరిగి కాళ్లూ చేతులూ సన్నగిలి చూచేవాళ్లకి వీడెట్లా బతుకుతాడా అని అనిపించేటట్టున్నాడు పాపం. వాణ్ణి చూడంగనే సుబ్బరాముడికి దయగలిగి ఉన్నవాటిలో లేతవి మంచివిగా రెండు ఏరి బురదములికి "ఇయిగో

"ఏమిటి? నిద్రేనా ఏమిటి? అన్నం తినకుండా నిద్రపోయిందీ - చిన్న పిల్లాడిలాగ" అంటూ లేచి సరోజిని శేషశాయిపడుకున్న మంచం దగ్గరకు వచ్చింది. బెడ్‌రూములైటుకు తలుపు అడ్డం వచ్చి శేషశాయి మొఖానకి చీకటిఅయింది. దగ్గరకు వచ్చి తట్టి పలకరించింది. శేషశాయి పలకలేదు. మీదచేయివేసి ఇటూ ఇటూ కదిపి పలకరించింది: నిద్రపోతూఉన్నవాళ్ళని లేపడం సులభంగాని మేలుకొని ఉన్నవాళ్ళను లేపడం కష్టంగా! ప్రణయ కోపమేమోనని అనుకొని చీకటిలోవున్న శేషశాయి ముఖానికి తన ముఖం దగ్గరగా పెట్టి - ముందుకువంగి శేషశాయికి కితకితలు పెట్టింది అవీ పనిచేయలేదు: 'ఏమిటండీ: ఇల్లాపండుకొన్నారు." అని ఇష్టంపుచ్చుకొని ఆ పక్కగా ఒత్తిగిలి పండుకొనిఉన్న శేషశాయిముఖాన్ని తనపక్కకి తిప్పుకొనే ప్రయత్నంలో ఒళ్ళువెచ్చగా చేతికితగిలింది. కొంచెం ఆందోళన కలిగి ఏమిటాయనుకొని, మంచంమీదకూచుని తలగడమీద చేయిపడేవరకు అది చల్లగా ముద్దలా ఉంది.

"ఏమిటండీ: ఎందు కిట్లా?"

"........... ......."

"ఎందుకూ ఈదుఃఖం?"

"........................."

"చెప్పరుగదూ? నన్ను చంపుకొన్నంత ఒట్టే" అని అనేవరకు శేషశాయి లేచికూర్చొని రెండు చేతులూ సరోజిని మెడకుచుట్టి తల ఆమెభుజంమీదపెట్టి కళ్ళకు చిల్లులు పొడుచుకొని - ఆమెరవికెను స్నానం చేయిస్తున్నాడు. సరోజినికి కంపంఎత్తుతూంది.

"సరోజినీ, నాకిప్పుడు ఆకలిలేదు: అన్నం తినను"

"................ ........."

"తినలేను: నాకడుపులో నీవు చిచ్చుపెట్టి నోటిలో అన్నంపెట్టితే నేను తినగలనా?"

"........................."

"ఇన్నాళ్ళగా నాతో కాపురం చేస్తున్నావు గాని నామనస్సెట్టిదో నీవు తెలుసుకోలేక పోయినావు గదా! నాకానందం కలుగచేసేపనులు నీవు చేసినప్పుడు గదా నీ చేతి అన్నం నాకానందం కలుగ చేస్తుంది. ఈ రోజు నాజన్మలో దుర్దినం—"

"నే నేంచేశానండీ. అంత తప్పుపని చేసిన జ్ఞాపకం నాకేమీ లేదే?"

"అవును. అందుకనే నాదుఃఖం. నీవు రోజూ చేస్తూ ఉన్నది నీకుపరిపాటి అయిపోబట్టి నీకు తప్పుగా తోచదు. అదితప్పు అని ఇతరులు చెప్పితేగాని నీకు తప్పు అని తెలియదు. ఒకవేళ ఇతరులు చెప్పినా కూడ నీకు తప్పుగా తోచదేమో.

"..... ....................."

"సరోజినీ! ఉదయంనుండి చూస్తున్నాను. నీ వింతకఠినహృదయ వని నే ననుకోలేదు. అనేకగ్రంథాలు చదివావు. అనేక పత్రికలు చదువుతూ ఉంటావు దేశమూ దేశభక్తీ అంటే పరేనంటావు. కాని ఏమిప్రయోజనం? నీ ఇంటిముంగిట తాండవించే దరిద్రదేవతను తరిమివేయలేకపోతున్నావు. ఎందుకీ దొంగాట? ఎవరికోరకు?"

"

"పొద్దున్న నీవు చేసినకూరగాయలబేరం నీ కిప్పుడైనా జ్ఞాపకం ఉందా? ఆ బేరాలు చూసినప్పటినుండీ నాదుఃఖం ఇనుమడించింది. దమ్మిడీదగ్గర, చిట్టెడు గింజలదగ్గర వాళ్లను ఎంత ఏడిపించి పంపావు. ఛీ. ఛీ. ఇంత ఉదార శూన్యతగల హృదయంకలదానవని నేననుకోలేదుసుమా. పనిచేయక, సోమరిపోతులయి, ముష్టి ఎత్తుకొని బ్రతకడం గౌరవంగా భావించి, ఏదితాగో, ఏతాంబురాయో పట్టుకొని, ముఖాన్న విభూతి పెండికట్లులో, తిరుచూర్ణరేఖలో ధరించి ఏ బ్రహ్మంగారి తత్వాలో పాడుకొంటూవస్తే తవ్వలతోనూ, సోలలతోనూ ఉపాదానం చేస్తావు. కాని అడుక్కొని తినడం ఇష్టంలేక, ఇతర పెద్ద పెద్ద వ్యాపారాలు చేసు కోవడం వీలులేక ఏ కూరో, ఏ కాయో, ఏ ఆకో, ఏ అలమో కష్టపడిమోసుకొని నీ యింటికాడికి అమ్ముకోనువస్తే వాళ్లతో ఆబేరాలేమిటి? ఎన్నిదమ్మిడీలు

ఈ ప్రకారంగా మిగిల్చి నీ మెడలోని నాలుగువేల రూపాయల బంగారం బరువును మరింత వృద్ధిచేయా లనుకొన్నావు ? పట్నవాసాల్లో షాపుల్లోనికిపోతే చోరం చేయగూడదని పెద్దపెద్ద అక్షరాలు అచ్చువే యించి ఎదురుగా తగిలిస్తారే? మొన్న నీవు రెండు వందలరూపాయల చీరలూ రవికలూ కొనుక్కొన్నా వుగదా: అప్పుడు ఈ చోరాలు చేయలేక పోయినావేమి? ఈ వంకాయచోరాలు అక్కడ సాగవనేకామూ? వీళ్లు దరిద్రులు గాబట్టి, నీవు ఐశ్వర్యవంతురాలవు గాబట్టి నీవు కొట్టినా తిట్టినా పడి ఉంటారని గదా నీకు ఈ వంకాయలదగ్గరా - పొన్నగంటాకు దగ్గరా - వేప పల్లు దగ్గరా. ఛీ: ఛీ: ఛీ: ఎందుకీ చోరాలు ........."

"

"అబ్బా! తలుచుకొంటే కడుపుదహించుకొని పోతూంది. "బాలింతరాలిని రవికలేక బయటికి పోవా లంటే సిగ్గవుతుంది. ఒక్క పాతరవికె పారెయ్యమ్మా" అని నీవంటి ఆడది నోరువిడిచి అడిగితే అంతమాత్రం యివ్వడానికి నీకు మనస్సురాలేకపోయింది గదా: "అన్నంలేక పాలెండిపోయినై - ఒక్క పిడచ అన్నం పెట్టమ్మా" అని అడిగిన ఎరుకలదాని ఆకలి తీర్చలేక పోయినావు. ఆఖరుకు చంటిబిడ్డ మాడున పెట్టుకోను రవంత ఆముదం చుక్క పెట్టమని గోలపెట్టితే చెయ్యి ఊరుకోలేదని తలుపుబిగించి లోనికిపోయావు. నేనన్నీ గమనిస్తూనే ఉన్నాను: నీస్వాతంత్ర్యానికి భంగం కలిగితే నీవు ఆ సమయంలో ఓర్చుకోలేవని, సమయం చూచి నీకు నచ్చచెప్పాలి అని అప్పుడు నోరుమూసుకొని ఊరుకున్నాను. సరోజినీ! ఆడదాని మనస్సు మగవాని మనస్సుకంటె కోమలమయిందని అంటారుగాని నాకు నమ్మకం లేదు"

"... ... ...

"నేనిట్లా అంటున్నానని కోపపడకు. నా మనస్సు కుమిలి కుమిలి నీమీద నాకు గల ప్రేమ నన్నీరోజు ఇట్లా అనిపిస్తూంది. నీవు దినమ్మూ చేసే చర్యల లోని అర్థం నీకు విపులంగా నచ్చచెప్పి నే నభిలషించిన విధముగా నిన్ను మార్చవలెననే నాకోరికగాని నీ మీద నాకు అసూయా, ఆగ్రహం లేదు: తెలిసిందా. ఆఖరుకు నీచేత సుబ్బి కొక పాతచీరైనా ఈ రోజు ఇప్పించలేకపోయాను నేను ఇవ్వాళ. ఆరునెలలయింది చీరయిచ్చి ఇప్పుడేమి తొందరన్నావు. నీవు ౬ గంటల కొకసారి చీర మార్చనిదే ఉండలేవే. అది ఆరునెలల కయినా చీరమార్చుటకు వాయిదా రానప్పుడు ఇంకా ఎప్పుడు వస్తుంది? నీ చీరలూ, నీ రవికెలూ దాచి పెట్టుకోను ఓ బీరువాచాలక ఇంకో బీరువాను చేయించమని తొందర చేస్తున్నావు గదా! ఎందుకు నీకిన్ని చీరలు? రోజుకు పదిగంటలకాలం నీయింట్లో దాస్యం చేసి, నెలకు రూపాయి పావలా జీతం తీసుకొనిజీవించే ఆడదానికి చీరలుకొనుక్కొను డబ్బు ఎక్కడనుంచి వస్తుందనుకొన్నావు. నిన్నాశ్రయించుకొన్న జీవియెడ నీకే కరుణలేనపుడు. ఇక బయటివాళ్లకెట్లా కలుగు ననుకొన్నావు, 'వరికోతకు పోతాను. నాలుగు రోజులు శలవు ఇవ్వవలసిం' దని కోరితే నీవు నిరాకరించినావటగా! అబ్బా! ఎంత కఠినహృదయం నీది సరోజినీ. ప్రేమలేని జన్మ నిరర్థకం. కరుణలేని జీవితం నిష్ఫలం. దయాదాక్షిణ్యాలు లేని జీవనం నిష్ప్రయోజనం! నిష్ప్రయోజనం! ఉప్పిక అవుతూంది. ఇన్నిమందినీళ్లు ఇయ్యి..."

"........................."

"ఇంతకీ నేను చేసుకొన్న పాపఫలం కాకపోతే నీచేతికిందపనిచేసే నీవంటి ఆడదానియెడ నీవింత కాఠిన్యం వహించి, నాకింతదుఃఖం కలిగించి ఉండవు. ఆహా! తలచుకొంటే ఆశ్చర్యం కలుగుతుంది. నాకంటె రెట్టింపుగా నెలకి వందలకొద్దీ సంపాదించుకొని, తిన్నది హరించుకోలేక, అజీర్తివ్యాధిచే బాధపడే నావంటి ప్లీడరు శ్యామలరావు ఇంట్లో అడుగుపెట్టంగనే, అడగకుండానే పళ్లెంలో అమర్చి ఫలహారాలు ముందుపెట్టినావు. కాని చెమట ఊడ్చి నీకు ఊడిగంచేసే దాసిదానికి ఒక్క బేడడబ్బు లివ్వలేకపోయినావు. అబ్బా! ఈ రోజు దాని ప్రాణాలు మన ఇంట్లో అన్యాయంగా

పోయి ఉంటుంది! దాని నుదిశకుపోయి చూతును గదా, కుచేలుని సంతానంవలె దాని పిల్లలు పదిమంది తిన డానికి కూడు లేక, నిన్నా ఈ రోజు కూడా పచ్చి చేపలు, పచ్చికప్పలు, పచ్చి ఎండ్రకాయలూ-బురదలో పట్టినవి. బురదయినా దులపకుండా తింటున్నారు. ఇక నాకు అన్నం నోటికెట్లాపోతుంది సరోజినీ! నీవు పోయి తిను. నాకు ఆకలి అవటంలేదు."

"........................."

"దుఃఖించి ప్రయోజనం లేదు. నేనిట్లాగా, నీవిట్లాగా కన్నీళ్ళు కారిస్తే ప్రయోజనం లేదు. మన కన్నీటిధార దారిద్ర్యదుఃఖాగ్నిని చల్లార్చి, ఈ జన్మలో ఒక్క జీవుని దుఃఖమైనా తొలగింపచేసినప్పుడు గదా మన జన్మ సార్థకం. అది లేనప్పుడు మన జన్మ ఎందుకు?......"

"........................."

"సృష్టిలో కల్లా మానవజన్మ సర్వోత్కృష్టమైనదని పెద్దలంటారు. అందేగాదు చాలా పవిత్రమైనదనికూడా అంటారు. అట్టి పవిత్రమైన జన్మలు పోషించుకొనేటందుకు అన్నమూ, నీళ్ళూ లేక, ఎన్ని కులముల వారు నశించి పోతున్నారో నీకు తెలియదు. నీ కాకలిబాధ ఎట్లాంటిదో తెలియదు గాబట్టి లోకంలో నీ కాకలి బాధ ఉన్నదని నీవు తెలుసుకోలేక పోతావు. దారిద్ర్య దుఃఖం నీకు లేదు గాబట్టి లోకంలో అది లేదనుకొంటున్నావు. గడపదాటి బయట తలపెట్ట వలసిన అవసరం నీకు లేదు గాబట్టి, లోకంలోవున్న దుఃఖం నీవెరుగవు. నీ కాళ్ళకు మొక్కుకొని నీకు దాస్యంచేసే రామానాడిదాని కడుపులోని బాధే నీకు తెలియనప్పుడు, ఇక బయటిబాధ నీకు ఎట్లా తెలుస్తుంది?"

"................."

"నీ సంసారంలో నీకింత స్వేచ్ఛ ఉన్నందుకు, నిన్నింటిపెట్టుకొని నిన్నాశ్రయించిన పరిప్రోట్టు జీవుల్ని ఎందరిని నీవు ఉద్ధరించగలవో ఆలోచించుకో: నీభర్తమీద, నీపుత్రునిమీద నీవు ఎట్టి ప్రేమతో ప్రవర్తిస్తున్నావో అట్టి ప్రేమనే ఇతరజీవులమీద ప్రసరింపజేస్తే ఇట్టి అల్పగుణాలు అలవడవు. సరోజినీ! ఇకనైనా నీమనసు మార్చుకో. ఎన్నిరోజులనుంచో నీకీ విషయాలు చెప్పవలెనని అనుకోవడమేగాని నాకు అట్టి అవకాశం ఇదివరకు చిక్కలేదు.

"నాథా! నా తప్పులన్నీ క్షమించండి. ఇక మీదట మీ కోరికప్రకారమే ప్రవర్తించి మీ కానందము కలుగచేసి దినములు గడుపుకొంటూ ఉంటాను. ఈతప్పు క్షమించి ఈపూట భోజనానికి లెండి."

"సరోజినీ! ఈనాడు నామనస్సులో గలిగిన ఈ దుర్భరమైన ఆవేదన ఈరాత్రి ఉపవాసవ్రతంవల్ల గాని చల్లారి, నాకు శాంతి కలుగదు. నే నీరాత్రి ఉపవసించి సర్వేశ్వరుని ప్రార్థిస్తూ గడపవలెనని నిశ్చయం చేసుకొన్నాను. నీవు మరోకలాగున అనుకోకు."

సరోజిని లోపల పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక అనేక విహ్వలమైన అవస్థలోపడి మనశ్శాంతికోరకై నాథుని పాదములపై వ్రాలి అతని పాదపద్మములను కన్నీటిధారచే అభిషేకించింది. పాదములపై చేయబడిన అభిషేక శైత్యంవల్ల శేషశాయికి తలనొప్పి కొంత ఉపశమించిందిగాని, కడుపులో బాధ యింకా తగ్గనందువల్ల 'లంఘనం పరమౌషధం' అని ఆరాత్రి సర్వేశ్వరుని ప్రార్థిస్తూ తన హృదయాన్ని ఆయన పదసన్నిధానంనిలిపి ధ్యానించుకోగా, కడుపులో వేడికూడా కొంతసేపటికి చల్లారగా నిద్రపట్టినది. సరోజినికూడా ఆరాత్రి అన్నంవర్జించి భర్త నిద్రపోయినపిదపకూడా ఆయనకు శైత్యోపచారాలుచేసి, ఆరాత్రి భర్తను అనుకరించి, తెల్లవారి లేచేవరకు ఆమెకు ఆకలిబాధ ఎట్లాంటిదో కొంత తెలిసింది.

---

# మన యాహారము

౨౦

గోటేటి జోగిరాజు

యువనామ సంవత్సర కార్తికమాసపు సంచిక యందలి తొమ్మిదవ వ్యాసమున కూరగాయలు మొదలగువాని యాహారపు విలువనుగూర్చి తెలుపబడెను. దానితో నాయాతరగతుల తిండివస్తువుల తత్త్వపరిశీలన ముగిసెను. ఈపరిశీలనవలన నాయాతరగతులలోని యేప్రత్యేకవస్తువుగాని మానవశరీరమునకు సమగ్రమును, ఆరోగ్యకరమునునగు నాహారముగ బనికివచ్చునని చెప్పదగునది కవబడదు. అనుకూలమగు కొన్నివస్తువులను చేర్చితిననిగాని సమగ్రమును ఆరోగ్యకరమునునగు నాహారము లభింపదు.

ఆహారనిర్ణయమునందు గమనింపవలసిన ముఖ్యసూత్రములుకొన్ని, మొదటివ్యాసమున వివరింపబడెను. అందు ముఖ్యమైనవి యీక్రింద సంగ్రహముగ మరల వ్రాయబడును.

౧. ఆహారపు మొత్తపు యింధనశక్తి మనిషియొక్క వయసు, పని, బరువు వీనికి తగినట్లుండవలెను.

౨. ఆహారమునందలి మాంసకృత్తులు, చమురు, కర్బనోదజనితములు శరీరమునకువలయు పరిమితిని గలిగియుండుటయేగాక సమీకరణమున కనుకూలమగు రూపమునగూడ నుండవలయును.

౩. శరీరమునకు వలయు ఖనిజద్రవ్యములుకూడ సమీకరణమగు రూపమున తగినంతయుండవలెను.

౪. శరీరమునకు జీవశక్తినిచ్చు A, B, C, D, వగైరా విటమినులుకూడ ఆహారమున తగినంత యుండవలెను.

౫. కడుపునింపి తృప్తిగలిగించుటకు తగినట్లు కొంతస్థూలత్వమును గలిగియుండుటయు మలవిసర్జనకు సహాయపడుటకు తగినంతసారపదార్థముతో కూడియుండుటయుకూడ అనుకూలమగు నాహారలక్షణములనిచెప్పవచ్చును.

పైలక్షణములను గలిగియుండునట్లు, వెనుకటి వ్యాసములందు పేర్కొనబడిన వేర్వేరు తరగతులందలి యాహారద్రవ్యముల నెట్లు సంపుటీకరణము చేసికొనవలెనో తెలుపుటకు ఈ క్రింద కొన్నిపట్టికలు వ్రాయబడును. ఈపట్టికలందు సూచింపబడిన ద్రవ్యములుగాని, వానిసంపుటీకరణముగాని, ప్రతిమనిషికిని అనుకూలింపకపోవచ్చును. ఆహారశాస్త్రముగాని, శారీరశాస్త్రముగాని యింకను పరిపూర్ణతనొందకపోవుటచే నెంత ప్రవీణుడైన శాస్త్రజ్ఞుడయినను ప్రతివ్యక్తికిని అనుకూలించు ఆహారపుపట్టికను వ్రాసి యివ్వజాలడు. తన యాహారమును సంస్కరించుకొనవలచు యేవ్యక్తియయినను ఆహారశాస్త్రముఖ్యసూత్రముల ననుసరించి వ్రాయబడు యీక్రింది పట్టికలవంటి పట్టికలలో సూచింపబడు ఆహార సంపుటీలలో నేది తనవయసు, తూనిక, పాటు, శరీరతత్త్వము మొదలగు వానినిబట్టి తన కనుకూలించునని తోచునో దాని నవలంబించి, అనుభవమునుబట్టి అందు తగిన మార్పులను చేసికొనవలసియుండును.

వెనుకటి వ్యాసములందు పేర్కొనబడినపెక్కుద్రవ్యములలో నిరువదిరెండు ముఖ్యద్రవ్యములుమాత్రమే యీక్రిందిపట్టికలందలి యాహారసంపుటీ లిందు చేరియున్నవి. ఈపట్టికలందలి యంకెలను సులువుగ గ్రహింపగలుగుటకు ఈయిరువదిరెంటి సంఘట్టనమును మరల నొకచోట చేర్చి యీక్రింద వ్రాయుట యుక్తముగ నుండును.

| ఆహారద్రవ్యము | ఒక ఔన్సులో గల మాంసకృత్తులు (గ్రాములు) | చమురు (గ్రాములు) | కర్బనోదజనితములు (గ్రాములు) | ఇంధనశక్తి 1 ఔన్సుకు కాలరీలు | 100 పా. తూనికకువలయు ఖనిజ ద్రవ్యముల I ఔన్సు వలన లభించు సున్నము % | స్ఫురము % | ఇనుము % | విటమినుల పరిమితి ఎ | బి | సి | పౌను 1 కి వెల రు. | అ. | పై. | 1 అణాకు లభించు ఇంధన శక్తి (కాలరీలు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. చేబియ్యము | 2.30 | 0.09 | 22.80 | 99 | 0.6 | 6.3 | 5.5 | స్వ | + | o | 0 | 0 | 8 | 2376 |
| 2. గోధుమ (పొట్టుతో) | 3.9) | 0.54 | 20.35 | 102 | 3 8 | 9.1 | 9.1 | + | ++ | o | 0 | 0 | 9 | 2176 |
| 3. చోడి | 2.78 | 0.46 | 23.35 | 108 | | | | + | ++ | o | 0 | 0 | 6 | 3456 |
| 4. వరి తవుడు | 5.70 | 6 00 | 8.10 | 110 | 4.8 | 40.0 | 35.0 | + | ++ | o | 0 | 0 | 4 | 5280 |
| 5. కంది | 6.50 | 0.99 | 16.20 | 100 | 5.0 | 13.1 | 25.0 | + | ++ | o | 0 | 0 | 6 | 3200 |
| 6. పెసర | 6.71 | 0.81 | 18.12 | 107 | | | | | | | 0 | 0 | 6 | 3424 |
| 7. మినుము | 6.81 | 0.66 | 18 20 | 106 | 6 4 | 13.1 | 26.0 | + | ++ | o | 0 | 0 | 6 | 3392 |
| 8. వేరుసెనగ | 8.72 | 14.78 | 3.96 | 184 | 4.4 | 12.8 | 5.6 | + | ++ | o | 0 | 0 | 9 | 3925 |
| 9. నూవులు | 6.08 | 15.48 | 4.93 | 183 | 54.0 | 18.9 | ? | + | ++ | o | 0 | 1 | 0 | 2928 |
| 10. తెలికపిండి (నూవుపొట్టుతో) | 11.40 | 3.00 | 9.60 | 111 | 90 0 | 31.0 | ? | + | ++ | o | 0 | 0 | 8 | 2664 |
| 11. నూనె | — | 28 | — | 252 | — | — | — | ++ | o | o | 0 | 4 | 0 | 1008 |
| 12. కొబ్బెర (సగము ముదిరినది) | 1.70 | 10.8 | 3.6 | 118 | 3.0 | 5.1 | 1.2 | + | + | o | 0 | 1 | 0 | 1888 |
| 13. ఆవుపాలు | 1.00 | 1.32 | 1.50 | 22 | 6 2 | 2 4 | 0.5 | +++ | ++ | + | 0 | 0 | 9 | 469 |
| 14. మజ్జిగ | 0.85 | 0.14 | 1.36 | 9 | 5 5 | 2.6 | 0.6 | + | + | + | 0 | 0 | 3 | 576 |
| 15. వెన్న | — | 23.10 | — | 208 | — | — | — | +++ | o | o | 0 | 12 | 0 | 277 |
| 16. నేయి | — | 28.00 | — | 252 | — | — | — | ++ | o | o | 0 | 8 | 0 | 504 |
| 17. పండ్లు (అరటి) | 0.40 | 0.2) | 6.60 | 28 | 0 5 | 0.9 | 1.5 | స్వ | + | + | 0 | 0 | 4 | 1344 |
| 18. పండ్లు (ఇతరజాతులసగటు) | 0.16 | 0.07 | 2.59 | 12 | 1.0 | 0.6 | 0.9 | ++ | ++ | ++ | 0 | 1 | 0 | 192 |
| 19. కాయగూరలు (సగటు) | 0.30 | 0.04 | 1.40 | 7 | 0.7 | 0.8 | 0.7 | + | ++ | +++ | 0 | 0 | 4 | 336 |
| 20. ఆకుకూరలు (సగటు) | 0.40 | 0.05 | 0.88 | 5 | 2.4 | 1.00 | 3.9 | +++ | +++ | +++ | 0 | 0 | 2 | 480 |
| 21. బెల్లము | 0.08 | — | 25.00 | 100 | — | — | — | — | స్వ | o | 0 | 0 | 8 | 2400 |
| 22. తేనె | 0.11 | — | 20.21 | 80 | 0 4 | 0.6 | 2 8 | స్వ | స్వ | o | 0 | 4 | 0 | 324 |

*　　*　　*　　*

### పట్టిక ౧. వరియన్నము ప్రధానముగాఁగల యాహారము

| ఆహార ద్రవ్యము | ద్రవ్యపరిమితి ఔన్సులలో | ఆహారద్రవ్యము నందలి: మాంసకృత్తులు | క్రొవ్వు | కార్బోహైడ్రేట్లు | ఉత్పత్తియగు కాలరీలు | ఖనిజద్రవ్యముల పరిమితిలో వల సినదానిలో %: సున్నము | భాస్వరము | ఇనుము | విటమినుల పరిమితి: ఎ | బి | సి | 1 కాలరీ నిచ్చు ద్రవ్యముల పరిమితి | 1 సెలవుకల యా ద్రవ్యముల విలువ: రు. | అ. | పై. | వరా. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | గ్రా | గ్రా | గ్రా | | | | | | | | | | | | |
| 1. చేబియ్యము | 8 | 18 | 1 | 178 | 792 | 5 | 50 | 44 | స్వ | + | ० | 15 | 0 | 10 | 0 | |
| 2. కందిపప్పు | 2 | 14 | 2 | 32 | 200 | 10 | 26 | 50 | + | ++ | ० | 3¾ | 0 | 1 | 11 | |
| 3. కాయగూరలు | 6 | 2 | — | 8 | 42 | 4 | 5 | 4 | + | ++ | +++ | 11¼ | 0 | 3 | 9 | |
| 4. ఆకుగూరలు | 2 | 1 | — | 2 | 10 | 5 | 2 | 8 | +++ | +++ | +++ | 3¾ | 0 | 0 | 8 | |
| 5. నూనె (పోపులకు) | ¼ | — | 7 | — | 63 | — | — | — | ++ | ० | ० | 15 | 0 | 2 | 0 | |
| 6. నేయి | ¾ | — | 21 | | 189 | — | — | — | ++ | ० | ० | 1 ౧౧/౩౧ | 0 | 11 | 8 | |
| 7. మజ్జిగ | 16 | 14 | 2 | 22 | 144 | 08 | 42 | 12 | + | + | + | 30 | 0 | 7 | 6 | |
| 8. పండ్లు (అరటి) | 6 | 2 | 1 | 40 | 168 | 8 | 5 | 9 | స్వ | + | + | 11¼ | 0 | 3 | 9 | |
| | | 51 | 34 | 282 | 1608 | 115 | 130 | 127 | | | | | 2 | 8 | 10 | |
| రద్దుకు మినహాయింపు 10% | | 5 | 3 | 28 | 161 | 12 | 13 | 13 | | | | | | | | |
| పోషనికరం | | 46 | 31 | 254 | 1447 | 103 | 117 | 114 | | | | | | | | |

(౧) ఈ యాహారము దినమునకంతటికిని సరిపడును. వీలునుబట్టి ౨సార్లుగాని ౩ సార్లుగాని విభజించి పుచ్చుకొనవలెను. ఉదయమున ౬ ఔన్సుల మజ్జిగయు ౧ అరటిపండును పుచ్చుకొని తక్కినవి మధ్యాహ్నము రాత్రి పుచ్చుకొనవచ్చును.

(౨) రుచికొరకు సుమారు ½ ఔన్సు ఉప్పును ½ ఔన్సు మసాలా ద్రవ్యములను చేర్చుకొనవచ్చును.

(౩) కందిపప్పునకు బదులు ఆయాతత్త్వముల యనుకూలతనుబట్టి పెసరపప్పునుగూడ నుపయోగింపవచ్చును.

(౪) ౧౬ ఔన్సుల మజ్జిగ అనగా ౧౬ ఔన్సుల పాలను తోడుపెట్టి వెన్న తీయగా మిగులునది. దీనికిబదులు పాలనుగాని పెరుగునుగాని పుచ్చుకొనవచ్చును. కాని అట్లుపుచ్చుకొను ప్రతి౬ ఔన్సులకును ½ ఔన్సు నేతిని తగ్గించవలెను.

(౫) అరటిపండ్లకు బదులు అంతే ఇంధనశక్తి నిచ్చు నితరపండ్లను పుచ్చుకొనవచ్చును.

పట్టిక ౨. గోధుమయన్నముగాని రొట్టెగాని ప్రధానముగ గల్గు యాహారము

| ఆహార ద్రవ్యము | ద్రవ్యపరిమితి ఔన్సులు | ఆహారద్రవ్యము నందలి మాంసకృత్తులు | క్రొవ్వు | కర్బోహైడ్రేటులు | ఇచ్చు ఉష్ణపరిమాణము కేలరీలు | ఖనిజద్రవ్యముల పరిమితిలో వలసిన దానిలో % సున్నము | భాస్వరము | ఇనుము | విటమినుల పరిమితి ఎ | బి | సి | 1 నెలకు పట్టు ద్రవ్యముల పరిమితి | 1 నెలకు వలయు ద్రవ్యముల విలువ రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. గోధుము పొట్టుతో | 8 | 31 | 4 | 163 | 816 | 30 | 73 | 73 | + | ++ | o | 15 | 0 | 11 | 3 |
| 2. పెసర పప్పు | 1 | 7 | 1 | 18 | 107 | 5 | 13 | 25 | + | ++ | o | 1 7/8 | 0 | 0 | 11 |
| 3. కాయగూరలు | 8 | 3 | — | 11 | 56 | 4 | 5 | 4 | + | ++ | ++ | 15 | 0 | 5 | 0 |
| 4. ఆకు కూరలు | 2 | 1 | — | 2 | 10 | 5 | 2 | 8 | +++ | +++ | +++ | 3¾ | 0 | 0 | 8 |
| 5. నూనె | ¼ | — | 7 | — | 63 | — | — | — | ++ | o | o | 15/32 | 0 | 2 | 0 |
| 6. నేయి | 1 | — | 28 | — | 252 | — | — | — | ++ | o | o | 1 7/8 | 0 | 15 | 0 |
| 7. మజ్జిగ | 12 | 10 | 21 | 16 | 108 | 69 | 31 | 7 | + | + | + | 22½ | 0 | 5 | 8 |
| 8. పండ్లు (అరటి) | 8 | 3 | 1 | 53 | 224 | 4 | 7 | 12 | స్వ | + | + | 15 | 0 | 5 | 0 |
| | | 55 | 43 | 263 | 1636 | 113 | 129 | 126 | | | | | 2 | 13 | 6 |
| రద్దుకు మినహాయింపు 10% | | 6 | 4 | 26 | 164 | 11 | 13 | 13 | | | | | | | |
| పోను నికరము | | 49 | 39 | 237 | 1472 | 102 | 116 | 113 | | | | | | | |

౧ వ పట్టిక యందలి ౧, ౩, ౪, ౫ వరాలు దీనికివర్తించును. అలవాటుచేసికొనువారికి దానికంటె నిదియెక్కువ ఆరోగ్యకరముగ నుండును. అలవాటుపడువరకును ఒక్కపూట మొదటిపట్టికయందలి యాహారమును ఒకపూట నిందలి యాహారమును పుచ్చుకొనవచ్చును, లేక ౩వపట్టికయందు చూపబడిన వరి, గోధుమ కలసినయాహారమును తినవచ్చును.

గోధుమను గింజ ౨, ౩ ముక్కలగునట్లు విసరి యన్నముగవండి తినవచ్చును లేక పిండిగ (పొట్టుతీసివేయకుండ) విసరి రొట్టిచేసి తినవచ్చును లేక గింజ ౨, ౩ ముక్కలగునట్లు విసరి, గోధుమలను, పెసరపప్పును, కలిపి పులగముగవండి తినవచ్చును.

పట్టిక 3. వరియు, గోధుమయు కలసి ప్రధానముగ గల యాహారము

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. చేబియ్యము | 5 | 11 | — | 111 | 495 | 4 | 31 | 28 | స్వ | + | o | 9 3/8 | 0 | 6 | 3 |
| 2. గోధుమ (పొట్టుతో) | 3 | 12 | 2 | 61 | 306 | 12 | 27 | 27 | + | ++ | o | 5 5/8 | 0 | 4 | 3 |
| 3. పెసరపప్పు (పొట్టుతో) | 1½ | 10 | 1 | 27 | 160 | 8 | 20 | 38 | + | ++ | o | 2 13/16 | 0 | 1 | 5 |
| 4. కాయగూరలు | 8 | 3 | — | 11 | 56 | 4 | 5 | 4 | + | ++ | ++ | 15 | 0 | 5 | 0 |
| 5. ఆకుగూరలు | 2 | 1 | — | 2 | 10 | 5 | 2 | 8 | +++ | +++ | +++ | 8¾ | 0 | 0 | |
| 6. నూనె | ¼ | — | 7 | — | 68 | — | — | — | ++ | o | o | 15/32 | 0 | 2 | 0 |
| 7. నేయి | ¼ | — | 28 | — | 252 | — | — | — | ++ | o | o | 1 2/8 | 0 | 15 | 0 |
| 8. మజ్జిగ | 16 | 14 | 2 | 22 | 144 | 88 | 42 | 12 | + | + | + | 30 | 0 | 7 | 6 |
| 9. పండ్లు (అరటి) | 6 | 2 | 1 | 40 | 168 | 3 | 5 | 9 | స్వ | + | + | 11¼ | 0 | 3 | 9 |
| | | 53 | 41 | 274 | 1654 | 124 | 132 | 126 | | | | | 2 | 13 | 10 |
| రద్దునకు మినహాయింపు 10% | | 5 | 4 | 27 | 165 | 12 | 13 | 13 | | | | | | | |
| పోను నికరం | | 48 | 37 | 247 | 1489 | 112 | 119 | 113 | | | | | | | |

౧ వ పట్టికయందలి ౧, ౩, ౪, ౫ వరాలు దీనికిని వర్తించును. ౨ వ పట్టికయందలి యాహారము వేడిచేయునని తోచినచో ఈ పట్టికయందలి యాహారము అనుకూలముగ నుండవచ్చును. బియ్యమును అన్నముగవండి పగటిపూటయు, గోధుమను అన్నముగగాని, రొట్టెగగాని చేసి రాత్రియు తినవచ్చును. లేక గోధుమను ½ ఔన్సు పెసరపప్పును పులగమువండి, రాత్రి తినవచ్చును. తక్కిన పెసరపప్పు మధ్యాహ్నము ప్రత్యేకముగవండి తినవచ్చును.

## పట్టిక ౮. వరియు, చోడియు ప్రధానముగ గల యాహారము

| ఆహారద్రవ్యము | ప్రతిదినపు ఔన్సులు | ఆహార ద్రవ్యము నందలి మాంసకృత్తులు | కొవ్వు | పిండిపదార్థములు | ఉష్ణము కేలరీలు | ఖనిజద్రవ్యముల పరిమితిలో వలసినదానిలో % సున్నము | భాస్వరము | ఇనుము | విటమినుల పరిమితి ఎ | బి | సి | 1 రూపాయకు వచ్చు ద్రవ్యముల పరిమితి | 1 నెలకు వలయు ద్రవ్యముల విలువ రు. | అ. | పై. | వరా. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. చేదియ్యము | 5 | 11 | — | 111 | 495 | 4 | 31 | 28 | స్వ | + | ○ | 9⅜ | 0 | 6 | 3 | |
| 2. చోడి (పొట్టుతో) | 3 | 8 | 5 | 59 | 306 | 12 | 27 | 27 | + | ++ | ○ | 5⅝ | 0 | 2 | 10 | |
| 3. కందిపప్పు (పొట్టుతో) | 2 | 14 | 2 | 83 | 200 | 10 | 26 | 50 | + | ++ | ○ | 3¾ | 0 | 1 | 11 | |
| 4. కాయగూరలు | 6 | 2 | — | 8 | 42 | 4 | 5 | 4 | + | ++ | ++ | 11¼ | 0 | 3 | 9 | |
| 5. ఆకుగూరలు | 2 | 1 | — | 2 | 10 | 5 | 2 | 8 | +++ | +++ | +++ | 3¾ | 0 | 0 | 8 | |
| 6. నూనె | ¼ | — | 7 | — | 63 | — | — | — | ++ | ○ | ○ | 15/32 | 0 | 2 | 0 | |
| 7. నేయి | ¾ | — | 21 | | 189 | — | — | — | ++ | ○ | ○ | 113/32 | 0 | 11 | 3 | |
| 8. మజ్జిగ | 16 | 14 | 2 | 22 | 144 | 88 | 42 | 12 | + | + | + | 30 | 0 | 7 | 6 | |
| 9. పండ్లు (అరటి) | 6 | 2 | 1 | 40 | 168 | 3 | 5 | 9 | స్వ | + | + | 11¼ | 0 | 3 | 9 | |
| | | 52 | 38 | 274 | 1617 | 126 | 138 | 138 | | | | | 2 | 7 | 11 | |
| రద్దువలన మినహాయింపు 10% | | 5 | 4 | 27 | 162 | 13 | 14 | 14 | | | | | | | | |
| పోను నికరం | | 47 | 34 | 247 | 1455 | 113 | 124 | 124 | | | | | | | | |

౧ వ పట్టికయందలి వరాలు దీనికిని వర్తించును. ఈపట్టికయందలి ఆహారము మిగుల శ్రేష్ఠమయినది. వరి, గోధుమ ప్రధానముగల యాహారముకంటె చౌక. మరియు నీప్రాంతములందు గోధుమ పండదు. చోళ్లు సులభముగ పండును. కాన విద్యార్థులుకూడ తాము తిను వరియన్నముతోపాటు కొంత చోడియంబలిగాని జావనుగాని పుచ్చుకొనుట మంచిది. చోడిగింజలను మొలకకట్టి యెండించి, యించుకవేచి పిండిచేసి, నీటితో నుడికించి చల్లార్చి, మజ్జిగ జేర్చి పుచ్చుకొనుట మంచిది. మూడుసార్లు ఆహారమును పుచ్చుకొనవలయునో ఉదయమున ౧ ఔన్సు పిండితోను ౬ ఔన్సుల మజ్జిగతోను చేసిన జావమాత్రమేగాని, ౧ అరటిపండుకూడగాని పుచ్చుకొని మధ్యాహ్నమును రాత్రియు ఒక్కొక్క ఔన్సు పిండితో చేసిన జావనుగాని, అంబలిగాని రొట్టెగాని తినవచ్చును. ఈపట్టికయందు చోడికిబదులు గంటెలనుగాని, జొన్నలనుగాని చేర్చుకొనవచ్చును.

పట్టిక ౫. వంట సులువగు నాహారము

| | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. చేబియ్యము | 3 | 7 | — | 67 | 297 | 2 | 19 | 17 | స్వ | + | ○ | $5\frac{3}{8}$ | 0 | 3 | 9 |
| 2. గోధుమ (పొట్టుతో) | 2 | 8 | 1 | 41 | 204 | 7 | 18 | 18 | + | ++ | ○ | $3\frac{3}{4}$ | 0 | 3 | 2 |
| 3. మినుము (పొట్టుతో సహా) | $1\frac{1}{2}$ | 10 | 1 | 27 | 159 | 9 | 20 | 33 | + | ++ | ○ | 213/16 | 0 | 1 | 5 |
| 4. వేరుసెనగ | 1 | 9 | 15 | 4 | 184 | 4 | 13 | 6 | స్వ | ++ | ○ | $1\frac{7}{8}$ | 0 | 1 | 5 |
| 5. కూరగాయలు | 12 | 4 | — | 17 | 84 | 8 | 10 | 8 | + | ++ | ++ | $22\frac{1}{2}$ | 0 | 7 | 6 |
| 6. ఆకుకూరలు | 4 | 2 | — | 3 | 20 | 10 | 4 | 16 | +++ | +++ | +++ | $7\frac{1}{2}$ | 0 | 1 | 3 |
| 7. నేయి | 1 | — | 28 | — | 252 | — | — | — | ++ | ○ | ○ | $1\frac{7}{8}$ | 0 | 15 | 0 |
| 8. మజ్జిగ | 16 | 14 | 2 | 22 | 144 | 88 | 42 | 12 | + | + | + | 30 | 0 | 7 | 6 |
| 9. పండ్లు (అరటి) | 6 | 2 | 1 | 40 | 168 | 3 | 5 | 9 | స్వ | + | + | $11\frac{1}{4}$ | 0 | 3 | 9 |
| 10. బెల్లం | 1 | — | — | 25 | 100 | — | — | — | — | — | — | $1\frac{7}{8}$ | 0 | 1 | 3 |
| | | 56 | 48 | 246 | 1612 | 121 | 181 | 125 | | | | | 2 | 14 | 0 |
| రద్దుకు మినహాయింపు 10% | | 6 | 5 | 25 | 161 | 12 | 13 | 13 | | | | | | | |
| పోను నికరం | | 50 | 43 | 221 | 1451 | 109 | 118 | 112 | | | | | | | |

ఇందు మొదటి యాదువస్తువులను ఆవిరిమీద నుడికించితినవలెను. గోధుమనుగింజ రెండు ముక్కలగునట్లు విసరవలెను. మినుమును పొట్టుతో సహా పిండిగా విసరవలెను. వేరుసెనగను చెక్క ముక్కగ నలుగగొట్టవలెను. కూరగాయలను ఆకుకూరలను సన్నముగ తరగవలెను. అన్నిటిని చేర్చి కొంచెము నీరు చిలకరించి కలిపి ఆవిరిమీదగాని, కుక్కరులోగాని వండి నేతిని బెల్లమునుజేర్చి కలిపితినిన రుచిగనుండును. పిమ్మట మజ్జిగను త్రాగి పండ్లను తినవచ్చును. మూడుసార్లు ఆహారమును పుచ్చుకొనుచో ఉదయమున ౧,౨ అరటిపండ్లను, ౬ ఔన్సుల మజ్జిగను పుచ్చుకొని, తక్కిన యాహారమును, మధ్యాహ్నము సగమును, రాత్రి సగమును పుచ్చుకొనవలెను.

పట్టిక ౬. వంట యవసరములేని యాహారము — గోధుమ ప్రధానముగ గలది

| ఆహారద్రవ్యము | ద్రవ్యపరిమితి ఔన్సులు | ఆహారద్రవ్యము నందలి మాంసకృత్తులు | క్రొవ్వు | కర్బోజలజనకములు | ఉష్ణశక్తి కాలరీలు | ఖనిజద్రవ్యముల పరిమితిలో వలసిన దానిలో % సున్నము | భాస్వరము | ఇనుము | విటమినుల పరిమితి ఎ | బి | సి | 1 కాలరీ కయ్యే ద్రవ్యముల పరిమితి | 1 నెలకు కలయూ ద్రవ్యముల పరిమితి వరా. రు. | పై. | అ. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. గోధుమలు (మొలకకట్టి) | 5 | 20 | 3 | 102 | 510 | 19 | 46 | 46 | + | + + | + + | $9\frac{3}{8}$ | 0 | 7 | 6 |
| 2. వేరుసెనగ ( " ) | 1 | 9 | 15 | 4 | 184 | 4 | 13 | 6 | + | + + | + + | $1\frac{7}{8}$ | 0 | 1 | 5 |
| 3. వరితవుడు | 1 | 6 | 6 | ·8 | 110 | ·5 | 40 | 35 | + | + + | o | $1\frac{7}{8}$ | 0 | 0 | 8 |
| 4. పాలు | 12 | 12 | 16 | 18 | 264 | 75 | 29 | 6 | +++ | + + | + | 221/15 | 1 | 0 | 11 |
| 5. పండ్లు (అరటి) | 16 | 6 | 3 | 102 | 448 | 8 | 14 | 24 | స్వ | + | + | 30 | 0 | 10 | 0 |
| 6. తేనె | 1 | — | — | 20 | 81 | — | 1 | 3 | స్వ | స్వ | o | $1\frac{7}{8}$ | 0 | 7 | 6 |
| | | 53 | 43 | 254 | 1597 | 111 | 143 | 120 | | | | | 2 | 12 | 0 |
| రద్దుకుమినహాయింపులు10% | | 5 | 4 | 25 | 160 | 11 | 14 | 12 | | | | | | | |
| పోను నికరం | | 48 | 39 | 229 | 1437 | 100 | 129 | 108 | | | | | | | |

మొలకకట్టిన గోధుమలతోను వేరుసెనగలతోను తేనెను కలిపి తినవచ్చును. తవుడుతో ఒకఅరటిపండు కలిపి తినవచ్చును. ౨ అరటి పండ్లకు బదులు ౩,4 నారింజవగైరా పండ్లను తినవచ్చును. తేనెకుబదులు బెల్లము నుపయోగించవచ్చును. పాటుపడనివారు పెరుగు నుపయోగించవచ్చును. లేక మజ్జిగను, నేతిని ఉపయోగించవచ్చును. మూడుసార్లు ఆహారమును పుచ్చుకొనుచో, ఉదయమున ౧,౨ అరటిపండ్లనుగాని యితరఫలములనుగాని పుచ్చుకొని, తక్కిన యాహారమును మధ్యాహ్నమును రాత్రియు పుచ్చుకొనవచ్చును. లేక ఉదయమున కొంచెము పాలుమాత్రము పుచ్చుకొనవచ్చును.

13.  5-  12  ౬-౨3

పట్టిక ౭. వంట యవసరములేని యాహారము — అరటిపండ్లు ప్రధానముగ గలది

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. అరటిపండ్లు | 30 | 12 | 6 | 198 | 840 | 15 | 27 | 45 | స్వ | + | + | 56¼ | 1 | 1 | 10 |
| 2. వేరుసెనగ (మొలకకట్టి) | 1 | 9 | 15 | 4 | 184 | 4 | 13 | 6 | + | ++ | ++ | 1 7/8 | 0 | 1 | 5 |
| 3. వరితవుడు | 2 | 11 | 12 | 16 | 220 | 10 | 80 | 70 | + | ++ | o | 3¾ | 0 | 1 | 3 |
| 4. పాలు | 16 | 16 | 21 | 24 | 852 | 99 | 38 | 8 | +++ | +++ | + | 80 | 1 | 6 | 6 |
| | | 48 | 54 | 242 | 1596 | 128 | 158 | 129 | | | | | 2 | 11 | 0 |
| రద్దుకు మినహాయింపు 10% | | 5 | 5 | 24 | 160 | 13 | 16 | 13 | | | | | | | |
| పోను నికరం | | 43 | 49 | 218 | 1436 | 115 | 142 | 116 | | | | | | | |

ఇది మిగుల లఘువగు నాహారము. నాల్గువస్తువులే కావలసియుండును. కొన్ని యరటిపండ్లకు బదులు ఇతరపండ్లను తినుచుండవచ్చును. పాలు పడకపోయినచో పెరుగు నుపయోగింపవచ్చును. ఈయాహారమును దినమునకు రెండుసార్లుగాని మూడుసార్లుగాని పుచ్చుకొనవచ్చును. మూడుసార్లు పుచ్చుకొనచో ఉదయమున కొంచము పాలనుమాత్రముగాని, పండ్లనుమాత్రముగాని పుచ్చుకొని మధ్యాహ్నమును రాత్రియు పుచ్చుకొనవచ్చును.

పట్టిక ౮. జంతు సంబంధ పదార్థములేని యాహారము — వంట యవసరమగునది

మనిషి తూనిక ౧౧౦ పౌ. కఠిన వ్యాయామము ½ గంట, లఘువ్యాయామము ౧ గంట

| ఆహార ద్రవ్యము | ద్రవ్యపరిమాణ ఔన్సులు | ఆహార ద్రవ్యము సంపత్తి: మాంసకృత్తి | క్రొవ్వు | పిండిపదార్థము | శక్తి (కాలరీలు) | ఖనిజ ద్రవ్యముల పరిమితిలో వలసిన దానిలో %: సున్నము | భాస్వరము | ఇనుము | విటమినుల పరిమితి: ఎ | బి | సి | 1 నెలకు వలయు ద్రవ్యముల పరిమితి | 1 నెలకు వలయు ద్రవ్యముల పరిమితి: రు. | అ. | పై. | వ.గా. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. చేబియ్యము | 8 | 18 | 1 | 178 | 792 | 5 | 50 | 44 | స్వ | + | ○ | 15 | 0 | 10 | 0 | |
| 2. కంది పప్పు | 2 | 13 | 2 | 32 | 20) | 10 | 26 | 50 | + | ++ | — | 3¾ | 0 | 1 | 11 | |
| 3. నూవులు (పొట్టుతో) | 1½ | 9 | 22 | 7 | 270 | 81 | 29 | 7 | + | ++ | ○ | 213/16 | 0 | 2 | 10 | |
| 4. నేయి | ½ | — | 14 | — | 126 | — | — | — | ++ | ○ | ○ | 15/16 | 0 | 7 | 0 | |
| 5. కూరగాయలు | 9 | 3 | — | 13 | 63 | 6 | 7 | 6 | + | ++ | +++ | 16⅞ | 0 | 5 | 8 | |
| 6. ఆకుగూరలు | 3 | 1 | — | 3 | 15 | 7 | 3 | 12 | +++ | +++ | +++ | 5⅝ | 0 | 0 | 11 | |
| 7. పండు (అరటి) | 6 | 2 | 1 | 40 | 168 | 3 | 5 | 9 | స్వ | + | + | 11¼ | 0 | 3 | 9 | |
| | | 46 | 40 | 273 | 1634 | 112 | 120 | 128 | | | | | 2 | 0 | 1 | |
| రద్దుకుమినహాయింపు 10% | | 5 | 4 | 27 | 163 | 11 | 12 | 13 | | | | | | | | |
| పోను నికరం | | 41 | 36 | 246 | 1471 | 101 | 108 | 115 | | | | | | | | |

పాలు దొరకకగాని, జంతుసంబంధమగు పదార్థములు పుచ్చుకొననిష్టము లేకగాని, క్షీరసంబంధమగు ద్రవ్యములను పుచ్చుకొనక యితరాహారమునుమాత్రమే పుచ్చుకొనువారో సామాన్యముగ ఆహారమున సున్నము లోటువడుటచే ఆరోగ్యము చెడును. కాని యిటీవల జరిగిన పరిశోధనలవలన నూవులలో (ముఖ్యముగ పైపొట్టులో) సున్నము విస్తారముగగలదని కనిపెట్టబడెను. ఇందువలన క్షీరద్రవ్యములులేని సమగ్రాహారపు పట్టికను నిర్ణయింపవీలయ్యెను. కాని బియ్యము, పప్పు వగైరాలలోని మాంసకృత్తుల మానవశరీరమునకు పాలలోని మాంసకృత్తులంత యనుకూలములుగావని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. పాలను సంపాదించుకొనగలుగువారు పాలు, పెరుగు, మజ్జిగ వగైరాలనే వాడుట శ్రేష్ఠమయినను, వానిని సంపాదించుకొనుశక్తిలేనివారును, యితరులు అవలంబింపనపుడును, క్షీరద్రవ్యములకు బదులు, నూవులను (చిమ్మిలి రూపమున) గాని, నూవు తెలకపిండినిగాని, నూవుపొట్టుగాని పుచ్చుకొనుటవలన శరీరమునకు సున్నపులోటు లేకుండ చేసికొనవచ్చును. నూవుపొట్టు పుచ్చుకొనుచో, మాంసకృత్తులను, చమురును ఒసగుటకు వేరుసెనగ గింజలనుగాని, జీడిపప్పునుగాని తినవచ్చును. ½ ఔన్సునూవుపొట్టును 1 ఔన్సు వేరుసెనగగింజలుగాని జీడిపప్పుగాని చేరి 10 ఔన్సుల పాలతో సమానమగు నింధనశక్తిని సున్నము ఒసగును.

## పట్టిక ౯. జంతుసంబంధ పదార్థములులేని యాహారము — వంట యవసరము లేనివి

### అరటిపండ్లు — వేరుసెనగ చేరినది

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. అరటిపండ్లు | 36 | 14 | 7 | 238 | 1008 | 18 | 32 | 54 | స్వ | + | + | $67\frac{1}{2}$ | 1 | 6 | 6 |
| 2. వేరుసెనగ (మొలకకట్టి) | $1\frac{1}{2}$ | 13 | 22 | 6 | 276 | 7 | 19 | 8 | + | ++ | ++ | 213/16 | 0 | 2 | 2 |
| 3. నూవు(తెలకపిండిపొట్టుతో | 1 | 11 | 3 | 10 | 111 | 90 | 31 | ? | + | ++ | o | 1 7/8 | 0 | 1 | 3 |
| 4. వరితవుడు | 2 | 11 | 12 | 16 | 220 | 10 | 80 | 70 | + | ++ | o | $8\frac{3}{4}$ | 0 | 1 | 3 |
| | | 49 | 44 | 270 | 1615 | 125 | 162 | 132 | | | | | 1 | 11 | 2 |
| రద్దుకు మినహాయింపు 10% | | 5 | 4 | 27 | 162 | 13 | 16 | 18 | | | | | | | |
| పోను నికరం | | 44 | 40 | 243 | 1453 | 112 | 146 | 119 | | | | | | | |

కొన్ని యరటిపండ్లకు బదులు ఇతర పండ్లను తినవచ్చును. ఈయాహారమును దినమునకు రెండుసార్లుగాని 3 సార్లుగాని విభజించి పుచ్చుకొనవచ్చును. ఉదయమున కొన్నిపండ్లను మాత్రము పుచ్చుకొని తక్కినది మధ్యాహ్నమును రాత్రియు పుచ్చుకొనవలెను.



## పట్టిక ౧౦. జంతుసంబంధ పదార్థములేని యాహారము — వంట యవసరము లేనిది

### అరటిపండ్లు కొబ్బెర చేరినది

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. కొబ్బెర (సగము ముదిరినది) | 3 | 5 | 33 | 11 | 354 | 9 | 15 | 3 | + | + | + | $5\frac{5}{8}$ | 0 | 5 | 8 |
| 2. అరటిపండ్లు | 33 | 13 | 6 | 218 | 924 | 17 | 29 | 50 | స్వ | + | + | $67\frac{1}{2}$ | 1 | 6 | 6 |
| 3. నూవు తెలికపిండి (పొట్టుతో) | 1 | 11 | 3 | 10 | 111 | 90 | 31 | ? | + | ++ | o | $1\frac{7}{8}$ | 0 | 1 | 3 |
| 4. తవుడు | 2 | 11 | 12 | 16 | 220 | 10 | 80 | 70 | + | ++ | o | $8\frac{3}{4}$ | 0 | 1 | 3 |
| | | 40 | 54 | 255 | 1609 | 126 | 155 | 123 | | | | | 1 | 14 | 8 |
| రద్దుకు మినహాయింపు 10% | | 4 | 5 | 26 | 169 | 13 | 16 | 12 | | | | | | | |
| పోను నికరం | | 36 | 49 | 229 | 1440 | 118 | 139 | 111 | | | | | | | |

౯ వ పట్టికయందలి వరాలు దీనికిని వర్తించును. 3 ఔన్సుల కొబ్బెరకు బదులు ౨ ఔన్సుల జీడిపప్పు పుచ్చుకొనవచ్చును.

పట్టిక ౧౧. అతిమూత్రవ్యాధిగలవారికి సరిపడు ఆహారము వ్యాధి తీవ్రముగ నున్నపుడు అవలంబింపదగినది

| ఆహార ద్రవ్యము | ద్రవ్యపరిమితి ఔన్సులు | ఆహారద్రవ్యము సంపత్తి: మాంసకృత్తులు | క్రొవ్వు | పిండిపదార్థములు | శరీరోష్ణ పరిమాణము కాలరీలు | ఖనిజద్రవ్యముల పరిమితిలో వలసిన దానిలో %: సున్నము | భాస్వరము | ఇనుము | విటమినుల పరిమితి: ఎ | బి | సి | 1 రోజుకు కావలసిన ద్రవ్యముల పరిమితి | 1 నెలకు వలయు ద్రవ్యముల పరిమితి వరా.: రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| . వేరుసెనగ (మొలకకట్టి) | 3 | 17 | 30 | 8 | 368 | 8 | 26 | 11 | + | ++ | ++ | $3\frac{3}{4}$ | 0 | 2 | 10 |
| . కంది ” | 1 | 7 | 1 | 16 | 100 | 5 | 13 | 25 | + | ++ | ++ | $1\frac{7}{8}$ | 0 | 0 | 11 |
| . పాలు | 16 | 16 | 21 | 24 | 352 | 99 | 38 | 8 | +++ | ++ | + | 30 | 1 | 6 | 6 |
| . నేయి | 1 | — | 28 | — | 252 | — | — | — | ++ | o | o | $1\frac{7}{8}$ | 0 | 15 | 0 |
| . వరితవుడు | 2 | 11 | 12 | 16 | 220 | 10 | 80 | 70 | + | ++ | o | $3\frac{3}{4}$ | 0 | 1 | 3 |
| . కాయగూరలు | 12 | 4 | — | 17 | 84 | 8 | 10 | 8 | + | ++ | ++ | $22\frac{1}{2}$ | 0 | 7 | 6 |
| . ఆకుగూరలు | 4 | 2 | — | 4 | 20 | 10 | 4 | 16 | +++ | +++ | ++ప | $7\frac{1}{2}$ | 0 | 1 | 3 |
| | | 57 | 92 | 85 | 1396 | 140 | 171 | 138 | | | | | 3 | 3 | 3 |
| రద్దుకు మినహాయింపు 10% | | 6 | 9 | 9 | 140 | 14 | 17 | 14 | | | | | | | |
| బోను నికరం | | 51 | 89 | 76 | 1256 | 126 | 154 | 124 | | | | | | | |

వ్యాధి కనిపెట్టబడగానే, మూత్రమున చక్కెర తగ్గువరకు అనగా ౧, ౨ రోజులు ఉపవసించి, పిమ్మట కొంచెము పాలు, కూర తినుట కారంభించి క్రమక్రమముగ ఇతర ఆహారవస్తువులనుకూడ చేర్చుచు 3, ౪ నెలలలో పైపట్టికయందు సూచింపబడిన పూర్తియాహారమును తీసికొనవలెను. మూత్రమున చక్కెర లేకుండ చూచుకొనుటయేగాక తిన్నతిండి జీర్ణమగుచున్నదా లేదాయనికూడ చూచుకొనవలెను. వేరుసెనగను ½ ఔన్సుతో ప్రారంభించి క్రమముగ హెచ్చింపవలెను. ఇందలి కాయగూరలు, ఆకుగూరలు వండకుండ తినుటయే మంచిది. అలవాటుపడువరకు వండి తినవచ్చును. ఈయాహారమును దినమునకు రెండుసార్లు విభజించి తినుట మంచిది.

పట్టిక ౧౨. అతిమాత్ర వ్యాధిగలవారి కనుకూలించు ఆహారము — పండితినదగినది.

వ్యాధి తగ్గినపిమ్మట నది మరల కనబడకుండుటకు అవలంబింపతగినది.

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. వేరుసెనగ | 2 | 17 | 30 | 8 | 368 | 8 | 26 | 11 | + | ++ | ○ | $3\frac{3}{4}$ | 0 | 2 | 11 |
| 2. మినుము | 1 | 7 | — | 18 | 101 | 6 | 13 | 26 | + | ++ | ○ | $1\frac{7}{8}$ | 0 | 0 | 11 |
| 3. తవుడు | 2 | 11 | 12 | 16 | 220 | 10 | 80 | 70 | + | ++ | ○ | $3\frac{3}{4}$ | 0 | 1 | 3 |
| 4. నేయి | $1\frac{1}{2}$ | — | 42 | — | 378 | — | — | — | ++ | ○ | ○ | 213/16 | 1 | 6 | 6 |
| 5. కూరగాయలు | 12 | 4 | — | 17 | 84 | 8 | 10 | 8 | + | ++ | ††† | $22\frac{1}{2}$ | 0 | 7 | 6 |
| 6. ఆకుగూరలు | 4 | 2 | — | 4 | 20 | 10 | 4 | 16 | ††† | ††† | ††† | $7\frac{1}{2}$ | 0 | 1 | 3 |
| 7. పండ్లు (నారింజ సీమవంగ వగైరా) | 12 | 2 | 1 | 31 | 144 | 12 | 7 | 10 | ++ | ++ | ++ | $22\frac{1}{2}$ | 1 | 6 | 6 |
| 8. పాలు లేక పెరుగు | 12 | 12 | 16 | 18 | 264 | 74 | 29 | 6 | ††† | ++ | + | $22\frac{1}{2}$ | 1 | 0 | 11 |
| | | 55 | 101 | 112 | 1579 | 128 | 169 | 147 | | | | | 4 | 11 | 9 |
| రద్దుకు మినహాయింపు 10% | | 6 | 10 | 11 | 158 | 13 | 17 | 15 | | | | | | | |
| పోను నికరం | | 49 | 91 | 101 | 1421 | 115 | 152 | 132 | | | | | | | |

౧౧ వ పట్టికలోని యాహారమును కొంతకాలము తినుటవలన వ్యాధిశమించిన పిమ్మట నీపట్టిక యందలి యాహారమును తినదగును. దీని నవలంబించి కాలముగడుపువారి కీవ్యాధి మరల రాదనిచెప్పవచ్చును. ఇందు ౧, ౨, ౩, ౫, ౬ వస్తువులను ౫ వ పట్టికలోని వరాలో వ్రాయబడినట్లు ఆవిరి మీద గాని కుక్కరులోగాని వండి నేతినిచేర్చి తినవలెను. పండ్లును, పాలు లేక పెరుగును పిమ్మట పుచ్చుకొనవలెను. దీనిని విభజించి దినమునకు రెండు పార్లు పుచ్చుకొనుట మంచిది.

## పట్టిక ౧౩. శరీరపరిశ్రమ హెచ్చుగగలవారి కనుకూలించునది — చోడి ప్రధానముగగలది

| ఆహార ద్రవ్యము | ద్రవ్యపరిమితి ఔన్సు | ఆహార ద్రవ్యము నందలి మాంసకృత్తులు | వసలు | కార్బోహైడ్రేటులు | శక్తి నిచ్చు కాలరీలు | ఖనిజ ద్రవ్యముల పరిమితిలో వలసిన దానిలో % కాల్షియం | ఫాస్ఫరస్ | ఇనుము | విటమినుల పరిమితి ఎ | బి | సి | 1 నెలకు వలయు ఆహార ద్రవ్యముల పరిమితి | 1 నెలకు వలయు ద్రవ్యముల విలువ రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. చోడి | 12 | 33 | 6 | 280 | 1296 | 48 | 108 | 108 | + | + + | ○ | 22½ | 0 | 11 | 3 |
| 2. వేరుసెనగగింజలు, (మొలకకట్టి) | 2 | 17 | 30 | 8 | 368 | 9 | 26 | 11 | స్వ | + + | ○ | 3¾ | 0 | 2 | 10 |
| 3. కాయగూరలు | 4 | 1 | — | 6 | 28 | 3 | 3 | 3 | + | + + | + + | 7½ | 0 | 2 | 6 |
| 4. ఆకుకూరలు | 4 | 2 | — | 4 | 20 | 10 | 4 | 16 | +++ | +++ | +++ | 7½ | 0 | 1 | 3 |
| 5. నూనె | ½ | — | 14 | — | 126 | — | — | — | + + | ○ | ○ | 15/16 | 0 | 3 | 9 |
| 6. మజ్జిగ | 8 | 7 | 1 | 11 | 72 | 44 | 21 | 6 | + + | + | + | 15 | 0 | 3 | 9 |
| 7. అరటిపండ్లు | 6 | 2 | 1 | 40 | 168 | 3 | 5 | 9 | + | + | + | 11¼ | 0 | 3 | 9 |
| 8. బెల్లము | 1 | — | — | 25 | 100 | — | — | — | స్వ | — | — | 1⅞ | 0 | 1 | 4 |
| | | 62 | 52 | 374 | 2178 | 117 | 159 | 153 | | | | | 1 | 14 | 5 |
| రద్దుకు మినహాయింపు 10% | | 6 | 5 | 37 | 218 | 12 | 16 | 15 | | | | | | | |
| పోనునికరం | | 56 | 48 | 347 | 1960 | 105 | 143 | 138 | | | | | | | |

ఈయాహారమును వీలునుబట్టి రెండు లేక మూడు భాగములుగ విభజించి దినమునకు రెండు లేక మూడుసార్లు పుచ్చుకొనవచ్చును. ఉదయమున కొంచెము చోడిఅంబలి లేక జావగాని, అరటిపండ్లుగాని మజ్జిగతో పుచ్చుకొనవచ్చును. చోడికిబదులు గంటెలు జొన్నలు మొదలగు నితర తృణధాన్యములను కొంతవర కుపయోగింపవచ్చును.

పట్టిక ౧౪. శరీర పరిశ్రమ హెచ్చుగగలవారి కనుకూలించునది, వరి, చోడి ప్రధానముగగలది

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. చేబియ్యము | 7 | 16 | 1 | 156 | 693 | 4 | 44 | 39 | స్వ | + | o | 13⅛ | 0 | 8 | 9 |
| 2. చోడి | 5 | 14 | 2 | 117 | 540 | 20 | 45 | 45 | + | ++ | o | 9⅜ | 0 | 4 | 8 |
| 3. వేరుసెనగ | 2 | 17 | 30 | 8 | 368 | 9 | 26 | 11 | + | ++ | o | 3¾ | 0 | 2 | 6 |
| 4. కూరగాయలు | 4 | 1 | — | 6 | 28 | 3 | 3 | 3 | ++ | ++ | ††† | 7½ | 0 | 2 | 6 |
| 5. ఆకుగూరలు | 4 | 2 | — | 4 | 20 | 10 | 4 | 16 | ††† | ††† | ††† | 7½ | 0 | 1 | 3 |
| 6. నూనె | ½ | — | 14 | — | 126 | — | — | — | ++ | o | o | 15/16 | 0 | 3 | 6 |
| 7. మజ్జిగ | 12 | 10 | 2 | 16 | 108 | 66 | 31 | 7 | + | + | + | 22½ | 0 | 5 | 8 |
| 8. పండ్లు (అరటి) | 6 | 2 | 1 | 40 | 100 | 3 | 5 | 9 | స్వ | + | + | 11¼ | 0 | 3 | 9 |
| 9. బెల్లము | 1 | — | — | 25 | 120 | — | — | — | | — | — | 1⅞ | 0 | 1 | 4 |
| | | 62 | 50 | 372 | 2151 | 115 | 158 | 120 | | | | | 2 | 1 | 11 |
| రద్దుకు మినహాయింపు 10% | | 6 | 5 | 37 | 215 | 12 | 16 | 12 | | | | | | | |
| పోను నికరం | | 56 | 45 | 335 | 1936 | 103 | 142 | 108 | | | | | | | |

౧౩ వ పట్టికయందలి వరాలు దీనికిని వర్తించును.

+ † ఈ రెండుగుర్తులును 'ప్లస్' గుర్తులుగానే స్వీకరింపబడినవి.

పయి ౧౮ పట్టికలయందలి యాహారము నూరు పౌనులు బరువుగల వ్యక్తికి ఒకదినమునకు సరిపడునట్లు లెక్కకట్టి వ్రాయబడినది. వీలునుబట్టి దానిని రెండు పాళ్లుగాని, మూడుసాళ్లుగాని విభజించి పుచ్చుకొనవచ్చును. హెచ్చు బరువుగలవారు తమ తూనికకు తగినట్లు ఆయావస్తువుల పరిమితిని హెచ్చించుకొనవలెను. ఉదా:—౧౨౫ పౌనుల బరువుగల వ్యక్తి ఈపట్టికయందు చూపబడిన పరిమితిలో నాల్గవవంతు హెచ్చుగ పుచ్చుకొనవలసి యుండును.

ఈపట్టికలందలి మొదటి పంద్రెండును శరీర పరిశ్రమ అంతగా లేక ఆఫీసుపనియేచేయు గుమాస్తాలకును, ఉద్యోగస్థులకును అనుకూలించునట్లు వ్రాయబడెను. ఇట్టివారైనను దినమునకు ౪గంట కఠినవ్యాయామమును (దండెములుతీయుట, త్రవ్వుటవంటిది), ౧ గంట లఘువ్యాయామము (నడక, గోల్ఫ త్రవ్వుట వంటిది)గలిగి యుండుట ఆవశ్యకము గావున నీపంద్రెండు పట్టికలందు నీపాటి కొద్దివ్యాయామమునకుతగినట్లె ఆహారపు పరిమితి నిర్ణయింపబడెను. బయట తిరుగు ఉద్యోగస్థులుగాని, యితర శరీర పరిశ్రమగలవారుగాని తమకదనముగ గలుగు ప్రతియొకగంట లఘువ్యాయామమునకును నూరు పౌనుల తూనికకు ౫౦ కాలరీల ఉష్ణతనిచ్చు ఆహారమును (౪ ఔన్సుబియ్యపు అన్నముగాని ౨ ఔన్సుల బరువుగల అరటిపండుగాని సుమారు ౫౦ కాలరీల శక్తినిచ్చును) అదనముగ పుచ్చుకొనవలసి యుండును. ప్రతి గంట కఠినవ్యాయామమునకును ౧౦౦ కాలరీల ఉష్ణతనిచ్చు ఆహారమును అదనముగ పుచ్చుకొనవలెను.

౧౧, ౧౨ పట్టికలయందలి యాహారము ప్రత్యేకము అతిమూత్రవ్యాధిగలవారి కుద్దేశింపబడినది.

౧౩, ౧౮ పట్టికలందలి యాహారము విస్తారము శరీరపరిశ్రమగల్గియుండు వ్యవసాయదారులకును, ఇతర పరిశ్రమలను తమవృత్తిగాగలవారలకును అనుకూలించునట్లు వ్రాయబడినవి. దినమునకు ౮ గంటలు కఠినవ్యాయామమును, ౮ గంటలు లఘువ్యాయామమును గలవారికవిసరిపడును. హెచ్చుపరిశ్రమచేయువారు తమ యాహారము నందుకు దగినట్లు హెచ్చు చేసికొనవలెను. తక్కువ పరిశ్రమగలవారు తగ్గించుకొనవలెను.

# తెలుగుటాకీలు - ప్రస్తుత నిర్మాణవిధానము

## ఏ. వి. సీతారామయ్య

జీవము లేని సినిమాకంపెనీలకు పుట్టినిల్లు బొంబాయి. కాని ఇప్పుడిప్పుడు మద్రాసురాష్ట్రముగూడ ముందంజ వేయుచున్న దీవిషయమున. మనరాష్ట్రమునకు ముఖ్యనగరమగు చెన్నపట్టణము, బెంగుళూరు మొదలయిన ఏరెండు మూడు పట్టణములలో తప్ప స్టూడియో నిర్మాణమునకు యోగ్యములగు పట్టణములు లేవు. సినిమాయందలి ఉత్సాహవంతులగు కొందరికి ఇటీవలనే బెజవాడయందొక స్టూడియో నిర్మించ బుద్ధిపుట్టినది. కాని దైవానుగ్రహమువలన అది మరల తిరుగుమొగము పెట్టి కొంత ధననాశనము తప్పించినది. తెలుగు దేశమున ఫిలిములు తయారుచేయు 'ప్రొడ్యూసర్లు' (Prcducers) హెచ్చుగానున్నను ఫిలిములను తయారుచేయు స్టూడియోలు మాత్రము మచ్చునకైన లేవు. ఈవిషయమున అరవవారు ముందంజవేసి కొన్ని స్టూడియోలను నిర్మించుకొనియున్నారు. మనకుమాత్రము సినిమాకంపెనీలు ఇన్నియున్నను స్టూడియోమాత్రము ఒకటైనను లేదు. కాని యిచ్చట నేను మన చిత్రములను తయారుచేసుకొనుటకుగాను స్వంత స్టూడియోలను కలిగియుండు నవసరమును గురించి ముచ్చటించుటలేదు. ప్రస్తుతము మనవారు తెలుగుటాకీలను తయారుచేయుటకుగాను కంపెనీలను మాత్రము స్థాపించి సమాజములను కలకత్తా, బొంబాయి నగరములకు కొనిపోయి అచ్చటి స్టూడియోలను అద్దెకు తీసికొని పటములను తయారుచేయుచున్నారు. ఈ విధముగ కొంతకాలము జరిగినయెడల కలుగు ఫలితములను గురించియే నేనిచ్చట ముచ్చటించ దలచుచున్నాను.

౧౯౩౮ సెప్టెంబరువరకు కలకత్తాలోని స్టూడియో స్వంతదారులు దక్షిణాదిటాకీలను తయారుచేయుటకు బొత్తిగా యిష్టపడకుండిరి. పరిశ్రమయందలి లాభమును గుర్తించి నేను కలకత్తా స్టూడియో ప్రొప్రయిటర్లను తెలుగుపటములు తయారుచేయ సూచనలతో కలుసుకొనగా ఒకరైనను అందుకు సిద్ధపడకుండిరి. తెలుగు, తమిళపటములను తయారుచేయుటకు స్టూడియోలను అద్దెకిచ్చుటకు సైతము కొందరి కిష్టములేకుండెను. కారణము, ఏ హిందీపటమైనను స్టూడియోకు వచ్చు అద్దెకన్న నెక్కుడు రాబడి తెప్పించగల అవకాశము గలిగియుండెను ఆ కాలమున. అదియుగాక తమిళ, ఆంధ్రపటములు ప్రదర్శించు స్థలములు కొద్ది, హిందీపటములకుగల స్థలములకంటె. మరియొక కారణము తమిళ తెలుగు టాకీలు హిందీ టాకీలతో పోల్చిచూచిన యెడల కళాదృష్టిని చాల హీనజాతికి చెందినవి. అటువంటి కళాహైన్యముగల పటములు తయారుచేయుటకు వారికిగల అయిష్టతగూడ విశదముగా గనబడుచుండెను.

ప్రస్తుత మాంధ్రదేశములో తుపానువలె వీచుచున్న టాకీతయారుచేయవలెనను ఉత్సాహము ఈస్టు ఇండియా ఫిలిం కంపెనీవారి 'లవ-కుశ' వలన జనించినది. ౧౯౩౫ ఫిబ్రవరిలో 'రిలీజు' చేయబడినది మొదలు ఇంతవరకు అది ఆకర్షించుచున్న ప్రజలు, తద్వారా ఆర్జించినధనము పెట్టుబడిదారుల నాకర్షించి కదలించినవి. వెంటనే గ్రామమున కొక ఫిలిం కంపెనీ వెలసినది, శుభము.

కాని యిచ్చట మన మొకింత నిలచి ఈ కంపెనీలు నడపబడుచున్న విధానమునుగురించి కొంచె మాలోచించవలె. పెట్టుబడిదారులు మనరాష్ట్రమున కొద్ది. ఆకొద్దిమంది ఆలోచించి ఆలోచించి ఒకపరిశ్రమను ప్రవేశింతురు. సరియైన పాలకులులేకగాని, సరియైన పరిపాలనా విధానములేకగాని పరిశ్రమయందలి ప్రత్యేక నిపుణుల

సహాయము పొందకపోవుటచేగాని, నిర్వాహకుల సంఖ్య యధికమగుటచేగాని, ఆపరిశ్రమ కూలబడుట తటస్థించును. వెంటనే మనరాష్ట్రమున పరిశ్రమలకు తగు ప్రోత్సాహము ప్రజలివ్వరను ఓదార్పుతో పెట్టుబడిదారులు నిరాశజెందుదురు. మరల చాలకాలమువరకు ఆ పరిశ్రమయందు మరియొకరెవరును ప్రయత్నము చేయుటకైన వీలులేనట్లు పెట్టుబడిదారులు భయపడుచుందురు. ఇది యింతవరకు తెలుగుదేశమున పరిశ్రమలు నిర్వహింపబడి అంతమొందింపబడిన విధానము. ఇది తెలుగువారందరికి అనుభవమే. అందువలన క్రొత్తగా పైకివచ్చుచు మునుముందు అభివృద్ధిగాంచదగిన ఈఫిలింపరిశ్రమ ఏవిధముగా నిర్వహించబడుచున్నది, దీనివలన ఏవిధమైన ఫలితము కలుగబోవుచున్నది తెలుగువారు గమనించుట అవసరము. ఎందువలన నన ఎటువంటి ఫిలిమునకైనను ధన మొసగబోవునదీ మనమేగదా.

సాధారణముగా ఒకతెలుగుటాకీ తయారుచేయుటకు రు. ౫౦,౦౦౦ లు చాలును. తెలుగుదేశమునందున్న అన్ని సినిమాప్రదర్శనశాలలలోను ఆటాకీ సాధారణ ప్రదర్శనావకాశమును గలిగియుండిన కనీసము ఒక రూ. ౫౦,౦౦౦ లు లాభము రాగలదు. 'సావిత్రి', 'లవకుశ' ల మాదిరి 'ప్రొడ్యూసరు' నకు లక్షలు గడించకపోయినను లాభముమాత్రము రాక మానదు. నిజమునకు మన తెలుగుదేశమున ఇందరు 'ఫిలిం ప్రొడ్యూసర్లు', ఇన్ని సినిమాకంపెనీలు వెలయుటకు కారణము 'లవ - కుశ' యే. కాని అవిధముగ నది ప్రజలను ఆకర్షించుటకు గల కారణము లేవో ఫిలిం తీయవలెననుకొను ప్రొడ్యూసరు ఆలోచింపవలసియున్నను ఆలోచింపడు. తెలుగుపటమైనంతమాత్రమున ప్రజలు తండోపతండములుగ మూగి ధనమును క్రుమ్మరింతురను నమ్మికతో ఏదో ఒకపటమును - తెలుగైనచాలును- తయారుచేయును. ఏ విషయమందైనను క్రొత్తలో క్రొత్తదనమే కొంత విలువగలిగియుండును. పోనుపోను ఆ క్రొత్తదనమునందలి ఆకర్షణ తగ్గి నిజముగ గుణమున్నదా, లేదా యనుపరీక్ష బయలుదేరును. ఇది ప్రొడ్యూసరు గుర్తించుటవసరము. ఈకాలమున తెలుగుటాకీ అయినంతమాత్రముననే డబ్బువచ్చుననుకొనుట వెర్రి. ఉదాహరణగా కాళీఫిల్ము కంపెనీవారి 'తులాభారము' లేదా? అది తెలుగుటాకీయే. పైగా జనమన్నన పొందిన చక్కని నాటకమునుండి గ్రహింపబడిన కథ. చక్కని పద్యములు, జనాకర్షణీయములైన పాటలు. నటులు తక్కినటాకీలలోనివారికంటె తీసిపోరు. కాని బాగుండలేదను పేరుసంపాదించినది. కారణము అందుబాటులోనున్న వస్తువులను సరిగానుపయోగించుకొనలేకపోయిన డైరెక్టరులు తీసిన పటమది. అంతా తవక తవక తయారు. ఇంతకంటె గొప్పవి కాకపోయినను యడవల్లివారి 'పాదుక', 'శకుంతల' మొదలగు టాకీలకు ధనము వచ్చినది. కారణము అప్పటి వాటియందున్న నూతనత్వము. అదికాక యిప్పుడు ప్రదర్శింపబడుచున్న టాకీలకు సైతము మన మనుకొనుచున్న ధనము నిజముగ వచ్చుచున్నదనునది సమస్య. ప్రచురణార్థమై ప్రజలు లేకపోయినను పొట్టి బెంచీలకు, కుర్చీలకు ప్రదర్శింపబడుచున్నవి మన తెలుగు టాకీలు కొన్ని. ఈ టాకీలే ఇన్నివారములు ప్రదర్శింపబడుచున్నప్పుడు మనటాకీ ఈమాత్రకాలమైనను ప్రదర్శింపబడక పోవునా యని 'స్వతంత్ర ప్రొడ్యూసరు' తలపరాదు. స్వతంత్రుడైన ప్రొడ్యూసరుకంటె స్టూడియో స్వంతదారునకు ఫిలింతయారుచేయుట సులభము చవక కాన. స్టూడియో స్వంతదారుల ఫిలిములు, వారి రాబడులమీద నాధారపడి స్వతంత్ర ప్రొడ్యూసరు రంగమున దుముకరాదు. కనీసము ఒక రూ. ౨౦,౦౦౦ లయినను లేనిది స్వతంత్ర ప్రొడ్యూసరు స్టూడియో స్వంతదారునితో ఢీకొనలేడీ వ్యాపారమున. సరియైన పెట్టుబడి లేకుండని వ్యాపారమున దిగిన మధ్యలో తట్టతగలవేసికొని లేచిపోవలసివచ్చును. కాన మన తెలుగుఫిలిం నిర్మాతలు ఈ విషయముల నాలోచించుచున్నారా తమ కార్యవిధానమున? ఎట్లు తయారుచేయుచున్నారు తమ ఫిలిముల?

ఒక కంపెనీని ఏదోవకపేరుతో స్థాపించి తాము తీయబోవు టాకీని పత్రికలయందు విరివిగా ప్రచురించుట తెలుగు టాకీనిర్మాణమున ప్రథమ సోపానము. కొందరు

నటులను 'అడ్వాన్సుల' నిచ్చి 'బుక్' చేసి పేరులను గూడ ప్రచురించుట క్రమముగా జరుగుపని. ఈసందర్భమున ప్రతిగ్రామములోను రెండు మూడు సినిమాప్రదర్శనశాలలుండుటచే వారిలోవారికిగల పోటీచేత ఒకరి కంటెనొకరు హెచ్చు 'పాట'తో కొంతసొమ్మునిచ్చి—ఫిలింతీయబోవు కంపెనీవారికి—ఆరాబోవు టాకీని తమ హాలులో ప్రదర్శించుటకు హక్కును పొందుదురు. ఈ విధముగ ప్రతిగ్రామమునుంచియు - ముఖ్యముగా రెండు మూడు ప్రదర్శనశాలలున్న నగరములనుంచి - ఫిలిం నిర్మాతలకు కొంతధనము సమకూరును. హక్కును పొందు ప్రతిప్రదర్శకుడును కనీసము ఒక రూ. ౧౦౦౦ లయినను యిచ్చును. ఈవిధముగ రూ. ౧౦,౦౦౦ లకు తక్కువ లేకుండ కంపెనీకి ఫిలిం నిర్మాణము ప్రారంభించక మునుపే చేకూరును. కంపెనీవారికి పత్రికలయందలి ప్రకటనలకును, నటులకిచ్చిన ఎడ్వాన్సులకును వెచ్చించిన ఏ రూ. ౨౦౦౦ లో, రూ. 3000 లో తప్ప యితర పెట్టుబడివుండదు. అప్పుడు ముందుగ ప్రదర్శనహక్కుకొరకు ధరావతులు కట్టినవారి రూ ౧౦,౦౦౦౦ లతో కంపెనీవారు 'జట్టు' (set) ను తీసికొనిపోయి కొంత స్టూడియో అద్దెకిచ్చి ఎడ్వాన్సునిచ్చి పని ప్రారంభింతురు. ఒకమాసములో చేనున్న ధన మైపోవుట తటస్థించును. అప్పుడు కొంతి భాగముమాత్రమే తయారయిన ఆపటమును అందగా నుంచుకొని అనుకొనిన చోటినుండి ధనము రానట్లు నటించుచు ఎవరయిన క్రొత్తపెట్టుబడిదారుల సహాయమున ఫిలిమును పూర్తిచేయుటకు ప్రయత్నింతురు. అప్పుడు ఎవరో ఒక మహానుభావుడు తటస్థించి ఆఫిలిమును పూర్తిచేయుటకు తగు ధనసహాయ మొసగును. అంతదనుక ఆఫిలిమునిర్మాణము ఆగియుండును. ఇదియే కారణము మన తెలుగుటాకీలలో కొన్ని నెలల పర్యంతము పూర్తిగాకుండ నిలుచుటకు. టెక్నికల్‌గా పరిపక్వముగా నుండుటకొరకు చేయబడు ప్రయత్నముల వలన ఆలస్యమగుటకూడ నుండునుగాని మన తెలుగు టాకీలలో నది తక్కువ. దీనివలన ఫలితము విశదమే గదా! అసందర్భ పరిస్థితులలో కాలముగానికాలమున ఫిలుము బయలుపడుట జరుగును. రెండవ పెట్టుబడిదారు దొరకునంతలో నటీనటుల 'ఎగ్రిమెంట్లు' కాలదోషము పట్టుటయు, మరల వారిని నిలుపుకొనుటకు 'ప్రొప్రయిటరు' అష్టకష్టములబడుటయు, వారు అసంతుష్టికరమైన పరిస్థితులలో పనిచేయవలసి యుండుటచేతను ఫిలిము మొదటిభాగమువలె నుత్సాహకరముగా తయారుకాదుగావున ఫిలిమంతయు సాక్షిగా నడవక పోడుదుడుకులతో నిండియుండును. సగమాకలితో మాడుచుండు ఈ నటులన్న స్టూడియోవారికి గౌరవముండదు. వారికి వీరియందు గౌరవ మున్నగదా ఫిలింనిర్మాణమందు ఆపేక్ష. ఇంతలో ఫిలిం తయారగుటయు, మరల ఆంధ్రులకొక 'సినిమా ప్రపంచమున నొక నూతనాలంకారము' ఏర్పడుటయు జరుగును!

మరియొక ఫిలిం నిర్మాణమార్గముగూడ తెలుగు టాకీలలో కలదు. ఫిలింనిర్మాతకు ధనముండుటయు, నిర్మాణమందు కించిత్తైన జ్ఞానము లేకుండుటయు, అంతట నాతడు ఒక "అనుభవశాలి" చేతిలో దీనినంతయు పెట్టుటయు—ఆ 'అనుభవము' న కర్థము భగవంతునికే తెలియవలె—జరుగును. అంతట నా 'యనుభవశాలి' తన యిచ్చవచ్చిన ఒక నొకబారుసంఘమును తోలుకొనిపోయి, ఒకచౌకబారు స్టూడియోలో పటమును తయారుచేయుటకు ఏ సినిమాకుల గురువునో, ఏ సినిమాకుల వృద్ధునో నియమించుటయు, అంత తెలుగురాని ఆ డైరెక్టరు దానిని పూర్తిగావించుటయు, తెలుగువారికి మరల నొక గొప్ప తెలుగుటాకీ బయలుపడుటయు జరుగును.

ఫిలిం నిర్మాణమున మూడవమార్గము, ఫిలిం నిర్మాణమున కగు ఖర్చులలో స్టూడియోవారును, పెట్టుబడిదారును చెరికొంత పెట్టుకొని తయారుచేయుట. ఇద్దరు యజమానుల చేతులలో నలుగు ఈ నటులు అష్టకష్టములతో పటమును పూర్తిగావింతురు. కారణము పెట్టుబడిదారు ఖర్చులు తగ్గుటకుగాను వీరిని కష్టపెట్టుచుండును. తమ కాలము వృథాపోవకుండ వీరినుండి రక్తమును పిండుచుందురు స్టూడియోవారు.

తీవ్రముగా విమర్శించుచుంటినని నన్ను తప్పుదలచినను నిజమును దాచుటకుగాని, యథార్థసంఘటనము

లను త్రోసివేయుటకుగాని వీలులేదని నా నమ్మకము. పరిస్థితుల నీవిధముగ జరుగనిచ్చిన ఒక గొప్ప పరిశ్రమ అన్యరాష్ట్రీయులకు పూర్తిగా వశమైపోవును. దాని వలన నష్టమెంతేనిగలదు.

దినదినమును క్రొత్తటాకీలు వచ్చుచున్నట్లే తెలుగు ప్రేక్షకులయందు విమర్శజ్ఞానము సైతము పెంపొందుచున్నది. చదువుకొనిన యువకులు ముఖ్యముగా వీటిని క్షమింపక తీవ్రముగా విమర్శించి త్రోసివేతురని కోరుచున్నాను. బంగాళమునందు మన తెలుగుటాకీలను ఎంత పరిహాసకరముగా జూతురో అనుభవించినవారికే తెలియును.

ఇవియే మన తెలుగుటాకీలు. సినిమా ప్రేక్షకులకు నయనోత్సవములు! సినిమాకులగురువుల చేతులనుండి తయారగుచున్న గొప్పటాకీలు ప్రదీప్తతారలతో నటింపబడి సినిమా ప్రపంచమున వెలుగుచున్న నూతనాలంకారములు!

వీటిని ఏవిధముగ తయారుచేయవలె, ఏపరిశ్రమను ఏవిధముగ నడిపిన లాభకరము? అనునవి మరియొక వ్యాసమున ముచ్చటింతును.



'నాటు హేటు' K. M. R.

# నా మహారాష్ట్ర యాత్ర

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

బస్సువాలకం బహుచిత్రముగానున్నది. అది యీనాటిదికాదని వెంటనే గుర్తించితిని. ధర్మరాజాదులవారి రాజసూయయాగమును చూచుటకై బయలుదేరిన కొంతమంది పెద్దమనుష్యులు ఒకబస్సుమీద ప్రయాణంసాగించి, తిరిగివచ్చునపుడు అది భంగపెట్టుటచే నాసికలో దానిని వదలినట్లును, అదియే నేటి మాప్రయాణమునకై ఉపయోగింపబడుచున్నట్లును ఊహింపగలిగితిని. తూకముగలవ్యక్తులు నలుగురు కూర్చున్నయెడల అది విరిగి ముక్కలగునని[y]యూ, మధ్యమార్గమున మమ్మిది యేగోతిలోనో కూల్చివేయుననియు అనుకొనుచు బిక్కుబిక్కుమనుచునే అందు ప్రవేశించితిని. ఈరీతి బస్సులు ఉత్తరహిందూస్థానములో-ముఖ్యముగా లాహోరు అమృతసరములకు నడుమ-విరివిగా లభించును. నేను ప్రవేశించునప్పటికే బస్సులో మహాశయు లెందరో పెద్దపెద్దదుప్పట్లు కప్పుకొని కూర్చునియుండిరి. వాలకములనుబట్టి చూడగా వారంతా పొరంబోకు సరుకులోనివారివలె తోచిరి. వారు కప్పుకొనిన దుప్పట్లుకూడ ద్వాపరయుగంలోనివలె నగపడినవి. నన్నుచూచి పాపము కొంతచోటిచ్చిరి. నాసికకు తాళమువేసినగాని కూర్చుండుట సాధ్యముకాదని గ్రహించి, ఊపిరిబిగబట్టి ఒకప్రక్క ఇరికిలపడితిని. పెద్దపాగాధరించిన చిన్నమనిషియొకడు చాలసేపు నన్ను తేరిచూచి "భాయీసాబ్! Where did you come from?" అని ప్రశ్నించినాడు. బస్సులోని బహుస్థాయిలలో నెవ్వరికైన ఇంగ్లీషు వచ్చియుండునని నేను తలచియుండలేదు. హిందీతో ఇంగ్లీషును మిశ్రయించిన మహాశయు డొకడు నన్నట్లు ప్రశ్నింపగనే "గోదావరి సాగరమున కలియుచోటున కనతిదూరము నుండి" అని ఇంగ్లీషులో Peraphrasis అలంకారము ఉపయోగించి వడిగా నుత్తరమిచ్చితిని. దానితో అతడు ఉక్కిరిబిక్కిరియైనాడు. ఇంగ్లీషులో నోరువిప్పుట తప్పనిగ్రహించి అతడు హిందీలో ధోరణి మొదలుపెట్టినాడు. నాస్వస్థలము రాజమండ్రి అని యెఱిగినాడు. మహారాష్ట్రులకు ముఖ్యముగా, నందలి గోదావరితీరవాసులకు రాజమండ్రి పరిచితమైనప్రదేశము. ఆవ్యక్తి నాగపురములో నేదోయుద్యోగము చేయుచున్నాడు. వానిసొంతయూరు నాసికము. సెలవుదీసికొని, యిపు డింటికి మరలుచున్నాడు. డిశంబరులో నాగపురమున మారిస్ కాలేజి స్వర్ణోత్సవసందర్భమున రాధాకృష్ణుడొసగిన మహోపన్యాసమును వింటినని అతడు పలికినాడు. ఇంతలో నెవ్వడో బస్సుకడకు నడచివచ్చి, లోనివారిని తేరిచూడ దొడగినాడు. నాసమీపమునగూర్చున్న నాగపూరుమిత్రుడు మెల్లగా "మీదేయూరగని అత డడిగినయెడల నాసికయనియే చెప్పుడు. లేకున్న మీసామానును పరికించి కొంతపన్ను యిమ్మంటాడు" అని నాతో చెప్పినాడు. కాశ్మీరము, రాజస్థానము మున్నగుచోటులకు పోయినపుడిట్టిపరీక్షలు జరుగుచుంట నెఱుగుదును. 'నాది నాసిక' యని వానితో నెట్లు తెలుపుదును? అమాంతముగా అబద్ధమాడుట నాకిష్టంలేదు. చదివినది ప్లీడరీవృత్తికైనా, జగదీశుడు అందులో రాడుదేలనీయక అందుండి నన్నుతొలగించి నే నెంత యత్నించుచున్నను నన్ను మరల నందులో ప్రవేశింపనీయకున్నాడు. ఆహా! మంచి లాయరునైనయెడల, న్యాయవాదవృత్తికి మంగళసూత్రమును కట్టియున్నయెడల, అబద్ధమాడుటకు అంత తటపటాయించియుందునా? అయినను అప్పటిలో నాకడనున్న సామానుమాత్ర మెంత? స్నానమునకు పనికివచ్చు గుడ్డలేకదా నాకడనున్నవి! వానికి పన్ను తగులబడియగుచో, మాట్లాడక రెండు తువాళ్లు నాపెద్దమనిషికి సమర్పించవలెనని నిశ్చయించితిని. తొందరపడి "నాది నాసికయే" అని చెప్పదలచుకొనలేదు. కాని నేనుకూడ మహారాష్ట్రుడనని అపో

చూపడి నన్నేమియు ప్రశ్నింపక ఆవ్యక్తి అందుండి తరలిపోయినాడు. బస్సు కదలినది. ఏముహూర్తమున ఊడి క్రిందబడుదుమో అని యడలి, బస్సు శబ్దము వికృతమై వినబడినపుడు "హరహరా" అనుకొనుచు, మరల విపత్తురాకుండుటకై వేయిదేవుళ్లకు మ్రొక్కుచు నిమిషములు లెక్కింపసాగితిని. చలిగాలి రివ్వురివ్వున వీవసాగినది. నాసిక ఐదుమైళ్లదూరమందే యుండుటచే (బస్సు నేరకంపాకీదయైనను) అచిరములో నచటు జేరుకొంటిమి. పైక మంతకుమున్నే చెల్లించితిని కావున అంతటితో బస్సునుండి దిగితిని.

చలి మరంతమై, దుస్సహమై యుండెను. ఇంకను రాత్రి సాగుచునేయున్నది. నాటినిశీథము నాయెడల పగబూనినదేమో అని యూహించితిని. నాసికనుండి త్రియంబకమునకు పోవుబస్సు పగలు ఎనిమిది గంటలు దాటినపిదపగాని బయలుదేరదని వినియుంటిని. అప్పటివఱకు కాలక్షేపము చేయుటెందు? బొంబాయిలో ఏముహూర్తమున రైలెక్కితినో, త్రోవపొడుగునను చిక్కులే పడుచుంటిని నిమిషమైనను ఎందును ఒరగలేనైతిని. సన్యాసిరోగమువంటి మాబస్సు మార్గమధ్యమందే ప్రభాతమును చూచునని ఆశపడితిని. నిద్దరకు నీరువదిలి, తెరువున నిలిచి యెంతసేపు చలితోపోరు సలుపవలెనో యెఱుగనైతిని.

సమయాసమయములందు నిద్రాహారములకు స్వస్తి చెప్పి, యిక్కట్టులతో పోరు సలుపవలయు తరుణములు నాకెన్నో లభించినవి. తొలుత దేశాటనమునకై బయల్దేరి కలకత్తాలో ప్రవేశించినపుడు అనుదినము నాతరుణములు ప్రత్యక్షమగుచుండెడివి. బాలకుడనై కలకత్తాలో బజారు హైస్కూలులో చదువుతఱి, తప్పనిసరిగ ఆత్మసంయమమును అభ్యసించుటకై పాటుపడవలసివచ్చెను. కొంత పైక మార్జించి చదువుకొనవలసివచ్చెను. విశ్రాంతిగాని, నిద్రగాని, యిష్టమైన ఆహారముగాని నాకంతగా లభించెడిదికాదు. అప్పుడు కలకత్తాలో తెలుగువారిసంఖ్య అంతగాలేదు. తెలుగు తిండిలేదు. భోజనమునకై ౨౫ ఈడెన్ హాస్పిటల్ రోడ్డులో గల పంజాబీ హోటలులో ప్రవేశించితిని. అచ్చట లభించెడిది రొట్టె. అంతకుమున్ను రొట్టెతినుటకు అభ్యాసములేనందున అచ్చటి ఉప్పుకారములులేని క్రొత్త తిండి నాకు సొక్కెడిదికాదు. ఆ సమయములో నాజీవనముపై కన్నుంచిన ఆంధ్రులిద్దఱుండిరి. వీరు బ్రాహ్మణేతరులు: రేకపల్లి వీరాస్వామి, చోడిసెట్టి వీరరాఘవులు అనువారు. వీరు కలకత్తాలో వర్తకము చేయుచుండువారు. నాకును వీరికిని సఖ్యము కుదిరినది. వీరాస్వామి అప్పటికే మిగుల వృద్ధుడు. అప్పటికి ముప్పదియైదేండ్లకుమున్నే అతడు కలకత్తాలో చేరుకొన్నాడు. కాకినాడనుండి గోదావరి లంక పొగాకును తెప్పించి, కలకత్తాలో చుట్టలు చుట్టించి గ్లాస్‌గో మున్నగు రేవులకు ఎగుమతిచేయువాడు. ఈతని కింగ్లీషురాదు. బంగాళమును, హిందీని, అక్కరైనపుడు తెలుగును కలిపి 'చక చక' మాట్లాడువాడు. అట్టిగ్రామ్యమునకు వ్యాకరణ మక్కఱలేదనుకొన్నాడు. మనిషి మంచివాడు. మంచిభక్తుడు. సన్యాసులపై నెంతో ప్రీతిగలవాడు. ఎందఱెందఱో కపట సన్యాసులీయమాయకుని జేరి ఏమేమో మంత్రము లుచ్చరించి డబ్బు దోచుకొని పోవువారు. ఒక సన్యాసి "నిన్ను బ్రాహ్మణుని చేతు"నని చెప్పి యేమేమో మంత్రములుచ్చరించి అతని మెడలో నొకజందము వేసినాడు. అబద్ధపు జందమైననేమి, దానిని మెడదాల్చి తన జన్మ పవిత్రమైనదని వీరాస్వామి యెంచువాడు. పుణ్యదినములందు తప్పక ఉపవాసములు సలుపుచు, మత్స్యమాంసములను వర్జించి మిగుల నిష్ఠాపరుడై యుండువాడు. అపుడపుడు హోమములు సలుపుచుండువాడు. అనుదినము ౫౦ ప్రిన్సెప్ వీధినుండి అచటికి రమారమి రెండుమైళ్ళదూరమందున్న చాంద్‌పాల్ ఘట్టమునకు స్నానమునకై పోవుచు నన్నుకూడ గొంపోవువాడు. కలకత్తాలో తొలుత నన్నుజూచిన తెలుగువాడీతడే! తన యింట్లో బసచేయుమని నన్ను కోరినాడు. వీని కింగ్లీషురానందున, ఈతని వర్తకమునకు సంబంధించిన ఉత్తరములను నేనే వ్రాసిపెట్టుచుండువాడను. మాసమాసము నాకు కొంత ప్రతిఫలం యిచ్చువాడు. తనతో గంగాస్నానమునకు గొంపోవువాడు. ఉపవాసములందును, జాగరణములందును తనతో పాల్గొనుడని ప్రోత్సహించువాడు. నాచే భారతభాగవతములు చదివించి,

వినుచుండువాడు. వీరరాఘవుని మకాము మలంగావేళ్ లో. అతనిదుంగడి ఆరవనెంబరు చాందినీచౌక్ లో నుండెడిది. ఇతని తండ్రి నాగయ్య, కాకినాడ కాపురస్థుడు. వీరాస్వామికంటె ముందుగనే కలకత్తాపోయి వర్తకము మొదలిడినాడు. తొలుత కొంతకాలము వీరాస్వామి ఈతనికడపనిచేసి, పదంపడి సొంతవర్తకము స్థాపించుకొన్నాడు. వీరరాఘవులు కలకత్తాలో పుట్టి, అందే పెరిగినాడు. బంగాళమునే చదువుట, వ్రాయుట నేర్చినాడు. తెలుగు వ్రాయ నెఱుగడు. వర్తకమును తానే చూచుకొనుచుండువాడు. తెలుగు ఉత్తరములను నాచే వ్రాయించుకొనుచుండువాడు. వీరాస్వామివలె స్వదేశపుమట్టలను ఎగుమతిచేసి, అతనికంటె విరివిగా విదేశమునుండి వివిధములైన సిగరెట్లను తెప్పించి పెద్ద వర్తకము జేయుచుండువాడు. జావాచుట్టలను వాడు వాడు. అప్పటికే పార్ట్
గుడును కావున అక్కఱగునపు డీతనికి ఉత్తరములు టైప్ చేసి యిచ్చువాడను. ఇతడుకూడ ప్రతిమాసము నాకు కొంత పైక మిచ్చుచుండువాడు. వీరాస్వామి, వీరరాఘవులతో గల సంబంధము కలకత్తాలో నావిద్యార్థి జీవనమందెంచుక భాగమును గడపి తరువాతి చదువునకు వలసిన వ్యవస్థను అన్యుల సంపర్కమువలన స్థాపించుకొనగలిగితిని. చిన్నతనమునుండి వివిధరాష్ట్రములందలి ప్రజలను పఠించుతరుణములు నాకనేకము లభించినవి. ఆంధ్రులందు బ్రాహ్మణబ్రాహ్మణేతరుల నెందఱినో పఠించితిని. వారియెడల నాకు సమానగౌరవభావము కలదు. నా బ్రాహ్మణేతరమిత్రు లంతగా చదువుకొనిన వారు కారు. కావున వీరు తమ గుండెలను భూమిలో పూడ్చిపెట్టలేదు. తోడి బ్రాహ్మణులు, తోడిబంధువులు నిర్దయులై నన్ను భ్రష్టునిజేసి దేశాటనమునకై పుత్తెంచినపుడు, నన్ను దగ్గరకు దీసికొని, నాకాదరానురాగము లొసగి, నాచేయుపని నానందముతో గైకొని నా కంతేని సాయముచేసి, నన్ను కాపాడినవారు బ్రాహ్మణేతర సోదరులే! జాతినిబట్టిగాక గుణమును బట్టియే మనుష్యమహత్త్వమును గుర్తింపవలెనని నాడే గ్రహించితిని. వీరాస్వామి వీరరాఘవుల గురు గుణములు నాకపుడు మేలుబంతులైనవి. ఉపవాసములును, జాగరణములును వీరాస్వామివల్లనే నాకు పట్టుబడినవి. వీరాస్వామి, వీరరాఘవులు నేడిహజగతియందు లేరు. వీరి పవిత్రాత్మలకు సచ్చిదానందముల నొసగుటకై సదా నేనీశ్వరుని ప్రార్థించుచుందును.

నా పరిశ్రమను పరికించుచు ఆదినములలో వీరాస్వామి నన్నుద్దేశించి, "అర్జునునివలె నిద్రను, లక్ష్మణునివలె ఆహారమును మీరు జయించినారు" అనుచుండువాడు. ఈ ప్రశంసకు నేను తగనుగాని, కలకత్తా చేరినపిదప నిద్రాహారములను హద్దులో నుంపగలిగితి ననియు, నిక్కట్టు లొక్కుమ్మడి మూగినపుడు దృఢచిత్తుడనై నిలువగలననియు నమ్ముచుందును. నాడే కాదు నేడుకూడ దురంతదురితోత్కట బాధలు పైబడి నాగుండెలను గుండజేయ గమకింప, నన్ను కాపాడుచున్న దీ యాత్మవిశ్వాసమే!

నాసికలో నాకు తలదాచుకొనుటకు చోటు లేక పడినయిబ్బందిని నే నంతగా పాటింపలేదు గాని నా యాత్మవిశ్వాసమును కఠోరపరీక్షకు గుఱిగావించిన పరిస్థితులు ఈ మహారాష్ట్రయాత్రలో గూడ నన్నెదుర్కొనినవని తెలుపుదును. క్రూరమృగములతో నిండిన సాంద్రవనములందు నేను కొన్నిరాత్రులు గడపవలసి వచ్చెను. చదువరు లీయుదంతమును కాలక్రమమున నెఱుంగగలరు. ఆ తరంగమందలి జిజ్ఞాసను వృద్ధిజేసి, భయ సంశయములను పోనాడి దుర్విమర్శనలను, విషాక్తములైన పరిహాసములను పాటింపక మనుష్యహృదయమున నపూర్వశక్తిని జనింపజేయునది ఆత్మవిశ్వాసమని తెలుపుట నాయాశయము.

బస్సునుండి దిగినంతనే నాగపూరువ్యక్తి మఱి నాతో మాట్లాడక మెల్లగా నిష్క్రమింప దొడగినాడు. నాసిక అతని స్వస్థలము. అందు సొంత గృహముగల అదృష్టవంతుడు. బస్సులో నిష్టాగోష్ఠి నాతో కాలక్షేపము చేసిన పెద్దమనిషి. రాత్రిసమయముగనుక తనయింట విందారగింపబోవువాడనుగానని, ఉదయమే లేచి త్రియంబకము పోవువాడనని యెఱిగిన బుద్ధిమంతుడు.

అప్పటికప్పుడే రాత్రి చాల కడచిపోయినందున మిగిలిన భాగమున చలినుండి నన్ను కాపాడుటకై పరుండుటకై నాకు కొంతచోటిచ్చిన తన కపుడెంతో పుణ్యము లభించు నని యూహింపజాలు బుద్ధిశాలి. దురంతమైన చలిచే నేను వడకుచుండ నప్పటి నాదుస్థితిని గ్రహింపగల విద్యాధికుడు కాని అతడేమియు పలుకక, మెల్లగ తనదారి దాను బట్టుచున్నాడు. "మీకూడవచ్చి, తెలవారువఱకు అందుందు" నని ఆమొద్దురాస్చిప్పతో నెటు పలుకుదును? "ఏయరు సమీపదైన నించుక చోటు లభించినయెడల, కొంచెము సేపందు విశ్రమించి ప్పుడె తి ననుకొందును" అని మాత్రము రెండడుగులు ముందులకు వెచి అతనికి వినబడున ట్లంటిని. "ఇచ్చట అఱుసలేమీయుండవు" అని సెలవిచ్చి అతడు దాటనాడు. నాఆశ్ల మంతకొని పోయినది. చోటునకై నేనంత పరితపించలేదు. కాని యిట్టికఠినచిత్తుని గాంచితినని ఖేదపడితిని. విద్యాధికుని యందు నిష్ఠురమైన అట్టి యుదాసీనభావమును గాంచినంతనే నా ఖేదమున కాగ్రహము తోడైనది. కొంత దూరమువఱకు సాగిపోయిన ఆవ్యక్తిని కేకవేసి, నిలిచినంతనే వానిని సమీపించి, "ఏపుణ్యభూమి పంగర్థజీవియైన శివాజీని, దేశహితార్థము మహాత్యాగ మొనరించిన లోకమాన్యతిలక్‌ను, మహనీయగుణారిష్టుడైన గోఖలేను కని జగత్ప్రసిద్ధి నందెనదో, అట్టిమహారాష్ట్రము నేడును మహాత్ముల కాలవాలమైయున్న దని ఆశపడితిని. మీదర్శనము నాకు నిక్కముగ నాశాభంగము కలిగించినది. ఇక నిం డెట్టివింతమానవులు నాకు మలబడుదురో! ఇక తమత్రోవను తాము పొండు. నే నీపథమందే నిలిచియుండి మీపై శాపవృష్టి నురిపింపను గాని నేటియనుభవమును హృదయంగమ మొనరించుకొందును. మీకు సంపూర్ణమైన ఆంతరంగిక పరివర్తనము కలుగుగాకని ఈశ్వరుని వేడుకొందును." అని పలికి మరలితిని. అతడేమియు మాట్లాడక తనదారిని తాను పోయినాడు.

ఈ మహారాష్ట్రుని బోలువ్యక్తి యొకడు హిమగిరియాత్రయందు దేడేండ్లకుమున్ను నాకు ప్రత్యక్షమైనాడు. నాటియుదంతము నీసందర్భమున సంక్షేపముగ తెలుపుట అప్రస్తుతము కాదని నాతలంపు.

ఒకానొక హిమగిరి యాత్రలో నాకు గమ్యస్థానమైనది శ్రీనగరము. అచటికి పోవుటకు రెండుమార్గము లున్నవి. అవి జమ్మూ, రావల్పిండిపథములు. ఫ్రాంటియర్ మెయిల్‌లో పోయి వజీరాబాద్‌లో దిగి, అందుండి కాశ్మీరరాజుయొక్క గ్రీష్మావాసమైన జమ్మూకు పోయి, అందుండి బస్సుద్వారా శ్రీనగరమునకు పోవచ్చును. కాని, యీత్రోవ బహుళములైన అపాయములతో నిండియుండును. మహోన్నత స్థలముల నుండి పాతాళమునంటు లోయలలోనికి దిగి, అందుండి మరల పైకెగబ్రాకి మరల నొకగభీరోపత్యకయొక్క యంచునుండి హిమగిరియాత్రయందు బస్సుపోవును. లోయలోనికి దిగుబస్సు వెన్క నెత్తైనచోటునుండి వచ్చుబస్సులోనివారికి ఒక్కొక్కపుడు కానుపించదు. బస్సుకంటె ప్లైజర్‌కార్ వేగముగ పోవును గావున పెక్కువిపత్తులకు గుఱియగుచుండును. కావున పలువురు ధనికులుకూడ బస్సునే ఆశ్రయించుచుందురు అచ్చటి డ్రైవరులు మిగుల నేర్పరులు. ఇంచుక యజాగ్రత పొడసూపినయెడల, బస్సు కుభాలన లోతులోయలోపడి పిండిపిండియగును! అందలివారు నిముసములో గుండయగుదురు! కాశ్మీరరాజు విశేషధనము వెచ్చించి జమ్మూనుండియు, రావల్పిండినుండియు శ్రీనగరమునకు రోడ్లు వేయించినాడు కాని పర్వతప్రదేశమందలి తెన్నులు సరియైనవి కాక ఉపద్రవములతో నిండియుండును. ఏపిల్సువర్తకమునకు రావల్పిండి మార్గము అనుకూలమైనది. అందును అపాయములు జరుగుచుండునుగాని జమ్మూపథమందలి అపదలకంటె నివి తక్కువయైనవి. రావల్పిండినుండి శ్రీనగరము సుమారు రెండువందలమైళ్ల దూరమందున్నది. ఈ మార్గముగుండా నేను కాశ్మీరమునకు పోవ నిశ్చయించితిని.

౧౯౨౯ లో లాహోరులో జరిగిన కాంగ్రెసునకు రాజస్థానమునుండి పోయి, అందుండి హిమగిరియాత్ర సలుప నుద్దేశించితిని. లాహోరు కాంగ్రెసునకు కొంద

ఆంధ్రులు వచ్చిరి. తొలుత నేను "రాజస్థానయువ సమాజము" యొక్క డేరాలో బసచేసితిని. ఒక బంగాళా ఆంధ్రసోదరుడు * నాకు కనుపించి తెలుగుల డేరాలోనికి రమ్మని నన్నాహ్వానించినాడు. కలకత్తానుండి [illegible]తోగూడ పెక్కండ్రు లలు రాజస్థానమున సత్కారము నొసరించుచుండుటచే, నాటివఱకు నాకు తెలుగుమొగము కనుపించలేదు; తెలుగుమాట చెవిబడలేదు. అందుచే రాజస్థాన మిత్రులతో నేనో సర్ది చెప్పి నేనాంధ్రులడేరాలో ప్రవేశించితిని. నాతో నాపొట్టి పిచికి యున్నాడు. నెల్లూరినుండి కేబాలవారు, కాకినాడ నుండి మొసలగంటివారు, రాజమండ్రినుండి నాళం వారు కాంగ్రెసుకు వచ్చిరి. ఇంగ్లీషు రానికొందఱు తెలుగులుకూడ లాహోరు కాంగ్రెసు చూచుటకై వచ్చిరి. పలువురుకలిసి ఒక్కటిక్కటేకాని వంతులువంతులుగా కాంగ్రెసుడేరాలో ప్రవేశించి విడ్డూరము చూచువారు. చాలకాల సాంతడే లో ఏమేమో హస్కకొట్టు వారు బెనారెస్‌నుండి వచ్చిన ఆంధ్రవిద్యార్థులీవేళ కలో కులాసామాటలలో పాల్గొనువారు. నేను పెషావరునకు పోదుమనినప్పుడు నలుగురాంధ్రులు నావెంట బడిరి. వీరిలో మొదటివాడు రాజమండ్రి కాపురస్థుడు నాళంభీమరాజు. ఇతడు నిర్మలహృదయుడైన దేశభక్తుడు. వైశ్యకులమునకు వన్నెదెచ్చిన యువకుడు. చదువునకై కలకత్తా వచ్చి నాకడ కొన్నాళ్లుండుటచే నితడు నాకు పూర్వపరిచితుడు. రెండవవ్యక్తి విశాఖ పట్టణమునకు సమీపమందలి చోడవరమునుండి వచ్చిన వాడపల్లి బ్రహ్మన్నశాస్త్రిగారు. తక్కిన యిరువురు ఇచ్ఛాపురమునుండి వచ్చినవారు. ఒకడు తూముల కృష్ణమూర్తియను వైశ్యరత్నము; రెండవ వాడు పట్టు సాలికులస్థుడు దున్నా రామమూర్తి. ఇతడింగ్లీషు నెరుగడు. కాంగ్రెసుఏమో చూడవలెనని పరుగెత్తు కొనివచ్చినాడు. ఫ్రాంటియరు మెయిలు లాహోరులో రాత్రి ఏడుగంటలకు బయల్దేఱును. మేమాఱుగురము (ఆఱవవాడు పొట్టిపిచికి) ఆఱైనపిదప మాడేరాను విడిచి అవ్వలి కరిగితిమి. "లజపతి నగర"ద్వారమున స్టేషను వఱకు రెండుటాంగాలు కట్టించుకొనదలచితిమి. "సంతులుగారూ! కిరితో విరా సిందు నిలువుడు" అనిచెప్పి భీమరాజు ముందుకరిగి "టాంగావాలా! టాంగావాలా!!" అని యఱచినాడు. టాంగావచ్చు లోపల ఆతనిజేబు చులకనైనది. అందున్న మనీపర్సు నెవ్వరో లాగివైచిరి! అందు చాల నోట్లున్నవట. కాంగ్రెసుసమయము కావున జనులు ఇసుకవేసిన రాల నట్లున్నారు. పోయినపర్సు ఇక లభించుననుట కల్ల. టాంగాలువచ్చునని మేము నిలబడియుంటిమి. భీమరాజుమాత్రమువచ్చి పర్సుపోయినసంగతిని చెప్పినాడు. ఆతనినష్టమునకు మిక్కిలి వగచితిమి. పోలీసులతో చెప్పితిమి కాని పోయినడబ్బు మరల లభించలేదు. ఇట్టిదుశ్శకునముతో ప్రయాణము సాగించుట కిష్టపడక నాటికి డేరాలోనికి మరలిపోతిమి. మఱునాడు నేనూ, బుడంకాయా పయనమైతిమి. భీమరాజు తనపయనము మానుకొన్నాడు. తక్కినముగ్గురు నావెంట బడిరి. వీరితోగలిసి నేనుసలిపిన ప్రయాణమును గుఱించిన విపులోదంతము నా "కాశ్మీరమజిలీలందు" కాల క్రమమున వివరింతును. ప్రస్తుతము మనదృష్టియందలి విషయమును దృష్టాంతీకరించుటకుమాత్రము అప్పటి ప్రయాణాంశముల గొన్నింటి నిం దుల్లేఖింతును.

పైన తెలిపిన ముగ్గురు మిత్రులు నాతో† పెషావరునుండి ఖైబరుకనుమయవ్వలివఱకు వచ్చిరి. కాశ్మీరమునకు కూడ పోదునని నా ప్లాను వారికి దెలిపితిని. "మేముకూడ వచ్చుటకిష్టము. హిందీకాని, పంజాబీకాని, కాశ్మీరికాని మాకురాదు. ఒంటరిగా గాక మీతో పయనముసాగించిన, మాకంతేని మేలుకలుగును. మా అంతకు మేమచటికి పోలేము." అని పలికి వారు

* ఇతనిపేరు 'రావు'; కొంతకాలము మదరాసులోనున్నాడు. పదంపడి బొంబాయిపోయినాడు. కడచిన డిశంబరులో నన్నందు కలిసికొని "బొంబే క్రానికల్" ఆఫీసులో నుంటినని తెలిపినాడు.

† "నాతో" అనినప్పుడు నాకూడ నాపొట్టిపిచికిగాడుకూడ నున్నాడని చదువరులు గ్రహింతురు గాక! నా యనుచరుడైన బుడంకాయగాడిని గుఱించిన వృత్తాంతమును నా "కాశ్మీరమజిలీ" లందు [illegible],

ముప్వురు నావెంటబడిరి. నాతో తత్క్షశిలయందు విడిసి, అందుండి రావల్పిండి వచ్చిరి. రావల్పిండిలో "దాల్ మండీ" యను చోటున నానక్ సింగ్ అను సిక్కు మిత్రునింట గొంతకాలముండి, పదంపడి శ్రీనగరమునకు పయనమైతిని.

రావల్పిండికి నలుబదియైదు మైళ్ళదూరములో మర్రే అనుచోటు కలదు. పంజాబు గవర్నమెంటువారిందే వేసవిసమయమున వసింతురు. హిమగిరిపై నిది మిసుల నెత్తయిన ప్రదేశమం దుండుటచేతను, మే మచటికి జనవరిలో పోవుటచేతను, ఆచోటంత యు మంచుతో నిండియుండెను. కాశ్మీర ప్రభుత్వమువారిచే నియోగింపబడిన నౌకరులు బస్సుపోవుత్రోవనుండి మంచునెత్తివ్వి, పక్కపార్శ్వమున ప్రోగొనరింతురు. అచటి యిండ్లన్నియు తొట్టుగ పిండిముద్దలతో కప్పబడినట్లు మంచుముద్దలతో గప్పబడియుండెను. బస్సుపోవుతలుపు చేయిజాపగనే నిమిషములో నది తెల్లబడిపోయెడిని. ఇచటికి దమారమి ఇరువది మైళ్ళలో "కోహాలా" అను చిన్నకొండపల్లె కలదు. ఈపల్లె జీలమ్‌నదియొడ్డున నున్నది. మే మీపల్లెను చేరుసరికి రాత్రి రమారమి యొనిమిదిగంటలసమయ మైనది. హిమగిరి యాత్రలో రాత్రులందు కొండలందు పలుమారు విడియుచుండు వారము. అప్పటియనుభవములు అత్యాశ్చర్యమైనవి. నాటికి "కోహాలా" యందు విశ్రమించి మరునాడుదయమున బయనమగుదమని చెప్పి మాబస్సు డ్రైవరెందో అంతర్ధానమైనాడు. బస్సు ఆగగనే ఒక కాశ్మీరీ యువకుడు చరచర మాకడకు వచ్చినాడు. అతని మేనిచాయ దబ్బపండురంగును ధిక్కరించుచున్నది. అతడు దట్టమైన లాంగ్ కోటును ధరించినాడు. వాని తలపై చక్కనిటోపీ అలరారుచున్నది. బస్సులో నున్న నన్ను చూచి "బాబూ సాబ్! ఆయియే. మై ఆప్ కా తాబేదార్ హూం" అనినాడు. ఈ యాహ్వానము నాకెంతో ఆనందము గలిగించినది. రామనవమి యుత్సవములు చూచి, భద్రాచలమునుండి రాజమండ్రీకి యాత్రికులు తిరిగివచ్చునపుడు, పోలవరంకడ ఇసుకతిప్పలలో గొన్నిపందిరులువేసి పుణ్యాత్ములు కొందరు వారిని ప్రేమపూర్వకముగ నాహ్వానించి భక్ష్యభోజ్యలేహ్యచోష్యములతో వారిని తనుపుచుందురు. ఇట్టి యేర్పాటు నేడున్నదో లేదో యెఱుగను గాని ౧౯౩౨ లో నుండెడిది. వినయపూర్వకముగ హిమగిరిపల్లెయందు మమ్మాహ్వానించిన కాశ్మీరీయువకుని జూచి మంచుకొండపై మాకాతిథ్యమీయ నవతరించిన గంధర్వబాలుడని యూహించితిని. అపూర్వమైన విందు చేయుదునని ఆశపడితిని. "చలియే!" అని చెప్పి మిత్రులతో నేనాతని వెంటబడితిని. చలి చెప్పనలవిగానట్లున్నది. అక్కరైన శీతవస్త్రములు శరీరముపైనున్నను, అంతరంగమునుండి దారుణమైనచలి యొడలిని గజగజ ఊపుచుండెను! అవిరముగా మే మాయువకుని యింటికి కరిగితిమి. మమ్మాతడు వేర్వేరుకుర్చీలపై నాసీనుల గావించి మూగల గల బల్లలపై వేడినిప్పులతో నింపిన కుంపట్ల నుంచినాడు. శీతనగమున పయనము సలుపుతఱి రాత్రులందు అనివార్యముగ అగ్నిసమీపమున సమయము గడుపవలెను. రాత్రులందు కొండపల్లెలందు విడియునపుడు గదికిని మంచమునకును అగ్నికిని ప్రత్యేకముగా బాడుగనీయవలెను. అగ్నిదర్శనమువల్ల మేము "అమ్మయ్యా!" అనుకొన్నాము. "తమకు పూరీకావలెనా, కచోడీ కావలెనా, పుల్కా కావలెనా, పరోటా లేక చపాటీ కావలెనా? సెలవీయుడు" అని కాశ్మీరీయువకుడు నమ్రతగ్గ శించి పలికినాడు. "ఇవన్నీ రొట్టెరకములు. మీ కేమి కావలెనో చెప్పండి" అని తెలుగుసోదరుల నడిగితిని. ఇంతలో షాట్టెపిఁడికి "గరాంగరం చపాటీ లియావ్" అని హుకుమ్ జారీచేసినాడు. నిమిషములో వేడివేడి చపాటీలువచ్చి మాముందు వ్రాలినవి. "మలాయిభీ లీజియేగా?" ("మీగడకూడ తీసికొందురా?") అని యువకు డడిగినాడు. వాని ప్రశ్న ముగియకముస్నే "అల్ బత్" (తప్పక) అని బుడంకాయగాడు అఱచినాడు. మీగడతోను, కోప్ లేక గోబీ (కేబేజ్) ఆలూ (బంగాళాదుంప) మటర్ (పచ్చిబొటానీగింజలు) కలిసిన చక్కనికూరతోను చపాటీలను కడుపునిండా మెక్కితిమి. "దూద్ భీ లీజియేగా?" ("పాలుకూడ దీసికొందురా?") అని యువకుడు మరల ప్రశ్నించి

నాడు. "జరూర్!" అని పొట్టిపిచికే పలికినాడు. అర్ధ సేరు ప్రాప్తికి అందరము పంచదార కలిసిన వేడివేడి పాలు పీల్చి "అమ్మయ్యా!" అనుకొన్నాము. "ఏం పుణ్యాత్ముడండి! జగదీశుడిట్టివానికే సకలైశ్వర్యము లిచ్చును. మే మిలాపలికితిమని ఆ పెద్దమనిషికి తర్జుమాచేసి చెప్పండి" అని బ్రహ్మన్నశాస్త్రిగారనిరి. నేనట్లే తెలిపితిని. "అబ్ కా మెహర్‌బానీ" అని యతడు బిల్లుతెచ్చి మాముందుంచి "పాక్‌భీ లియాఖ్వంగా" అని చెప్పి వెంటనేపోయి, తాంబూలము తెచ్చి మాకిచ్చినాడు. బిల్లులో నైదురూకల మొత్తమున్నది. "ఏమి చెప్మా?" అనుకొని, తోడనే "మాకింత సత్కారము చేసి మా యుదరములను నిండించిన పెద్దమనిషి ఒక హోటలుకీపరుగాని మనుష్యులను తనుపుట్టకై గంధర్వలోకమునుండి దిగివచ్చిన వరూథిని తమ్ముడు కా"డని గుర్తించి దానిని, కూడనున్న మహాశయులచేతి కిచ్చితిని. బిల్లును చూచినంతనే వారు తెల్లబోయిరి. కత్తితో గ్రేటువేసినను వారి ముగములనుండి రక్తపుచుక్క పడునని తోచలేదు. నిమిషమునకుమున్ను అతని నెంతో పొగడిన బ్రహ్మన్నశాస్త్రిగారు "హరి హరి మోహమ్మంటా! అయిను రూపాయలే! కొంప తీశాను ఉండి ఉండి!" అని గుండె చూచుకొని అంచినాను. "మనిషి ఒక్కింటికి రూపాయిన్నోనది. పొట్టిపిచికిగాడిఖర్చును నేనే భరింతును. కావున నేను రెండురూకలిత్తును రూపాయిచొప్పున మీరు మీ పైకము వానికీయుడు" అని నేను పలికితిని. "అప్పు డేమనుకొంటే యేమిలాభం యిచ్చివేయండి" అన్నాడు రామమూర్తి. "ఇటువంటి డిమేండు తలపైబడునని కలలోనైన తలచియుండలేదు. హిమగిరి తలపై పడినట్లయింది. నేను పుట్టి పెరిగి రమారమి యేభై యేండ్లు కడపినాను. ఒకపూట తిండికి (అందులో అన్నమూ లేదు, పిడి పిండామూలేదు) రూపాయి నెన్నడూ యిచ్చియుండలేదు. ఈదెబ్బ వీడికి దక్కియేమున్నం దేమి?" అని విసుకుకొనుచు బ్రహ్మన్నశాస్త్రిగారు బొంటెనుండి తమ రూపాయను దీసి క్రిందికి గిరవాటు చేసిరి. "ఈలా" అని పంతులుగారు ముందే చెప్పియుండవలసింది. మాటరాకపోవడంచేత ఇంతపని జరిగిపోయింది. వీడు ఏమిపెట్టినాడని రూపాయి యిచ్చేది! చివరికి ఒక్క పెసరట్టయినా కళ్ళబడింది కాదు. నోరంతా చచ్చిపోయింది. చూసి చూసి వీనికి రూపాయి నేనియ్యను. నాకింకా చపాటీలు తెప్పించండి" అన్నాడు కృష్ణమూర్తి. మా ధోరణి యేమో కాశ్మీరీయుడగునకు తెలిసినది కాదు. "క్యా చాయియే ఫర్మాయియేగా" అని అతడనినాడు. "ఉనోక్ ఫిర్ చపాటీ దీజియేగా" అని నేనంటిని. వడివడిగపోయి నాలుగు చపాటీలను తెచ్చి అతడు కృష్ణమూర్తియందుంచినాడు. "చేతులు కడుగుకొన్న నేమి? మేమేల అడుగరాదు?" అని తక్కిన మహాశయులు తమలో తాము యోచించుకొనిరి. ఇంతలో మఱొకబిల్లుతెచ్చి "అపుర్ ఆఠ్ అణా దీజియే" అన్నాడు యువకుడు. "మఱి ఎనిమిదణాలీయమంటున్నాడు" అని కృష్ణమూర్తితో చెప్పితిని. "సనేమిరా!" అనినాడాతడు. "అల్లరెందుకు పాలు తేయుండి" అని నేనంటిని. "పీల్చివేశాడు వీని దుంప తెగా" అని బ్రహ్మన్నశాస్త్రిగారనిరి. "ఇంతఘోరమా! ఇంత దారుణమా! ఈ దెబ్బతో ఎంతమందికో సంతర్పణచేయవచ్చునే!" అని సణుగుచు, తిట్టుచు కృష్ణమూర్తి పైకము చెల్లించినాడు. "పరుండుటకు మాకు చోటెందు లభించును?" అని నేను యువకుని ప్రశ్నించితిని. "కొంతదూరంలో ఒక డాక్‌బంగ్లా యున్నది. అచట కావలసినంత చోటుండును. ఇక్కడ చోటులేదు. ఇష్టమైతే ఈ బల్లమీద ఒకరిద్దఱు పరుండవచ్చును. కాని యిచ్చట చలి అధికము" అని అతడనినాడు. ఇచ్ఛాపురపు మిత్రులందే యుండదలచిరి. కాని 'నిద్రచేసి' నందులకు మరల పైకమీయవలసి వచ్చునని అదలిరి. మఱిఅచ్చటికి పోలేమని ప్రక్కనున్న దుకాణములో చతికిలబడిరి. నేను వెలుపలికరిగితిని. పొట్టిపిచికీ, బ్రహ్మన్నశాస్త్రిగారూ నావెంట బడిరి. "పాక్‌కా పైసా దీజియే" అని హోటలువాడు శాస్త్రిగారిచేయి పట్టుకొన్నాడు. "ఏమండో, వీడేమో అంటున్నాడు. కోడతాడు కాబోలు వీడి మొహామ్మంటా! అమాంతంగా జెబ్బ పట్టు

కొన్నాడు!" అని శాస్త్రిగారు మొరపెట్టిరి. వెనుకకు తిరిగి సంగతినెఱిగి, కిల్లలకైన డబ్బులు యువకునికిచ్చి ముందులకరిగితిని. "బంగ్లా బాగా యెత్తుచోటునయున్న" దని అచటివా రన్నారు. కారుచీకట్లు నలువైపులందు అలముకొనియున్నవి. త్రోవా, తెన్నూ కానుపింపలేదు. ఎత్తుపల్లములూ, ముళ్లూ, మంచుగడ్డలూ మమ్మెదుర్కొనినవి. ఎట్లో నేనూ, బుడంకాయగాడూ ముందుల కెగబ్రాకితిమి. ఇక బ్రహ్మన్నశాస్త్రిగారు!

లాహోరులోనే ఈయన బావాజీవలె తయారైనారు. ఈ తన యొజ్ఞోపవీతంచలే వాడుచుండురు. ఒంటికి చొక్కాలేదు, కాలికి జోడులేదు. మెడలువంచి "పిండీలో" ఈయనచే ఒకరగ్గు కొనిపించినాను. "చొక్కాకుట్టించుకొను" డంటే "ఊహూ!" అని మూతిపొడిగించారు. "కాలికి జోడుతప్పదు. జోడు లేకున్న నీప్రాంతాలలో నలుగురూ నవ్వెదరు. అదట్లుండ జోడులేనిదే మంచులో తిరుగరాదు. ఐదునిమిషాలలో ప్రాణము లెగిరిపోవును" అని చెప్పితిని. నానక్‌సింగూ, అతని సోదరులూ అట్లే చెప్పిరి. ఎట్టకేలకు ఒక చవుకరకపుజోడు కొనుటకు శాస్త్రిజీ అంగీకరించారు. పాతవుపాటి యొజ్ఞని తురకజోడును కొన్నారు. జోడు సంతకుమున్న దని పెద్దమనిషియగుటచేతను, ఆజోడుతోలు రాతికంటె గట్టిదగుటచేతను శాస్త్రిజీ దానిలో పాదములు దూర్చి చాల బాధపడువారు. "రామా! ఇది కుక్కపీకినట్లు పీకుతోందండీ!" అని ఆయన అనుచువారు.

నేనూ, పొట్టిపిచికే ముందులకరుగుచు "త్వరగా రండి" అని శాస్త్రిజీని హెచ్చరించితిమి. పాపము ఆయనబాధ వర్ణనాతీతము. బిక్కుబిక్కుమంటూ జోడుతో ముందుల కడుగువేసి "రామా హరీ!" అని కవ్వున కేకవేసి, దానిని తీసివేసి మంచులోనూ, ముండ్లలోనూ అడుగువేసి "అమ్మో! చచ్చేము!" అని బహుకష్టముతో మరల జోడుతొడిగి, కాలుసాగించి "హరహరా" అని ఆయన ప్రక్కగోతిలో పడిపోయిరి! మేమిద్దఱమూ దావుకు వచ్చితిమి. "చంపేశావయ్యా బ్రాహ్మడా! ఇక్కణ్ణుంచి రావడంయెల్లా? జోడుతొడిగితే ఒకతంటా, తొడగకపోతే మఱొకతంటా! ఈ కాశ్మీరము నన్ను చంపేందుకు పుట్టించికాబోలు! ఈ పర్వతాలూ, యీ మంచూ, యీ ముళ్లూ నాహతమార్చి తీర్తాయి!" అని ఆయన గద్గదస్వరముతో మొరపెట్టినారు. నాగుండె నీరైనది. పొట్టిపిచికి పకపకనవ్వుచు గంతులువేసినాడు. "శాస్త్రిజీని ఇందుండి కదపుటెట్లు?" అని పరిపరివిధముల దలపోసితిని. ఇద్దఱమూ పట్టి పైకి కొనిపోవుదమనినను, అతడు స్థూలకాయుడుగాని బెండువంటివాడుకాడు. ఎక్కవలసినది ఎత్తుకొండయగుటను, దాపలనున్నది లోతులోయ యగుటను, అట్లొనరించుట అసాధ్యమని గ్రహించితిని. ఆయనచే మరల కష్టంమీద జోడుతొడిగించి, మెల్లగ చెరియొకవైపునుండి చెరియొక చేయిపట్టుకొని ముందుల కడుగువేయించితిమి. బుడంకాయిగాడి నవ్వు హెచ్చినకొలది శాస్త్రిజీ ఆగ్రహం హెచ్చినది. "తెల్లవారనియ్యి నిన్ను తవ్విపాఱవేస్తాను" అని ఆయన అనుచువాడు. ఎట్లో శాస్త్రిజీతో మేము డాక్ బంగ్లాను చేరుకొన్నాము.

మే మచటికి పోవునప్పటికి బంగ్లానుండి యెవ్వరో ఒక హిందూస్థానీయుడు దివాలున నీవలికి వచ్చినాడు. యూరపియన్ డ్రెస్‌తో అతడు అలరారుతున్నాడు. "మీ రెవరు? ఇప్పటికేలవచ్చితిరి?" అని అత డనినాడు. అతని కంఠస్వరము తీవ్రముగా నున్నది. "అయ్యా! మే మీ రాత్రి యిచ్చట పరుండుము. ఉదయమే లేచిపోదుము" అని నేను తెలిపితిని. "ఇచట చోటులేదు పొండు" అని అత డనినాడు. "లోపల చోటులేకున్నను, మే మీ వసారాలో నొరుగుదుము. ఇందు కావలసినంత చోటున్నది కదా!" అని నేనంటిని. "తావు ఇందూ లేదు, అందూ లేదు. వెంటనే పొండు" అని అత డనినాడు. నేను హిందీలో ప్రసంగించుచుండ నతడు ఇంగ్లీషులో మాట్లాడసాగినాడు. నేనుకూడ ఇంగ్లీషులో ప్రసంగము మొదలిడి; నా ధోరణిలో కొంత స్టీమ్ ఎక్కించితిని. "ఏమోయీ! నీవు మానవునివలెనే అగపడుదున్నావు. అందున భారతీయుడవు. నీ కిట్టి నిష్ఠురము కూడదు. నిన్ను మేము కోరిన దేమియులేదు. దక్షిణ సీమనుండి

వచ్చి, కాశ్మీరమునకు పోవుచు, ఈ రాత్రి యిందు చిక్కుబడిపోతిమి. ఈ స్థితిలో వన్యమృగములయిన మాకు చోటిచ్చుట కంగీకరింపుము. మనుష్యరూపమున నున్న నీ నోటినుండి ఇట్టి నుడువులు వెడలుట శోచనీయము" అని పలికితిని. "ఎంతచెప్పినను, మిమ్మిందు పడుండనీయను" అని అత డెప్పటిపాటను పాడినాడు. "నీవు నూఱుచెప్పుము. వేయిచెప్పుము. మే మింకే తిష్ఠవేతుము. నీ యిచ్చవచ్చినచర్య జరుపుకొనుము." అని "శాస్త్రీజీ! సంశయింపక మీరు ప్రక్కవేయుడు" అని పలికితిని. తాను తెనుగున మాట్లాడిన నచటి హిందూస్థానీయునకు బోధపడదని శాస్త్రీజీ యెంచుకొను. "ఈపిశాచము మనలను మ్రింగివేయునేమో! వీనితో మనకు పోరాట మెందులకు?" అని "పరుండుడు" అని నేను గద్దించినంతనే నేలపై మేను వాల్చినారు. "మనము మనుష్యులము. ఈతడు ప్రస్తుతము పశువైనాడు. పశుబలముకంటె మనుష్యబల మధికము. ఏచింతలేక నిద్రింపుడు. హిమగిరిని విలోకించుచు నే నీరాత్రి మేలుకొని యుందును. మీకేమియు భయములేదు." అని శాస్త్రిగారికి ధైర్యము చెప్పితిని. హిందూస్థానీయు డవాక్కయి నిలిచినాడు. "నీవు ఈ మహత్తరమైన భారతభూమియందు పుట్టుటకు తగవు. 'అతిథిదేవో భవ' అను పవిత్రవాక్కు ఈ దేశమందు ముఖ్యముగ, లోకస్రష్టకు మునిపుంగవులకు, దేవతలకు నిలయమైన ఈపర్వతప్రదేశమందు ప్రతిధ్వనించినది. నీవు నీహృదయము నెందు వీడితివో యెరుగను. ఈ బంగ్లాకు సంబంధించిన నిబంధనపత్రమును గొనిరమ్ము. మర్యాదనేకాక, రూలునుకూడ నెఱుగని మూర్ఖుడవువలె నగపడుచున్నావు. నీపైచర్య దీసికొనిన నీ యుద్యోగము ఊడి నేలరాలును. నీ కపకారము చేయను గాని నీకు హితవు చెప్పుదును. మేము దొంగలము కాము. ఇందుండి నీవు మమ్ములను క్రిందికి దొరలింప దొరకొనినను, మేము కదలువారము కాము. ఈగహనమున మాకు మరొకతావు లభింపదని నీవు తొలుతనే గ్రహించి యుండవలసినది" అని హిందూస్థానీయు నుద్దేశించి పలికితిని. ఏమనుకొనినాడో కాని అత డిక మాట్లాడ లేదు. నా యాదేశానుసారము పొట్టిపిచికిపోయి శాస్త్రీజీ ప్రక్క పరున్నాడు. కొండమీది యల్లరి విని ఎవరో ఒకపెద్దమనిషి బంగ్లాలోనికి చరచర వచ్చినాడు. మనిషి చామనచాయవాడు. దట్టమైన బట్టలు ధరించినాడు. "కథయే" మని నన్నడిగినాడు. జరిగిన ఉదంతమును వానికి పూసగ్రుచ్చినట్లు చెప్పితిని. అతడు మిగుల నక్కజంపడి రాతిప్రతిమవలె నిలిచిన హిందూస్థానీయు నుద్దేశించి "నీ వెంతేని దుర్నయమున కొడిగట్టితివి. సిగ్గుచే, దుఃఖావమానములతో మనము తలలు వంచుకొనవలెను. ఈయన దాక్షిణాత్యుడు. విద్యాబుద్ధులందు దాక్షిణాత్యులు మన తలదాటినారు. వారు మనకు పూజనీయులు. ఉత్తరహిందూస్థానమునుండి పోయినవారిని వా రెంతో గౌరవింతురు. వారుమాపు ఆదరణమునకు బదులుగ నీ వత్యాచారము జూపితివి" అని పలికి ముఖము వాచునట్లు వానికి చీవాట్లు పెట్టినాడు. పశ్చాత్తాపము నంది ఆ హిందూస్థానీయుడు క్షమింపుడని నన్ను వేడుకొనినాడు. నా కన్నులనుండి నీరు జొటజొట రాలినది. గంగాస్రవంతివలె నా హృదయమున నత్తఱి పూతభావపూర ముప్పొంగినది.

ఆహా! మనుష్యాత్మకు మహదానంద మొసగునది మహత్తరమైన ప్రణయభావమేకదా! మనుష్యహృదయము నేలున దీభావమేకదా! అప్పుడప్పుడు దుశ్చింతలు రాబందులట్లు మనసుపై వ్రాలుట నిక్కమే! క్రోధభావము ఝంఝామారుతమట్లు హృదయము నట్టిట్టు లాడించుటయు నిక్కమే! క్రోధముచే ఘూర్ణితచిత్తుడైన వ్యక్తి దురుక్తులాడుట నిక్కమే! దుష్క్రియలకు దొడగుటయు నిక్కమే! కాని క్రోధముగాని, మఱే ప్రతికూలభావముగాని మనుష్యాత్మకు సహజములు కావు. సహజముగాని సరు కెంతకాలము నిలుచును? దేవదేవుని పీఠస్థలియైన మనుష్యహృదయమున పిశాచము కాపురముండ నేర్చునా? జగచ్చక్షువుమ్రోల కారుచీకటి భామవలె నృత్యముచేయజాలునా? మనుష్యహృదయమున దివ్యశంఖారవమట్లు పవిత్రప్రేమవాక్కు ప్రతిధ్వనించినంతనే దొంగపగిది క్రోధమందుండి కాలికొలది పాఱిపోదా? కొంతసేపు హిందూస్థానీ

యొడుదను, నేనును పోరాడుకొంటిమి. ఆత్మరక్షణము కొఱకు, చెంతనున్న మిత్రులకు రక్షణముసగుకొఱకు నేను కొంతనాటక మాడితిని. సంయమిని కానుగాని క్రోధభావమును హృదంతరాళమున గాపుర ముండ నీయక దానిని తటిమికొట్ట నాకురంపడుదును. కాని మెత్తనివానిని చూచిన మొత్తువా రెదు రగునపుడు అస్త్రసన్యాసము అనర్థహేతువగునట్టి, కాలపరిస్థితులు కురుసేనలట్లు మార్కొనినపుడు ముప్పునుండి దాటుటకై కొంత ధూమధామముచేయుచు, ఎదుటిపక్షుని మిత్రుని గావించుకొనుటకై వేయివెరవులు రోయుచుందును. నాకు మిగులగూర్చు మిత్రులలో పలువు రొకప్పుడు నన్నెదుర్కొనినవారే! నాటి హిందూస్థానీయుడు పసంపడి నాకు ప్రాణమిత్రుడైనాడు. హిమగిరియాత్రయందు నాకతడెంతో సాయము సలిపినాడు. ఈతని పరిచర్యనుగుతించిన విపులోదంతమును చదువరులు వేఱుగ్రంథమున గాంచగలరు. పొట్టిపిచికి తొలుత నాశత్రువేకదా!

ప్రణయభావసేచనముచే నాటిరాత్రి మమ్ముల నానందపూరమందు ముంచిన ఆనూతన ఆగంతువునకు మేము ధన్యవాదము లొసగితిమి. అతడు కురుక్షేత్రమందు అధ్యాపకవృత్తిలో నుండెను. "కొంత సొంతపనిమీద కోహాలోకు కొన్నాళ్లకుముందే యరుదెంచితి" నని అతడు పలికినాడు. అతని పేరు చిరంజీవి. నేనుత్తరహిందూస్థానమును వీడివచ్చినయనంతరము అతడును, నాటిహిందూస్థానీయుడును తఱచుగ జాబులు వ్రాయుచు, నా యోగక్షేమము లరయుచున్నారు. దాక్షిణాత్యమునకు రండని వీరికి పలుమాఱు వ్రాయుచుందును. ప్రేమఋణమును దీర్చుకొను నవకాశములకై పొసలుచుందును.

"పరుండుటకు మీకిచట సౌకర్యము లభించదు. ఈ చలికి మీరు గుఱికారాదు. మీకు వలసిన సదుపాయములను నేనొనగూర్తును. నా సహోదరుండు" అని ప్రొఫెసర్ చిరంజీవి నాటినిశీథమున నాతో సాదరపూర్వకముగ పలికినాడు. "మంచి" దని నెచ్చెలులతో కలిసి మెల్లగ నాతనివెంట నరిగితిని. తరువాతియూంతమును పాఠకులు పదపడి తెలిసికొనగలరు.

హిమశైలమున, నాడు తాంసిల్లిన హిందూస్థానీయునకు నాసికజేరుకటి నాకగపడిన నాగపురవ్యక్తి తమ్ముడేమోయని యూహించితిని. చదువరు లితని గాలక్రమమున మరల గాంచగలుగుదురు; నెచ్చెలియయ్యెనని ఆనందింపజాలుదురు.

నా డాతడదృశ్యుడైనంతన తిరువున, చలిలో నేనటే నిలువంబడి పోతిని.

# బ్రతుకు తెరువు

**వడ్లమన్నాటి కుటుంబరావు**

౫

## యువకునకు లక్ష్యము ప్రధానము

ఒక మహత్తరాశయమును మనమునం దుంచుకొని, దానిని సాధించి ఫలప్రాప్తిననుభవించు మానవుడు యథార్థముగ ఆదర్శపురుషు డనదగును. జీవిత పరమావధియందు ఒకలక్ష్యము, ఒక ఆశయము లేని మానవుని జీవితము చుక్కాని లేని ఓడవంటిది. చుక్కానిగాని, నావికుడుగాని లేని ఓడ గాలివిసురుడుకు, ఎడతెరపి లేని తరంగముల తాకిడికి ఎట్లు దెబ్బతినునో అట్లే లక్ష్యము, ఆశయము లేని మానవుని జీవితముకూడ.

తన యజమానికి యువకుడు ప్రయోజనకారిగ నుండునట్లు ప్రయత్నింపవలెను. తనకుమాలిన ధర్మమాయనుసామ్యము యువకునిపట్ల వర్తింపజేసికొనగూడదు. వివేకముగల యువకుడైనచో తనసేవను స్వప్రయోజకముగగూడ చేసికొనగలుగును. యువకుని సేవ యజమానికి ప్రయోజనకరముగ నుండవలెనన్నచో యజమాని యువకుల నడుమ పరస్పర విశ్వాస ముండవలెను. యజమాని నియమించెడు ప్రతి కార్యమునకు యువకుడు సిద్ధపడుటవలన యజమానియొక్క ఆదరవిశ్వాసములకు యువకుడు పాత్రుడు గాగలడు. యువకు డిట్టిసందర్భముల అలక్ష్యము, అసంతృప్తి నగుపరచుచో భావిజీవితమునందు అభివృద్ధి నైర్గ్యముగ నుండును.

వ్యాపారాభివృద్ధికి నిజాయితీ చాలముఖ్యము. యజమానికి ముప్పునుదెచ్చు కార్యములను యువకుడేమాత్రము తలపెట్టగూడదు. అట్లు తలపెట్టువాడు నేడుగాకున్న ముందైనను పట్టుపడకమానడు. నేడు పట్టుపడకున్నంత మాత్రమున, ఆకార్యాలయమునువిడిచి మరొకదానియందు చేరినంత మాత్రమున యువకుడు తానొనర్చిన అపచారములకు బాధ్యుడు కాకపోడు. యువకు డట్టి అప్రామాణ్యపుకార్యమొనర్చి ఆకార్యాలయను విడచి మరొకదానియందు చేరినప్పటికి త్వరలో పట్టుబడకపోవచ్చును. ఎంతకాలమైనపిదప నయ్యది బయలుపడి సరాసరి న్యాయస్థానమూలమున నిందితుడుగ ఖాయపడకపోయినను భావ్యభివృద్ధికి భంగహేతువుగ నుండుటలో నెట్టిసంశయము నుండదు. యజమానికి హెచ్చగు నాకరిచేసి అతనిని యువకుడు యెల్లప్పుడును మొగమోటమి (Obligation)లోనుంచవలెను. అట్టిదానిని యజమాని యెన్నడును మరువజాలడు.

కొందరు యువకులు కార్యాలయమునందు పని చేయుపట్ల వారికిగల రెండుకండ్లలో నొకదానిని గడియారపుముల్లుపై లగ్నమొనర్చెదరు. రెండవదానిని కార్యాలయ సేవయం దుంచెదరు. ఆనాటి కానాటి పని పూర్తియయినదా లేదాయను శ్రద్ధ చాలముఖ్యముగాని ఆఫీసు మూసెడివేళ యెప్పుడాయని గడియారము వంకనే లక్ష్యముంచగూడదు. యజమానికనుసన్నలలో మెలగుచు అభివృద్ధి నాశించు యువకుడు యజమానియొక్క పనులందు శ్రద్ధ నెక్కుడుగ చూపి, యింటికి మరలుట యించుక ఆలస్యమైనను విసువుచెందకూడదు.

ఆఫీసునందు పనులను చింపర వందరగ నొనర్పగూడదు. త్వరత్వరగా చేయలేకున్నంత మాత్రమున అసహ్యకరముగ చేయకూడదు. చేయునది యించుకయైనను బహుసుశ్రమముగ, యితరులు కాకర్షణీయముగ నుండునట్లొనర్పవలెను. పని జాస్తిగనుండి తెమలకున్నచో నీ విషయము అధికారులకు విన్నవింపవచ్చును. నిర్ణీతకార్యముల నొనర్పుటయందుగూడ వెనుకపడుచున్నట్లు యజమాను లభిప్రాయపడకుండ కష్టముచే జాగ్రత్తగ వారి కెరుకపరచవలెను. తప్పులుచేయుట సులభము. సవరించుకొనుట చాలకష్టము. ఒక్కొక్కసందర్భమున నాసవరింపు యువకుని శక్తులు దాటిపోయి ప్రమాదము తటస్థించును.

ఒకానొక యువకుడు ఒకనియొద్ద సేవకావృత్తికి చేరునది ఆనాటికి భుక్తిగడచుటకొరకు గాదు. భావిజీవితము సౌఖ్యకరముగ, ఆనందమయముగ గడుపగలుగుతలంపుతో నేను కష్టించుచున్నాను.

ఈసంవత్సర మీమాసమునందు నెల ౧౫ రు. ౩౦ ల జీతమునకు కుదిరినాతడు పైసంవత్సర మీనెలకు రు. ౪౦ లు వేతనము సంపాదించుట కన్నివిధముల కష్టించవలెను. పైసంవత్సరమునకు పదిరూపాయలు హెచ్చువేతనము సంపాదింపగలుగుటకు సాధనభూతములు కాగలవి దేహమనోబలములు, యుక్తి, ఓరిమి తక్క వేఱులేవు. ముప్పదిరూపాయల వేతనమునందున్న యువకుడు ఒక్కసంవత్సరములో నూరురూపాయల వేతనముకొరకు ఆశించుట వెఱ్ఱిదురాశయనిగూడ తోపజేయును. నిచ్చెన నెక్కవాడొక్కసారిగ పైమెట్టుకు నురకదలంచు మానవుడు నిజముగ ఉన్మాదుడే. అట్టి ప్రయత్నమునకు దిగువాడు కాలుగాని, చెయ్యిగాని, నడుముగాని విరచుకొనుటయందేలాటి ఆక్షేపము నుండదు. అధికాశ అసలుకే మోసము దెచ్చును. యువకుడు తనమోతాదు నెరిగి ఆశయముల నిర్మించుకొనవలెనేగాని కొరగాని కోర్కెలకు పరువులెత్తి ఉన్నదికూడ నూడగొట్టుకొనుట తగదు. తన మోతాదును అభివృద్ధిమార్గముననున్న యితరులతో తుల చూచుకొని యొక్కడేని వెనుకపడియున్నట్లు తోచిన సందర్భమున అట్టి లక్షణముల నరిచూచుకొనుచుండవలెను. యువకుడు ఇక్కడ గమనించవలసిన విషయములు తన ఉనికి, దుస్తులతీరు, అక్కడ పనిలోచేరిన కాలపరిమితి గావు ముఖ్యములు. యువకు డొనర్చు సేవయందు శ్రద్ధ, అప్రమత్తత, నిజాయితీ, అణకువ, ఉత్సాహము మొదలగునవి ముఖ్యములు. ఒకని నభివృద్ధిమార్గమున బడజేయునది యజమానికి తనయందుగల Favouritism కంటె Merit హెచ్చుగ సహాయకారియగును. యువకుడు తనలో నిమిడియున్న సాధనముల రాపిడిపెట్టుటవల్ల ఆ Merit ను పొందగలడు.

మానవజీవితమునకు సుఖదుఃఖము లెట్టివో జయాపజయములుగూడ నట్టివే. హెచ్చు ఆశయములు కలవాడు అపజయముల లక్ష్యమొనర్పడు. అయ్యది యొకతీరుగ త్రోసివైచి పునఃప్రయత్నమునకు దిగును. అపజయముల నన్నిటినొకపక్క త్రొక్కి ముందుకుదుముకుచుండిన అంతశీఘ్రముగ మానవునకు జయభేరి తన కెదురుగ వచ్చుచున్నట్లు తలచును.

౧౨

## యువకు డెట్టిపనిని ప్రథమమున స్వీకరించుట మంచిది

యువకుడు మొట్టమొదటగా చిన్న కార్యాలయమునందు పనిచేయుటే బహు ఉత్తమము. చిన్న కార్యాలయములందు ప్రత్యేకశాఖ లనునవి గమనింపబడక జరుగవలసిన కార్యములెల్ల కొలదిమందిమీదనే ఆధారపడియుండును. ఇట్టి ప్రదేశముల పనిచేయువారలు వాణిజ్యమునకు సంబంధించిన అన్ని పనులను కొద్దిగనో, గొప్పగనో యెరుగుట కవకాశమేర్పడును. పెద్దకార్యాలయమున చేరిన యువకుడు సాధారణముగ ఒక ప్రత్యేకశాఖయందు నియమింపబడి యితరశాఖల పనుల నవగాహన మొనర్చుకొనుట కవకాశముండదు. అయినను యిచ్చోట యువకుడు కొంతకాలమునకు ఆ ప్రత్యేకశాఖయందు నిపుణుడు కాగలడు. ఈ ప్రత్యేకశాఖా నైపుణ్యము అన్నిశాఖల నెరిగియున్న దానికంటె గొప్పదే. అన్నిశాఖలయందును ప్రవేశించిన వారనేకులు Jack of all trades అనబడి అభివృద్ధికి రాజాలకున్నారు. ఒకశాఖయందు ప్రాముఖ్యముసంపాదించుటకు కృషిచేసిన యువకునకు హెచ్చగు నవకాశము లభించును. నూతనముగ సంస్థలు బయలువెడలనున్న సమయమున నిట్టి యువకునికొరకు నవకాశములు వెదకికొనుచువచ్చును. ఇప్పట్టున నొక్కవిషయము నుదాహరింపవచ్చును. యువకుడు ప్రప్రథమమున చిన్న కార్యాలయమునందే ప్రారంభమై అన్నిశాఖల మర్మములను కొద్దిగనో, గొప్పగనో రెండు మూడు వత్సరముల కృషివల్ల నవగాహన మొనర్చుకుని పిమ్మట పెద్ద సంస్థయందు చేరిగాని, చేరకగాని ఒక branch of busi-



మరమ్మతు D. A. R.

[illegible] నందు ప్రత్యేక ప్రాముఖ్యత నలవడజేసికొనుటకు శ్రమపడవలెను.

అవకాశము దొరికినంతవరకు యువకుడు తన మెదడును కార్యాలయమునకు సంబంధించిన ప్రతివిషయమునందును జొప్పించుట మంచిది. ఇంతమాత్రమున అన్నివిషయములందును జోక్యము కల్పించుకొనుమని గాదు అర్థము. ఎరిగియుండుట మంచిది. వాణిజ్యమునందు నిపుణులైనవారితో పరిచయ మలవడ జేసికొనుట మంచిది. తీరికసమయములందు నితర వ్యాపారపురీరుల పెద్దలతో ప్రసంగించుటచేతనో, పఠనమొనర్చుటచేతనో ప్రపంచజ్ఞానమును సంపాదించుట ఉత్తమము. ఇట్టి సందర్భములందు యువకుడు తన కార్యాలయపు గుట్టుమట్టుల బయలుపెట్ట జనదు. సంవత్సరమున కొకసారి పదునైదు దినములు యజమానియొద్ద శలవు తీసికొని మహాపట్నముల దర్శించి అక్కడివింతల, విశేషముల, క్రొత్త క్రొత్త తీరులు, క్రొత్తవ్యాపారములు, ప్రచురణాదికములకు అక్కడివా రనుసరించెడు పంథాలు కర్ణాకర్ణిగ గ్రహించుట యుత్తమము.

యువకుడు తన రాజధాని విడచి మరొక రాజధాని నడలినప్పుడు అక్కడిభాష తనకురాదని సిగ్గుజెంది మాటలాడకుండ నుండగూడదు. తప్పులో ఒప్పులో వారిభాషనే మాటలాడవలెను. భాష యెరుగనివారు తప్పులే మాటలాడెదరు. పొరబాటువచ్చినను ఈదేశము భాష తెలియనివాడని గేలిచేయక సవరింప నక్కడివారు ప్రయత్నించుటచేత కొంతవరకు యువకుడు ఆభాషను సాధింపగలుగును. పరభాష లెన్ని నేర్చిన నంత శ్రేయము యువకునకు. ఏదేశమేగిన ఆదేశపుభాషను ప్రసంగించుట వల్ల చాల కార్యములు సులభసాధ్యములు కాగలవు.

ఆంధ్రులకు స్వాభిమానము మెండని యిదివరకే పఠించితిమి. ప్రపంచమునం దన్నిప్రాణులు ఆంధ్రభాషనే లెరిగియుండగూడదని ఆంధ్రుని తలతిక్క. ఆంధ్రుడు త్రివేంద్రము వెళ్లినను తెలుగునే ప్రసంగించునుగాని అరవము ప్రసంగించి చూడమని యత్నము సలుపక పోగా ఆప్రాంతములం దాభాషయొక్క ఆవశ్యకతనైన యోచింపడు. అట్లే ఉత్తరహిందూస్థాన ప్రాంతముల కేగిన యాంధ్రుడు గూడ. భారతవర్షమునందే ప్రాంతమునకు జనినను హిందీ తెలిసియుండుటవల్ల నెన్నగు రావచ్చును. వాణిజ్యమునం దతినిపుణులైన ఆంగ్లేయులు భారతవర్షమునకు వచ్చినవెంటనే హిందీభాష నభ్యసింప ప్రయత్నింతురు. భారతవర్షమునకు ఏకైకభాష యనదగిన హిందీని వ్యాపార సౌలభ్యముకొరకు యువకుడు అభ్యసించుట ఉత్తమము.

౧౩

## వేతనములు

ప్రపంచమున చలామణి అగుటకు ప్రతిప్రాణికి ఒకవెల గలదు. యువకుడు తానె తవరకు చలామణి కాగలుగునో యెరిగియుండవలెను. తనయొక్కవిలువను, అర్హతను తాను గుర్తింపవలెను. యువకుడు అత్రుతతో తానుగ నౌకరీ వెదకుకొనుచుబోయినచో తక్కువవేతనము లభ్యపడును. తా నెంతవేతనమున కర్హుడో యెరిగి తాను దర్శించిన యజమానిగూడ కొంచె మెచ్చుతక్కువగ నామిత్తమునే సూచించిన ఆనౌకరీని వెంటనే అంగీకరింపవచ్చును. అత్రి మెన్నటికిని చెరుపు. సాధారణముగ యజమాని యనబడువాడెప్పుడును తక్కువవేతనమునకు లభ్యపడునాతనినే గ్రహించి హెచ్చుగుపని నాతనియొద్దనుంచి తీసికొన యత్నించును. యువకుడు తన శక్తియుక్తుల బేరీజువేసికొని యెంతవేతనమునకు తా నర్హుడో తెలిసికొనగలిగినచో యజమానులయొక్క సహజనైజమును కొంతవర కడ్డగించగలుగును.

యువకుడు నౌకరీకొరకు తహతహ పడుచుండవచ్చును. అంతమాత్రముచేత యజమాని చెప్పెడి యిచ్చకపుమాటలకు లొంగిపోయి యువకుడు తక్కువవేతనమున కంగీకరించుట యుక్తముగాదు. లభ్యపడినదే తడవుగ దూరుట అవ్యక్తమని పూర్వోక్త అధ్యాయమునందు తెలుపబడినది. వైవాహికబంధముచే రెండుసంసారములకు బాంధవ్య మేర్పడనున్న సందర్భమున

యిరుతెగలవారును ఒకరి సంప్రదాయము నొకరు ముందుగ నెట్లు విచారించుకొందురో అట్లే యువకుడు నౌకరీ వదలుకొను సందర్భమునగూడ. నౌకరీస్థిరపడక పూర్వము ఆసంస్థయొక్క పరువు మర్యాదలు, అంతకు ముందు చేరియున్నవారికి వేతనములు సరిగ నియ్యబడు చున్నవా యనునది రెండవది, మూడవది యజమాని యొక్క స్వభావము, నాలవది వేతనము, అకాలము నందు పనిచేయవలసిన సందర్భ మేర్పడినప్పు డియ్యబడు Extra Wages మొదలగు విషయములందు యువకుడు శ్రద్ధగ విచారించవలెను.

కొన్నికొన్ని సంస్థలలో పనిచేయవలసిన కాలము ముందుగ నిర్ణయమైయున్నను నట్లు జరుగక అధికముగ (Overtime) పనిచేయవలసియుండును. ఇట్టి సందర్భములందు యజమానులు తాబేదారులకు overtime wages అని అధికముగ నిచ్చు యేర్పాటు చేసియుందురు. పనిలోచేరకముందు యువకుడిట్టి వెల్ల దృష్టిపరచు కొనుటుచితము. పనిచేయవలసిన కాలపరిమితి ఉదయము పదిమొదలు సాయంకాలము అయిదుగంటలవరకని నిర్ణయమైయుండియు ఒక్కొక్క సంస్థయందు గుమాస్తాలు రాత్రి తొమ్మిదవరకు పనిచేయుచుండుట మనమెరుగుదుము. ఇంతకష్టించి పిమ్మట విచారించుట అనుచితము. కాన ముందుగనే యువకు డిట్టి విషయములందు శ్రద్ధగ నుండవలెను.

పై సలహా కష్టించి పనిచేయదలచినవానికే వర్తించును. పగలంతయు కార్యాలయపు వరండాలలో స్నేహితులతో ప్రసంగించుచు సిగరెట్లు నూదివేయుచు కాలము వృధపరచదలచు యువకునకు వర్తింపదు. ఇట్టి యువకునకు యజమాని తగినట్లు బుద్ధి చెప్పును.

నిర్ణయపరిమితి కెక్కుడుకాలము పనిచేయుటకు సహజముగ సంస్థయందు తగినంతమంది గుమాస్తాలు లేకుండుటయొక హేతువు. overtime పనిచేయవలసి యుండునని తెలుపబడక, చేయవలసివచ్చినప్పుడు overtime wages యియ్యబడునను నిర్ణయము లేనప్పుడు, ఏదో ఒకటిరెండుతడవలు అత్యవసర సమయములు overtime చేసినందు కూరకున్న overtime చేయుట నిత్యావసరముగ కన్పట్టినప్పుడు యీ విషయమునంతను యజమానులకు యువకుడు తెలియపరచవచ్చును.

పగలంతయు కష్టించిపనిచేసి యింకను overtime పనిచేయుట చాలమంది యువకులకు బహుకష్టముగ నుండును. ఇంతేగాక ఆరోగ్యమునకు భంగపాటు. ఆంగ్లేయులచే నడుపబడు సంస్థలందు సహజముగ వారమునకు ఒకటిన్నరరోజులు శెలవుండును. దేశీయులచే నడుపబడువాటికి దినమున కిరువదినాలుగు గంటలు చాలవు. శరీరమునకు తగినంత వ్యాయామము, మెదడుకు తగినంత విచ్చలవిడి, ఉల్లాసము లేక యిరువదినాల్గు గంటలు కుర్చీనంటిపెట్టుకుని పనిచేయువారికి అజీర్తి, నిద్రలేమి, మూలశంక, దృష్టి (మూత్రతిత్తి) కొవ్వుబారుట మొదలగున వేర్పడి ముందుముందు చాల బాధపడుదురు.

విశ్రాంతియనునది లేకుండపనిచేయు యువకుని overtime work బహు అసహ్యకరముగ నుండవచ్చును. ఇది మనసుపెట్టి చేసినదిగాదు. ఇట్లు రాత్రిపూట over time చేసిన యువకుడు మరునాడుగూడ సరిగపనిచేయలేక కండ్లు గుంటలుపడి, నిద్రమత్తులోనుండి మామూలు గజరుపవలసిన పనినిగూడ మూలకు ద్రోయుచుండును గాన యజమాను లీవిషయమున శ్రద్ధవహించు టుత్తమము.

మన కాధ్యాత్మిక చింత హెచ్చు. రేపు అను దినము మనము చూడము. నౌకరీలోచేరి సంపాదింపగలుగుచున్నను యేస్వల్పమాత్రమునో కష్టసమయముల కాదుకొనునట్లు సేకరించియుంచుట మనలో చాలమందికి తెలియక చాలశ్రమపడుచున్నారు. అంతకుముందు ఎంతమాత్రపు అప్పుచేసియుండినను చేయబడియుండును గాక. యువకుడు మొదటినెల వేతనమును తీసినప్పటినుండియే యేస్వల్పమునైన దాచ ప్రయత్నించవలెను. యువకునకు లభ్యపడువేతనము నెలాగు ఖర్చుపెట్టుచున్నది ప్రతిదినము లెక్కవ్రాసి యుంచు టుచితము. ఈ లెక్కవ్రాయుట బ్రహ్మాండమైన పనిగాదు. ఒక ప్రక్కను రాబడి నుదాహరింపుచు రెండవపై పునగుడ్డలు,

వినోదములు, తిండి, చిరితిండి, రాకపోకలఖర్చు, ఇంటిబాడుగ, విద్యాసముపార్జనము, తల్లిదండ్రులు మొదలైనవారికి పంపబడునది, పాత అప్పుక్రింద చెల్లు బడునది, చిల్లర ఖర్చులు, దాపరికము మున్నగు నంశ ములక్రింద వివరణముగ వ్రాయుచుండవలెను. ఇట్లొక సంవత్సరకాలము శ్రద్ధతో వ్రాసినచో నేవిషయమున యువకుడు అధికవ్యయము,దుర్వ్యయము చేయుచున్నా డో తెలిసికొని ముందు ముందుజాగ్రత్తపడి ఆ అధికవ్య యమును, దుర్వ్యయమును తగ్గించియెక్కుడుగ దాచగలు గును.

ఏ హేతువు చేతను వినోదములకు,ఖుస్తులకు అప్పు చేయతగదు. సహజముగ యువకులు యిట్టివాటి విషయ మై అలక్ష్యముగ వ్యయపరచి పిదపచింతించుచుందురు. సేకరింపవలెననునది మనసా తోచినట్లైన జీవితభీమా మూలమున సేకరింపనెంచుట ఉత్తమము. రెండవపద్ధతి తన గార్డియను యొద్దకు పంపుట ఏకారణముచేతనైన తానుచేరిన పనినుండి కొంతకాలమైన విడవ తొలగవలసి వచ్చిన సంసర్భమున యువకుడు గార్డియను పంచచేరక తప్పదు. అప్పట్టున నీయేర్పాటు చాల సహాయకారిగ నుండగలుగును

కొందరుగార్డియనులు తమ బిడ్డలు ఆర్జించుచున్న ది చాల స్వల్పమనీ, తగినంత చేతలేనన్న చిక్కుపడు ననీ యోచించి కొంతపైకమును తామే యువకునకు పంపుట పరిపాటి. ఇట్టి పద్ధతులు గార్డియను లెంతమా త్రము ప్రోత్సాహపరచగూడదు. దీనికలవాటుచెందిన యువకులకు డబ్బుయొక్క విలువ తెలియదు. విచ్చల విడిఖర్చుచేసి పిమ్మట చాల కష్టపడుదురు. క్లుప్తముగ ఖర్చుతో జీవించుట యువకులకు నేర్పుట గార్డియనుల ధర్మము, విధి.

కొందరు గార్డియనులు తమయువకులు కష్టించి సంపాదించుదానినెల్ల సంగ్రహించి ఒకదమ్మిడిగూడ చేతపెట్టక నేడిపింతురు. ఇట్లొనర్చుట సంసారము నందు పొరుపులు గొనితెచ్చుకొనుటవంటిది.గార్డియనులు కొంత ధారాళమనస్కులై యుండుట సమష్టికుటుంబ గౌరవమర్యాద లెరిగినవారికి బాగుగ తెలియును.

వ్యయాంశములలో నొక్కొక్కదాని క్రిం దెంతెంత ఖర్చుపెట్టవలెనను table యొక్కడను లేదు. గార్డియనుల కెంత పంపవలెననునదికూడ నేశాస్త్రము నందు నుదాహరింపబడియుండ లేదు.వారికి పంపబడునది వారు గడపుజీవితసరళి ననుసరించి యుండును. వారు కోరినను, కోరకున్నను పెంచి పెద్దచేసినందుకు కృతజ్ఞ తగ యువకుని ఆర్జనలో వారును భాగస్వాములుగ నుండుట ధర్మవిరుద్ధ మేమాత్రముగాదు.

పాఠశాల చదువు సమయమున యువకునకు చేతి నిండ డబ్బుదొరకక, నౌకరీలభ్యపడి యేమట్టుకో వేతన ము లభించి చేతిలో రూకలగపడుచున్నప్పుడు ధారాళ ముగ వ్యయపరచుటయందు గల మనస్తత్త్వముల తార తమ్యముల జాగ్రత్తగ విమర్శనదృష్టితో పరిశీలించిన యువకుడు తానిప్పుడు చేయుచున్న కొన్నిఖర్చులు అనవసరమైనవని గ్రహించకపోడు.

ఖర్చులన్నీ గడవగా యేస్వల్పమేని మిగిలినచో దానిని బ్యాంకునందుంచు టుచితము. ఆదాపరికము ఒకపాటి మొత్తమైనప్పుడు దాని, నక్కడనుండి తొల గించి చక్కని ప్రతిఫలమును దెచ్చిపెట్టు యేసంస్థ యొక్క షేరులనో కొనినచో ఆమొత్తము మళ్లీపెరుగుచు ధనార్జనవిషయ మటులుండగ సంఘమందుగూడ అచిర కాలముననే యువకుడు మంచి గౌరవమర్యాదల నంద గలుగును. యువకుడిట్టి పెట్టుబడులు చేయువాడని తెలిసినచో పలువు రాతనిమట్టు తిరిగి సలాములుచేయు దురు. ఈపెట్టుబడులు నూటికి అయిదు రూపాయల లాభమును దెచ్చునవై యుండిన చాలును. నూటికి పది పన్నెండులకు పరుగులెత్తుట దురాశ. అట్టివి నెగ్గుట దుర్లభ మనున దటులుండ పెట్టుబడిధనమే స్వాహా యగును. దురాశకుపోవుట మొదలు చెడగొట్టుకొను చేరమను సామ్యము సర్వసాధారణమైనది. కొందరు యువకులకు యేసంస్థలో తమపైకమును పెట్టుబడిపెట్టు టసురక్షితమో తెలియజాలక చిక్కుపడెదరు. అట్టి సంవర్భములందు బ్రోకర్లు రి నెంతమాత్రము నమ్మదగదు. వీరు మట్టిని బెల్లము[illegible]నమ్మించెదరు. తడి గుడ్డలతో గొంతులు తెగగోయుజాతి యిది. గోరం తలు కొండంతలజేసి డబ్బు నపహరింతురు. ఈవిష

యములు విశ్వసింపదగినవారు ఆవిషయములందారి తెరిన బంధువేగాని మరొకరు గాజాలరు. రెండవపక్షమైనను ఒకబ్యాంకుయొక్క సలహాగూడ మంచిదే.

ధనమును ఆర్జించుటకంటె ధనమును కూడబెట్టుట, దాచుట, దాచినదానిని పెంచుట యథార్థముగ గొప్ప విషయములు. ఎంతో ప్రపంచానుభవము, కొద్దిలో అన్ని సుఖముల ననుభవించుట తెలిసినయాతడే యే స్వల్పమేని దాచగలడు; దాచినదానిని పెంపొందించగలడు. అర్థశాస్త్రముయొక్క నేర్పు ఇందేగలదు.

(సశేషము)

---



స్నేహితులు A. A.

# నక్షత్రమండలము

(ధాత సంవత్సర వైశాఖమాసము, జ్యేష్ఠమాసము)

గొబ్బూరు వేంకటానందరాఘవరావు

ఉత్తరము

తూర్పు




పడమర

దక్షిణము

[ఈపటమును తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు పట్టుకొని ఖగోళమును పరిశీలింపవలెను. ఇందున్నట్లు

| | | |
|---|---|---|
| 1936 మేనెల 8 తేదీని రాత్రి 8-57 గంటలకును, | మేనెల 15 తేదీని రాత్రి 8-29 గంటలకును | నక్షత్రాదులు |
| ,, 22 ,, ,, 8-1 ,, | ,, 31 ,, ,, 7-25 ,, | కనబడును.] |
| జూన్ 7 ,, ,, 6-57 ,, | | |

The radiant orbs
That more than deck', that animate the sky,
Are life-infusing suns of other worlds.

కాంతివంతములైన ఆచుక్కలు ఆకాశము ధరించిన రత్నభూషణములా? కావు! అవి కేవలము నిర్జీవములైన భూషణమాత్రములు కావు. ఆదిత్యగోళములు నభోమండల చైతన్యహేతువులు. విశేషించి, విశాల విశ్వమున మన ప్రపంచమునుబోలు నితర ప్రపంచములందు వసించు జీవుల రక్షణవ్యాప్తుల కావశ్యకములైన తేజోష్ణాదిశక్తుల ప్రసాదించు మహాసూర్యమండలములు సుమా అవి!

A thorough advocate in a just cause, and a penetrating mathematician facing the starry heavens, both alike bear the semblance of divinity. Goethe.

అన్యాయమును నిర్మూలించి ధర్మస్థాపనము చేయుటకై యావచ్ఛక్తిని వినియోగించి పాటుపడెడు న్యాయవాదియు, అద్భుత తేజముతో నాకాశమున మెఱయు నక్షత్రకోటుల మర్మములను భేదింప స్వశక్తిం గొనుపు గణకశిరోమణియు, ఉభయులును సంభూతులు.

ఈ మేనెల ౧వ తేదీ మొదలు జూన్ ౧వ తేదీవరకు రాత్రి తొలిజామున మన కగపడు ఖగోళ దృశ్యమును పరిశీలింతము.

## పాలవెల్లి (The Milky way)

ఈమాసములో పాలవెల్లి ఉత్తరమున ధ్రువపంక్తిని, ఈశాన్యదిశను తప్ప శేషించిన దిక్చక్రమునంతయు నావరించియున్నది. కొన్నిచోట్ల దిక్చక్రముపై నగపడుచున్నను, మరికొన్నిచోట్ల అప్పుడే దిక్చక్రమునుండి వేలి పొడచూప కడగుచున్నట్లు తోచుచున్నది. ఇట్లు మూడుపాళ్లకుపైగా మన కగపడు దిక్చక్రమును క్రమ్ముకొనియుండి ఈధవళదృశ్యము మనకు ఇపుడు నేత్రోత్సవము చేయుచున్నది.

## తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రములు (First Magnitude Stars)

ఈనక్షత్రములిరువదింటిలో ఈమాసమున మనకు సుమారు ౧౪ కనబడుచున్నవి.

౧. మృగవ్యాధుడు (Sirius)
౨. బ్రహ్మహృదయము (Capella)
౩. పాంబనూత్రి (Pollux)
౪. పూర్వశ్వానము (Procyon)
౫. మఘ (Regulus)
౬. చిత్త (Spica)
౭. స్వాతి (Arcturus)
౮. బ్రహ్మ (Vega)
౯. జ్యేష్ఠ (Antar.s)
౧౦. ౧౧. అశ్వినులు ౩. (Alpha beta centaurs)
౧౨. ౧౩. త్రిశంకునక్షత్రములు (Alpha a beta Cruse.)

౧౪. అగస్త్యుడు (Canopus) మే మాసాంతము వరకు సూర్యాస్తమయము కాగానే కొంతవరకు కనబడి అటుపైని అస్తమించును. అందుచేత పటమున చూపలేదు.

## గ్రహములు

శని పూర్వాభాద్రయందును, కుజుడు కృత్తిక, రోహిణీ నక్షత్రములందును, శుక్రుడు భరణీ, కృత్తికా నక్షత్రములందును సంచరించుటచేత ఇపుడు మన కగపడరు. గురుడు జ్యేష్ఠ ౪, ౩ పాదములందు వక్రగతుడైయుండుటచేత, ఈ మాసములో కొంతవరకు రాత్రి తొలిజామున నగపడడు; పిమ్మట నగపడును.

## ఉత్తరాకాశమున

ధ్రువపంక్తిలో చిన్నయెలుగుతోకచివరను ధ్రువుడును, తోకలో మహేంద్రకశ్యపులును, తోకమూలను అగ్నినక్షత్రమును కానవగును. అగ్ని కెగువ

మిత్రనక్షత్రమును, వీటికెదురుగా ధాతవిధాత నక్షత్రములును మెఱయుచున్నవి. ధ్రువునికి దిగువ ఊర్ధ్వశిచుక్కలలో కొన్నిమాత్ర మగపడుచున్నవి.

ధ్రువక్షితికీవల, ఈశాన్యభాగమున పామువలె మెలికలు తిరుగుచు క్రూరముఖముతో నరకు డగపడుచున్నాడు. నరకునికీవల గగనమధ్యరేఖ కటునిటు సప్తఋషులు చక్కగా మెరయుచున్నారు. సప్తఋషులలో క్రతుపులహులకావల, పశ్చిమమునకు ఏనుగు తొండముతోను, లంబోదరముతోను, విఘ్నేశ్వరుడు మూషకముపై నధిరోహించి మెఱయుచున్నాడు.

## పశ్చిమాకాశమున

దిక్చక్రము నాశ్రయించియున్నట్లు ఇపుడు కనబడుపాలపల్లికి ఈవల సారథమండలములో బ్రహ్మహృదయము తెల్లనివెలుగుతో ప్రకాశించుచున్నది. ఆదిగువ మిథునరాశిలో పునర్వసు ఆకాశమను సముద్రమున తేలియాడు మహామీనమువలె మెఱయుచున్నది. అందున్న సాంబ (Pollux), పూర్వశ్వానములు ముఖ్యముగా గమనింపతగును. పూర్వశ్వానముకవి విరివిచెందినటున్న పాలపల్లికిని దిక్చక్రమునకును మధ్య మృగవ్యాధు డత్యంత తేజోరాశియై వెలుగుచున్నాడు. ఆ ప్రక్క పాలసముద్రములో మందరగిరిని నిలిపి వాసుకియను కవ్వపుత్రాటితో మథించుచున్నవారిలో రాక్షసులందరును అస్తమించినారు. దేవతలకు తల్లియైన అదితి పునర్వసునకు అధిదేవత. పునర్వసునుండి వరుసగా నక్షత్రములకు దేవతలె అధిదేవతలు. కర్కాటకమునందు పొల్లు పూవువలెనున్న పుష్యమి! అధిదేవత దేవగురుడు బృహస్పతి. అక్రింది ఆశ్లేషకు సర్ప మధిదేవత. మఘకు పితరులు. ఆశ్లేష కెగువ సింహరాశిలో పల్లకివలెను, కొడవలివలెను వక్రాకారముతోనున్న మఘచుక్కలకు అధిదేవతలు పితృదేవతలు.

## దక్షిణమున

దక్షిణదిక్కున మన కిపుడు ముఖ్యముగా నగపడుచున్నవి నౌకామండలము, అశ్వతరమండలమును. అందు నౌకామండలమునకు గల నాలుగుభాగములును ఇపుడు చక్కగా కానవచ్చుచున్నవి. స్తంభము (Mast), తెరచాపలు (Sails), పృష్ఠభాగము, (the keel) అమరము, అనగా చుక్కాని కలభాగము (Helm) ను అందలి వేర్వేరు భాగములు. చుక్కాని త్రిప్పుచున్నట్లున్న అగస్త్యుడు (Canopus) ఈమాసములో సూర్యాస్తమానము కాగానే కొంతవఱకు ఈనెల ౩౧ తేదీవఱ కగపడి, పిమ్మట అస్తమించును. కనుకనే పటములో అగస్త్యుని చూప వలనుపడలేదు.

నౌకామండలమునకు తూర్పుగ నున్నది అశ్వతర మండలము. అనాథయైన వార్తికపుపక్షిని ఒక్కకడి చేసికొని మ్రింగవలెనని నోరుతెరచుకొని ఘోరముగా పఱతెంచువృకమును ఈటెతో పొడిచి మ్రుక్కించి, ఆదిక్కుమాలిన పక్షిని రక్షించినారు అశ్వినులు. ఇందును గూర్చి ఋగ్వేదములో ఎన్నో ఋక్కు లున్నవి. ఈయంశ మిపుడు ప్రత్యక్షగోచరము. ఇదే అశ్వినుల (౨) మూపవస్థానము (Centaurus) అశ్వతరమండలము. ఈ అశ్వతర మండలమునకును నౌకామండలమునకును మధ్య పాలపల్లిలో శిలువ(Cross)ఆకారముతో, స్వర్గభ్రష్టుడై తలక్రిందుగా వ్రేలుచున్నాడు త్రిశంకుడు. భూమ్యాకాశములమధ్య తాను కల్పించిన స్వర్గములో నీ త్రిశంకుని నిలుపుచు ఆప్రక్కనే ఉన్నాడు విశ్వామిత్రుడు. వసిష్ఠుడును, అతనిపుత్రులను పరిత్యజించి శపించిన త్రిశంకుడు, వసిష్ఠునిసమీపమునుండి పోవు గగనరేఖ (Meridian) దిగువనే సరిగానుండుట గమనింపతగిన విషయము.

## తూర్పున

శ్రీ మహావిష్ణుస్వరూపము, ఆతనికి పాన్పగు శేషుని ఫణములదిగువ చక్కగా ఉదయమైనది. ఆతని నాభికమల సంజాతుడు బ్రహ్మ తనముఖమున నిడికొనిన సరస్వతి మీటువీణెతో కూడ ఈశాన్యదిశ నిపుడే పొడచూపినాడు. పాలవెల్లిపై మెలికలు తిరిగి విష్ణువునకు పాన్పుగా నమరియున్న శేషునకు (Serpens) దిగువ మిత్రదైవత్యమైన అనూరాధయు, అనూ

రాగవు దిగువ పగడమువలె ఎఱ్ఱని కాంతితో స్వాతి కెదురుగ మెఱయుచు జ్యేష్ఠయు చక్కగా ప్రకాశించుచున్నవి. (జ్యేష్ఠకు ఇంద్రు డధిదేవత) మఘ వఱకు నక్షత్రముల కధిదేవతలను పైనిచూచియున్నాము. పూర్వ ఫల్గునికి అర్యముడును, ఉత్తరఫల్గునికి భగుడును అధిదేవతలు. భగుడొసగునదే భాగ్యము. హస్త సవితృ దేవతాకము. చిత్రకు త్వష్ట్రయు, స్వాతికి వాయువును, విశాఖకు ఇంద్రాగ్నులును క్రమముగా అధిదేవతలు.

## మధ్యను

కర్కాటకమునందలి పుష్యమి, ఆశ్లేషలును, సింహమునందలి మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గునీ నక్షత్రములును, కన్యలోని ఉత్తరఫల్గునీశేషము, హస్త, చిత్ర నక్షత్రములును, తులలోని చిత్రశేషము, స్వాతి విశాఖా నక్షత్రములును వరుసగా మధ్య నున్నవి. మఘకు ఆగ్నేయముగా గ్రావము లున్నవి. దేవతలకు పానీయమైన సోమరసము తీయుటకు సాధనభూతము లైన శిలలివి. ఆరసమును చమసమను పాత్రలో నుంచి పిమ్మట దేవతలు పానము చేసెడివారట. ఆపాత్ర (Crater, the cup) కూడ ప్రక్కనే కలదు. కన్య రాశిలోని అప్పవత్సు, పాణిని, ఏళ, లోనగు నక్షత్ర ములు చిత్ర ప్రక్కనే ఉన్నవి.

## విశాఖ

ఏమాసము పున్నమనాడు చంద్రుడు విశాఖా నక్షత్రముచెంత నుండునో అమాసము వైశాఖమాసము. దీనికే మాధవమాసమనియు నామాంతరము కలదు. ఏమా సమునందు సూర్యాస్తమానముకాగానే మాధవుడు (శ్రీ మహావిష్ణువు) తూర్పున నుదయించునో అమాసము మాధ వమాసము. అది యీమాసమే.

వేదవాఙ్మయములో విశాఖకు రాధయనిపేరు. 'రాధోవిశాఖే' అని శ్రుతి. రాధ (విశాఖ) కు తరు వాతి నక్షత్రము అనూరాధ. ఈ నక్షత్రమునకు ఈపేరు వచ్చుటకు కారణము బెంట్లీ (Bentley) దొరగారు చెప్పుచున్నారు. స్వాతివఱకును అశ్విన్యాది నక్షత్ర ములు ఖగోళపు ఉత్తరార్ధములో కానవచ్చును; కాని అటుపై విశాఖ ఆరంభమునుండి ఖగోళదక్షిణార్ధమునకు మరలును. ఇట్లు వేరు శాఖామార్గమును పట్టి క్రాంతి వృత్తము అటుపైపోవును కాన ఇది వి-శాఖ అనబడు చున్నదని వారుచెప్పియున్నారు.

విశాఖ ఇంద్రాగ్నిదైవత్యమైన నక్షత్రము. దీని ఆకారము (తులాలచక్రంపంచ) కుమ్మరిసారెవలె గుం డ్రనైయున్న అయిదునక్షత్రము లనిచెప్పబడినది. విశా ఖపైనే కన్యకలదు అగ్నికుండమువలె గుండ్రనిదియు, అగ్నిదైవత్యమైనదియు నైన విశాఖ అడుగునను, అమీద కన్యయు నుండుటచేత కన్య అగ్నికుండ సముద్భవ, అయోనిజ అని చెప్పబడినది. ఆకన్యయే ద్రుపదపుత్రిక - ద్రౌపదికన్య అని మన మనేకపర్యాయ ములు వర్ణించియుంటిమి.






విశాఖానక్షత్రముయొక్క రూపము పైన చూపబడినది. ఇందు ముఖ్యమైన నక్షత్రము లైదు కల వు. కుమ్మరిసారెవలెను, అగ్నిగుండమువలెను ఇవిగుండ్ర ముగానున్నవి. తులారాశిలో త్రాసువంటి ఆకారముగల నక్షత్రము లున్నవికదా! ఆత్రాసులో దక్షిణపు వైపు న్న చిప్ప ఈవిశాఖానక్షత్రము అనవచ్చును. క్రాంతి వృత్తము ఈనక్షత్రముల మధ్యగాపోవుచున్నది. అనగా చంద్రుడు, అంగారకుడు, శుక్రుడు, శని, గురుడు లోనగుగ్రహములు ఆకాశమున నేమార్గము ననుసరించి పోవుచున్నట్లు మన కగపడునో ఆమార్గము-అరస్తా-అదే క్రాంతివృత్తము-ఈనక్షత్రములమధ్య పడిపోవుచున్నది.

ఇందు బీటా-సిగ్మా సుర్తులుగల నక్షత్రముల మధ్యను చంద్రుడున్న దినము విశాఖానక్షత్రముగల దినము; ఆ మధ్య పూర్ణచంద్రుడుగల దినమే వైశాఖ పూర్ణిమ. ఆనాటి దృశ్యము కడు మనోహరముగా నుండును. ముత్యములవలె మిలమిలలాడుచు చిన్నవిగానున్న ట్లగపడు రెండు నక్షత్రముల మధ్య పూర్ణచంద్రుడు మెరయునప్పటిదృశ్యము అనాదికాలమునుండియు కవిరాజులదృష్టి నాకర్షించియేయున్నది.

శ్రీమద్రామాయణములో వాల్మీకి కొన్ని సందర్భములయం దీదృశ్యమును వర్ణించియున్నాడు.

యుద్ధ. ౭౬-౧౮:—
"తయోర్మధ్యేకపిశ్రేష్ఠశ్శోణితాక్తప్రజఙ్ఘయోః,
విశాఖయోర్మధ్యగతః పూర్ణచంద్ర ఇవాభవత్."

శోణితాక్త ప్రజంఘులును రాక్షసులమధ్య అంగదుడు ప్రకాశించిన రూపవిశేషము ఇందు చక్కగా వర్ణింపబడినది. అంగదుడు బలశాలి; తేజస్వి. అతని కిరుప్రక్కల గల రక్కసులు దివిటీముందర దీపములవలె అతనియెదుట కాంతిహీనులుగాకయున్నారు. (చూ. బీటా-సిగ్మానక్షత్రములమధ్య చంద్రుడు.)

చంద్రుడేగాక, అంగారకుడు విశాఖానక్షత్రముల మధ్యనున్నను రమ్యముగానే కనబడును. రావణ వధాత్పూర్వము ఈయంశము వర్ణింపబడినది.

యుద్ధ. ౧౦౩ - ౩౩:—
"కోసలానాంచ నక్షత్రం వ్యక్త మిన్ద్రాగ్నిదైవతమ్,
ఆక్రమ్యాఙ్గారక స్తస్థౌ విశాఖామపి చాంబరే."

## విశాఖనక్షత్రము : కాళిదాసు

వాల్మీకి కాళిదాసునకు అనేక విషయములలో గురువని చెప్పదగియుండును. వాల్మీకి రామాయణము రచించినాడు; కాళిదాసు రఘువంశము వ్రాసినాడు. వాల్మీకి వర్ణించిన ఉపమానాంశములు అనేకసందర్భములలో కాళిదాసు చక్కగా గ్రహించి, వాటి కింకను వన్నెతెచ్చినాడు. ప్రస్తుతము మనము చర్చించుచున్న విశాఖానక్షత్రమును గూర్చిన ఒక ఉపమానము నిట పరిశీలింతము.

ముంగొండ గ్రామవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ మహీధర రామమోహనరావుగారు "అభిజ్ఞానశాకుంతల నాటకము, తృతీయాంకమున శకుంతల తన చెలికత్తెలగు అనసూయ, ప్రియంవదలతో తనకు దుష్యంత మహీపాలునియందు కలిగిన ప్రేమనుగూర్చి తెలుపుటయును, చెలికత్తెలుకూడ అందు కనురూపసంభాషణలు చేయుటయును పొంచుండి రహస్యముగా వినుచున్న దుష్యంతుడు

"కిమత్రచిత్రమ్ యది విశాఖే శశాఙ్కలేఖామనువర్తేతే" అని కాళిదాసు వర్ణించియున్నాడు. ఈ ఉపమానముయొక్క సారస్యము వివరింపవలె"నని నన్ను కోరిరి. ఈ మాసపు నక్షత్రమండల వ్యాసమున దానిని గూర్చి వ్రాసెదనని వారితో మనవిచేసియుంటిని.

శకుంతల చెలికత్తెలగు ప్రియంవద, అనసూయలు తనయందు బద్ధానురాగయై యున్న శకుంతల యొక్క చిత్తవృత్తికి అనుకూలురై ప్రోత్సాహ వాక్యములు పలుకుచుండుట విని దుష్యంతుడు పైవాక్యమును వచించెను. "ఏమి అక్కడ చిత్రము? విశాఖా నక్షత్రపు చుక్కలు చంద్రకలను అనుసరించియే యున్నవి?" అని ఆశ్చర్యముతో ప్రశ్నించుచున్నాడు దుష్యంతుడు.

శకుంతల చంద్రబింబముగాను, ఆ బింబమునకు ఇటునటుగల చుక్కలురెండును-బీటా-సిగ్మాచుక్కలు-ప్రియంవద, అనసూయలుగాను భావన. చంద్రబింబము క్రాంతి వృత్తమార్గమున ఒకొక్కనాడొకొక్క నక్షత్రములోనికి పోవుచున్నట్లు ఆకాశమున నగపడును. నక్షత్రములకు స్వంతముగా గమనమున్నట్లు సాధారముగా కనబడదు. కావున చంద్రుడు నక్షత్రముల ననుసరించినగాని, నక్షత్రములు చంద్రు ననుసరించివెంటపోవు. ఇచట శకుంతల చెలికత్తెలు శకుంతలయొక్క ప్రేమ భావమునకు వ్యతిరేకము పలుకక ఆమె అభిప్రాయమున కనుకూలురై ఆమె ననుసరించుచున్నారు. ఆకాశమున

చంద్రుననుసరింపని చుక్కలు ఇపుడు శకుంతల చంద్రు నమసరించుచున్నట్లున్నవి. కనుక అపూర్వము, ఆశ్చర్యమనని దుష్యంతుని అభిప్రాయము - అని నావిన్నపము.

విశాఖే=విశాఖానక్షత్రే, శశాంకరేఖాం=చంద్రకలాం, అనువర్తేతే=అనుసరతోయది అత్ర=అస్మిన్నర్థే, కించిత్రం నకిమపి- ఇత్యర్థః. నక్షత్రాణాం చంద్రానుసరణస్య స్వాభావికత్వా దిత్యాశయః— అని వ్యాఖ్యానకర్తలు వ్రాసినది సరికాదని నాకు తోచుచున్నది.

---



సాయంకాలపు దుస్తుల ముస్తాబు G. S. A.

# కాకతీయ సంచిక *

## డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

ఈగ్రంథము కాకతీయ చరిత్రమునందలి వివిధ విషయములను గూర్చి వ్రాసిన వ్యాసముల సంపుటము. ఇందు ౨౩ చారిత్రకవ్యాసములను, ౫౦ పైగా చిత్రపటములును, పద్యములును, కాకతీయవర్ధంత్యుత్సవ నివేదికయును, కొన్ని కొన్ని చారిత్రక మూలాధారములును గలవు. ఈసంచిక సంపాదకులు మద్రాసు విశ్వవిద్యాలయమునందు 'పరిశోధక విద్యార్థి'గ తమ చారిత్రక పరిశోధనలను ప్రారంభించినప్పటినుండియు కాకతీయ చరిత్రమునే అభిమానేతిహాస విషయముగ జేసికొనియున్నారు. చరిత్రయందు వీరికున్న ఉత్సాహమును, చారిత్రకాభివృద్ధికై అధికప్రయాసల కోర్చి వీరు గావించుచున్న ప్రయత్నములను ఎంతయు అభినందనీయములు.

కాని ఇట్టివారి సంపాదకత్వమున వెలువడిన ఈ గ్రంథమును ఉత్తమతరగతి గ్రంథములలో లెక్కించుటకు వీలులేకుండుట యెంతయు శోచనీయము. సంపాదకులుగాని, వ్యాసకర్తలుగాని ఈగ్రంథప్రచురణమునందలి యుద్దేశ్యమేదో సరిగ గమనించినట్లగపడదు. కాకతీయచరిత్రమునుగూర్చి జనసామాన్యమునకు ఏదో కొంత తెలియజేయవలెనను నుద్దేశ్యమే ప్రధానమైయున్నచో, ఇదివరకే కాకతీయులనుగూర్చి శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారొక గ్రంథమును ప్రచురించియున్నందున, వ్యయప్రయాస లధికములుగ లేక ఒకచిన్నపొత్తమును తయారుచేయవచ్చును. అట్లుగాక ఆంధ్రచరిత్రమునకొక ముఖ్యభాగమగు కాకతీయ చరిత్రమును సంపూర్ణముగ పరిశోధించి చారిత్రకవిజ్ఞానము నభివృద్ధి పరుపవలెనను నుద్దేశ్యమే ప్రధానమైయుండినచో అట్టియుద్దేశ్యము నెరవేరుటకు సంపాదకులును, ప్రకాశకులును ఒకప్రత్యేకవిధానము ననుసరించి ప్రయత్నించియుండవలెను. ఇట్టి మహాత్కార్యములందు సంపాదకులబాధ్యత మెండు. కాకతీయ చరిత్రమునందలి ప్రతి సమస్యను, ప్రతివిషయమును తీసికొని చర్చించి విశదీకరింపవలెనన్న సంపాదకులు మునుముందు విషయవిభజనము జేసికొని ఒక్కొక్కప్రత్యేకవిషయమును పరిశోధించి చర్చించుబాధ్యత నొక్కొక్కరిపైబెట్టి వారిపరిశోధనలను తీసికొని నేర్పాటు చేయుబాధ్యత తామే వహింపవలెను. ఇట్లు చేసియుండినచో సంచికయందలి వ్యాసములుచర్వితచర్వణములు గాక సంచికకు ఒక ఐక్యత (unity) యును, సంపూర్ణత్వమును సిద్ధించియుండును. అట్లు చేయనందున ఈ సంచికయందు కొన్ని కొన్ని ముఖ్యాంశముల చర్చ జరగనేలేదు. కాని కొన్ని విషయములను మాత్రము పలువురు ఒకనిర్ణీతవిధానము ననుసరించక చర్చించినందువలన వాదప్రతివాదములకును, పునరుక్తిదోషములకును ఎక్కువగ అవకాశము కలిగినది. వ్యాసకర్తలు ఒకరియభిప్రాయముల నొకరు ఖండించుచు, ప్రతిఘటించుచు, వాదించుచు నున్నందున చరిత్ర విషయము స్పష్టముగ దెలియక నిజము మరుగుపడుచున్నది. పలువురు తమవ్యాసములందు క్లిష్టసమస్యలను పలువిధముల అప్రస్తుతముగను, అసంపూర్ణముగను చర్చించుటకు బదులు, ఇట్టి సమస్యల నొక్కొక్కదాని నొక్కరు సమగ్రముగ పరిశోధించి, అభిప్రాయభేదము లన్నిటిని తామే నిష్పక్షపాతముగను, సంగ్రహముగను విశదీకరించి, అందు తమయభిప్రాయ మేదో విశదముగ చెప్పియుండిన సమంజసముగ నుండెడిది.

ఈ సంచికకు వ్యాసములను పంపినవారిలో చాలమందికి చారిత్రకపరిశోధనయం దనుభవములేదు. ఐనను అట్టివారు ఉత్సాహముతో చారిత్రకాభివృద్ధికై

* సంపాదకుడు మారేమండరామారావు, ఎం. ఏ, బి. ఇ. డి.; ప్రకాశకులు ఆంధ్రేతిహాస పరిశోధక మండలి, రాజమహేంద్రవరము, ౧౯౩౫; పుటలు ౧౨ X ౩౩౦ X ౩౭ వెల రు. ౪-౦-౦.

కృషిచేయుటకు బూనుకొన్నందున సంచికా సంపాదకులు వారికొక నిర్ణీతవిధానము నేర్పరచి వారికీవిషయములను ఎట్లు పరిశోధింపవలెనో సంగ్రహముగ వారికి ముందు దెలిపి, వారు వ్రాసిపంపిన వ్యాసములను జదివి అందలి లోపములను వారల కెరింగించి సవరణలను జేయించియుండినచో అనుభవజ్ఞులుకానివారుకూడ నిర్దుష్టములును, శాస్త్రీయములును అగువ్యాసములను వ్రాసియుందురు. కాని సంపాదకులు వ్యాసకర్తల కెట్టి విధానమును తెలియజేయక, ఎట్టి నిబంధనలను ఏర్పరచక స్వేచ్ఛగ వదలివైచినందున ఈ మహాప్రయత్నము లన్నియు వ్యర్థములైనవి.

వర్ధంత్యుత్సవమునకు సంబంధించిన వాఙ్మయముగాక ప్రత్యేకముగ కాకతీయులను గూర్చిన విషయమే ఇందు ౨౭౦ పుటలకుపైగా నున్నది. కాని విషయమునంతటిని ౧౦౦ లేక ౧౫౦ పుటలలో తెలుపవచ్చునైయుండెను. ఇందున్న ముఖ్యవ్యాసములను వ్రేళ్లపై లెక్కింపవచ్చును. 'కాకతీయ రాజ్యము - భౌతికస్వరూపము', 'కాకతీయులు-కళింగము', 'కాకతీయులచరిత్రము', 'గద్యాలసంస్థానము', 'ప్రతాపరుద్రునిపై మహమ్మదీయుల దండయాత్రలు', 'కాకతీయులనాటి సాంఘికచరిత్ర', ఈ వ్యాసములుతప్ప మిగిలినవన్నియు కొంచెమించుమించుగ చర్వితచర్వణములే. ఈ వ్యాసములందుగూడ ఒకరిద్దరుతప్ప వ్యాసకర్తలు తమ నిర్ణీతవిషయములపై నేటివరకును ప్రచురించిన ఆధారముల నన్నిటిని పరీక్షించి విషయమును సంపూర్ణముగ పరిశోధించినట్లు గానరాదు. ఉదాహరణముగ శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్యాసమును గైకొందము. ఈవ్యాసము నిదివరకే కొన్నిసంవత్సరములకుపూర్వము ప్రచురించియున్నారు. అట్టిచో దీని నేలాటి మార్పులను జేయక ఉన్నదున్నట్లుగ పునర్ముద్రితము జేయుటకు కారణమేమి?

ఈశ్వరదత్తుగారు ఈసంచికను విమర్శించుచు "ఈవ్యాసమును శర్మగారి యనుమతిలేకయే, సంచికయందు ముద్రింపించిరి" అని వ్రాసియున్నారు. ఇది నిజమైయైనచో ఇట్టి విపరీతచర్య వ్యాసకర్తకు అన్యాయమును, అప్రతిష్ఠాకరమును.

కాకతీయుల పుట్టుపూర్వోత్తరాలనుగూర్చిగాని, నాటిమతవిషయములనుగూర్చిగాని, రాజ్యాంగపద్ధతులను గూర్చిగాని, ఆర్థికపరిస్థితులనుగూర్చిగాని, వాస్తుపద్ధతినిగూర్చిగాని శిల్ప, చిత్రకళాసంపదనుగూర్చిగాని ఈ గ్రంథమునందు, ఆధారమున్నంతవరకు నయ్యె, విశదముగ చర్చింపలేదు. కాకతీయులనాటి ఆంధ్రవాఙ్మయమునుగూర్చి వ్రాసియున్న వ్యాసము అసమగ్రము. ఇక సంస్కృత వాఙ్మయపు ప్రశంసయే లేదు. కాకతీయులపాలనమున నేయేవిజ్ఞానవిభాగము లెట్లెట్లు అభివృద్ధినొందెనో ఇంచుకంతయు ఈసంచికయందు పల్లడిగాలేదు. సాంఘిక విషయములపై రెండువ్యాసములున్నను ప్రత్యేకముగ ఏ ఒక్కరైనను శ్రద్ధతో ప్రయత్నించి సంపూర్ణ పరిశోధన గావించియుండినచో ఎన్నియో అమూల్యవిషయములు తెలిసియుండును.

కాకతీయచరిత్రయందలి కొన్నికొన్ని ముఖ్యసమస్యలను ఇదివరకే పత్రికలందును, చారిత్రక గ్రంథములందును పలువురు చర్చించియున్నారు. అట్టివానిని గూడ ఇందు చర్చింపక, కడకు అట్టిసమస్య లెవ్వియో గూడ ఈగ్రంథమున దెల్పకుండుట చిత్రమే. ఉదాహరణముగ రెండువిషయములను గైకొందము: (౧) ప్రతాపరుద్ర పరిపాలనాపద్ధతినిగూర్చి ఇలకాలముక్రిందట శ్రీ శర్మగారు ఆంధ్రపత్రిక యుగాదిసంచికయందు కొంతవరకు చర్చించియున్నారు. ఆయంశమును గురించి శ్రీ వెంకటరమణయ్యగారు కూడ తమ పుస్తకమునందు చర్చించియున్నారు. విజయనగర రాజ్యాంగవిధానమునందలి కొన్నికొన్ని ముఖ్యాంశములు కాకతీయపద్ధతిపైనకే ఆధారపడియున్నవి గాన కాకతీయ పరిపాలనాపద్ధతిని విశదముగ చర్చించుట చాలయవసరము.

(౨) ప్రతాపరుద్ర యనంతర స్థితిగతులను వివరించుచు సంపాదకులు విజయనగర సామ్రాజ్యనిర్మాణమునుగూర్చి విపులముగ వ్రాసియున్నారు. కాని ఓరుగల్లునందును, ఓరుగంటి రాజ్యమునందును ప్రతాపరుద్రునియనంతర మేమిజరిగెనో ఇంచుకంతయు తెలుప

రైరి. ప్రతాపరుద్ర రాజ్యావసానకాలము వరకును మాత్రమే తమపరిశోధనలను గావింప సంపాదకులు నిశ్చయించియుండిరని యనుకొనుటకు వీలులేదు. ఏలన అట్లైనచో రెడ్డిరాజ్యనిర్మాణమునుగూర్చియు, విజయనగర నిర్మాణమునుగూర్చియు చర్చింపనవసరమేమి?

ఇక నింకొకవిషయమునుగురించి గూడ చదువరికి కొంతసందేహముకలుగుటకు ఆస్పదముగలదు. తెలుగుదేశమున పేరెన్నికగన్న చరిత్రకారులలో కొందరివ్యాసములిందుగానరావు. చరిత్రయందు తగినంతశ్రద్ధవహించి పరిశోధనలను సల్పునందు తెలుగువారుచాలకొద్దిమందియే. అట్టిచో పేరువడసిన భావరాజు వెంకటకృష్ణరావుగారు, నేలటూరి వెంకటరమణయ్యగారు, చిలుకూరు వీరభద్రరావుగారు, చిలుకూరు నారాయణరావుగారు మొదలగువారివ్యాసము లిందుగానరాకుండుటకు కారణమేమి? ఈవిషయమునుగూర్చి సంపాదకులు తమవిజ్ఞాపనమునందేల తెలియజేయలేదో యర్థముగాదు.

పై యంశములనుబట్టియే ఈ గ్రంథ మెట్టిదో కొంతవరకును బోధపడును. ఇక ఈ పుస్తకమునచర్చించిన విషయములను కొన్నిటిని పరామర్శింతము. కాకతీయరాజ్యాంగ వ్యవహారములనుగూర్చి మారేమండ రామారావుగారు ౧౧౨ పుటలకుమించిన ఒకపెద్దవ్యాసమును, దూపాటి వెంకటరమణాచార్యులవారు ౨ వ్యాసములను, మౌల్వీ సయ్యదు అహమ్మదుల్లాసాహేబుగారొకవ్యాసమును, పింగలి వెంకటేశ్వరరావుగారొక వ్యాసమును వ్రాసియున్నారు. కాని వ్యాసకర్త లెవ్వరెవ్వరు ఏ ఏ విషయములను చర్చింపవలెనో నిర్ణీతము జేసికొనక తమకుదోచినదంతయు వ్రాసినందున, కొన్ని కొన్నియంశములను ప్రతివారును పూర్వాపరసంబంధమేమాత్రమునులేకచర్చించియున్నను కొన్నిటినిగూర్చి ఒకరును ప్రస్తావించనేలేదు. అంతేగాక ఆయావ్యాసములందలి విషయములు కొన్నికొన్ని పట్టుల పరస్పర విరుద్ధములుగగూడ నున్నవి. కాకతీయరాజ్య మెన్నడారంభమాయెనో, ఎన్నడవసానము జెందెనో ఈవిషయమైఎవరును ఈసంచికయందు విశదముచేయలేదు. కాకతీయులకును పశ్చిమ చాళుక్యులకును, కలచుర్యులకును వెలనాటిచోడులకును, తెలుగుచోడులకును యాదవులకును, ఇతరరాజ్యములకును ఎట్టి సంబంధముండెనో తేటతెల్లముగ నుచితరీతిని విశదముచేయలేదు. కాకతీయ సామంతశేఖరులలో కొందరిచరిత్రమును సువ్యక్తముగ జేయలేదు. చర్చనీయాంశముల నెన్నిటినో సూచితముమాత్రముచేసి వదలివైచిరి. ఎన్నియో సందర్భములందు ఒకతరము క్రిందటనే ప్రచురింపబడిన శ్రీ చిలుకూరు వీరభద్రరావుగారి గ్రంథమున నుండువిషయమున కన్న ఇందేమియు అంతయధికము గానరాదు.

గ్రంథవిస్తరభీతిచేతశాస్త్రీయాంశముల నన్నిటిని ఇట పేర్కొనుటకైన సాధ్యము గాదు. ఒకటి రెంటిని మాత్ర ముదాహరించెదను.

కాకతీయుల కులనిర్ణయమును గైకొందము. కాకతీయులు క్షత్రియులా, శూద్రులా యన్న విషయముపై ఇదివరకే ఎన్నియోమార్లు చర్చ జరిగినను ఉన్న యాధారముల నన్నిటిని పురస్కరించుకొని నిష్పక్షపాతముగ పరిశోధనజేసి ఎవరును ఇదివరకును ఇందలి సత్యాసత్యము లెవ్వియో తేల్చలేదు. రామారావుగారు కాకతీయులుశూద్రులనిచెప్పియున్నారు. కానిఅందులకు తగిన ప్రమాణముల నొసగలేదు. కాకతీయులు శూద్రులనుటకు మూడువిధములగు ఆధారములు గలవు – (౧) కాకతీయుల సన్నిహితబాంధవ్యము, (౨) దుర్జయవంశకులనిర్ణయము, (౩) కాకతీయసామంతుల శాసనములు. కాకతీయులు శూద్రులతో వివాహసంబంధములు జేసికొనినంతమాత్రాన వారి క్షత్రియత్వము నశించిపోదు. రాజన్యులకు వివాహసంబంధములు కేవలము మతసాంఘికపరిస్థితులపై నాధారపడవు. రాజకీయపరిస్థితులనుబట్టి సాంఘికనిబంధనల నతిక్రమించి క్షత్రియులు వర్ణాంతర, జాత్యంతర వివాహములనుగూడ జేసికొనుట క్రొత్తగాదు. చంద్రగుప్త సెల్యూకసుల

౧. కాకతీయులు చాళుక్య వంశజులతోను, యాదవవంశజులతోను బంధుత్వమును గలిపికొనినట్లు మనకు దెలియును.

వివాహబాంధవ్యమును, రాజపుత్ర మొగలుల సంబంధములును ఇందులకు తార్కాణము. ఇట్టి విషమపరిస్థితులలోనేగాక సాధారణపరిస్థితులందును గూడ వర్ణాంతర వివాహము శాస్త్రసమ్మతమైనదే. కాన వివాహసంబంధములనుబట్టి కాకతీయుల కులనిర్ణయము జేయ సాధ్యముకాదు.

ఇక రెండవ యాధారమును పరిశీలింతము. శూద్రులు కొందరు తాము దుర్జయకులజులమని చెప్పుకొనినంతమాత్రమున దుర్జయకులజులందరును (తాము క్షత్రియులమని శాసనములలో స్పష్టముగ జెప్పికొనినను) శూద్రులేయనుటకు సాధ్యముగాదు. హీనకులజులు అగ్రకులజుల సంతతివారమని చెప్పుకొనుట విశేషము గాదు.

మూడవది శాసనాధారము. మన కింతవరకును కాకతీయరాజులు చెక్కించిన కొన్నినూర్ల శాసనములు దొరకియుండగా వానిలో ఒక్కదానియందైనను కాకతీయులు శూద్రులనుటకు తగిన యాధారము ఇంచుకేని యగుపింపదు. గణపతిదేవుని కాలము నాటికి కాకతీయులు ప్రబలి తమ శాసనములందు క్షత్రియత్వమాపాదించుకొనిరని వాదించినను, అంతకు చాలపూర్వము నైన పదునొకండు, పండ్రెండు శతాబ్దములనాటి కాకతీయరాజుల శాసనములందైనను స్పష్టముగ వారుశూద్రులనుటకుతగిన యాధారమొక్కచెమైనను గాన్పించకుండుట యొకవిచిత్రమే. ఇదియటుండ జుట్టయలంక గొంకారెడ్డి తన శాసనములందు తాను ప్రతాపరుద్రుని తనయుడనని చెప్పుకొనియున్నాడు గాన ప్రతాపరుద్రుడు క్షత్రియుడు గాజాలడని యొకవాదమున్నది. గొంకారెడ్డి తాను ప్రతాపరుద్రుని తనయుడనని చెప్పుకొనినంతమాత్రాన, అతడు ప్రతాపరుద్రుని ఔరసపుత్రుడనియు, అందువలన ప్రతాపరుద్రుడు శూద్రుడనియు రెడ్డికులుడనియు నిర్ధారణము జేయుటకు వీలులేదు. ఏలయన ప్రతాపరుద్రుడు రెడ్డికులజుడైనయెడల శ్రీ రామారావుగారే చెప్పినట్లు ప్రతాపరుద్రుడేల పద్మనాయకులను సన్మానించి రెడ్లను తిరస్కరించి అవమానపరచియుండును? మరియు సేవకులు యజమానుని పితృభావముతో జూచుచు, తాము తమ యజమానునితనయులమని చెప్పుకొనుట కెన్నియో నిదర్శనములు గలవు. కనుక ఇంతమాత్రముచేతనే ప్రతాపరుద్రుడుగాని, కాకతీయులుగాని శూద్రులనుట యుక్తము కాదు.

కాకతీయులు క్షత్రియులనుటకు గల ఆధారములను కొంతపరిశీలింతము. ఈసంచికయందు శ్రీ రుద్రరాజు నరసింహరాజుగారు సంపాదకుల అభిప్రాయములను ప్రతిఘటించుచు, కాకతీయులు క్షత్రియులే యని వాదించుచు ఈ క్రింది విధముగ వ్రాసియున్నారు: "విద్యానాథుడు కాకతీయులను క్షత్రియులగానే స్తుతించియున్నాడనియు, తనపుస్తకమున క్షత్రియులనుగానే తెలుపనుద్దేశించి, క్షత్రియులనుగానే పేర్కొనియున్నాడనియు........ మున్నాటికిని స్పష్టమైయున్నది. ప్రతాపరుద్రీయమువలన కాకతీయులు క్షత్రియోత్తరులుగా దేలుచున్నారనుట నేటి మనపరిశోధకుల యపూర్వ పరిశోధనావిలసనము తక్క వేరొండుకాదు." శ్రీరుద్రరాజు నరసింహరాజుగారి అభిప్రాయము కేవలము తక్క ప్రతాపరుద్రీయముపైననే యాధారపడియున్నది. కాని, నిజముగ విద్యానాథుడు ప్రతాపరుద్రునికే అంకితముగ నొసగిన ఈ గ్రంథమందు ఒక్కచోటనైనను వారుచెప్పునంతనిస్సందేహముగను, సుస్పష్టముగను కాకతీయులు క్షత్రియులని చెప్పియుండినచో నరసింహరాజుగారి 'పరిశోధనావిలసనము'నకు అవకాశమే యుండక పోవును. వాస్తవముజూడ నరసింహరాజు గారు పేర్కొనిన శ్లోకములన్నియు సందేహాస్పదములుగనున్నవేకాని, ఘంటాపథముగ కాకతీయులు క్షత్రియులనిగాని, శూద్రులనిగాని జెప్పనాధారములుగాజాలవు. కానకనే కాకతీయకులనిరూపణము కేవలము తక్క ప్రతాపరుద్రీయముపైననే యాధారపడజేయ సాధ్యముగాదు. ఉన్న యాధారములనన్నిటిని సవిమర్శముగ పరిశోధింపక, 'విద్యానాథుని కాకతీయాన్వయ నిరూపణము'ను గూర్చి యొకరును, ఇతరాధారములనుండి తెలియనగువిషయముల నొకరును పరస్పరసంబంధ మేమాత్రమును లేక చర్చించుట నిరుపయోగము.

కాకతీయ చరిత్ర ప్రారంభముననున్న సమస్య ఈపుస్తకమునందు ఇంత అసంపూర్ణముగను, అశాస్త్రీ

యముగను చర్చితమైనది. ఇక కాకతీయచరిత్రాంతమున నున్న సమస్యలను కొంతపరిశీలింతము.

కాకతీయరాజ్యానంతర స్థితిగతులనుగూర్చి ప్రస్తావించియున్నారని ఇదివరకే తెల్పితిని. ఈవిషయమును గూర్చి వ్రాయునపుడుగూడ వా రొకనియతమార్గము ననుసరించినట్లు గానబడదు. విజయనగరనిర్మాణమును గూర్చి హొయసలవాదమనియు, ఆంధ్రవాదమనియు రెండువాదములుగాక కర్ణాటకవాదమని మూడవవాదమునుకూడ శ్రీ రామారావుగారు తెచ్చిపెట్టియున్నారు. "ఇందలి విషయములు (అనగా కర్ణాటకవాదమునందలి విషయములు) ఆంధ్రవాదమునకు ప్రతికూలములుగాక దానిని విశదీకరించుచున్న" వట. అట్లైనచో దీనొక క్రొత్తవాదముక్రింద జేర్చుట ఏల? ఈ వాదమునకు ఆధారములగు కుమారరామనచరిత మొదలగుగ్రంథములు వారు తెల్పురీతిని విజయనగర నిర్మాణమునకును కంపిలరాజ్యమునకు మాత్రమే సంబంధమున్నదనినొక్కిచెప్పుచుండ, కాకతీయసంబంధముపైననే యాధారపడిన ఆంధ్రవాదమునకే 'కర్ణాటక' వాదముగాని, అందలి విషయములుగాని ఎట్లు అనుకూలము లగుచున్నవో యర్థముగాదు. ఇంతకును ఈతృతీయవాదమునకు కర్ణాటకవాదమని వారేల పేరొసగిరో తెలియరాదు.

రామారావుగారు ఆంధ్రవాదమునే యంగీకరించుచు, ఈక్రిందివిధమున వ్రాయుచున్నారు. "విజయనగర సామ్రాజ్యము కర్ణాటసామ్రాజ్య మనుటయు, హొయసలబల్లాలుడు దానిని స్థాపించెననుటయు ప్రమాదకరములనియు, నాసామ్రాజ్య మాంధ్రవినిర్మితిము నాంధ్రాభిపోషకమునై యొప్పెననుటయు సమంజసములనియు స్పష్టమగుచున్నది." ఈ యభిప్రాయమును బలపరచుటకే వారు ౮ ప్రమాణముల నొసగియున్నారు. ఇవన్నియు నిజముగ ప్రమాణములుగావు. వీనిలో ఐదు ప్రమాణములు టెంగుటూరి సూర్యనారాయణరావుగారు మొదలగు కొందరు చరిత్రకారుల స్వీయాభిప్రాయములు. ఈచరిత్రకారులుతమగ్రంథములను వ్రాయునప్పటికివిజయనగరచరిత్రమునుగూర్చి యధికముగపరిశోధన జరిగియుండలేదు. అప్పటి కింకను శాసనవాఙ్మయమునుగాని, ప్రబంధాది సమకాలికగ్రంథములను గాని సరిగ పరిశోధించనందున ఆధారములు వాటికి చాల తక్కువయే.౧ కాన అప్పటికున్న ఏకొద్ది ఆధారములనో పురస్కరించుకొని వ్రాసిన అట్టివారి యభిప్రాయములను నేడు మనము ప్రమాణములుగ గైకొనుట యసమ్మతము. ఇటీవల, (అనగా కాకతీయసంచికను ప్రచురించుటకు చాలపూర్వమే) శ్రీ వెంకటరమణయ్యగారు ఈవిషయమునంతగు సంపూర్ణముగ పరిశోధించి ఆంధ్రవాదమును స్థాపించుచు ఒకగ్రంథమును ప్రచురించియున్నారు. అందున్న యభిప్రాయములే ఈసంచికయందునుగాన్పించుచున్నను, అందుజూపినవాదములుగాని విశేషములుగాని ఒక్కటియుఇందుగానబడవు. సూర్యనారాయణరావుగారి గ్రంథమును పేర్కొనియు గూడ శ్రీ వెంకటరమణయ్యగారి గ్రంథప్రస్తావమైన జేయక పోవుట విచారకరము.

చారిత్రకచర్చలందు సమకాలికవాఙ్మయమును, శాసనములును ఆధారము లగునేగాని పాతబడిపోయిన ఎట్టి గొప్ప చరిత్రకారుల యభిప్రాయము లైనను, గ్రంథములైనను ఆధారములు గాజాలవు. కాన రామారావుగారు చూపిన యభిప్రాయములను వదలివైచినచో ఇక మిగులు నాధారములు మూడే.

౧. మొదటిబుక్కరాజు కోడలగు గంగాంబ తన 'మధురావిజయము'న ప్రాచీనసంస్కృతకవులను ప్రశంసించిన పిమ్మట అగస్త్య, విశ్వనాథాద్యేకశిలానగర కవికుంజరులను పేర్కొని యుండెను. ఇది రామారావుగారి మొదటి ప్రమాణము. ఒక విజయనగరరాజుకోడలు తనగ్రంథారంభమున ఏకశిలానగర కవులను పేర్కొనినంతమాత్రముననే విజయనగర సామ్రాజ్యము 'ఆంధ్రవినిర్మిత'మని ఎంతమట్టుకు స్పష్టమగునో చదువరులే యూహించుకొనవచ్చును.

౧. వీరిలో ఒక నూయల్ దొరతప్ప మిగతవారెవ్వరును విజయనగర చరిత్రముపై ప్రత్యేకముగ పరిశోధనలను జరుపలేదు.

౨. శివతత్వరత్నాకరము, రాజకాలనిర్ణయము అను గ్రంథములే రామారావుగారి రెండవయాధారము. ఈగ్రంథములు విజయనగర నిర్మాణానంతరమున 3 శతాబ్దములకు పైగా రచింపబడినవి. కేవల మీగ్రంథములపైననే ఆధారపడి విజయనగర నిర్మాణమునుగూర్చి ఎట్టి తీర్మానమును జేయుటకు సాధ్యముగాదు.

3. ఇక రామారావుగారు చూపిన ఆధారమొక్కటియే. అది బరని యను మహమ్మదీయ చరిత్రకారుడు వ్రాసిన సమకాలిక చారిత్రకగ్రంథము. ఇందు తమ వాదమున కాధారమగు వాక్యమును రామారావుగారు ఈక్రిందివిధముగ అనువాదము చేసియున్నారు. "సులతాను తనకు ప్రతినిధిగ కంపిల రాజ్యమున కంపిన సామంతుడు ఓరుగల్లు రాజగు కన్ననాయకునకు సమీపబంధువు." కాని ఈ అనువాదమునకును ఇలియట్ గారి పుస్తకమునందున్న పాఠమునకును కొంతవ్యత్యాసమున్నందున ఆపాఠమునుగూడ ఈక్రిందనిచ్చుచున్నాను. "About the same time one of the relations of Kanya naik whom the sultan had sent to Kambala apostatized from Islam and stirred up a revolt" ఇందు చెప్పిన విషయము నిజమే యని ఒప్పుకొనినను ఇతడే (అనగా ఈకన్ననాయకుని బంధువే) విజయనగర నిర్మాణమును గావించెనని బరని ఇంకెచ్చటను చెప్పనందున పైయంశము ఆంధ్రవాదమున కెట్లు అనుకూలమగునో తెలియదు.

ఆంధ్రవాదమునకున్న యాధారమంతయు శ్రీ రామారావుగారు జూపిన ఈ ౩ 'ప్రమాణములు' మాత్రమే యైనచో ఆంధ్రవాద మీమాత్రమును నిలువజాలదని ఘంటాపథముగ చెప్పవచ్చును. కాని పైన జూపినట్లు డాక్టరు వెంకటరమణయ్యగారు ఇటీవలనే ఆంధ్రవాదమును సవిస్తరముగ చర్చించి విశదీకరించి యుండినందున ఇచ్చట ఆ చర్చ యనవసరము.

ఈ సందర్భముననే రామారావుగారు రెడ్లను గూర్చివ్రాసిన విషయమునుగూడ కొంత చర్చించవలసినదే. రెడ్లచరిత్రయందలి కొన్నికొన్ని సందిగ్ధాంశములపై నాధారపడి రామారావుగారు రెడ్లనుగూర్చి కొంత కఠినముగ వ్రాసియున్నారు. మాత్సర్యమును, పక్షపాతమును లేక ఎట్టి కఠినోక్తులనాడినను సరియేకాని, మన యాధారములు దృఢమైనవా కావాయనియు, మన కాఠిన్యమునకు తగినంత యాస్పదమున్నదా లేదా యనియు, మునుముందు మనము పరిష్కరించుకొనవలెను. రెడ్లపై కాఠిన్యము బూనుటకు రామారావుగారికి తగినన్ని యాధారము లుండవచ్చునేమో కాని ఈ సంచికయందట్టి యాధారములను వారు విశదీకరించలేదు. ఈ విషయ మత్యంత ప్రాముఖ్యమైనదిగాన రామారావుగారి వాక్యములను కొన్నిటి నిట నుదాహరించెదను:

(౧) "కాకతీయాంధ్రచక్రవర్తుల కాలమునందితరజాతులవారందరు, నభివృద్ధినందుచు రాజాదరణమునకు పాత్రులగుచుండ నీ రెడ్డిసామంతు లేల నిటు లజ్ఞాతగౌరవులై యుండిరి." (౨) "ఇంతవరకును (అనగా ప్రతాపరుద్రుని కాలమువరకును) కాకతీయరాజు లిట్టి కార్యము నొనర్చియుండలేదు. పద్మనాయకులయెడ పక్షపాతము జూపుచుండినను వారు లితరజాతివారల నవమానించియుండలేదు." (అనగా ప్రతాపరుద్రుడు పద్మనాయకులనుదప్ప మిగతవారిని అవమానపరచెనని అన్వయమగును.) (3) "ఆంధ్రదేశమును, కాకతీయరాజవంశమును చావుబ్రతుకులకు లోనైయుండి తమస్వాతంత్ర్యమునకై పోరుచుండిన క్లిష్టసమయము స్వార్థపరులగు రెడ్డినాయకులు కేవల స్వాభిమానపూరితులై చక్రవర్తిపై దమపగను దీర్చుకొన మంచిసమయము దొరకినదని సంతసించిరి." (౪) "అనుభవజ్ఞులు విశ్వసనీయులు మహాశూరులునగు సుండయనాయక సోమయనాయకాది కాకతీయ సేనానులు గతించియుండిరి. ఇతర సేనానులు నితరబలములు కొల్ల ముత్తరమున తురుష్కసమరమున నిమగ్నులై యుండిరి. దానంజేసి ప్రోలయవేముని స్వాతంత్ర్య స్థాపన మనాయాసముగ నెఱవేఱినది." (౫) "అయినను చక్రవర్తి యొక సేనను ధరణికోటపై కంపియుండెను. అల్పసంఖ్యాకులగు వీరిని మహాశూరుడును ప్రబలుడునగు వేమారెడ్డి త్వరలోనిర్జించి తన మార్గమును నిష్కంటకము నొనర్చు

కొనియెను." (౬) "స్వార్థపరులగు నీరెడ్డినాయకులొనర్చిన మఱియొకస్వామిద్రోహ కార్యముగూడ దెలియనగుచున్నది.........ధరణికోట కేగినవారలుగాక మఱికొందఱు బొబ్బారెడ్డియను నాతని నాయకత్వమున జక్రవర్తిపక్షమునందుండిరి...... బొబ్బారెడ్డి తురుష్కసేనానివద్దనుండి కొంతద్రవ్యమును బడసి నాడు యుద్ధమున పాల్గొనకుండుటకై యొడంబడిక జేసికొనియుండెను."

పైవిషయములకు ప్రతాపచరిత్రమును, స్థానిక చరిత్రలును దప్ప రామారావుగారు వేఱొండు ఆధారమును జూపలేదు. ఇందు మొదటియాధారము కాకతీయ చరిత్రమునకు కొంత ఉపయోగకరమైనను, శాసనాధారముగాని, సమకాలిక వాఙ్మయాధారముగాని లేక, కేవలము దానినే యాధారముచేసికొని చరిత్రవ్రాయుట యుచితేతరమని అందరెఱింగినయంశమే. అది కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఎన్ని శతాబ్దములకో పుట్టిన గ్రంథము రెండవ యాధారమగు స్థానికచరిత్రలందలి కాకతీయ చరిత్రము ప్రతాపచరిత్రమున కించుమించుగా నకలు. అందువలన వీటినే సంపూర్ణముగ విశ్వసించి అటువంటి యభిప్రాయములను వెలిపుచ్చుట సత్య చరిత్ర రచనమునకు పూనుకొనువారికి తగదు.

రెడ్డిరాజ్యస్థాపనము క్రీ. శ. ౧౩౨౦ లోనే జరిగిన దని రామారావుగారు వ్రాసియున్నారు. కాని ఇందులకు తగినయాధారము చూపలేదు. శాసనవాఙ్మయములను జాగ్రత్తగ పరిశీలించినయెడల రెడ్డిరాజ్యస్థాపనము ప్రతాపరుద్రుని యనంతరముననేకాని అతనిజీవితమునమాత్ర మెప్పటికిని సంభవించియుండదని విశదమగుచున్నది. ప్రోలయవేమారెడ్డి నిజముగ క్రీ. శ. ౧౩౨౦ లోనే రెడ్డిసామ్రాజ్యమును స్థాపించియుండినచో క్రీ. శ. ౧౩౨౦ నుండి ౧౩౨౩ వరకును ప్రతాపరుద్రుడేల రెడ్డిరాజుపై దండెత్తి వశపఱచుకొనలేదో తెలియరాదు. కలువచేరుశాసనమును ఇతరశాసన సముదాయముగూడ రామారావుగారి యూహకు ప్రతిబంధకములుగ గన్పట్టుచున్నవి. రెడ్డిరాజ్యస్థాపనమునుగూర్చి గడచిన యుగాదిసంచికయందు శ్రీ సోమశేఖరశర్మగారు విపులముగ చర్చించియున్నందున గ్రంథవిస్తరభీతిచే ఇట నెక్కువగ వ్రాయనైతిని.

"కాకతీయరుద్రుడు యాదవులతో యుద్ధము జేయుచు విధివశముచే యుద్ధరంగమునం దసువులు బాసెను" అని రామారావుగారు చెప్పియున్నారు. ఈ యభిప్రాయము చర్చనీయము. "ఓరుగల్లు కాకతీయ గణపతిదేవ చక్రవర్తిచే నిర్మింపబడెనని స్పష్టమగుచున్నది." అనిచెప్పి ఇందునకు తగునాధారమును జూపలేదు. ప్రతాపరుద్రుడు క్రీ. శ. ౧౩౨౬ వరకును రాజ్యముచేయుచుండెననుటకు రామారావుగారు చూపిన యాధారము చాలదు. వీరుచూపిన శాసనములు అప్పటికింకను ప్రతాపరుద్రుడు జీవించియుండెననిగాని రాజ్యమేలుచుండెననిగాని తెల్పవు.

మాకేమందు రామారావుగారి వ్యాసమునందలి విషయము లెన్నియో ఈరీతిగ నిరాధారములుగను, ప్రమాదకరములుగను గన్పట్టుచున్నవి. రామారావుగారు సుప్రసిద్ధ ఆంగ్లవిద్యావంతులు. కష్టమునకోర్చి పరిశోధన చేయగలవారు. అట్టివారు సావకాశముగ శ్రద్ధతో పనిచేసియుండినచో వారి వ్యాసమునందు ఇట్టి దోషము లగపడియుండవు.

సంపాదకుల వ్యాసమే ఇట్టులుండ ఇక ఇతర వ్యాసములగూర్చి చెప్పవలయునా? "ప్రతాపరుద్రునిపై మహమ్మదీయుల దండయాత్రలు" అను వ్యాసమునకై కొందము. ఈవిషయమునుగూర్చి ఇదివరకే డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు తమ "దక్షిణహిందూదేశము మహమ్మదీయదండయాత్రలు", అనుగ్రంథమునందువిపులముగ వ్రాసియున్నారు. ఈగ్రంథము చాలసంవత్సరములకు పూర్వము వ్రాసియున్నదైనను అంతకన్న ఎక్కువ విశేషము లేవియులేవు. ఈ వ్యాసమునందును డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారి గ్రంథమునందున్న దోషములను సవరించియు ఉన్నకొద్ది ఆధారములను,

౧. క్రీ. శ. ౧౩౨౦ నుండి ౧౩౨౩ వరకును ప్రతాపరుద్రుడు తురుష్కులతో ఎడతెగక పోరుచునేయుండెననుటకు ఎట్టియాధారమును గానరాదు.

సమగ్రముగ పరిశోధించియు సమన్వయించి వ్రాసి యుండినచో ఈ వ్యాసము ఎంతయో ఉపయోగకరముగ నుండెడిది.

ఉదాహరణముగ రెండుమూడు విషయములను మాత్రము గమనింతము. క్రీ. శ. ౧౩౦౯ వ సంవత్సరమునందు మాలిక్‌కాఫరు వారంగలుమీదికి దండెత్తి వచ్చిన సందర్భమునందు వెంకటరావుగారు ఇట్లు వ్రాయుచున్నారు. "రామదేవుడు సుల్తానునకును నాయకులకును ఉపాయనము నుపంపి వారికి స్వాగత మొసంగెను. తురుష్కసేనలు రాజ్యమునుండి పోవుచున్నప్పుడాత డోరంగలు పరిసరములనున్న గ్రామములకు ఘన సేవకులనుబంపి, తురుష్కసేనల కేవిధమగు లోటును జరుగకుండ జేయించెను. కాఫరునకు సహాయము చేయుటకై కొంత మరాఠీదండును కొన్ని మరాఠీపటాలములను వారికి సమకూర్చి తాను కొంతదూరమువరకును వారిని సాగనంపెను." ఇందునకు నా కేయాధారమును జూపలేదు. రామదేవు డీసందర్భమున ఇట్లు చేసెనని చెప్పుట కెట్టి యాధారమును గానరాదు.

ఇక "శ్రీపురము" (Sirpur) ముట్టడిని గమనింతము. ఈకోట ఎచ్చట నుండెననిగాని, ఈ కోట ముట్టడి ఎట్టి ప్రాముఖ్యమైన విషయమనిగాని వెంకటరావుగారు గమనించిన ట్లగపడదు. ఈ కోటముట్టడిని గూర్చి వారు సంగ్రహముగ నిట్లు వ్రాసిరి. "మహమ్మదీయు లాగ్నేయాంబకముల నుపయోగించుటచే కోటలోని కొన్నిగృహములకు నిప్పంటుకొనెను. చాలమంది యగ్నిజ్వాలలోబడి దగ్ధులైరి. మిగిలినవారు క్రూరులగు తురుష్కులచే ఖండింపబడి." దీనినిబట్టి ఈకోట తురుష్కులకు సులభముగ వశమయ్యెననియు, హిందువులు తురుష్కుల యుద్ధపద్ధతికిని సామర్థ్యమునకును తాళజాలక వారితో రెండును సాటికిరాక ఓడిపోయిరనియువిదితమగుచున్నది. కాని ఈవిషయమునందు మనకు ముఖ్యాధారమైన అమీరుఖుస్రూ వ్రాసిన చరిత్రమును చదివినయెడల, హిందువులు శక్తిసామర్థ్యములతో మహమ్మదీయుల నెదిర్చిరనియు, పరిస్థితులువిషమించినపిమ్మట చేయునదేమియు లేక మానవష్టమునకు వెరచి రాజపుత్ర వీరులవలె 'జోహారు' నొనర్చిరనియు విశదమగుచున్నది. అనగా కోటలోని స్త్రీలును, పిల్లలును మహమ్మదీయులపాల బడకుండ అగ్నిలోబడి మరణించిరి. కత్తిపట్టగల ప్రతిమగవాడును వీరమరణాయత్తచిత్తుడై శత్రులనెదుర్కొని తుమురాడి రణరంగమున నిహతుడాయెను. ఈ కోట మహమ్మదీయులచే జిక్కినను వారికి అందేమియు చిక్కలేదు. కానిచో అందుండి వారికి ఎంతధనము ఎన్ని ఏనుగులు దొరకెనో మనకు తెలిసియే యుండును. మహమ్మదీయుల కిది విజయమని చెప్పినను 'పిర్రిక్' (Pyrrhic) విజయమువంటిది. ౧

ఈ ముట్టడికి పిమ్మట మాలిక్‌కాఫరు అవలంబించిన పద్ధతిని జూచినచో అతడు 'సిర్పూరు' నందు తనకు కలిగినకష్టములను, హిందువులుజూపిన శక్తిసామర్థ్యములను ఏమాత్రమును మరవలేదని స్పష్టముగను విశదమైనను గర్వాంధునివలె అనాగరికముతో ప్రవర్తనము సాగింపక వారంగల్లును ముట్టడించుటకు బయలు అతడు కడుజాగ్రత్తగను, సావకాశముగను ప్రయాణము సాగించెను. వారంగలు సమీపించుటకు పూర్వమే అతడు వేయిమంది సైనికులను ముందంపి ఆ ప్రాంతపు జనులను కొందరిని చెఱపట్టి వారినుండి తనకుపయోగములను కొన్ని ముఖ్యాంశములను విచారించి కనుగొనెను. వారంగలును సమీపించినపిమ్మటకూడ అతడేమాత్రమును ఆతురపడలేదు. మునుముందు కొంతసేననంపి, కోటకు సమీపముననుండు అనుమకొండను స్వాధీనము చేసికొనపిమ్మటనే అతడు సైన్యముతో వచ్చిడండువిడిసెను. ఈ కొండపైనుండి చుట్టుపట్లనుండు ప్రాంతమంతయు విశదముగ గానవచ్చుచున్నందున కోటలోని వ్యవహారమంతయు తెలిసికొని తదనుగుణముగ ప్రవర్తించుటకవకాశ ముండెను. కొన్నిదినము లట విశ్రాంతిగైకొని, దగ్గరనున్న చెట్లనన్నిటిని నఱికించి, విశేషముగ కలపను ప్రోగుచేసి తనసైన్యమురక్షణకై ఒక దుర్భేద్యమగు ఆవరణమును నిర్మించి, సర్వసన్నాహములను జేసికొని

౧. అనగా లాభమునకన్న నష్టమే ఎక్కువయని యర్థము

ఎప్పటికిలకు వారంగల్ కోటను ముట్టడింప సమకట్టెను. తన సైన్యరక్షణమునకై ఇతడు చేసిన నానాప్రయత్నములను చూచినచో అతడు కాకతీయరాజుల ధాటిని గుర్తెరింగి జాగ్రత్తగ ప్రవర్తించుచుండెనని విశదమగుచున్నది. మాలిక్ కాఫరు వారంగల్ కోటనుపట్టుకొనుట కెంతకష్టపడెనో అమీరు ఖుస్రూవ్రాసిన చరిత్రమును చదివిన బోధపడును.

కాకతీయసామ్రాజ్య మహోన్నత్యమును వెల్లడి చారిత్రక విజ్ఞానము వృద్ధినొందిన [illegible] కాకతీయవంశ కాలమునందు [illegible] కాకతీయనోధులు చూపిన ఇట్టి [illegible] సామర్థ్యములనుగూర్చి తెలియచేయకుండుట యొక [illegible] లోపమే.

ముఖ్యమైనవ్యాసము లొకటి రెండింటికన్న [illegible] ఇక మిగతవానినిగూర్చి విస్తరముగ చెప్పనవసర కాకతీయుల [illegible] తగినంత ప్రస్థ [illegible] మున [illegible] యుండ [illegible] గూడ [illegible] అసంపూర్ణ పరిశో[illegible] యున్నది. కవాగని వంశవేశీలన్న అనుబంధమునందు చారిత్రకాధారముల నిచ్చిరిగాని ఇవియైనను సంపూర్తిగ లేవు. కొన్ని కొన్ని క్రొత్తశాసనములపై నాధారముచేసి ఈసంచికయందు కొన్ని నూతనసిద్ధాంతములను జేసియున్నారు. కాని ఆ శాసనపాఠముల నివ్వలేదు. మైలిగి దేవునిగూర్చిన చర్చయంతయు పాలసశాసనముపై నాధారపడియున్నది, గాని అశాసనము నివ్వలేదు. గూడూరి శాసనము నిచ్చియున్నారుగాని ఇచ్చినపాఠము దోషపూరితమని తోచుచున్నది. ఎట్లున్నను ఈ చిన్న శాసనప్రతిబింబ మివ్వకపోవుటచే ఈ పాఠమునందునిపర్చితములైన యంశములు నిరుపయోగములు.

రాళ్లభండి సుబ్బారావుగారివ్యాస మెక్కువ ఉపయోగకరముగ గాన్పించదు. ప్రారంభ భూగోళ పాఠపుస్తకములందలి విషయములనిచ్చుటతో మాత్రమే తృప్తినొందక వీరు ఈ ప్రాంతపు నైసర్గిక పరిస్థితులను బట్టి కాకతీయరాజ్యమెట్టిపరిణామమునకు లోనయ్యెనో, ఏవిధముగ కాకతీయసామ్రాజ్యాభివృద్ధికి నైసర్గికపరిస్థితులు అనుకూలములుగను ప్రతికూలములుగను ఏర్పడుచుండెనో తెలిపియుండినచో వారివ్యాస మెంతో ఉపయోగకరముగ నుండెడిది.

వాఙ్మయమును గూర్చి ఈ సంచికయందు ఆరు ఉత్తమవ్యాసములున్నను వీనివల్ల అప్పటి వాఙ్మయమెంత ఉత్తమమైనదో ఇంచుకంతయు బోధపడదు. కాకతీయుల నాటివాఙ్మయము చాలవరకును ఏపల్లెలందో ఏవాడలందో తాటాకు పుస్తకరూపమున దాగి నానాటికి ఖిలమై [illegible] ఉపేక్షితములై యున్న శిలాశాసనములనుండియే యెంతయోవాఙ్మయము బహిర్గతమైనది. అట్టి శాసనములందలి చక్కని తెలుగుపద్యములను వచనమును అనుబంధమునందే ఇచ్చియుండిరి, వీనినన్నిటిని పరిశోధించి కాకతీయులనాటి వాఙ్మయమునుగూర్చి ఏల వ్రాయరైరో యర్థముగాదు. పాల్కురికి [illegible] సోమ[illegible] బండారు [illegible] తమ్మయ్యగారు ఒక [illegible] వ్యాసమును వ్రాసియున్నారు ఇన్ని వివరములతో ఇంతటి పెద్దవ్యాసము కాకతీయ సంచికకు అనవసరమైనను పాల్కురికి సోమనాథుని జీవితమును తెలిసికొనుటకు ఉపయోగకరముగ నున్నది.

ఆంధ్రవాఙ్మయమునుగూర్చిన పరిశోధనయే ఇట్లుండ ఇక కన్నడ సంస్కృత వాఙ్మయములను గూర్చి చెప్పనవసరమే లేదు. ప్రతాపరుద్రీయమనువ్యాసమునందు ప్రతాపరుద్రీయమునందలి వివిధ ప్రకరణముల సారాంశమును ఒకటిరెండు చారిత్రక విషయములను దప్ప వేరేమియు గానరాదు. అలంకారశాస్త్రమున అగ్రస్థానమును వహించిన ఈ గ్రంథరాజమునుగూర్చిన ముఖ్యాంశముల నేమాత్రమును వీరు గమనించిన ట్లగపడదు. ఎట్టివారికిని బూదపురశాసనములనుజదివిన కాకతీయయుగమునకవిత్వమును అలంకారశాస్త్రమును ఎట్టిఉచ్చస్థితియందుండెనో విశదమగును. ఇట్టివిషయముల పరిశోధన ఈగ్రంథమున గానరాదు.

మత పరిణామమును దెలుపు వ్యాస మొక్కటైనను గానరాదు. కాళాముఖ, పాశుపతాది మతశాఖ

లెన్నియో కాకతీయ సామ్రాజ్యమున వృద్ధినొందుచు కాకతీయ రాజుల మన్ననలకు పాత్రములైయుండినను ఈవిషయమునకు తగినంత ప్రాముఖ్యమునిచ్చి ఎవరును చర్చించియుండలేదు.

ఆంధ్రభారతీ తీర్థప్రధానులైన శ్రీయుత డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు శ్రీ కాకతీయ వర్ధంత్యుత్సవాహ్వాన సంఘాధ్యక్షులకు "విజయవిభవాశీర్వచనములతో, వినయపూర్వకముగా, సహర్షముగా, మంగళాచరణరూపముగా, సగౌరవముగా చదివించుటకై శ్రీ ఏకశిలానగరమునకు" "శ్రీ కీర్తిశేషులైన సురుజాడ వేంకట అప్పారావుగారి విజయనగరం చరిత్రరికార్డులో నుండి వ్రాయించి" పంపిన 'కాకతీయ రాజుల విజయబిరుద ప్రశస్తి' అనబడు, కాకతీయేతర రాజన్యులవక్కణ దురవబోధముగ నున్నను చదువుటకు మాత్రము ముచ్చటగనుండి ముదమును కలిగించుచున్నది.

అచ్చుతప్పు లసంఖ్యాకములు. తప్పొప్పులపట్టియైన ఇందు లేకుండుటచే విషయపరిచితిలేనివానికి ఈగ్రంథ మత్యంతప్రమాదకరము. కాలనిర్ణయముజేయు పర్వములందుగూడ సంఖ్యలు తప్పుగ నీయబడినవి. కొన్నిచోట్ల శాలివాహన క్రీస్తుశకములు తారుమారైనవి. మరికొన్నిచోట్ల నీయబడిన సంవత్సరములు పరస్పరము వ్యత్యాసములుగ నున్నది.

అనుబంధమున నొసంగిన కొన్ని శాసనముల పాఠములకును ఇటీవల ప్రచురించిన తెలంగాణా శాసనములకును చాల సామ్యమున్నందున బహుశః 'తెలంగాణా శాసన' సంపుటముపైననే వీరాధారపడియున్నట్లు తోచుచున్నది. ఫాల్గునమాసపు భారతియందు ఈ 'తెలంగాణా శాసనములను' విమర్శించుచు శ్రీ సోమశేఖర శర్మగారు ఇందొసంగిన శాసనపాఠములు దుష్టములనియు, అశాస్త్రీయములనియు విశదముగ నిరూపించియున్నందున ఇచ్చట అప్రశంసమానెడ. చారిత్రకాధారలను సరిగా పరిష్కరించుకొనక చరిత్ర వ్రాయబూనుకొనుట ప్రమాదకరమని యంచెరింగిన యంశమే. వ్యాసరాజముల కొకటియు, అనుబంధముల కొకటియు, ఇందు రెండుకారాదిసూచికలు సంపాదకులచే విశేష పరిశ్రమతో తయారుచేయబడినవి. ఇట్టివి చదువరులకు ఎంతయో ఉపయోగకరములనుటకు సందేహము లేదు. కాని ఈ సూచికలలో అనేక ముఖ్యపదములు లోపించుటచేత ఉండవలసినంత సహాయకరముగ లేవు. పైగా ఇట్టి సూచికలను తయారుచేయుటలో గమనింపగలసిన కొన్ని సామాన్యపద్ధతులనుగూడ సంపాదకులు గమనించినట్లగుపడదు.

ఇంతటిశ్రమమీద ఇంతటి ప్రవ్యవ్యయముమీద ఇన్ని తప్పులు కల్గి గ్రంథము తయారగుట చాల విచారకరము. సంపాదకీయసంఘమువారైనను ఈలోపములను నివారించవలసియుండెను. పేరువకేకాని వారీ విషయమున జోక్యము కలిగించుకొనినట్లు గనుపడదు. లేదా వారికి కాకతీయచరిత్రయందలి ముఖ్యసమస్యలనుగూర్చి తగినంతపరిచయమైనను లేకయుండవలెను. ఐనను ఇందున్న చిత్రపటములును కొన్నికొన్ని పద్యములును కొన్ని విషయములును జనసామాన్యమునకు కాకతీయ చరిత్రయందు కొంత యుత్సాహమును కలుగజేయవచ్చును.



# కలగూరగంప



## వాల్టు డిస్నీ





ప్రపంచంలో ఏ దేశంలోనైనా సరే తరుచుగా సినీమాలకి వెళ్లేవాళ్లలో 'మిక్కీమౌస్' (Micky Mouse) అంటే తెలియనివాళ్ళుండరు. మిక్కీ అంటే అంతా యిష్టపడతారు. పసిపిల్లలు మిక్కీ కార్టూనులు చూడడానికి తెగ ఆదుర్దాపడతారు. ప్రపంచంలో నూరుమందికిపైగా, వ్యాపారులు తమ వ్యాపారవస్తువులకు (Patents) మిక్కీ పేరుపెట్టుకున్నారు. ఉదాహరణానికి, మిక్కీ రేజర్లు, బ్లేడుల్సు, కత్తెరలు, ఆటవస్తువులు, గొడుగులు, బొమ్మల పుస్తకాలు యిలాంటివి. అసలు యీ 'మిక్కీమౌస్'ని యీ నవనాగరక ప్రపంచంలోకి సృష్టించినవాడు సుప్రసిద్ధ చిత్రకారుడు 'వాల్టుడిస్నీ'

ఈ 'డిస్నీ' 'చికాగో' నగరంలో౧౯౦౧ సంవత్సరం అక్టోబరు నెలలో జన్మించాడు. తండ్రి ఒకసాధారణ కుటుంబీకుడు.

తోడి బాలకులలాగే 'డిస్నీ' కూడా తనయింటికి సమీపాన్నివున్న ఏదో ఎలిమెంటరీ పాఠశాలలో ప్రవేశించి తనకు తొమ్మిదేళ్ళువచ్చేవరకూ చదివాడు. అప్పుడప్పుడు తనక్లాసులో 'బ్లాక్‌బోర్డు' మీద ఏవో బొమ్మలు వేసేవాడు. ఉపాధ్యాయుడు ఆశ్చర్యపడేవాడు అతని నైపుణ్యం చూచి.

చిత్రలేఖనంమీదున్న అభిలాష చూసి డిస్నీ తండ్రి 'డిస్నీ'ని చికాగో చిత్రకళాశాలలో ప్రవేశపెట్టాడు. అక్కడ చిత్రకళ బాగా అభ్యసించాడు. కళ అభ్యసిస్తూనే అనేక ప్రదర్శనాలకి (Exibiticns) చిత్రాలు పంపేవాడు. ఏ చిత్రమూ వృథా అవలేదు.

౧౯౧౮ లో ప్రపంచ యుద్ధం ముగిసాక అమెరికా సంయుక్తరాష్ట్రాలకి వచ్చి, త్రోవలో తల్లిదండ్రులున్నారని 'కంసాస్‌నగరం' (Kansas city) లో దిగాడు. అక్కడ వో పాత కెమేరా అమ్మకానికివస్తే దాన్ని కొన్నాడు. ఆ కెమేరాతో మొదట కొన్ని వార్తాచిత్రాల్ని (News reels) తీయడం మొదలు పెట్టేడు. కొన్నాళ్లకి స్వంతంగా ప్రకటన అద్దములు (Advertisement Slides) తయారుచేసేవాడు. అప్పుడే ఆ స్లైడ్సుమీదే ఏవో, పిల్లులు, నక్కలు, పిట్టలు మొదలైన బొమ్మలువేసి జనాన్ని ఆనందపరిచేవాడు.

౧౯౧౯ లో డిస్నీ 'ఫ్రాంసులో' Ambulance car నడిపేడు కొన్నాళ్ళు. ౧౯౨౩ లో మళ్లీ తన స్వదేశానికి తిరిగివచ్చేశాడు.

'లాస్ ఏంజిల్సు' (Los Angeles) లో వుండగా అతనికి మళ్లీ చలనచిత్రాలమీదకి బుద్ధివెళ్లింది. తాను వెనుక తయారుచేసిన మామూలు బొమ్మల (Still Pictures) కంటె బొమ్మలతో చలనచిత్రాలు తయారుచేస్తే బాగుంటుం దని తోచింది. వెంటనే తనతమ్ముడు 'రాయ్'న్ని ౫,౦౦౦,౦౦ల డబ్బుతోటే బయలుదేరి 'కాలిఫోర్నియా' (California) వచ్చి చేరాడు.

తాను తెచ్చినడబ్బుకీ, తలపెట్టిన కార్యానికీ ఎక్కడా లంగ రందదని తెలుసును కాని డబ్బుకంటె



వాల్టు డిస్నీ
మిక్కీమౌసుతో విమానము నెక్కనున్నాడు

ఇతనితమ్ముడు 'రాయ్' కూడా యితనిదగ్గరే వున్నాడు.

'డిస్నీ' ఎక్కువగా ప్రేమించేవాళ్లలో అతని పెళ్లాం మొదటిది. రెండు మిక్కీమౌసు తమ్ముడు. డిస్నీ అలవాట్లు, చేష్టలు చాలా చిత్రమైనవంటారు. అతనే వొక 'మిక్కీమౌస్' అంటారు అతనిమిత్రులు.

'డిస్నీ' ఎప్పుడూరాత్రి మొదట తనపనిముగించుకుని రెండోపనికి వెళ్తాడు. తనకు తీరికగావున్న పుడెల్లా సాధారణంగా ఏ సినిమాకో వెళ్తాడు. వాటిల్లో ఏవేనా క్రొత్త భావాలువుంటేవాటిని తన 'మిక్కీ'కి బోధిస్తాడు.

సాయంత్రం పనిముగియాగానే తన సహాయులతో (Assistants) గోల్ఫ్, బేసేబాల్, పోలో మొదలైన ఆటలు ఆడితాడు. తనసహాయులందరినీ తన తమ్ముళ్లమాదిరిగా చూస్తాడు. ఏదేనా వాళ్లుతప్పు చేస్తే సహించి వూరుకుంటాడు. పల్లెత్తుమాట నడు. అలా అని అతని సహాయులు అతనికి విసుగు కలిగించరు. చాలా వినయవిధేయతలతో నడుచుకుంటారు. ఒక్కొక్కప్పుడు భార్యతో చదరంగమాడుతాడు. ఆమె (Mrs. Disney) చదరంగ ప్రవీణురాలు. మరొకప్పుడు యింకా విలిపితనంగాను, చిన్నపిల్లాడుకంటే అవివేకంగానూ తాను తయారుచేయించిన 'మిక్కీమౌస్' బొమ్మ (Doll) తో ఆడుకుంటాడు. అలాంటప్పుడు అతని పెళ్లాం కడుపుచెక్కలయ్యేటట్టు నవ్వుతుంది. 'కళావినోద'

---

## జుల్లుందూరు కన్యామహా విద్యాలయము

ఈ విద్యాలయము జాతీయపద్ధతుల ననుసరించి ౧౮౮౬ వ సంవత్సరమున స్థాపింపబడినది. సంఘాభివృద్ధి కాటంకమగు 'పరదా'ను తొలగించుటకు, స్త్రీలకు వివాహయోగ్య వయస్సును పొడిగించుటకు నిది ప్రబలము సాధనము. నిరాడంబర జీవనముయొక్కయు, పవిత్రతయొక్కయు, ఆదర్శముయొక్కయు తత్వమును బోధించుట కీవిద్యాలయము ముందంజవేయుచున్నది. ఎనమండుగురు బాలికలతో ప్రారంభమయిన యీవిద్యాలయమున నేడు ౫౦౦ బాలికలు నివాసముచేయుచు విద్యనభ్యసించుచున్నారు. విద్యాలయము ౩౫ ఎకరముల విస్తీర్ణముగల ప్రదేశమున నాలుగులక్షల రూపాయల వ్యయముతో నిర్మింపబడినది. స్త్రీలు ఉత్కృష్టమగు సౌదర్యము, గృహిణీత్వము, మాతృత్వముగల్గి అభ్యున్నతిని గనవలయు ననుటయే ఈవిద్యాలయము ముఖ్యోద్దేశము. దీనినంటి యొకవనితంతుశరణాలయమున్నది. ఈ విద్యాలయమున లలితకళలును, ముఖ్యముగ శరీరవ్యాయామమును నేర్పబడుచున్నవి. దీనికిచెందిన చిత్రము లొకనాలు గీసంచికయందు గలవు.

---

## హిందూదేశములోని కఱవులు

### (మాడర్న రివ్యూ సంపాదకీయమునుండి)

హిందూదేశపు ఆర్థిక సభ్యుడగు సర్ జేమ్సు గ్రిగ్గు గారు 'బ్రిటిషుపరిపాలనలో హిందూదేశమందు కఱవు లంతరించినవి' అని ఆధారంలేని స్తోత్రం చేసుకున్నాడు. వేదకాలములో కూడా కఱవులు లేకపోలేదని చెప్పుటకు వేదములలోని కొన్ని భాగములను యేకరువు పెట్టాము. హిందూదేశ చరిత్రలో బ్రిటిషు యుగానికి పూర్వము కఱవులున్నాయని చెప్పడానికి పేరు పేరులు లేని కొంతమంది చరిత్రకారులనుకూడ ప్రస్తావించాము. గతశతాబ్దములలో చెప్పినట్లు హిందూదేశమున క్షామములు లేవని చెప్పవీలులేదు. కాని, అనేకకాలమున నితరదేశములలో క్షామములు లేవని చెప్పుటకును వీలులేదు. బ్రిటిషు యుగంలోనే, తక్కిన శకములలో కన్న క్షామములు యెక్కువగా సంభవించినవనియు, చాలాభీభత్సకరముగ పరిణమించినవనియు, హిందూదేశములో నెన్నో భాగములను పాడుచేసినవనియు నొక్కి చెప్పవచ్చును.

'౧౮౭౦ లో కాశ్మీర సంస్థానమున జీలమునది మృతదేహములతో నిండియుండెను.'

సర్ జేమ్సు గ్రిగ్.

క్రీ. శ. ౧౭౭౦ ప్రాంతమున బంగాళ రాష్ట్రమున సంభవించిన కఱవును ఆర్థిక సభ్యునికి జ్ఞప్తికి తెచ్చుటకు వీలులేదు. ఏలనన, అప్పటికి బ్రిటిషుపరిపాలన దేశమున బాగుగ పాతుకొనలేదు.

కాని ౧౮౩౭ న ఆగ్రారాష్ట్రమున సంభవించిన కఱవున కాన్పూరులో వీధులలోని, నదులలోని శవములను తీసివేయుటకు ప్రత్యేక సంఘము పనిచేసెను. ఆగ్రాలోను, ఫత్తేపూరులోను అనేకవిధముగ జరిగెను. చాలచోట్ల మృతదేహములు మృగములు వచ్చి పెఱుకుకొని తినునంతకును అటులనే పడియుండెడివి.

'India and its problems' అను పుస్తకములో డబ్ల్యు. యస్. లిలీ అనునొక గొప్ప బ్రిటిషుద్యోగి యిట్లు వ్రాసెను:

'పంతొమ్మిదవ శతాబ్దపు మొదటి యేబది సంవత్సరములలోను కఱవుకాలమున ౧,౮౦,౦౦,౦౦౦ జనులు నాశనమైరి. ఒక సంవత్సరములోనే — శ్రీవిక్టోరియా మహారాణి హిందూదేశ పరిపాలన వహించిన సంవత్సరము—దక్షిణ హిందూదేశమున ౫౦,౦౦,౦౦౦ కూటికిలేక మలమలమాడి చచ్చిరి ౧౮౭౬-౭౭ న (వేల్సుకన్న రెట్టింపు వైశాల్యముగల) బళ్లారి జిల్లాలో జరిగిన కఱవును నేను బాగుగ నెఱుగుదును. అప్పటి దృశ్యమును నేనెన్నటికిని మరువజాలను. ఎంతోమంది అస్థిపంజరములవంటి శరీరములవారిని, బాటలప్రక్కబడియుండి కుక్కనక్కలచేత పీకుకొనితినబడు ఎన్నియో శవములను నాకనులతో చూచితిని. అంతకన్నను భీభత్సకరము-ప్రపంచమునకు సంతోషవార్తలమని పురాతన గ్రీకులు చెప్పిన శిశువులు తమ తల్లులచేత వదలివేయబడి, లోతుకుపోయి సంతాపకరములైన తమ కనులతో మిలమిలలాడుచూ చూచుచు, ఎముకలుమాత్రము మిగుల కృశించిన దేహములతోనుండె నాకండ్లార జూచితిని. దానిని తలచుకొనిన ఇప్పటికిని శరీరము గగుర్పాటు నొందును.'

గతశతాబ్దములోని మొదటి పాదములో ఐదు కరవులును, రెండవ పాదములో రెండును, మూడవ పాదములో ఆరును, నాల్గవపాదములో పదునెనిమిదియున్ని సంభవించెను. ఈకరవులలో సంభవించినమరణములువరుసగా నీవిధమునలెక్క వేయబడినవి. (౧)౧౦,౦౦,౦౦౦; (౨) ౪౦౦౦౦౦౦ (౩) ౫,౫౦,౦౦,౦౦౦; (౪) ౧,౫౦,౦౦,౦౦౦నుండి౨,౬౦,౦౦,౦౦౦ వరకును—

౧౮౭౮ లోని క్షామసంఘపు లెక్క ప్రకారము ౧౮౬౬—౬౭ లోని ఒరిస్సా కరవుకాలమున ౧,౦౦,౦౦,౦౦౦ మంది చనిపోయిరి. 'చక్రవర్తి'

---

## క్షయరోగనివారణమునకు ఇటలీ అవలంబించిన పద్ధతులు

కడచిన పదిసంవత్సరములలో ఇటలీలో క్షయరోగమువలని మరణములు సంవత్సరమునకు

౬౦౦౦౦లనుండి ౩౫౦౦౦లకు(౪౧.౬౫%) తగ్గిపోయి నవి. ఆశ్చర్యమును కలుగచేయు యీ మంచికి కారణములు మూడు. చక్కని కట్టుబాట్లమీద ౧౯౩౭ లో ఆరంభింపబడిన నిర్బంధ సహాయపద్ధతి మొదటిది.

అన్ని సేవాసంఘముల కార్యకలాపములతో డను ప్రభుత్వము జోక్యము కలుగజేసికొనుట రెండవది. ప్రభుత్వపు జోక్యముచేత సేవాసంఘములపని జాటపడి, తీరుగా సాగుటకు వీలున్నది. అంతరంగిక మంత్రివర్గపు అజమాయిషీక్రింద తొమ్మిది సంఘములు తమస్వప్రయోజనమును నిర్వహించుకొనుచు పనిచేయు చున్నవి. అయిదుసంవత్సరములలో ఇటలీప్రభుత్వము యీ అవసరముక్రింద ౨,౫౦,౦౦,౦౦౦ పౌనులు ఖర్చు పెట్టినది. అందులో ప్రతిదమ్మిడీయును అత్యంతమైన ఉపయోగమును కలుగజేసినదనుటకు సందేహము లేదు.

చాలవరకు వ్యాధికుదుర్చబడినవారికి వ్యాధితిరుగబెట్టకుండనుండుటకు 'శానిటోరియములు' యేర్పాటుచేయుటయును, వ్యాధిని వ్యాపింపజేయు మురికి స్థలములలో కాపురముండువారికి నివసించుటకు పరిశుభ్రమైన ప్రదేశములను చూపుటయును ఇటీవల చేయబడు మంచికార్యములు. ఈ ప్రదేశములు సముద్రప్రాంతములలోను, చిన్నచిన్న కొండలమీదను వుండుటచేత అన్నివిధములను ఉపయోగకరములుగ నున్నవి.

అతి ఉత్సాహముతో దేశమంతటను చేయబడుచున్న ప్రచారము మూడవది. ప్రజాసామాన్యమునకు వార్తాపత్రికలవల్లను, చిన్నచిన్న ప్రకటనపత్రములవల్లను బోధించుటకు చాల శ్రద్ధ తీసుకొనబడుచున్నది. క్షయరోగమువలన కలుగు నష్టములను సినీమాలలో ప్రదర్శించుటవలనను, క్షయరోగచికిత్సానిపుణులచేత రేడియోలద్వారా ఉపన్యాసముల నిప్పించుటవలనను ప్రజలకు మంచి ప్రబోధము కలుగుచున్నది.

ప్రతి సంవత్సరము వసంతఋతువులో వేలకొలది పిల్లలకు క్ష పెన్నీ స్టాంపులనిచ్చి, ఆస్టాంపులను ఆపిల్లలచేత ప్రతిసందుమొగడలలోను అమ్మించి, ఆసొమ్మును క్షయనివారణసంఘవ్యయమునకు ఖర్చుపెట్టెదరు. ఈ విధమైన ప్రచారము కొనియాడబడదగినది.

(ఇంగ్లీషురరు పత్రికలో జాన్ బ్రౌనుగారు వ్రాసినవ్యాసమునుండి)　　　　'చక్రవర్తి'

---

# ఇండియానుగురించి ఒక జపానుస్త్రీ అభిప్రాయము

## (మాడరన్ రివ్యూ సంపాదకీయమునుండి)

తిరువనంతపురమున (Trivandrum) జరిగిన అఖిలభారత మహిళాసమావేశమునకు జపాను మహిళా విశ్వవిద్యాలయమునకు చెందిన కొహారా ... నికా అను నామె ప్రతినిధిగావచ్చెను. ఈమె సుప్రసిద్ధమైన శామురాయ్ కుటుంబమున జన్మించినది. ఈమె జపానులోని న్యూ లివింగ్ మూవ్‌మెంటు (New living Movement) నకు ఎగ్జిక్యూటివ్ సెక్రటరీ (Executive Secretary) గ పనిచేయుచున్నది. ఇన్‌స్టిట్యూటు ఆఫ్ హోమ్‌సైన్సు (Institute of Home Science) ను స్థాపించినది.

సింగపూరునుండి వెలువడు 'ది ఓరియంట్ గాంగ్' (The Orient Gong) అను పత్రిక ఇండియాను గురించిన ఆమెఅభిప్రాయములను ప్రకటించినది. 'భారతీయ స్త్రీ జనోద్ధరణకొరకు ఉత్సాహముతో పనిచేయుచున్న వివిధజాతులకు చెందిన అనేక స్త్రీ ప్రముఖురాండ్రను తిరువనంతపురములో కలసికొంటి' నని ఆమె చెప్పెను. ఆమె భారతీయస్త్రీలకిచ్చిన సలహాలనే మేము మనవిగా చెప్పుచున్నాము.

'ఈ సమావేశపు ముఖ్యోద్దేశము నాచరణలోనికి తేవలయుననిన భారతీయ మహిళలు పీవసాడలతో సమముగా కలసిమెలసితిరుగుట కలవాటుపడవలయునని నా యభిప్రాయము. జీవితములోని ప్రతిసమస్యను సంప్రదాయానుసారముగా పరిచేసుకొనుటకంటె స్వబుద్ధితో నూహించి స్వానుభవమువలన పరిచేసుకొనుట యుత్తమము.'

'ఇరువది సంవత్సరములు అహోరాహోరిగ పోరాడి శాస్త్రీయము లగు తమ హక్కులను నిలువబెట్టుకొనిన జపానుసోదరీమణులనుండి భారతీయ యువతులు నేర్చుకొనవలసిన దెంతయోగలదు. స్త్రీలోకము గృహకృత్యములలో మునిగి తేలుచు తమ తెలివితేటలను నందే వినియోగించుచున్నను, యీ మార్పులు క్రమముగ వచ్చును. జపానులో మే మీ విషయములను గురించి ఎక్కువగ మాట్లాడకుండనే, ప్రతిక్లిష్టపరిస్థితిని స్వయముగనెదుర్కొని పనిచేయునట్లు సంఘములను కట్టుబాటులోనుంచితిమి. జపానుస్త్రీలు భారతీయ సోదరీమణుల కివ్వగలిగిన సలహా యేమన, ప్రతివిషయమును దానినిగురించి యెక్కువగా నాలోచించుచు కూర్చుండక వెంటనే ఆచరణలోనికి పెట్టవలయును. జపానులో మే మెల్లపుడును, భర్తృశుశ్రూష, శిశుసంరక్షణ, సంఘమర్యాదలను ఆదర్శములుగా నుంచుకొందుము.

జపానున కిప్పుడు 'దైవికము' మీద నమ్మకము లేదు. దైవికమునకును జపానులోని ఆధునిక జీవితమునకును సంబంధము లేదు. జీవితసమస్యలను ఆచరణసాధ్యములుగ జేయుటకే జపాను సర్వదా ఉత్సాహముతో ప్రయత్నించుచున్నది.'

బ్రిటిషు పరిపాలకులు హిందూదేశమును అనాదినుండియు వ్యవసాయ ప్రధానదేశమనియు, వర్తమాన భవిష్యత్కాలములలో కూడ ముడివస్తువులను సరఫరా చేయుటకే అది యోగ్యమనియు నభిప్రాయపడుచున్నారు. అది పొరపాటు. అటులనే అనుకొన్నను, హిందూదేశ వ్యవసాయాభివృద్ధికొరకు ప్రభుత్వమువారు చేసినపని సరిపోవునా? అది యెంతమాత్రమును చాలదు. ఈ విషయమున జపానుదేశపు మహిళారత్న మేమనుచున్నది.:

'హిందూదేశ వ్యవసాయపరిశ్రమాభివృద్ధి యగుటకు నేర్పుగల ఇంజనీరింగును, యంత్రములచేత పొలమును దున్నించుటయును కావలెను. పాపము! బీదరైతులు దినమంతయు పొలములో అమితకష్టపడుదురు. నీటిపారుదల భూమికి చాలినంత లేదు. సరిగా పోషించినచో చక్కగా ఫలించు సారవంతమైన హిందూదేశపుభూములు, ఎక్కువ జనాభాగల యీ ఖండమునకు తగినంత—యీ ఒక్కఖండమేకాదు. ప్రపంచమునకు తగినంత— పంటనిచ్చుటకు సమర్థమైనవి. జపానులో ప్రతిఅంగుళపునేలయు చక్కగా నుపయోగింపబడుచున్నది. ఒకప్పుడు మాకును మంచిభూమిలేదు. మంచినీటిసప్లయిలేదు. మంచినీటి పారుదల పద్ధతిలేదు. ఈ కష్టములన్నియు మా కృషివలన తొలగించబడినవి. ఇప్పుడు జపానులో 'వర్టికల్ అగ్రికల్చర్' (Vertical Agriculture) అను పద్ధతితో భూమియొక్క నిమ్నోన్నతముల ననుసరించి పైరును నాటుచు చక్కనిపంట పండించుచున్నాము.'

అస్పృశ్యతనుగూర్చి ఆమె యిట్లు చెప్పుచున్నది. 'అస్పృశ్యతను గూర్చి మేము యెక్కువగా వినుచున్నాము. పశుపక్ష్యాదులపై నెంతో దయగల హిందువులు తమలోని మనుష్యులపై సమానభావము నేల చూపరు! జపానులో కూడ ప్రభుస్వామిక పద్ధతి అమలులో నున్నప్పుడు కులభేదములుండెడివి. ప్రభువులు, యోద్ధలు, రైతులు, వర్తకులు, కడపటఅస్పృశ్యులు— ఈవిధముగ. కాని యీగర్హ్యమగు కట్టుబాట్లను నిర్బంధవిద్యావిధానమువలనను, అన్యోన్య సహాయపద్ధతివలనను పోగొట్టుకొనగల్గితిమి'

బెంగాలీ, ఆంగ్లేయమాసపత్రికలలో నవీనజాతి నిర్మాణమున జపాను అవలంబించిన విధానమునుగూర్చి యెన్నియోసారులు పొగడినను, ఆవిధానముల ననుసరించి భారతజాతిని పునరుద్ధరించుటకు మనము ప్రయత్నించియుండలేదు. రాజకీయ నూతనసంస్కరణ మనచేతిలోనిపని కాకపోవచ్చును కాని సాంఘికసంస్కరణల విషయ మట్లుకాదే! అట్టియెడ హైందవప్రజాసమూహము హిందూసంఘసంస్కరణయెడ విముఖులుగాకున్నను అంటియునంటనట్లున్నట్లు దోచదా?

నిర్బంధోచిత విద్యావిధానమువలని ఫలితమును గూర్చి ఆమె యిట్లు చెప్పుచున్నది:—

"నిర్బంధోచిత విద్యావిధానమువలన జపానులో ౯౯% ప్రజలు నేడు విద్యావంతులై యున్నారు. ప్రతి

స్త్రీయును వార్తాపత్రికలను, సంచికలను చదువగలదు. దేశీయసంఘీభావమును వృద్ధిపరచుటకును, సంఘనైతికోద్ధరణమునకును యిది మూలాధారము. దేశములో సంఘీభావము బాగుగా నున్నపుడే దేశభక్తిమాపుటకు అవను."

ఈకారణమువలననే బ్రిటిషు రాజ్యాంగ ప్రముఖులును, వారిహైందవోద్యోగులును — వారేపదవులలలో నున్నను, హిందూదేశమున సార్వజనిక నిర్బంధోచిత విద్యావిధానమునకు సమ్మతించకపోయిరి.

భారతీయాభివృద్ధికి సార్వజనిక విద్యావిధానమే పరమావధియని చాలకాలమునుండి వాదించబడుచున్నది. సార్వజనికవిద్యయొక్క ముఖ్యావసరమునుగూర్చి మిక్కిలిగ జపానుసోదరీమణి చెప్పినందులకు సంతోషము.

"హిందూదేశమున నేను టాగూరు, గాంధి, సరోజినీ దేవి మొదలగు దేశీయ నాయకులను కలసికొనినప్పుడు వారు, తిండిలేక మలమల మాడుచున్నట్టియు, నిరక్షరకుక్షులైనట్టియు కోటానుకోట్ల భారతీయులను అభివృద్ధికి తెచ్చుటకు చాల కష్టపడి పనిచేయుచుండిరని నేను కనుగొంటిని. విద్య, చదువుట, వ్రాయుట, ముఖ్యముగా ఆలోచించుట లేనిచో యీజనుల నుద్ధరించుటకు చేయుప్రయత్నము బూడిదలో పోయు పన్నీరువంటిది.

నాయకప్రముఖులని నొక్కిచెప్పుచు, అగత్యమగు విద్యావిధానమును గూర్చి మాట్లాడుచు, కాంగ్రెసునాయకులతో టాగూరు మహాశయుని కలుపుటలో మన జపాను సోదరీమణి యభిప్రాయము సరికాదు. కాంగ్రెసునాయకులలో కొందరు నిర్బంధ విద్యావిధానముపెడ సదభిప్రాయమునే కలిగియున్నను కాంగ్రెసు ౧౯౨౦ సం. ము నుండియును నిర్బంధ విద్యావిధానమునకు తగినంత ప్రాముఖ్యము నిచ్చియుండలేదు. డా. రవీంద్రనాథ టాగూరు అట్లుగాక విద్యకు గల విలువను గుర్తించినాడు. మరియు తన యభిప్రాయములను దాచక వెలిబుచ్చినాడు. ఇటీవల కలకత్తాలో జరిగిన 'విద్యావారము' సందర్భమున తానిచ్చిన ఉపన్యాసములో 'మన ప్రజల మనఃకాయము సుష్కింపజేయుట అవమానకరము' అని చెప్పియున్నాడు.

'చక్రవర్తి'

# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి, ఏ., బి. యల్.,

ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోపయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంతవిధానము, బాఘ్‌విహారగుహలందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములశైలి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ-ఏకవర్ణచిత్రములు నల్గువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్ర కళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము.

వెల. రు. ౧-౧-౦.

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల, నెం. ౭, తంబుచెట్టివీధి, మదరాసు.



# ఆంధ్రాభ్యుదయము

తేజోమూర్తుల కేశవరావుగారు



ఏప్రెల్ సంచికయందు ప్రకటింపబడిన 'పల్లెటూరి సంసారము,' అనుకఱ్ఱపైన చెక్కబడిన వీరి చిత్రమునకు చెన్నపురి లలితకళాసంఘమువారి చిత్రప్రదర్శనము (1936)న మొదటి బహుమతి లభించినది. ఈ సంచికయందును అట్టిచిత్ర మొకటి 'తిరుచునాపల్లి కొండ' అనునది కలదు. వీరు కఱ్ఱపైన చిత్రములను సుందరముగ చెక్కుటయందు మంచి నేర్పు గలవారు.

వెల్లాల శేషగిరిశాస్త్రిగారు



వీరు పి. హెచ్. డి. పరీక్షకు చదువుటకు లండనుపోయిరి.

# శ్రీయుత వారణాసి కృష్ణమూర్తి గారు,

## ఎం. ఏ., (ఆనర్సు) బి. కాం.




వీరు బొంబాయి విశ్వవిద్యాలయమున బి. కామ్ పరీక్షయందు ఉత్తమతరగతియందు ఉత్తీర్ణులయి, మంగళదాసు హరివల్లభదాసు వాణిజ్య బహుమతిని బడసిన ప్రథమ ఆంధ్రులు. ప్రస్తుతము బొంబాయి సెంట్రల్ బ్యాంకునందు ఆఫీసరుగా పనిచేయుచున్నారు. వీరు బొంబాయి ఆంధ్రయువజన సంఘస్థాపకులును, కార్యదర్శులును అయి బొంబాయి ఆంధ్రమహాసభకు ఈ సంవత్సరపు కార్యదర్శిగా ఎన్నుకొనబడిరి.

సోమయాజి.

---



# ఆంధ్రాభ్యుదయము

తేజోమూర్తుల కేశవరావుగారు



ఏప్రెల్ సంచికయందు ప్రకటింపబడిన 'పల్లెటూరి సంసారము,' అనుకఱ్ఱపైన చెక్కబడిన వీరి చిత్రమునకు చెన్నపురి లలితకళాసంఘమువారి చిత్రప్రదర్శనము (1936)న మొదటి బహుమతి లభించినది. ఈ సంచికయందును అట్టిచిత్ర మొకటి 'తిరుచునాపల్లి కొండ' అనునది కలదు. వీరు కఱ్ఱపైన చిత్రములను సుందరముగ చెక్కుటయందు మంచి నేర్పు గలవారు.

---

వెల్లాల శేషగిరిశాస్త్రిగారు



వీరు పి హెచ్. డి. పరీక్షకు చదువుటకు లండనుపోయిరి.

---

# శ్రీయుత వారణాసి కృష్ణమూర్తి గారు,

## ఎం. ఏ., (ఆనర్సు) బి. కాం.




వీరు బొంబాయి విశ్వవిద్యాలయమున బి. కామ్. పరీక్షయందు ఉత్తమతరగతియందు ఉత్తీర్ణులయి, మంగళదాసు హరివల్లభదాసు వాణిజ్య బహుమతిని బడసిన ప్రథమ ఆంధ్రులు. ప్రస్తుతము బొంబాయి సెంట్రల్ బ్యాంకునందు ఆఫీసరుగా పనిచేయుచున్నారు. వీరు బొంబాయి ఆంధ్రయువజన సంఘస్థాపకులును, కార్యదర్శులును అయి బొంబాయి ఆంధ్రమహాసభకు ఈ సంవత్సరపు కార్యదర్శిగా ఎన్నుకొనబడిరి.

సోమయాజి.




## ఆంధ్రపత్రిక ధాతసంవత్సరాది సంచిక

డెమ్మీ ౧/౮ సైజు. ౫౬౦ పుటలు. సచిత్రము వెల ఆంధ్రపత్రిక, భారతి చందాదారులకు రు. ౧ ఇతరులకు రు. ౨. పోస్టేజివేరు. ప్రకాశకులు "ఆంధ్రపత్రికా" కార్యాలయమువారు, ౭. తంబుసెట్టివీధి, మదరాసు.

ప్రతిసంవత్సరము వెలువడు సంచికలవలెనే ఈ ధాతసంవత్సరాదిసంచికయూ వివిధములగు చిత్రములతోను, గద్య, పద్య వ్యాసములతోను ముచ్చటగ కూర్పబడి ఆకర్షకముగనున్నది. ఇందు ౧౨ త్రివర్ణచిత్రములును, రమారమి ౩౦౦ ఏకవర్ణ, వ్యంగ్య, ఛాయా చిత్రములును కలవు. ఈ చిత్రములు చాలవరకును వివిధసంస్థలకును, ప్రకృతిరామణీయకతకును, పేరుపడిన పెద్దలకును సంబంధించినవి. వ్యాసములు రాజకీయ, మత, సారస్వత, సాంఘిక, చరిత్ర, శాస్త్రసంబద్ధములయి తమ ప్రత్యేకతను నిలుపుకొని క్రొత్తవిషయములను దేశమున కెరుకపరుపజాలియున్నవి.

ఆంధ్రపత్రిక పుట్టినదాది నేటివఱకు సంవత్సరాదిసంచికాప్రకటన మవిచ్ఛిన్నముగ కొనసాగుచున్నది. ఈ సంచికతో ఇరువదియేడు సంచికలు వెలువడినవి. ఆంధ్రరాష్ట్రమున అన్నివిషయములందు సంస్కరణాభిలాషను మొలకలెత్తించి, మొగ్గతొడిగించి, పుష్పింపజేసి, ఫలోన్ముఖమునకు తెచ్చుటకు సంచికాసంపాదకులు చేయు ప్రయత్నములు అమూల్యములు. మనభారతదేశమునందు ఏ దేశభాషయందును ఇంతవరకు ఇట్టి సంచికాప్రకటనము జరుగుటలేదు. ఆ గౌరవము ఆంధ్రదేశమునకే దక్కుచున్నది.

మితిలేని వ్యయ, ప్రయాసములకోర్చి దేశాభ్యుదయమునకై సర్వవిధముల పాటుపడు ఆంధ్రపత్రికాధిపతులు, తత్సంపాదకులు నగు విశ్వదాత, దేశోద్ధారక శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి ప్రయత్నము అత్యంతము ప్రశంసాపాత్రము. బా. వేం. ర.

---

## శ్రీమదాంధ్ర మహాభారతము

తెనుగున అచ్చు తలపడినతరువాత భారతాది బృహద్గ్రంథములు తొలుతతొలుత పలుచని సీమకాగితములపైని, చేటపెద్దవైన అచ్చుపడుచుండెడివి. గద్యపద్యములును మొదలు, కొసలు తెలియక కాగితములపయి రాసిపోసినట్లుండెడివి. అప్పటి ఆర్థికస్థితికి వానివెల అయినను అంతతక్కువ అని చెప్పవలను గాకుండెడిది. విషయగౌరవమును, ప్రమాణమును, వెలను బట్టి వానికి పెద్దపుస్తకములు అనుపేరును సార్థకముగ నేర్పడినది. నానాటికి అన్నిటను నాజూకు ముదురుకొలదిని, కాగితములు, సైజు, అచ్చుతీరు మారి అందచందములతో నొప్పునట్లు వాని ప్రతులు తయారగుచువచ్చినవి. అందుకు దగినట్లు వానివెలకూడ పెరిగిపోయినది. రానురాను వానివెల వానిని చదువనభిలాషపడు బీదవారి కందుకోజాలనంత ఉన్నతిని పొందినది. ప్రజలకు వానిపయి మోజు ఎక్కువ. అవి పెద్ద'పుస్తకములు.' వానిని చదువనివాడు అసలే చదువనివాడు ప్రజల దృష్టిలో. చాలమంది వానిని కొనజాలక నిరాశను జెందుచున్నారు. అట్టిస్థితిలో వారికా 'పెద్దపుస్తకములను' తక్కువవెలకు లభించునట్లుచేయుట మిక్కిలి ఘనమగు విషయము కాకతప్పదు.

ప్రకృతము- ఆంధ్రమహాభారతమున ఆదిపంచకము (ఆది, సభా, అరణ్య, విరాటోద్యోగపర్వములు అయిదు)ను శ్రీకృష్ణసేవాలయమువారు, స్ట్రొటన్ ముత్తియాముదలివీధి, మదరాసు. ముద్రించి 'అశేషజనసాధ్యమగు విలువను' (రు. ౨-౮-౦) ఏర్పరిచి ప్రకటించినారు. రాయల్ ౧౫ సైజున గ్రంథమును అచ్చుకూ

ర్పించి, ఫారములు కట్టించి వానికి దిమ్మలు తయారు చేయించి ఆ దిమ్మలతో గ్రంథము నచ్చొత్తించుటచే గ్రంథము నల్పమూల్యమున కమ్ముటకు వారికి సాధ్యమైనది. దిమ్మల అచ్చు అయినను గ్రంథముసైజు అందముగను, అక్షరములు స్పష్టముగను సంపుటము చూడ ముచ్చటగా నున్నది. ఎక్కడనో తప్ప తప్పులు నంతగా లేవు. పాఠాంతరముల బాధయు లేదు. ఇట్లే మిగిలిన పర్వములన్నియు రెండవసంపుటమున ప్రకటితము కానున్నవట.

గ్రంథములు ఎంతతక్కువ వెలకు లభించిన విద్యావ్యాప్తి అంత ఎక్కువ అగుటకు అవకాశము కలుగును. ఇట్టి అవకాశము నాంధ్రులకు కలిగించు తలపుతో గ్రంథప్రకటనకార్యమును తలపెట్టిన ప్రకాశకు లాంధ్రుల కృతజ్ఞతకు మిక్కిలి పాత్రులు. వీరిట్లే క్రమముగా అధికమూల్యమునకుగాని లభింపని ఆంధ్రగ్రంథముల నన్నిటిని ముద్రించి ప్రకటించి అల్పమూల్యమునకు లభింపజేసి ఆంధ్రులకృతజ్ఞతకు ఇంకను ఎక్కువ పాత్రులు కాదగుదురు.

---

## దివాంధము

గద్యపద్యాత్మకము. ఖండకావ్యము. గ్రంథకర్త: పంతిము ఆంజనేయకవి. క్రౌను ౧/౮ సైజు. ౨౫ పుటలు. వెల అయిదణాలు. దొరకుచోటు తెలియదు.

గూబ యొకటి నెమిలితో చెలిమిచేసి దాని నాట్యమును, కవనమును మెచ్చి యితర ఖగములు గౌరవించగా చూచి సహింపలేకపోవుట, యితరులతో నెమలిపయి కొండెములు చెప్పుట, తన యత్నములు వమ్మగుట యిందు వర్ణితములు. దివాంధముదుశ్చేష్టితము లిందు చిత్రింపబడినవి. ఇది ప్రథమ ప్రకరణ కథాసంక్షేపము.

ఈకవి యన్యాపదేశముగ ఒక దుశ్చరిత్రుని స్వభావమును చిత్రించెను. రచన సాఫుగ సాగినది. సరికాని ప్రయోగము లందందు కలవు. కథాకల్పన నాతిహృదయంగమము. తక్కిన భాగములలో అది సవరింపబడవచ్చును. ఆంధ్రమున ఇట్టిమాదిరి కావ్యములు తక్కువ. ఆంధ్రు లిట్టివానికి స్వాగతమిచ్చుట యుచితము. దీని వెల తగ్గించుట లెస్స.

బు. వేం. ర.

## ఆంధ్రపుష్పబాణ విలాసము

శ్రీవేంకటరమణ గ్రంథమాల ద్వితీయ పుష్పము. సంస్కృత మూల సహితము. అనువాదకుడు శ్రీ దేవగుప్తాపు వేంకటరమణకవి, కరణము, వెంపడాము; పూసపాటిరేగ పోస్టు. నెల్లిమర్ల దరి. విశాఖపట్టణము జిల్లా. క్రౌను ౬ + ౬ పుటలు. మూల్యము మూడణాలు. కావలసినవారు గ్రంథకర్తకు వ్రాయవలెను.

సంస్కృతమునగల 'పుష్పబాణ విలాసము' నకిది తెలుగుసేత. 'శ్రీ వేంకట పండితరాయ సార్వభౌముని శృంగారచంద్రికా వ్యాఖ్య ననుసరించి యిందు మూలమునకు వన్నెపూర్పబడినది. మూలాభిప్రాయము చెడిపోకుండ అనువాద మతిజాగరూకతతో ఒనరింపబడినది. కాని మూలమునందలి వర్తమానకాలపు క్రియ లిందు భూతకాలపు క్రియలుగ మార్పబడుట స్వారస్యమునకు కొంత కొరత కలిగించునేమో! ఆంధ్రు లాదరించతగిన పుస్తక మిది. వెలమాత్ర మధికమనియే చెప్పవలసివచ్చుచున్నది.

బు. ర.

## కావ్యావళి

గ్రంథకర్త్రి: సోమరాజు ఇందుమతీదేవి- కావ్యత్రయ సంపుటి. ౧౦౩ పుటలు. చక్కని అచ్చుకూరుపు. మేలురకపు కాగితము. వెల నాలుగు అణాల తపాలబిళ్లలు. వలయువారు 'కొండపల్లి గోపాలరావు దేశముఖ్' అని కట్టెపల్లి, భద్రాచలంరోడ్డు, రైల్వేస్టేషన్ N.S.R. అను చిరునామాకుగాని,'యువకవి సమితి,కలువపాముల, కృష్ణాజిల్లా' అను చిరునామాకుగాని వ్రాయవలెను.

ఇందలి కావ్యములు మూడు. మొదటిది పతిభక్తి, రెండవది శ్రీ రంగనాథస్తుతి, మూడవది వేణుగోపాలశతకము.

గీతములలో రచింపబడిన "పతిభక్తి"లో కవయిత్రి వ్యద్గతాభిప్రాయములు సువ్యక్తములయి ఆమె పతిభక్తిని. రచనాశిల్పచాతుర్యమును చాటుచున్నవి. ద్విపదలో రచింపబడిన 'రంగనాథస్తుతి' యందును, సీసములతో కూర్పబడిన "వేణుగోపాలశతకము"నందును భగవద్విలాసములు ప్రస్ఫుటములు అవి కవయిత్రికిగల భక్త్యతిశయమును చాటజాలియున్నవి.

శ్రీమంతులలో పుట్టిపెరిగి శ్రీమంతుని చేపట్టిన ఈ కవయిత్రి అతిసుకుమారహృదయ, శక్తిసన్నిత ము. గ్రంథరచనకు తీసికొనినఛందస్సు దుష్కరనియమబద్ధములగు వృత్తములు కాక సుకుమారములగు సీస, గీత, ద్విపదలు. ఉద్దిష్టవస్తువులగు పతిభక్తి, దైవభక్తి అతిసుకుమారములు; అమూల్యములు. అవియే ఉత్తమస్త్రీలు ఏరుకొనదగినవి.

ఈ "కావ్యావళి"యందు రచన చక్కగ సాగినది. పదములు సుకుమారములు; భావగర్భితములు కొన్నియెడల శిల్పచాతుర్యము కొఱవడినను భక్తిమాత్రమంతటను పరిపుష్టమయినది. ఇందు౦దు కొలది సెరసులున్నను అవి రసభంజకములు కామింజేసి ఒక లెక్కలోనివి కాజాలవు.

దైవ, పతిభక్తులలో ఇందు పతిభక్తికే ప్రాముఖ్యము ఈయబడినది. అది ఎంతయు ఉచితము. ఆడుదానికి పతికంటె వేరు దైవము లేదు. మతములసంగతి ఎటులున్నను భక్తిభావము పరిణతి పొందినపుడు భగవంతుడు భర్తగను, భక్తులు భార్యలుగను మారిపోవుట సహజము. గీతాంజలి మొదలగు గ్రంథము లీవిషయమునే ప్రతిపాదించుచున్నవి. పయిసంబంధము లౌకికసంబంధముకంటె విలక్షణము. దానికి విషయసుఖములతో నెట్టి సంబంధము లేదు. మహాభక్తులు చాలమంది ఈ మార్గమునే అనుసరించిరి. ఈ గ్రంథకర్త్రి భక్తిలో పరిణతిని పొందినను మీదిభావమును అతిక్రమించి భగవంతుడు తండ్రిగను, తాను పుత్రికగను వర్ణించుకొనినది. ఈ వర్ణనమునకు ఆమెకుగల పతిభక్తియే కారణము. కాని యామె భక్త్యావేశమున పరవశురాలయినపుడు సంప్రదాయసిద్ధమగు సంబంధమునే అనుసరించి పతికి, భగవంతునికి అభేదమును వర్ణించినది. కొన్నియెడల భగవంతుని పతిగనే పేర్కొనినది. మానవసహజము. అతిక్రమింపరానిది.

మనలో కవయిత్రులగు మహిళామణులు తక్కువ. అందు ఆదర్శగ్రంథములను వ్రాసి దేశోపకారమొనరించువారు మరియు తక్కువ. శ్రీ ఇందుమతీదేవిగారు కట్టుదిట్టముగ గీర్వాణాంధ్రముల నభ్యసించి, కవిత నలవరచుకొని యిట్టి యుత్తమ గ్రంథమును వ్రాయుట మహిళాలోకమునకు మహోపకారము! మార్గదర్శకము. ఈమె యిట్టులే ఉత్తమగ్రంథములను రచించి ఆంధ్రులమన్ననలకు పాత్రురాలగుచు భాషాసేవ నొనరించుగాక!

నేం ర.

## తెనుఁగు—తోఁబుట్టువులు

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి ప్రణీతము కవితాసమితి గ్రంథావళి ౬-వ ప్రచురణము. క్రౌను ౧/౮ సైజు ౧౩౦ పుటలు. మేలుకాగితము, చక్కని అచ్చు- వెల ఎనిమిది అణాలు. వలయువారు 'కవితా సమితి, విశాఖపట్టణము' అను చిరునామాకు వ్రాయవలెను.

మన తెలుగుభాష సంస్కృతి జన్యమని కొందరును, ప్రాకృతజన్యమని కొందరును తలచుచున్నారు. తెనుగు ద్రావిడభాషాకుటుంబమునకు చెందినదికాని సంస్కృతజన్యముకాని, ప్రాకృతజన్యముకాని కాజాలదనియు, తమిళము, కన్నడము, మలయాళము మొదలగునవి తెనుగుతోబుట్టువులనియు ఈ గ్రంథమున వివరింపబడినది. చాలమంది భాషాతత్త్వశాస్త్రజ్ఞులు ఈ మతమునే ఆమోదించుచున్నారు. శ్రీ రామచంద్రశాస్త్రిగారు తమవాదమునకు తగిన ప్రమాణముల నొసగియున్నారు. ద్రావిడభాష లన్నింటియొక్క స్వరూపము సోదాహరణముగ, సవిశేషముగ ఇందు ఈయబడియున్నది. శ్రీ శాస్త్రిగారు సంస్కృతాంధ్రాంగ్లభాషలయందు పండితులగుటచే బహుగ్రంథపరిశోధనమొనర్చి తమ సిద్ధాంతమునకు స్థిరతను కూర్చినారు.

ఇందు రచన సరళము. చాలవరకు దేశ్యపదములతోడనే కూరుపు సాగినది. విషయ వివేచనము చాల స్పష్టముగ ఉన్నది.

“తెనుగు-తోబుట్టువులు” అను నీ విషయము ఇదివరకు ౧౯౩౭ సం. న “వైశాఖి”యందు (ఆంగీరస సం. కవితాసమితి వార్షికసంచికయందు) వ్యాసరూపమున ప్రకటింపబడినది. పెక్కురు పండితవర్యుల మెప్పును గనినది. ఇట్టిది గ్రంథరూపముగ వెలువడుట అవశ్యకమగుటచేతనే యిప్పుడు ఆరూపమును తాల్చినది

ఇది ఆంధ్రులందరు ఆదరింపదగిన గ్రంథము. విశ్వకళాపరిషత్తువారు దీని ప్రాశస్త్యమును గుర్తించి విద్వత్పరీక్షకు, బి. ఏ. పరీక్షకు అవశ్యపఠనీయముగ నిర్ణయించుట ఉచితము.

బు. వేం. ర.

---

# మహాత్ముని ఆంధ్రదేశ సంచారము

సచిత్రము. క్రౌను సైజు, ౯౨ పుటలు. చక్కని అచ్చు. మేలు కాగితములు. వెల ౯ అణాలు. ప్రకాశకులు “ఆంధ్రగ్రంథమాల, ౭, తంబుసెట్టివీధి, మదరాసు.” వలయువారు ప్రకాశకులకుగాని, ఏలూరులోని “ఆంధ్రరాష్ట్ర హరిజనసేవకసంఘము” వారికిగాని వ్రాయవలెను.

“హరిజనోద్యమ సందర్భమున జరిగిన ఆంధ్రరాష్ట్ర ప్రస్థానమునకు పూర్వము గాంధిమహాత్ముడు ఆంధ్రదేశమునకు నాలుగుసారులు విచ్చేసిరి.” మొత్తముపై మూడుసారులు ఆంధ్ర సంచారము చేసిరి. మొదటిది బెజవాడలో జరిగిన అఖిలభారతకాంగ్రెసుసంఘమువారి మహాసభకు విచ్చేసినపుడు జరిగినది. రెండవ సంచారము ఖాదీనిధిని ప్రోగుచేయుటకు ఉద్దేశింపబడినది. చివరిది హరిజనోద్యమ ప్రచారమునకు, హరిజననిధి సంపాదనకును ఏరుపడినది. పయి సంచారత్రయమునందును గాంధిమహాత్ముడాంధ్రుల కొసరించిన హితబోధలు, నిధివసూళ్లు, సంప్రతింపులు, సంచరించిన భాగములు, పడిన కష్టములు, అనుభవించిన ఆనందము, తృప్తి మొదలగు సంగతులు సందర్భోచితములగు చిత్రములతో వివరింపబడినవి.

ఒకప్పుడు కొందరు ఆంధ్రేతరులు మహాత్మునికి ఆంధ్రులపయి దురభిప్రాయము కలుగజేయ ప్రయత్నించిరి. అందలి యథార్థమును తెలిసికొనుటకు మహాత్మునకు కుతూహలము ఉండెనది. పయి మూడుసంచారములలోను, పదునయిదేండ్ల కాలములో ఆంధ్రదేశమున గాంధీయోద్యమములపట్ల ప్రజలకు కలిగిన భక్తివిశ్వాసములను బాగుగ మహాత్ముడు గుర్తించినాడు. గుర్తించి చాల ఆనందించినాడు. దక్షిణ హిందూస్థానమున ఆంధ్రదేశమే దేశీయోద్యమములం దెన్నికగన్నదని ప్రశంసించినాడు. పయివిషయము లన్నియు సులభశైలిలో చక్కగ ఈ గ్రంథమున వివరింపబడినవి. ఇప్పటికాలమున దేశీయోద్యమములపట్ల ఆంధ్రదేశముయొక్క స్థితిగతులను ఎరుగుటకు ఇది ముఖ్యమగు ఆధారగ్రంథము. ఇందలి ‘మహాత్మాగాంధీ జీవితచరిత్ర, ఆంధ్రదేశముపై ఇతరుల అభిప్రాయములు’ గ్రంథమునకు వన్నె కూర్చుచున్నవి. ఆంధ్రులెల్లరు చదువవలసిన గ్రంథ మిది.

బు. వేం. ర.

## పంచవటి

రచయిత: శ్రీ శ్రీనివాస శిరోమణి.

ప్రకాశకులు: ది ఓరియంటల్ బుక్ డిపో.

1/10 స్ప్రింగరు వీథి, మదరాసు, వెల 0—6—0

చిన్న చిన్న కథలు వ్రాయడము చాల కష్టమనిన సంగతి సర్వజన విదితమే. తెలుగులో చక్కని చిన్న కథలు యింకను నిజరూపమును దాల్పలేదు. చాలమంది పాశ్చాత్య కథల కనువాదములను, అనుకరణములను చేయుచున్నారుకాని, వానికి స్వతంత్ర రచనలకుండు లాలిత్యముండుటలేదు. ఉండుటకును వీలుకనపడదు.

స్వతంత్ర రచనల పదిపదునైదు సంవత్సరముల నుండి చిన్న కథలను వెలువరించుచూవున్న శ్రీ శ్రీనివాసశిరోమణి ఆంధ్రలోకమునకు పరిచితుడే. చిన్నకథలను, పాత్రలను కనులయెదుట సాక్షాత్కరింపజేసి, సంఘటనలను మనసునకు నచ్చునట్లు వ్రాయగల కొద్ది

మంది; ఆంధ్ర కథకులలో శ్రీనివాసశిరోమణికి చక్కని స్థానమున్నది

పంచవటి అను చిన్నకథల సంపుటి. ౧౨౨ పేజీలు, ముద్దుల నొలికించు రూపములో, అందరి అందుబాటులోనూ వుంచబడలుగ, పంచవటిని ప్రకటించిన ప్రకాశకులు కథావాఙ్మయమునకు గొప్ప యుపకారమునే చేసిరి. పంచవటిలోని కథలు ప్రతిఫలం, ఏకాకినీ, శృంగభంగము, దారద్వయము, ప్రేమలేఖ అనునవి. శృంగభంగం, ఏకాకినీ, దారద్వయం, ప్రతిఫలం, ప్రేమలేఖ అనే వరుసలో తారతమ్యమును చెప్పవచ్చును. మొదటి నాలుగుకథలును, హిందూ వివాహ సాంప్రదాయము ఆనుని పరిస్థితులలో ఫలప్రాయము కాకపోవుటకుగల కారణములను తెల్పుటకు వ్రాసినవి కావచ్చును. అయిదవకథ 'స్వేచ్ఛాప్రేమ' ప్రచారకులను మనసులోనిడికొని వ్రాసినదైయుండును.

కథలయిదును, సుమారు ఏడెనిమిదేండ్లకు పూర్వము వ్రాసినవి మొదటి నాలుగుకథలును వివాహానంతర జీవితంలో, భార్యాభర్తలు ఒకనొకరు పూర్తిగా అర్థముచేసుకొనుటకు వీలులేక, చేసుకోలేక, ఒకరియెడ నింకొకరు గావించుకొను అపరాధములను తెలియజేయుచున్నవి.

## ప్ర తి ఫ ల ం

సహజముగా, అత్తవారు, పరిచయములేనిభర్త-వీరియెడ స్త్రీలకుండు స్వభావము సీతది. భార్య తన మాట వినలేదనీ, (కాపురమునకు రాకపోయినను) పురాణయుగములోని స్త్రీలవలె తన నత్యంత భక్త్యనురాగములతో పూజించుటలేదనీ, ఆమెను అపార్థముచేసికొనినాడు మోహనరావు. వారి వివాహబంధము విచ్ఛిన్నమైపోయినది. ప్రపంచజ్ఞానమైనను పూర్తిగరాని కోడండ్లను తమయింటికి తమయిష్టప్రకారము వెంటనే పంపివేయలేదని కుమారులకు రెండవపెండ్లి చేసిన మాతాపితరులు ఆంధ్రులలో చాలవోట్ల నున్నారు. ఆ విషయమే యిచ్చట చూపబడినది. తీవ్రసంస్కారాభిలాషి యగు వాసుదేవరావు ఉద్రేక త్యాగముల పూర్తిగా చిత్రింపబడినాడు.

## ఏ కా కి నీ

కథావస్తువు మునటికథావస్తువే. కాని యీ కథలో దానికి వేరురూప మియ్యబడినది. నాగేశ్వరరావు సాత్త్వికమూర్తి. సీతమ్మ నిష్కామయోగిని పితా, భర్తలపై ఆమెకు సమానప్రేమ. కాని, ఆ ప్రేమను ప్రదర్శించుటలో ఆమె కృతకృత్య కాలేకపోయినది. భర్తను లోబరుచుకొని, తండ్రికి తాను లోబడియుండ గోరినది. తండ్రి అవ్యక్తుడు. కుమార్తెకు బోధించి కాపురమును నిలువబెట్టు టాతనికి చేతగాకపోయినది. కాపురము ధ్వంసమయినది.

## శృ ం గ భ ం గ ము

ఇది స్త్రీహృదయమును చక్కగా వ్యక్తపరుచుచున్నది. భర్తతో సంపర్కమునకు పూర్వము అతని యోగ్యత, అయోగ్యతలను తెలిసికొనజాలని యౌవనవతులు నిమిషమాత్రములో వారికి దలియుకొ కామం తప్పవారి త్రొక్కుట, తరువాత తామొనర్చిన దోషమును గుర్తించి, తమ నడవడి దిద్దుకొనుట యీ కథలోని ముఖ్యవస్తువు లలితది యిదే ప్రవర్తన. సుందరరావు భార్యకీయవలసిన పవిత్రస్థానమూ, ఆదరణా ఆమెకిచ్చినాడు. లలిత తాను, వారిరువురి పరిచయమునకు పూర్వముచేసిన దోషమునకు పరితపించి, నడతదిద్దుకొని సుందరరావిచ్చిన స్థానమును సఫలీకృతముచేసినది గోపాలరావు మోహమువదలక హాయిగా కాపురముచేసుకొను చున్న లలితవద్దకు పోవుటలో సామాన్యముగా కాముకులుచేయు పొరపాటునే చేసినాడు. పశ్చాత్తప్తయగు లలిత యతనికి సరియగు పాఠమును చెప్పినది.

## దా ర ద్వ య ం

వెంకటేశ్వరరావు రాజ్యలక్ష్మిరూపమునుకూడ మరచిపోయినాడు; పెళ్ళినాడుతప్ప మరిచూడలేదు. అందువలననే నవయౌవనవతియగు సత్యభామ అతనినాకర్షించినది. బ్రహ్మసమాజమువారికి పొత్తుగలిపినది. రాజ్యలక్ష్మికి వెంకటేశ్వరరావు దైవము. శివరావు

సమహూర్చిన రాజ్యలక్ష్మీవెంకటేశ్వరరావుల పునస్సంధానము చాల వినోదకరము; పరిస్థితి కనుకూలము.

## ప్రేమ ఖ

రాముడు స్వేచ్ఛాప్రేమ ప్రచారకుడు. సామ్యవాది. కమలమ్మ ఆదర్శగృహిణి. కమలమ్మ భర్త స్వాతంత్ర్యప్రియుడు. కమలకు అర్ధస్థానము నిచ్చినాడు. రాముని వివాహసమస్య కమలకును, ఆమె భర్తకును తీరనిదై పోయినది. కాని రాముని దృష్టి వేరు. అతనికి నీతిగర్భములో కమల చాల తెలివిగ వ్యవహరించి

శైలి వ్యావహారికము. అనవసరపు సంగతులు లేకుండ, మామూలుగ వ్యక్తి సంభాషణ కవసర మను నట్లు విరుపులు సంధులుచేయుటలో శ్రీనివాస శిరోమణి అందెవేసిన చేయి.

కథావిధానం (Technique), సంభాషణ, అవసరమైనప్పుడు వ్రాయుచు, తక్కినచోట్ల తానే చెప్పకొనిపోవుటలోని నేర్పు శ్రీనివాస శిరోమణికి హస్తగతము. కొన్నిచోట్ల సంభాషణ విసువు పుట్టించినను సందర్భము నూహించుకొనినచో సది అవసర మనిపించును. మొత్తముమీద కథలన్నియును మనోహరముగా నున్నవి. అయిదుకథలును పూర్వము సఖి, వినోదిని, భారతి లలో ప్రకటింపబడినవే. నూతన కథారచయితలకు కథావిధానము (Technique)ను తెలియజేయుటకు పుస్తకము చాలాఉపకరించగలదు. క. స.

## చతుర్థి

గ్రంథకర్త. శ్రీ ఇలింద్రరంగనాయకులు ఎమ్. ఏ.

ప్రకాశకులు: — సాహిత్యలత సంపాదకుడు కర్లపాలెం కృష్ణారావు. వెల తెలియదు.

ఇది నాలుగు చిన్నకథల సంపుటి. 'చతుర్థి'కిమూలము హిందీయని సంపాదకీయమే చెప్పుచున్నది. భావ గ్రాంథికము. 'కాలమునననుసరించి భావము మారుచున్నది.' అనుసంపాదకీయము గ్రంథములోని భాషావిషయమై వర్తించదు.

కథలు:- విషాదప్రేమ, ఉన్మాదిని, దేశభక్తుడు, తాయి.

ఉన్మాదిని, తాయి, దేశభక్తుడు, విషాదప్రేమ అనువరుసలో ప్రకటించిన కథలతారతమ్యము సరిపోయెడిది. కథలన్నియు భావోద్దీపకములే. శైలి వ్యావహారికమైయుండిన కథలలోని తత్త్వము మరింతరసవంతముగ నుండెడిది.

ప్రతికథలోనను వివిధమున తత్త్వములు నేర్పుగానే చెప్పబడినవి. కథలు హిందీమూలములయినను పాత్రలను తెలుగింపజేయు సానుకూలముగా నామములతో వ్రాయు నంతియవసరముగా తోచుటలేదు. కథావస్తువులను సంఘటన లాంధ్రదేశమునగూడ లేకపోలేదు. ప్రతికథయును పాఠకునికి ఆలోచనను కలుగజేయుననుటవు సందేహములేదు. క. స.

## త్రుటి

క్రౌను ౧/౮ సైజు పు. ౧౦౨. వెల రు. ౦-౮-౦

గ్రంథకర్త: దీక్షితులు. విశ్వసాహిత్యమాల, ముంగండ, (Via) అంబాజీపేట, తూ. గో. జిల్లా.

---

## రాజధర్మ ప్రకాశికా

### (శిక్షాస్మృతి)

క్రౌను ౧/౮ సైజు, పు. ౭౪. వెల రు. ౨-౦-౦

గ్రంథకర్త:—కొల్లూరు జోగారాయ దీక్షితులు.

గ్రంథము దొరకుచోటు: కొండపల్లి గోపాలరావు సేఠముఖ్, అనిశెట్టిపల్లి, భద్రాచలంరోడ్డు రైల్వేస్టేషన్. (N. S. R.)

## తరంగిణి

### (ఖండకావ్యసంపుటి)

రాయల్ ౧/౧౬ పు. ౩౮. వెల రు ౦-౮-౦

గ్రంథకర్త: కందుకూరి రామభద్రరావు, ఇన్స్పెక్టరు, రాజమహేంద్రవరము.

## పల్లెపట్టు

డెమ్మి ౧/౧౬ సైజు. పు. ౫౩. వెల తెలియరాదు.

గ్రంథకర్త: చిరుమామిళ్ల విజయపార్థసారధి, ముప్పాళ్ల, నందిగామ, కృష్ణాజిల్లా.

---

## పార్వతీపరిణయము

(అయిదంకములనాటకము)

౧/౮ సైజు. పు. ౮౪. వెల రు. ౦-౧౨-౦.

గ్రంథకర్త: వీ. వి. కోదండపాణిశాస్త్రి.

ప్రకాశకుడు: అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి, తెలుఁగు పండితుడు, హైస్కూలు, రేపల్లె.



## వీ ర గా థ లు

క్రౌను ౧/౮ సైజు, పు. ౬౪. వెల రు. ౦-౪-౦.

ప్రకాశకులు: అకుండి వెంకటశాస్త్రి, తెలుగు పండితుడు, సేవాసదనము, చెట్‌పట్, మదరాసు.

గ్రంథము దొరకుచోటు: శ్రీ వ్యాసనికేతనము, ఆర్యాపురము; రాజమహేంద్రవరము. ఘటోత్కచ భీమసేనులు, సోహ్రాబ్ రుస్తములు, భీమసేన హనుమంతులు, అభిమన్యుడు, పరశురాముడు అను కథలయిదు ఇందున్నవి. పాఠశాలల ఉపయోగమున కిది యంగీకరింపబడినది. ఇట్లు ఆచార్యులముద్రను పొందిన యీ పుస్తకముయొక్క గుణదోషవిచారణ మిక నవశ్యకము.



## శ్రీ రా మ శ క ంత

ఇది కాకినాడ నివాసులు శ్రీకాశీభట్ల సుబ్బయ్య శాస్త్రిలుగారు సంస్కృతమున రచించిన శ్రీరామకీర్తన సంకీర్తనరూపమగు ననుష్టుప్ శతకము. "శ్రీరామం నామి తం ప్రభుం" అనునది మకుటము. వెల ఒక అణా.



## శ బ రీ మ హా త్మ్య ము

క్రౌను ౧/౮ పు. ౪౦ వెల రు. ౦-3-౦

ఇది పండిత సూచిమంచి సుబ్బారాయ విరచితము. పిఠాపురమున గ్రంథకర్తవద్ద నిది దొరకును.

ఇది వచనరచనము: రచనము చదరముగాని, నిగ్గుష్టముగాని అనుటకు వలనుపడదు. కథాభాగము హిందీ వాఙ్మయముననుండి సరిగా తీసికొనబడినది.

## హరిహర సేవాకీర్తనలు

గ్రంథకర్త: మల్లాజ్ఝల వేంకటశేషశయనరావు, పిఠాపురము.

పేరువలననే తెలియుచున్నది గ్రంథసమగువిషయము. ఈ కీర్తనలను హరిహరభక్తులు పాడుకొనవచ్చును. వెల రు ౦-౨-౦.

## నిజామురాష్ట్ర పరిపాలనము

వెల రు. ౦-౪-౦. గోలకొండపత్రికా చందాదారులకు. రు. ౦-౬-౦ ఇతరులకు.

గ్రంథకర్త: సురవరపు ప్రతాపరెడ్డి బి.ఏ.బి.ఎల్.



## మోక్షసాధనసారసంగ్రహము

వెల ౦-౪-౦.

కర్త: కనకపల్లి భాస్కరరావు, గాంధినగరము, కాకినాడ.

## నీలాపనిందానివారణము

(ఏకాశ్వాస పద్యకావ్యము)

నరసింహ సూరికృతము. వెల ౦-౪-౦.

గ్రంథము దొరకుచోటు అంద్రంగి, ద్రాక్షారామం పోస్టు. తూర్పుగోదావరిజిల్లా.

## His Holiness Sri Sankaracharya Swami of Kama Kctipeetam.

క్రౌను ౧/౮ సైజు. పు. ౫౦. వెల రు ౦-౫-౦

గ్రంథకర్త: పాల్ బ్రంటను

ప్రకాశకులు: బి. జి. పాల్ అండ్ కో., ౧౨, ఫ్రాన్సిస్ జోసఫ్ వీధి, జి. టి. మదరాసు.



## India as a Federation

డెమ్మీ ౧/౮ సైజు. పు. ౨౨౮. వెల రు 3-౮-౦

గ్రంథకర్త: కే. వి. పున్నయ్య, యం. ఏ. (ఆనర్సు) ఆంధ్ర యూనివర్సిటి లెక్చరరు, వాల్తేరు,

ప్రకాశకులు: బి. జి. పాల్ అండ్ కో, ౧౨, ఫ్రాన్సిస్ జోసఫ్ వీధి, జి. టి. మదరాసు.

# సాభిప్రాయ విశేషములు

లక్నో కాంగ్రెసుసమావేశము, సామ్యవాదపక్ష ప్రాబల్యము, అస్సెంబ్లీ వ్యవహారములు, ఉత్కళ సింధు రాష్ట్రముల నిర్మాణము, కౌన్సిలు ఆర్డరులు, విల్లింగ్డనుప్రభువర్యుని నిర్గమనము, లిన్‌లిత్‌గో ప్రభువర్యుని యాగమనము, అబిసీనియా పరాజయము, చక్రవర్తి పలాయనము, ఇటలీ విజయము, జపాను విజయయాత్రలు, హిట్లరు దంభోక్తులు, ఆంక్షలనిరుపయోగము, జాతిసమితి క్లైబ్యము ప్రపంచావృత మైన విషాదయోగమునకును, ప్రజ్ఞావాదమునకును ప్రత్యక్షప్రమాణములు. విల్లింగ్డను ప్రభువు నిర్బంధాయుధప్రయోగమునను స్థాపించిన శాంతి స్వోత్కర్షమునకు వినియోగపడినను శాంతికి నిరర్థకముగ నున్నది. ప్రజలయందు ప్రాణవిశ్వాసములు లేని శాంతి దుఃఖచిహ్నము గాని శుభచిహ్నము గాదు. ఆజన్మాంతము సామ్రాజ్యాభిమానము నారాధించిన ప్రభువునకు ప్రజలసుఖదుఃఖము లుగణనీయములు కావు. పారతంత్ర్యము ననుభవించెడి ప్రజలకును నిది సహజావస్థ. విల్లింగ్డనుదంపతులకు మహారాజులు, రాజులు, మంత్రులు, శ్రీమంతులు, సంఘములును సమర్పించిన సన్మానములును ప్రజాహృదయము నావరించిన దైన్యమునకు నిదర్శనములు. ప్రజాభిప్రాయమును, అస్సెంబ్లీ అభిప్రాయమును ధిక్కరించిన విల్లింగ్డను ప్రభువు కాంగ్రెసుపక్షమునుండి గౌరవము నపేక్షించుట విచిత్రము. అస్సెంబ్లీయందు కాంగ్రెసుపక్షము చూపిన నిర్లక్ష్యము స్వీయప్రవర్తనమునకు సంబంధించినది కాని రాజునకు సంబంధించినది కాదు. గాంధిమహాత్ముని సందర్శనమును, మానసిక నైతికధర్మబలము లేకను నిరాకరించిన విల్లింగ్డనుప్రభువు తన ధైర్యమును తానే సమర్థించుకొనుటయును స్వాభిమానము. విల్లింగ్డనుప్రభువు చిత్రగుప్తుని వ్యాఖ్యానములనైనను గ్రహించి ఆత్మనిరీక్షణమును జేయుట వృద్ధాప్యమునందు తరణోపాయము. నిరంకుశాధికారమును, అష్టైశ్వర్యములను ననుభవించిన దేశమును విడిచి పోవునపుడు విచారము గలుగుటయందు విచిత్రము గనుపడదు. ప్రజల యోగక్షేమములను నిర్లక్ష్యముచేసినందులకు పశ్చాత్తాపము గలుగకుండుటమాత్రము విచారకరము. ఘనీభవించిన స్వాభిమాన, సామ్రాజ్యాభిమానములందు సకల ధర్మములును నంతర్ధానము లగుట సహజము. విల్లింగ్డను ప్రభువు గాంధిమహాత్ముని సహాయమునను శాంతిస్థాపనమునకు గల యవకాశములను నిరసించి, అశాంతిస్థాపనమునకు గారణభూతుడైన విధమును భావిచరిత్రము విశదము చేయగలదు.

* * *



**లిన్‌లిత్‌గో ప్రభువు**

లిన్‌లిత్‌గో ప్రభు వుపక్రమించిన ప్రజ్ఞావాచనసంకల్పములు వారి సద్భావములకు నిదర్శనములైనను, సామ్రాజ్య కవచాతిక్రమణముల ముఖ్యముగను నవీనరాజ్యాంగపాశముల్నందు దుర్లభమని భావికాలము విశదము చేయగలదు. కాపుజనులకు, గోబృందమునకు స్వస్తివాచకములు, వృషభదానము, బీదలకన్నదానము, సాధుభావణములు ప్రాచ్య సంప్రదాయముల కనురూపముగ నున్నను రాజ్యాంగ వ్యవహారములు రాజప్రతినిధి ప్రతిష్ఠను సమర్థించుటకు ప్రమాణములు. రాజప్రతినిధి ఇండియాకార్యదర్శికి తాబేదారైనను, ఇర్విన్‌ప్రభువువలెను స్వతంత్రాచరణమునకు కొంత యవకాశములు కలవు. ఆ స్వల్పావకాశముల నయినను బ్రిటీషు ప్రయోజనములకు గాకను హిందూస్థానప్రయోజనములకు వినియోగించుట రాజనీతి, వివేకము, ధర్మము.

గాంధిమహాత్ము డుపక్రమించిన గ్రామోద్ధరణోద్యమము ప్రభుత్వాధికారుల్ నాకర్షించిన విధమును రాజ్యాంగ వ్యవహారములు, ప్రసంగములు వెల్లడి చేయుచున్నవి. అధికారులు వారి రాజ్యతంత్రములను పట్టణములనుండి గ్రామసీమలకును, విద్యావంతులనుండి సామాన్యులకును ప్రసరింపజేయబూనుట సముచితమైనను ఫలము మాటలందుగాకను చేతలందు గనుపడవలయును. అధికార ప్రాపకము, రోడ్డులు, బోర్డులు, పరపతిసంఘములు ప్రజ్ఞావాదములు ప్రజలను సంతృప్తిపరచెడికాలము పోయినది. ప్రజాహృదయమునందు ప్రజ్వలుచున్న స్వాతంత్ర్యేచ్ఛను శాంతింపజేసినపుడె శాంతిస్థాపనము సాధ్యముగాగలదు. ప్రజాహృదయమును పీడించుచున్న దారిద్ర్యము, స్వాతంత్ర్యదాహము శాంతించినపుడె శాంతిస్థాపనము సాధ్యము. పట్టణములం దవలంబించిన రాజ్యతంత్రము గ్రామములం దసాధ్యము. ప్రజా స్వాతంత్ర్యమునకు విముఖులైన కలెక్టరుల గ్రామసీమ పర్యటనములు, వ్యవహారములు ప్రజలవిశ్వాసమునకుగాకను సందియములకు పాలగుట సహజము. లిన్‌లిత్‌గో ప్రభువు గ్రామపరిశ్రమల నుద్ధరించుటకు గాంధిమహాత్ముని కభయమునొసగి కార్యోపక్రమణము చేసిన ప్రజావిశ్వాసమును బడయుట కంకురార్పణమును చేయవచ్చును. విక్రమార్క సింహాసనమువలెను ఢిల్లీగద్దెయును నిరంకుశాధికార రక్షణమునకును, ప్రజానిర్బంధనములకును, బ్రిటీషు ప్రయోజనములకును వినియోగపడుటయును, స్వధర్మాచరణమునకు వినియోగపడకుండుటయును సహజము. సిమ్లాకొండల శీతలము, నిరంకుశ వాతావరణము నూతనోత్సాహమును మందగింపజేయుటయును సహజము.

* * *

**సంస్కరణ రాజ్యాంగములు**

నూతన రాజ్యాంగములు సమ్మోహనాస్త్రమువలెను అధికారులందును, నాయకు

లందును, ప్రజలయందును సంభ్రమమును గలుగజేయుచున్నవి. గవర్నరుజనరలు, గవర్నరులు, కమిషనరులు, కలెక్టరులు, మంత్రులు మొదలగు నధికారు లందరును సంస్కరణ మంత్రోచ్చారణమును జేయుచున్నారు. మంత్రులు సంస్కరణదుర్గ సంరక్షణమునకు ప్రయత్నములను జేయుచున్నారు. కాంగ్రెసు జాతీయ లిబరలు స్వతంత్రపక్షనాయకులును, హిందూమహామ్మదీయ నాయకులును సంస్కరణములను నిరాకరించియును సంస్కరణముల ననుభవింపను బూనుకొనుచున్నారు. ప్రభుత్వప్రజానాయకుల యైక్యమంతయును వాగల ౧౦ మాసములందును ఎన్నికల హాహావిడియందు నిమగ్నము గాగలవిధమును నిత్యవ్యవహారములు, ప్రసంగములు విశదము చేయుచున్నవి. ప్రసంగవ్యవహారము లెటులున్నను ప్రభుత్వహృదయమునందు పరివర్తనము గలుగని విధమును అస్సెంబ్లీవ్యవహారము, కౌన్సిలు ఆర్డరులు చెప్పక చెప్పుచున్నవి.

* * *

**అస్సెంబ్లి**

అస్సెంబ్లీయందు ప్రభుత్వము పరాజయమును పొందినను ధ్రువాధికారముద్వారా వ్యవహారములు సాగుచున్నవి. అస్సెంబ్లీ ఒటావాసంధిని విసర్జించినను ప్రభుత్వహృదయమునందు సంచలనము గలుగలేదు. గ్రిగ్గు గారి సర్వజ్ఞత్వము, క్రేయికుగారి నిరంకుశాధికారాభిమానము, నాయిసుగారి సరళత్వము, జఫరల్లీఖానుగారి సమర్థన చతురత్వము, సైనిక కార్యదర్శుల స్మృతివ్యాఖ్యానములు యథాప్రకారము సాగుచున్నవి. అస్సెంబ్లీయందు కాంగ్రెసుపక్షము గడించిన ధర్మనీతిబలములును ప్రభుత్వనిరాదరణము నకువలెను ప్రభుత్వాదరణమునకు పాత్రముగా లేదు. ప్రజాహృదయమునందువలెను అస్సెంబ్లీయందును కాంగ్రెసు స్వాతంత్ర్య ధర్మప్రతిష్ఠను ప్రతిష్ఠించినది. సంస్కరణముల నిర్దేశవ్యవహారములకు పేరునకు పార్లమెంటుసమ్మతి ముఖ్యమైనను స్టేటు సెక్రటరీ కల్పితములైన కౌన్సిలు ఆర్డరులద్వారా వ్యవహారములు సాగుచున్నవి. ఉత్కళసింధురాష్ట్రము లేర్పడి వ్యవహారములు సాగుచున్నవి. మేయరుగారి ఆర్థిక నివేదికపత్రము రాష్ట్రీయస్వపరిపాలనము ఫెడరేషను సాధ్యముగాగల విధమును వెల్లడి చేయుచున్నది. ప్రజానాయకుల శక్తులన్నియును సంస్కరణ ప్రచార ప్రణాళికలందు మగ్నముగాగల విధమును లక్నో కాంగ్రెసు వ్యవహారములు, పత్రికల వ్యాఖ్యానములు చెప్పక చెప్పుచున్నవి. ఏది ఎటులైనను ౧౯౩౭ వ సంవత్సరారంభమునందు రాజ్యాంగ సంస్కరణములు ప్రారంభమగుటయును, సంస్కరణముల నాచరణమునందు బెట్టుటకు ప్రజానాయకులు మహామహమికను బూనుటయును నిశ్చయము. నూతన రాజ్యాంగములు కాంగ్రెసునందును సందిగ్ధస్థితిని గలుగజేసిన విధమును లక్నో వ్యవహారములు వెల్లడిచేయుచున్నవి.

* * *

## లక్నో కాంగ్రెసు

లక్నో కాంగ్రెసు పీఠము పండిత జవహర్‌లాలు నెహ్రూగారి వ్యక్తి విజయము ధర్మ విజయము. నెహ్రూగారి భావములు సామ్యవాదమునకును, ధనవ్యవస్థా పరివర్తనమునకును పోషణము నొసగుచున్నను విచక్షణోపేతములుగ నున్నవి. సాంఘిక విభేదములకును, నిరంకుశాధికారమునకును, కులధనాధికారములకును, వర్ణాశ్రమధర్మములకును నిలయమైన దేశమునందు సామ్యవాద పక్ష వ్యాపనము దుర్లభమని నెహ్రూగారంగీకరించియును సామ్యవాద పక్షమునకు కాంగ్రెసు సంస్థయందు కల్పించిన బలము కాంగ్రెసు బలమును భేదాభిప్రాయములుగల వర్తమాన పరిస్థితులందు శిథిలము చేయుట సహజము. కాంగ్రెసునందు గల బహిష్కార పక్షము, పార్లమెంటు పక్షము, అధికార స్వీకరణ పక్షము, జాతీయ పక్షము, సామ్యవాద పక్షము వర్తమాన సందిగ్ధ సమయమునందు కాంగ్రెసు వ్యవహార ప్రతిష్ఠలకు దౌర్బల్యమును కల్పించగల విధమును ఢిల్లీ, లక్నో, వార్ధాలందు కాంగ్రెసు వర్కింగు కమిటీయందు సంభవించిన భేదాభిప్రాయములు సువ్యక్తము చేయుచున్నవి. గాంధిమహాత్ముడు కాంగ్రెసు వ్యవహారములందు మౌనముద్రను బూనియును, కాంగ్రెసు సంయోగమును సమకూర్చిన విధము బహిరంగ రహస్యము. గాంధిమహాత్ముడు సంకల్పించినటులు నెహ్రూగారి యధ్యక్షత లక్నో కాంగ్రెసునకు సిద్ధించినను, వారి నాయకత్వఫలము భిన్నరూపమును దాల్చిన విచిత్రముండదు. అధికార స్వీకరణమునకు సుముఖమైన కాంగ్రెసును, స్థాయిసంఘమును, వర్కింగు కమిటీని విముఖుడైన నాయకుడు, ఆత్మవిశ్వాసమునకు వ్యతిరేకముగను నిర్వహించుట దుర్లభము, నిరర్థకము. లక్నో కాంగ్రెసునందు అధికార స్వీకరణ సమస్య నిర్ణయింపబడుటయును, కార్యనిర్వాహకవర్గము తదనుగుణముగను నిర్మింపబడుటయును కాంగ్రెసు బల గౌరవ రక్షణములకు సాధనమై యుండియుండును. అధికార స్వీకరణ సమస్యకు వాయిదా వేయుటవలనను ఖండన మండనములలో కాలయాపన మగుటయును కార్యవిధానము శిథిలమగుటయును సహజము. కాంగ్రెసు అంగనిర్మాణమునందు చేసిన మార్పులును కాంగ్రెసు బలమును శిథిలము చేయుటకును, దుర్నయములను వ్యాపింప జేయుటకును వినియోగపడగల విధమును గత సంవత్సరానుభవము విశదము చేసినది. సామాన్య వ్యవహారములందువలెను జాతీయ వ్యవహారములందును స్వతంత్రమైన కర్మానుభవమె మోక్షసాధన మగుచున్నది. వర్తమాన సంవత్సరమునందును ప్రజలకు కాంగ్రెసు ఆదేశములను శిరసావహించి పాలించుట కార్యసాధనము, విధ్యుక్తధర్మము. స్వదేశ వ్యవహారములువలెను విదేశ వ్యవహారములును భయంకరములై ప్రపంచావృతమైన మహాపరివర్తనమునకు నిమిత్తములుగ నున్నవి.

* * *

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింద కనబరచిన నెంబర్లవారికి ఈనెల (1936 సం. ఆగస్టు)తో ఇచ్చిన యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకు చందా పంపు చేరునట్లు ఈ నెలాఖరు తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము పాటు చందాదారుల సెప్టంబరు 10-వ తేదిని రూ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున ఏభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ ముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపు

A 17. B 6. F 1. G 7, 9. 12. H 31, 33, 35, 36. J
R 24, 25. S 109, 110, 115, 118, 119, 249, 252, 272, 27

---

## సవరణ

'మొంగలీయము-రక్తస్పర్శ'

౧౯౩౬ సం. జూలై నెల సంచిక

| పుట. | కలము | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౪౫ | ౨ | ౪ | "తీర్మానించునా?" | "తీర్మానించుమమా?" |
| ౪౬ | ౧ | ౧౯ | "అల్లో" | "[illegible]" |
| ౪౭ | ౧ | ౯ | "ప్రీని" | "దీనిని" |
| ౫౦ | ౨ | ౪ | "ట్యాం జెంటు" | "ట్యాంజెంటు ౧." |
| ౫౦ | ౨ | ౧౫ | "క. ఖ. చ" | "క. ఓ. చ." |
| ౫౨ | ౧ | ౧ | "వారి సంతతి" | "వారి పూర్వులు" |
| [illegible] | [illegible] | ౧ | "వారి పూర్వులు" | "వారి సంతతి" |

